తాళ్ళపాక పద సాహిత్యము - సంపుటము -

# శృంగార సంకీర్తనలు



అన్నమాచార్య ప్రాజెక్టు

తిరుమల తిరుపతి దేవస్థాన

తాళ్లపాక పదసాహిత్యం - సంపుటం - 11

# శృంగార సంకీర్తనలు

(తాళ్లపాక అన్నమాచార్య విరచితములు)

పరిష్కర్త

విద్వాన్ అర్చకం ఉదయగిరి శ్రీనివాసాచార్యులు




ప్రచురణ

తిరుమల తిరుపతి దేవస్థానములు

1998

T.T.D. Religious Series - 543

ప్రథమ ముద్రణ : 1963

ద్వితీయ ముద్రణ : 1998



ప్రతులు : 2,000

వెల : రు. 25-00



ప్రచురణ :

శ్రీ M.K.R. వినాయక్, I.A.S.

కార్యనిర్వాహణాధికారి

తిరుమల తిరుపతి దేవస్థానములు

తిరుపతి.

ముద్రణ :

త్రివేణి ఆఫ్‌సెట్ ప్రింటర్స్

14/264, ఈడేపల్లి

మచిలీపట్నం - 1

ఆంధ్రప్రదేశ్

# విన్నపము

ఇందరికి అభయంబు లిచ్చు చేయి
*కందువగు మంచిబంగారు చేయి ॥*

కలియుగ ప్రత్యక్షదైవమైన శ్రీ వేంకటేశ్వరుని వైభవాన్ని, మాహాత్మ్యాన్ని, తత్త్వాన్ని 32,000 అధ్యాత్మ, శృంగార సంకీర్తనలుగా రచించినవాడు తాళ్లపాక అన్నమాచార్యులు. ఇందులో మనకు సుమారు 13,000 సంకీర్తనలు మాత్రమే లభించాయి. వీరి పుత్రుడు తాళ్లపాక పెదతిరుమలాచార్యులు, మనుమడు తాళ్లపాక చినతిరుమలాచార్యులు పదకవులే ! తాళ్లపాక కవులు క్రీ॥శ॥ 15-16 శతాబ్దాలకు చెందినవారు. వీరి స్వస్థలం ఆంధ్రప్రదేశ్‌లోని కడపజిల్లా రాజంపేట తాలూకా తాళ్లపాకగ్రామం.

క్రీ॥శ॥ 15వ శతాబ్దంలో వైష్ణవమత ప్రచారం కోసం తిరుమలను కేంద్రంగా చేసుకొని శ్రీ వేంకటేశ్వరాంకితంగా వేలకొలది సంకీర్తనలను, ఇతర సాహిత్య ప్రక్రియలను రచించినవారు తాళ్లపాకకవులు. శ్రీ వేంకటేశ్వరస్వామివారి సేవలో తరించిన ధన్యమూర్తులు.

తాళ్లపాక పదకవిత్రయంగా కీర్తిగడించిన తాళ్లపాక అన్నమాచార్యుల, తాళ్లపాక పెదతిరుమలయ్య, తాళ్లపాక చినతిరుమలయ్యల సంకీర్తనల రాగిరేకులు తిరుమలలో శ్రీవారి ఆలయంలో 'తాళ్లపాక అర'లో లభించాయి.

తాళ్లపాక కవుల సంకీర్తనల భాండాగారం గూర్చిన మొదటి శాసనం క్రీ॥శ॥ 1530 సంవత్సరంలో కనిపిస్తుంది. తదుపరి క్రీ॥శ॥ 1545, 1547, 1554, 1558 సంవత్సరాల నాటి శాసనాల్లోను సంకీర్తనభాండాగారం గూర్చిన ప్రస్తావన కనిపిస్తుంది. ఇవి తిరుమల తిరుపతి దేవస్థానాల శాసనాలు.

తిరుమల తిరుపతి దేవస్థానములవారు క్రీ॥శ॥ 1922 సంవత్సరం నుండి తాళ్లపాక కవుల సంకీర్తనల ముద్రణకు పూనుకొన్నారు. క్రీ॥శ॥ 1922 సంవత్సరం నుండి క్రీ॥శ॥ 1992 సంవత్సరం వరకు తాళ్లపాక కవుల సంకీర్తనల సంపుటాల ముద్రణలో వివిధ దశలు కనిపిస్తాయి.

1922 సంవత్సరంలో తిరుమల తిరుపతి దేవస్థానాలవారు రాగిరేకుల్లోని తాళ్లపాక కవుల సంకీర్తనలను వ్రాతప్రతుల్లో వ్రాయించటానికి పూనుకొన్నారు.

1935-38 సంవత్సరాల్లో తాళ్లపాక లఘుకృతులు, తాళ్లపాక కవుల సంకీర్తనలు సంపుటాలుకొన్ని వెలువడ్డాయి.

1947-65 సంవత్సరాల్లో తాళ్లపాక కవుల అధ్యాత్మ, శృంగార సంకీర్తనలు కొన్ని సంపుటాలు ముద్రించబడ్డాయి.

1947-1965 సంవత్సరాల మధ్యకాలంలో నిరాఘాటంగా కొనసాగిన తాళ్లపాక పదకవుల సంకీర్తనల ముద్రణ తరువాత ఒక దశాబ్దంపాటు కొనసాగలేదు.

1975-1986 సంవత్సరాల మధ్యకాలంలో తాళ్లపాక పదకవుల సంకీర్తనలు కొన్ని సంపుటాలు వరకు, మరియు అధ్యాత్మ సంకీర్తనలు [illegible] పుటాలు పునర్ముద్రింపబడ్డాయి.

తదుపరి 1992 సంవత్సరంలో ఒక సంపుటం ముద్రింపబడినది.

ఇంతేకాక తాళ్లపాక అన్నమాచార్యుల జీవిత చరిత్ర, తాళ్లపాక కవుల ఇతర సాహిత్య ప్రక్రియలను ఈ దశల్లోనే తిరుమల తిరుపతి దేవస్థానం ముద్రించింది.

ఈ వివిధ దశల్లో తాళ్లపాక పదకవుల సంకీర్తనలను రాగిరేకులనుండి పరిష్కరించిన మహాపండితులు కీ॥శే॥ సాధు సుబ్రహ్మణ్య శాస్త్రి, పండిత విజయరాఘవాచార్య, వేటూరి ప్రభాకరశాస్త్రి, రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ, పి.టి. జగన్నాథరావు, గౌరిపెద్ది రామసుబ్బశర్మ, శ్రీయుతులు ఉదయగిరి శ్రీనివాసాచార్యులుగారలు.

తిరుమల తిరుపతి దేవస్థానములు 1978 సంవత్సరంలో అన్నమాచార్య ప్రాజెక్ట్ స్థాపించినప్పటినుండి తాళ్లపాక అన్నమాచార్య సంకీర్తనలకు దేశవ్యాప్తంగా విశేషవ్యాప్తి ఏర్పడింది. తాళ్లపాక అన్నమాచార్యుల, ఇతర తాళ్లపాక కవుల సంకీర్తనలు సాహితీవేత్తలకు, సంగీత విద్వాంసులకు వరకవిత్వ వాణీవీణా నినాదాలైనాయి. ఈ సంకీర్తనలు భక్తులకు మోక్ష మార్గాన్ని తెలిపే విశిష్టరచనలు. పరిశోధకులకు, సాహిత్యచరిత్రకారులకు కొంగుబంగారమై విలసిల్లుతున్నాయి. తాళ్లపాక కవుల సంకీర్తనలకు సంగీత, సాహిత్య, భక్తలోకంలో నేడువున్న ఆదరణ ఎనలేనిది.

ఈ ఆవశ్యకతను గుర్తించి వివిధ దశల్లో పరిష్కరింపబడి, ముద్రించబడిన తాళ్లపాకకవుల సంకీర్తనలను ఒక్కసారిగా సమగ్రరీతిలో ముద్రించడానికి తిరుమల తిరుపతి దేవస్థానాల యాజమాన్యం సంకల్పించింది.

ప్రథమత: తాళ్లపాక కవుల సంకీర్తనలను సమగ్రంగా 29 సంపుటాలుగా లోకానికి అందిస్తున్నాం.

తాళ్లపాక పదకవుల సంపుటాల పునర్ముద్రణ ప్రణాళిక రూపొందించుటలో సహకరించిన శ్రీ ఉదయగిరి శ్రీనివాసాచార్యులుగారికి (తాళ్లపాక వాఙ్మయపరిష్కర్త) విద్వాన్ శ్రీ సింగరాజు సచ్చిదానందం గారికి (విశ్రాంత తెలుగు అధ్యాపకులు, తిరుమల తిరుపతి దేవస్థానాలు) ఆచార్య కె. సర్వోత్తమరావుగారికి (డీన్, హ్యూమానిటీస్ & ఎక్స్‌టెన్షన్ స్టడీస్, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి) డా॥ ఆచార్య ఎం. శ్రీమన్నారాయణమూర్తిగారికి (డైరెక్టర్, శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాసంస్థ, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి) మరియు ఈ సంపుటాల ముద్రణలో సాహిత్యపరంగా నిర్మాణాత్మకమైన సూచనలందించిన డా॥ముదివేడు ప్రభాకరరావు M.A.,Ph.D గారికి, (పరిశోధకులు, శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాలయం, తిరుపతి) హృదయపూర్వక కృతజ్ఞతాంజలులు అర్పిస్తున్నాము.

దీని తర్వాత తాళ్లపాక కవుల లఘుకృతులు, ఇతర కావ్యాలు వెలువరించడానికి ప్రణాళిక సిద్ధంచేస్తున్నాం.

ప్రస్తుతం వెలువడుచున్న తాళ్లపాక కవుల సంకీర్తనల సంపుటాలు శ్రీ వేంకటేశ్వర స్వామివారి కృపా కటాక్షంచే భక్తజనామోదం పొందగలవని విశ్వసిస్తున్నాం.

**M.K.R. వినాయక్**
కార్యనిర్వహణాధికారి
తిరుమల తిరుపతి దేవస్థానములు

# నివేదిక

క్రీ॥శ॥ 15వ శతాబ్దంలో భక్తి ప్రపత్తి, దేహాత్మవిచారాదులను తెలిపే అధ్యాత్మసంకీర్తనలు; జీవాత్మ, పరమాత్మల ఐక్యాన్నిచాటే అమలిన దివ్య శృంగార సంకీర్తనలు రచించినవారు తాళ్లపాక కవులు. సకల దేవతా స్వరూపమైన శ్రీ వేంకటేశ్వరస్వామి తత్త్వాన్ని ఎన్నోవేల సంకీర్తనలద్వారా లోకవిదితంచేసి ఆత్మకల్యాణంతోపాటు లోక కల్యాణం సాధించిన వారు తాళ్లపాక అన్నమాచార్యులు, వీరి పుత్రుడు తాళ్లపాక పెదతిరుమలాచార్యులు, మనుమడు తాళ్లపాక చినతిరుమలాచార్యులు. శ్రీ వేంకటేశ్వరుని పరతత్త్వంగా భావించి ఉభయ విభూతినాయకుడైన ఆ స్వామి కల్యాణగుణాలను ఎన్నోవేల సంకీర్తనల్లో కీర్తించారు. శరణాగతి తత్త్వాన్ని ప్రబోధించారు.

క్రీ॥ శ॥ 15వ శతాబ్దంలో శ్రీ వేంకటేశ్వరస్వామివారి నందకాంశ సంభూతుడుగా తాళ్లపాక అన్నమాచార్యులు జన్మించాడు. తన పదహారవయేట శ్రీ వేంకటేశ్వరుని సాక్షాత్కారం పొంది స్వామి ఆదేశంతో సంకీర్తనరచనకు శ్రీకారం చుట్టి ఆనాటినుండి జీవితాంతంవరకు దినమునకు ఒక్క సంకీర్తనకు తక్కువ కాకుండా సంకీర్తన రచన సాగించాడు. పల్లవి, చరణాలతో కూడిన సంకీర్తన రచనకితడు మార్గదర్శకుడై 'పదకవితాపితామహుడ'ని కీర్తి గడించాడు. అన్నమయ్య పదాలలో సంగీతం, సాహిత్యం, భగవద్భక్తి త్రివేణీ సంగమంలా మేళవించాయి.

శ్రీ వేంకటేశ్వరుని పరతత్త్వమూర్తిగానే కాకుండా వివిధ ఆగమ సంప్రదాయాల్లో వినుతుడైన వైభవమూర్తిగా కూడా అన్నమయ్య కీర్తించాడు. ఆంధ్రవాగ్గేయకారుల్లో అనేక వైష్ణవ క్షేత్రాలను సందర్శించి ఆయాక్షేత్ర మూర్తులపై వివిధ సంకీర్తనలను రచించిన ఘనత తాళ్లపాక అన్నమాచార్యులదే!

అన్నమయ్య భగవత్తత్త్వాన్ని అనేక జానపద గేయరీతుల్లో రచించి సామాన్యులకు అందించే ప్రయత్నంచేశాడు. అన్నమయ్య గ్రాంథిక, శిష్టవ్యావహారిక, వ్యావహారిక భాషాశైలులలో సంస్కృతాంధ్ర సంకీర్తనల్ని రచించాడు. జానపదుల జీవద్భాషను సర్వతంత్ర స్వతంత్రంగా వాడి సంకీర్తనల రచనాశైలిలో తర్వాతి వాగ్గేయకారులకి మార్గదర్శకుడైనాడు.

అన్నమయ్య పదాలు శ్రీ వేంకటేశ్వరముద్రాంకితాలు. వీరి బాటను అనుసరించిన వారు తాళ్లపాక పెదతిరుమలాచార్యులు, తాళ్లపాక చినతిరుమలాచార్యులు.

ఇహపర శ్రేయోదాయకమైన తాళ్లపాక అన్నమాచార్యులు, ఇతర తాళ్లపాకకవుల సంకీర్తనలను భక్తజనానికి అందించాలని తిరుమల తిరుపతి దేవస్థానములు 1978 సంవత్సరంలో సంకల్పించి అన్నమాచార్య ప్రాజెక్ట్ స్థాపించింది. అప్పటినుండి అన్నమాచార్య ప్రాజెక్ట్ కళాకారులచే గానంచేయబడిన తాళ్లపాక అన్నమాచార్యుల, ఇతర తాళ్లపాక కవుల సంకీర్తనలు ఆంధ్ర ప్రదేశ్‌లోనే కాక, ఆంధ్రేతర రాష్ట్రాలలో కూడా బహుళ ప్రచారం, ప్రాచుర్యం పొందాయి.

అన్నమాచార్య ప్రాజెక్ట్ తాళ్లపాక అన్నమాచార్య, ఇతర తాళ్లపాక కవుల సంకీర్తనల ప్రచారం-పరిశోధన -రికార్డింగ్ శాఖల సమన్వయంతో వివిధ కార్యక్రమాలను నిర్వహిస్తున్నది. అన్నమాచార్య ప్రాజెక్ట్ కళాకారులచే వేలకొలదిగా సంగీత సభలు, పరిశోధకులచే సాహితీసమావేశాలు నిర్వహించింది. మరియు తాళ్లపాక కవుల సంకీర్తనలను ఆడియో క్యాసెట్లుగా విడుదలచేసి బహుజనామోదం పొందింది.

తిరుమల తిరుపతి దేవస్థానంచే 1949 సంవత్సరం నుండి ప్రతి స[illegible] అన్నమాచార్య వర్ధంతి ఉత్సవాలు, 1978 సంవత్సరం నుండి అన్నమాచార్య జయంతి ఉత్సవా[illegible]ంగా నేటి[illegible] నిర్వహింప బడుచున్నవి. మరియు అన్నమాచార్య సంకీర్తనోత్సవాలు [illegible]యినుండి మహానగరాలస్థాయివరకు జరుగుచున్నాయి. అన్నమాచార్య ప్రాజెక్ట్ [illegible]లయా[illegible]

సమన్వయంతో తాళ్లపాక కవుల సాహితీ సదస్సులు నిర్వహిస్తున్నది. తిరుమల తిరుపతి దేవస్థానం 1978సం॥ నుండి తాళ్లపాక అన్నమాచార్యుల, ఇతర తాళ్లపాక కవుల సాహిత్యంపై వివిధ విశ్వవిద్యాలయాల్లో పరిశోధన చేసేవారికి ఉపకారవేతనం ఇచ్చి ప్రోత్సహిస్తున్నది. ఈ ప్రణాళిక క్రింద ఇప్పటివరకు దాదాపు 50 సిద్ధాంతవ్యాసాలు సమర్పింపబడ్డాయి.

తాళ్లపాక అన్నమాచార్యుల, ఇతర తాళ్లపాక కవుల సంకీర్తనలపట్ల నానాటికీ పెరుగుచున్న ప్రజాదరణ, మరియు 1935వ సంవత్సరం నుండి వివిధ దశల్లో ముద్రింపబడిన తాళ్లపాక అన్నమయ్య, తాళ్లపాక పెదతిరుమలయ్య, తాళ్లపాక చినతిరుమలయ్య సంకీర్తనల సంపుటాలు ఏనాడో చెల్లిపోయిన కారణంగా నేడు తాళ్లపాక కవుల సంకీర్తనల సంపుటాలు సమగ్రంగా పునర్ముద్రించవలసిన ఆవశ్యకత ఏర్పడింది.

పూర్వముద్రణ సంపుటాల్లోని పూర్వపరిష్కర్తల పీఠికలు యథాతథంగా ముద్రింపబడుచున్నాయి. పరిష్కర్తచే పీఠికలో సూచింపబడిన సంపుటాల సంఖ్యలు పూర్వముద్రణకు సంబంధించినవి. తాళ్లపాక కవుల సంకీర్తనల సంపుటాలు మొదటిసారిగా సమగ్రంగా పునర్ముద్రితమవుతున్నందువల్ల ముద్రణ, పాఠకుల సౌకర్యార్థం క్రమపద్ధతిలో వుండాలనే వుద్దేశ్యంతో పూర్వముద్రణ సంపుటాల సంఖ్యలు మార్చబడినవి. సంపుటాల సంఖ్యల మార్పులు ప్రత్యేకంగా పట్టికలో చూపబడింది.

తిరుమల తిరుపతి దేవస్థానానికి రాగిరేకుల్లో లభించిన తాళ్లపాక కవుల సంకీర్తనలు మొత్తం నేడు ముద్రించబడుచున్నందువల్ల సమగ్రమనే పదం సూచికంగా వాడబడింది.

భక్తిభావ విలసితాలైన తాళ్లపాక కవుల సంకీర్తనల సంపుటాలను సమగ్రంగా ముద్రించుటకు ఆమోదించిన తిరుమల తిరుపతి దేవస్థానం ధర్మకర్తృత్వమండలి అధ్యక్షులు శ్రీకలిదిండి రామచంద్రరాజుగారికి, మరియు ధర్మకర్తృత్వమండలి సభ్యులకు మా హార్దిక కృతజ్ఞతాంజలి.

ఈ సంపుటాల ముద్రణకు అధికారికమైన ఆమోదాన్ని తెలిపిన తిరుమల తిరుపతి దేవస్థానముల కార్యనిర్వహణాధికారి శ్రీ ఎం.కె.ఆర్.వినాయక్ I.A.S. గారికి కృతజ్ఞతాంజలి.

తాళ్లపాక పదకవుల సంపుటాల పునర్ముద్రణ ప్రణాళికరూపొందించుటలో సహకరించిన శ్రీ ఉదయగిరి శ్రీనివాసాచార్యులు గారికి (తాళ్లపాక వాఙ్మయపరిష్కర్త), విద్వాన్ శ్రీ సింగరాజు సచ్చిదానందంగారికి (విశ్రాంత తెలుగు అధ్యాపకులు, తిరుమల తిరుపతి దేవస్థానాలు) ఆచార్య కె. సర్వోత్తమరావుగారికి (డీన్, హ్యూమానిటీస్ & ఎక్స్‌టెన్షన్ స్టడీస్, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి) ఆచార్య ఎం. శ్రీమన్నారాయణమూర్తిగారికి (డైరక్టర్, శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాసంస్థ, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి) మరియు ఈ సంపుటాల ముద్రణలో సాహిత్యపరంగా నిర్మాణాత్మకమైన సూచనలందించిన డా॥ముదివేడు ప్రభాకరరావు M.A., Ph.D గారికి, (పరిశోధకులు, శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాలయం, తిరుపతి) మా హార్దిక కృతజ్ఞతాంజలులు.

ఈ సంపుటాల ముద్రణలో సాంకేతికపరమైన సహకారాన్ని అందించిన తిరుమల తిరుపతి దేవస్థానముల ముద్రణాధికారి శ్రీ ఎం. లక్ష్మణరావుగారికి, వారి సిబ్బందికి, తి.తి.దే పౌరసంబంధ శాఖాధికారి శ్రీ పి. సుభాన్‌గౌడ్ గారికి కృతజ్ఞతాంజలులు.

డా॥ మేడసాని మోహన్ M.A., Ph.D
డైరక్టర్
అన్నమాచార్య ప్రాజెక్ట్
తిరుమల తిరుపతి దేవస్థానములు
తిరుపతి.

తేది : 10-2-98

# తాళ్లపాక పదకవుల సంకీర్తనల సంపుటాలు

## సంఖ్యా వివరణ పట్టిక - 1998

| సంపుటాలు | మునుపటి సంఖ్య | ఇప్పటి సంఖ్య | సంకీర్తనాచార్యుని పేరు |
|---|---|---|---|
| అధ్యాత్మ సంకీర్తనలు | 1 | 1 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| అధ్యాత్మ సంకీర్తనలు | 2 | 2 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| అధ్యాత్మ సంకీర్తనలు | 3 | 3 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| అధ్యాత్మ సంకీర్తనలు | 10+11(1,2భాగాలు) | 4 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 12 | 5 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 4 | 6 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 13 | 7 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 14 | 8 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 15 | 9 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| అధ్యాత్మ, శృంగార సంకీర్తనలు | 16 | 10 | తాళ్లపాక చినతిరుమలాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 17 | 11 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 18 | 12 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 19 | 13 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 20 | 14 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| అధ్యాత్మ సంకీర్తనలు | 21 | 15 | తాళ్లపాక పెదతిరుమలాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 22 | 16 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 23 | 17 | తాళ్లపాక పెదతిరుమలాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 24 | 18 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 25 | 19 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 26 | 20 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 27 | 21 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 28 | 22 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 29 | 23 | తాళ్లపా[illegible]ార్యులు |

| | | | |
|---|---|---|---|
| శృంగార సంకీర్తనలు | 30 | 24 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 31 | 25 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 32 | 26 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| *శృంగార సంకీర్తనలు | 33 | 27 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| *శృంగార సంకీర్తనలు | 34 | 28 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| *శృంగార సంకీర్తనలు | 35 | 29 | తాళ్లపాక అన్నమాచార్యులు |

తాళ్లపాక పదసాహిత్యం మొదటిసారిగా సమగ్రంగా పునర్ముద్రణచేయ బడుచున్నది. ఈ సందర్భంగా సంకీర్తనల సంపుటాల సంఖ్యలు క్రమపద్ధతిలో ఉండాలనే వుద్దేశ్యంతో మార్పులు చేయబడి, పై పట్టికలో చూపబడినవి. పై పట్టికలోని మునుపటి సంఖ్య వరుసలో సూచింపబడిన 33, 34, 35 సంపుటాలు ఇంతవరకు ముద్రింపబడలేదు. ఇప్పుడు ప్రథమంగా ప్రచురింపబడుతున్నాయి. అయినప్పటికి ప్రస్తుతం 1998 సం॥లో క్రొత్తగా 1వ సంపుటం నుండి ఇవ్వబడిన క్రమ సంఖ్యలు ఈ ప్రథమ ముద్రణ సంపుటాలకు చేర్చబడినవి. వివిధ దశలలో 5, 6, 7, 8, 9 సంపుటాలు ప్రస్తుతం 1, 2, 3 సంపుటాలుగా గ్రహింప వినతి. వివరములకు ఆయా సంపుటాల పీఠికలు చదువగలరు. ఈ మార్పును సహృదయ పాఠకులు గమనించగలరు.

శ్రీ

# పీఠిక

★

కాకతీయసామ్రాజ్యచక్రవర్తి యైన ద్వితీయ ప్రతాపరుద్రునిచే సన్మానితుఁడు, భక్తాగ్రేసరుఁడు, ప్రథమాంధ్రసంకీర్తనాచార్యుఁడు నైన కృష్ణమాచార్యులు వేదాంతసంకీర్తనములు విన్నవింపఁగా వీనులార విని వివశుఁడై వెంకటేశ్వరుఁడు విరక్తుఁడయ్యెను. తర్వాత నూరేండ్లకు నందకాంశమున అన్నమాచార్యులు జన్మించి శృంగారసంకీర్తనలను రసగుళికలను విరచించి వెంకటేశ్వరునిచే నాస్వాదింపఁ జేయఁగా ఆ రసగుళికల నాస్వాదించి విరక్తుఁడైన వెంకటేశ్వరుఁడు మెచ్చి తల యూఁచి శృంగారి యయ్యెను. అన్నమయ్య విరచించిన శృంగార రసగుళికలే యిందు ఆరువందలు ప్రకటింపఁబడు చున్నవి. మూడు వందల ఒకటవసంఖ్య గల తామ్రఫలకమునుండి నాలుగువందల సంఖ్య గల తామ్రఫలకములలోని సంకీర్తనము లిందు ప్రకటింపఁ బడినవి.

అన్నమయ్య కీర్తనములను ఆయన కుమారుఁడు పెదతిరుమలయ్య, మనుమఁడు చినతిరుమలయ్యలు దేశ మంతటను వ్యాప్తి నందింపఁ జేసిరి. కడచిన సంపుటములో నీ విషయమును కొంత వివరించితిని. క్రీ. శ. 1562-1-1 న. గుంటూరుజిల్లా మంగళగిరిలోని శ్రీనరసింహస్వామి దేవాలయమున నీ సంకీర్తనములను గానము చేయుటకై చినతిరుమలయ్య యొక యేర్పాటు గావించెను. ఈ విషయ మీ క్రింది శాసనము వలన ధ్రువపడుచున్నది.

"దుంమఁతి సంవ్వత్సర పుష్య బ ౧౧ గు మగ్గ (2) ళగిరి శ్రీనరసిహ్వులకు తాళపాక చినతి (3) రుమలయ్యగారు తమ శ్రీరామనుజకు (4) టానకు[illegible]గాను పొలివోటు గట్టి సమపిఁచ్చి (5) ఇచ్చిన తుల్లఁపాటి ఖద్దికెక్షేత్రం కేసరి (6) పాటి నిఖర॥ కుచ్చెళ్లు ౪౦ కి ఇందుకు విని (7) యోగం పెరుమాళ్లు ఆరగించ్చిన (8) తళిఘ ప్రసాదం శ్రీవైష్ణవులకు జ (9) ా కింన్ని చిరువ్వాలి ఆరాధ్యులకు (10) రెండు పళ్లప్రసాదముంన్ను సంకీ (11) ర్తనా[illegible] స్వాదు భాగవతు (12) లకు ప్రసాదముం ప ౧ న్ను శ్రీరా[illegible] నుజ

కూటం కావలివారికె ప ం న్ను (14) శ్రీవైష్ణవులు యెనమంద్రకున్ను క (15) లుపు చమరు కరియమోదు తళిఘె (16) ఆకులు సహితం సమప్పణ। మగ్గళ (17) గిరి శ్రీనరసింహ్వాలకు బుజబళరాయ (18) ని సమప్పణగను మిసరగండ్డ అనవోత (19) వరము ఖండ్డె ........ కేసరిపాట్న ఖ (1½ అంగుళము జాగా ఖాళీగా వదలి యున్నది. అక్షరములు చెక్క లేదు) గ్రా (20) మం పాడు సహవుత్తరం భాగం క్షేత్ర (21) సమప్పణ గ్రామంలోను నివేశనం సగ (22) మ్ను క్షేత్రము సగమున్ను సమప్పణ.

## అన్నమయ్య కీర్తించిన వేల్పులు

ఓంగునూతల :— కడపజిల్లా కడపతాలూకాకు చేరిన చిన్నదాసరిపల్లె సమీపమందలి లోయలో వేయినూతులు గల ప్రదేశమునకు 'వోనూతలకోన' యనియు 'వోగునూతలకోన' యనియు పేర్లు కలవు. అచట నరసింహస్వామి దేవాలయము కలదు. అన్నమయ్య కీర్తించినాఁడు. చూ. సంకీ. సంఖ్య. 385.

* ఈ శాసనము సౌత్ ఇండియన్ ఇన్స్క్రిప్షన్సు వాల్యూం 4. నెం. 710 గా ప్రకటింపఁబడి యున్నది. అందులోని పాఠములకు నే నిప్పుడు ప్రకటించు పాఠములకు చిఱు మార్పులు కలవు. నేను స్వయముగా వెళ్లి శాసనమును చదివి యిది వ్రాసితిని.

ఈ శాసనస్తంభము మంగళగిరి శ్రీ నరసింహస్వామి దేవాలయ ముఖమంటపపు ముందుమెట్లకు ఉత్తరపు వైపున కలదు. రాతి పొడవు 66 అంగుళములు (భూమిపై నున్నది.) వెడల్పు క్రింది వైపున 15 అంగుళములు. పైభాగమున 12 అంగుళములు. మందము 6 అంగుళములు. ముందువైపున శా. శ. 1480 నాఁటి సదాశివరాయల శాసనమని కలదు. అది ముందువైపు కాగనె ఉత్తరపువైపున, అతర్వాత దక్షిణపువైపున, ఇంకను మిగిలిన భాగము పడమటివైపున తాళ్లపాకవారి శాసనమునకు క్రింద చెక్కి యున్నారు. తాళ్లపాకవారి శాసనమునకు సదాశివరాయల శాసనమునకు మధ్య నొక గీత చెక్కి యున్నారు. ఈ రెండు శాసనములకు క్రింద 15 అంగుళములు శిథిలము కలదు. ఇంతకు పూర్వ మీ శాసనము ప్రకటించినవారు కలగపులగముగా ప్రకటించి యున్నారు. ఇందు "ఆకులు సహితం సమప్పణ" అన్నవరకే తాళ్లపాకవారి దేమో; అయినను క్రింద గీత గలప్రదేశమువరకు ప్రకటించితిని.

ఈ శాసనపు కేది శ్రీస్వామి కణ్ణుపిళ్లగారి ఇండియన్ ఎపిగ్రఫీ ఆధారముగా వేసితిని. ఈ శాసనపు ఉనికి విషయమున స్పష్టమైన యెఱుకను నాకు చేకూర్చిన శ్రీ వేటూరి. ఆనందమూర్తిగారికి నా కృతజ్ఞత తెలుపుకొనుచున్నాను.

కడప :— కడపజిల్లా కడపగ్రామములోని వెంకటేశ్వరుని కీర్తించినాఁడు. చూ. సంకీ. సంఖ్య. 45; 290; 291; 417; 501; 563.

కోన :— కడపజిల్లా కడపతాలూకాకు చేరిన నందిమండలమునకు దక్షిణమున పాలకొండ పర్వతమందలి కోనలో చక్కని యూటలు గల ప్రదేశ మున్నది. అచటి ప్రజ లీప్రదేశమును చాల పవిత్ర మైనదానినిగా భావించుచున్నారు. అచట చెన్నరాయని దేవాలయము కలదు. ఆ చెన్నరాయని అన్నమయ్య కీర్తించినాఁడు. చూ. సంకీ. సంఖ్య. 423.

తిరుపతి :— చిత్తూరుజిల్లా చంద్రగిరితాలూకా తిరుపతిలో నేఁడు ప్రసిద్ధి పొందియున్న గోవిందరాజును కీర్తించినాఁడు. చూ. సంకీ. సంఖ్య. 575.

తుంగభద్రదరి :— తుంగభద్రానదీతీరమున నేగ్రామము నందలి దేవుని కీర్తించినాఁడో తెలియ రాలేదు. విజయనగరమునఁ గల దేవాలయములలో ప్రాచీన మైన గోపాలకృష్ణుని దేవాలయ మున్న దేమో తెలియ రాలేదు. నెల్లూరు జిల్లా దర్శితాలూకాలో తుంగభద్రాతీరమందలి పోలేపల్లిలో ప్రాచీన మైన విఠ్ఠలేశ్వరుని దేవాలయ మున్నట్లు తెలియుచున్నది. అందే గోపాలకృష్ణాలయము కల దేమో! తుంగభద్రదరిని గల గోపాలకృష్ణుని కీర్తించినాఁడు. చూ. సంకీ. సంఖ్య. 121.

పండరంగము :— బళ్లారిజిల్లా హొస్పేటతాలూకా తుంగభద్రానదీ తీరమందలి హంపీక్షేత్రమునఁ గల విఠ్ఠలేశ్వరస్వామికిని పండరంగమున (పండరిపురము) గల విఠ్ఠలేశ్వరునికిని అభేదము కల్పించి కీర్తన రచించినాఁడు. పురందరదాసుల సాహచర్యమే పం[illegible]ఠ్ఠలుని ప్రశంసకుఁ గారణము కావచ్చును [illegible]సంకీ. సంఖ్య. 427.

ముడియము :— కడపజిల్లా జమ్మలమడుగుతాలూకాలో కుందేరునది యొడ్డున పెద్దముడియము కలదు. దీనికి పడమటి వైపున ప్రాచీనకాలమునాఁటి యొకపాటిదిబ్బ కలదు. అచట ప్రాచీన మైన దేవాలయములు కలవు. అందులో నొకటి శ్రీనరసింహస్వామి దేవాలయము. ఈనరసింహుని కీర్తించినాఁడు. చూ. సంకీ. సంఖ్య. 139.

సంబటూరు :— కర్నూలుజిల్లా శిరివెళ్లతాలూకాలో 'సంబవరము కలదు. అది కాక యీ సంబటూరు వేఱైనదో తెలియ రాదు. ఆ సంబవరమున దేవాలయము కల దేమో! సంబటూరి చెన్నరాయని అన్నమయ్య కీర్తించి నాఁడు. చూ. సంకీ. సంఖ్య. 162.

అవకాశము చాలనందున పోలికలను గూర్చి వ్రాయలేక పోయితిని. ఇతరత్ర దానినిగూర్చి వివరింతును.

అస్తవ్యస్తముగను నపపాఠములతోను నింతకుమునుపు ప్రకటింపఁబడిన రెండవ సంపుటమే సరి యైన తీరున పంద్రెండవ సంపుటముగా ప్రకటింపఁ బడినది. ఆ ప్రకటనమున పరిష్కర్త లీక్రింది సంకీర్తనమును ప్రకటింప లేదు. ఈ సంకీర్తనము పదునైదవరేకున నైదవ పాటగా గలదు. దీనిని పంద్రెండవ సంపుటమున 88, 89 సంకీర్తనల నడుమ చదువుకొనవలయు నని ప్రార్థించుచున్నాను:

ఆహిరి

తొల్లియును మఱ్ఱాకు తొట్టెలనె వూఁగెఁ గన
చెల్లుబడి నూఁగీని శ్రీరంగశిశువూ ॥ పల్లవి ॥

కలికి కావేరితరఁగల బాహులతలనే
తలఁగ కిటు రంగమధ్యపుఁ దొట్టెలను
పలుమారు తను నూఁచి పాడఁగా నూఁగీని
చిలుపాల నెలవితో శ్రీరంగశిశువు ॥ తొల్లి ॥

అదివో కమలజుని తిరువారాధనం బనఁగ
అదనఁ గమలభవాండ మనుతొట్టెలను

ఉదధులు తరంగముల నూచఁగా నూఁగీవి
చెదరని సిరులతోడ శ్రీరంగశిశువు ॥ తొల్లి ॥

వేదములె చేరులై వెలయఁగ శేషుఁడే
పాదుకొని తొట్టెలై పరగఁ గాను
శ్రీదేవితోఁ గూడి శ్రీవెంకటేశుఁడై
నేఁడ దేరెడివాఁడె శ్రీరంగశిశువూ. ॥ తొల్లి ॥

(అన్న. శృంగా. 15-రేకు. 5-పాట.)

సంకీర్తనలు వేలకొలఁదిగా రచించిన అన్నమయ్య అలమేలు మంగకు ప్రత్యేకమైన దేవాలయ మున్నట్లు పేర్కొనలేదు. ఆమె శ్రీ వెంకటేశ్వరుని వక్షస్థలమునం దున్నట్లు పేర్కొన్నాఁడు. అతఁడే కాదు. అతని కుమారుఁడైన పెదతిరుమలయ్య, మనుమఁడైన చినతిరుమలయ్యలు కూడ తిరుచానూరులో నున్న అలమేలుమంగను తమ సంకీర్తనలలో పేర్కొనలేదు. పెదతిరుమలయ్య తన శృంగారసంకీర్తనల అరువది మూడవరేకు రెండవపాటలో "అదె వంటశాలలోన అలమేలుమంగ" అన్నాఁడు. కాబట్టి తిరుమలలో నేఁడు వకుళమాలికాదేవిపేర నున్న దేవతయే అలమేలుమంగ కాఁదగును. చినతిరుమలయ్య చంద్రగిరి సమీపమున మంగాపురమునందు గల దేవాలయమును జీర్ణోద్ధారము కావించెను. కాబట్టి కూడ తిరుమలలోని దేవియే అలమేలుమంగ యగుసు. వేలకొలఁదిగా నున్న శాసనములలో కూడ ఆ కాలమునకు అలమేలు మంగకు ప్రత్యేకమైనదేవాలయ మున్నట్లు తెలుపబడ లేదు.

అన్నమయ్య రచించిన "వెంకటేశ్వర శతకము"ను ఇచటి తామ్ర ఫలకములనుండి ఆంధ్రసాహిత్య పరిషత్తువారు వ్రాసికొని పోయినట్లు తెలియుచున్నది. కాని నేఁ డారేకులు కానవచ్చుట లేదు. ఇట్లే మఱి కొన్ని రేకులు కూడ కానవచ్చుట లేదు. వీనియునికిని తెలిసికొన వలసి యున్నది.

సింహాచలమున అధ్యయనోత్సవ సమయమున నేటికిని అన్న మాచార్య సంగీతత్తు కరుళప్పాదు' అని ఆరంభించి అన్నమయ [illegible] కీర్త నల నాలపింతురు. ఆ తర్వాత ద్రావిడవేదము పఠింతు[illegible]
సింహాచలము వఱకును వ్రాకిన వసుటకిది యొక సాక్ష్యమ[illegible]

శ్రీరంగమునందలి అన్నమాచార్యుల తామ్రఫలకములను తిరు మల తిరుపతి దేవస్థానమువారు వ్రాసికొనుటకుగా సెలవిచ్చినందులకు పై దేవాలయాధికారులకు, మద్రాసు ప్రభుత్వమువారికి కృతజ్ఞత తెలుపు చున్నాను. శ్రీరంగమునుండి వచ్చినరేకులు కూడ పరిమాణమునను, లిపి తీరునను అహోబలమునుండి తెచ్చిన రేకుల తీరుననే కలవు. ఇంకను సేకరింప వలసిన రేకులెన్నియో కలవు. ఇతరత్ర గల తాళ్లపాకవారి రేకులు, వారిచరిత్ర సేకరింపవలసి యున్నది.

పదునాల్గు సంవత్సరములుగా అన్నమాచార్యోత్సవము మహా వైభవముగ జరుగుచున్నను అన్నమయ్య పెదతిరుమలయ్యలవో, అన్నమయ్య చినతిరుమలయ్యలవో ఉబ్బెత్తు విగ్రహములు తెలియరాని విధముగా ప్రకటనము జరుగుచున్నది. తెలుగుదేశ మింత దుస్థితిలో నున్నది. ఇక నైన తెలుగువారు తాళ్లపాక కవులను సరి యైన విధముగా సత్కరించునట్లు ప్రచారము కావించవలె నని ప్రార్థించుచున్నాను.

అన్నమాచార్యుల సంకీర్తనములను ప్రకటింపవలె నని సంకల్ప మును కల్గియున్న తిరుమల తిరుపతి దేవస్థానముల ధర్మకర్తలసంఘము వారికిని, వారి తరపున కార్యనిర్వాహకు లైన శ్రీ చెలికాని అన్నారావు గారికిని ముఖ్యముగా నా ధన్యవాదము లర్పించుచున్నాను.

సంకీర్తనల పరిష్కరణ కార్యమున పనిగొనుటకు నాకనుమతి యిచ్చిన శ్రీవెంకటేశ్వర యూనివెర్సిటీవారికిని, ముఖ్యముగా సరసులు సాహితీప్రియులు వైస్‌ఛాన్సలర్‌గారు నైన శ్రీ శీరం గోవిందరాజులు నాయుడుగారికిని ధన్యవాదము లర్పించుచున్నాను.

సంకీర్తనల ముద్రణకార్యమును శ్రద్ధతో చూచుచున్న తిరుమల తిరుపతి దేవస్థానము ముద్రణాలయమువారికి భగవంతు డాయురారోగ్య ముల నొసఁగవలయు నని భగవంతుని ప్రార్థించుచున్నాను.

ఈ సంపుటమునందలి సంకీర్తనల పరిష్కరణమునను ముద్రణ మునను నేవేని దోషము లున్న సహృదయులు మన్నింతురు గాక.

ఇట్లు

తిరుపతి
10—3—63

అర్చకం. ఉదయగిరి. శ్రీనివాసాచార్యులు.

శ్రీ

శుభమస్తు

శ్రీమతే రామానుజాయ నమః

శ్రీ తాళ్లపాక

# అన్నమాచార్యుల శృంగార సంకీర్తనలు

~~౧౦-వ సంపుటము~~

[స్వస్తిశ్రీ జయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౩౪౬ అగు నేఁటి క్రోధి సంవత్సరమందు తాళ్లపాక అన్నమాచార్యులు అవతరించిన, పదారు యేండ్లకు తిరువేంగళనాథుఁడు ప్రత్యక్షమైతేను. అది మొదలుగాను శాలివాహన శకవరుషంబులు ౧౪౨౪ అగు నేఁటి దుందుభి సంవత్సర ఫాల్గుణ బహుళ ౧౨ * నిరుధానకు, తిరువేంగళనాథునిమీఁదను అంకితముగాను తాళ్లపాక అన్నమాచార్యులు విన్నపము చేసిన శృంగార సంకీర్తనలు.]†

301 వ రేకు. సాళంగనాట

నీ విన్నిటా నేర్పరివి నే నంతేసి నేరను
మోవి గిరిపే నింతె ముంచి యేమి సేసేరా ॥ పల్లవి ॥

కప్పురము నోటి కిచ్చి కాఁక లెల్లా రేఁచేవు
యెప్పటివాఁడవె కావా యేరా నీవు
అప్పటి మంచివాఁడవై యానలు వెట్టుకొనేవు
రెప్ప లెత్తి చూచే నింతె రేసు లేమి సేసేరా ॥ నీవి ॥

అంచెలను విడె మిచ్చి ఆసలు వుట్టించేవు
మంచి చుట్టమవె కావా మాకు నెప్పుడు
లంచము మో విచ్చే నంటా లావులనె పెనఁగేవు
మంచానకుఁ దీసే నింతె మరి యేమి సేసేరా ॥ నీవి ॥

* అస్మద్గురుదేవులు శ్రీవేటూరి ప్రభాకరశాస్త్రిగారు "నిరోధానకు? తిరోధానానకు?" అని సందేహముతో పాఠము సూచించిరి. "నిరుధానకు" అను పదము చనిపోవు వరకు అను అర్థమున ప్రయోగింపబడినది.

† ఈ వచనము మొదటి రేకున మాత్రమే గలదు.

గందవొడి మీఁదఁ జల్లి కాఁగిలించుకొనేవు
    అందగాఁడవె కావా అన్నిటా నీవు
    పొందుల శ్రీవెంకటేశ భోగించితివి నన్ను
    మందెమేళా లాడే నింతె మరి యేమి నేసేరా. ॥ నీవి ॥ 1

## పాడి

ఏమి బాఁతి నే నీకు యిటు నాకె దక్కితివి
    నోమటి నిందుకె పో నీ తొత్త నైతి నేను ॥ పల్లవి ॥

మన్నించి విచ్చేసితివి మా యింటికి నేఁడు నీవు
    కన్నుసన్న నేసితేనె కా దన నైతి
    పిన్నదాన నవక నా ప్రియమె చేకొంటివి
    యిన్నేసి నావలపుల కెల్లా లోనైతివి ॥ ఏమి ॥

తప్పక చూచినంతలో దగ్గరి కూచుండితివి
    కప్పురవిడె మిచ్చితేఁ గైకొంటివి
    చెప్పినట్టల్లాఁ జేసి చేఁతలకు గురైతివి
    యిప్పుడు నా యంకెలకు యియ్యకో లైతివి ॥ ఏమి ॥

గక్కనఁ గాఁగిలించితే కన్నులు దేలించితివి
    పక్కన నా రతులకు భ్రమసితివి
    యిక్కువ శ్రీవెంకటేశ యింమనె నన్నుఁ గూడితి
    మిక్కిలి నాయెద కూనుమేలువాఁడ వైతివి. ॥ ఏమి ॥ 2

## హిజ్జిజి

నీ వోజగా దిది ని న్నెఱఁగనా
    బూవపుసరసా లేల పూఁచ వచ్చేవూ ॥ పల్లవి ॥

అంగనమొగము చూచి అప్పటప్పటికి నాతో
    యెంగిలిమాటలు నేర్చి యే లాడేవు
    సంగడి జాణతనాలు సతు లెల్ల నాడఁగాను
    జంగిలివలపు లేల చల్ల వచ్చేవూ ॥ నీవో ॥

తరుణి అప్పణగొని తమకించి నాతోఁడ
　　మెరవుల నవ్వులు నీ వేల నవ్వేవు
　　వరుస వంతులవారి వానులు గొంత రేఁచుక
　　పొరుగు పొరచు లేల పుయ్య వచ్చేవు　　॥ నీవో ॥

యింతి కైదండ వట్టుక యిప్పు డిట్టె నామీఁద
　　యింతలోనె నీ చేయి యేల వేసేవు
　　బంతినె శ్రీవెంకటేశ పైకొని నన్నుఁ గూడితి
　　దొంతరరతుల కేల దొమ్మి సేసేవు.　　॥ నీవో ॥ 3

## సాళంగం

అవధరించవయ్య అనుమాన మిఁక నేల
　　చివురుఁజేతులనె నేసవెట్టీ ‡ నదివో　　॥ పల్లవి ॥

కాంత మోవివిందు వెట్టి కన్నుల నవ్వుఁజూపుల
　　వింతలుగఁ గప్పురపువిడే లిచ్చి
　　పొంతనె సరసముల పువ్వుబాసికేలు గట్టి
　　చింత దీర చెనకులనేస వెట్టీ నదివో　　॥ అవ ॥

పక్కనఁ దనతొడలఁ బానుపు వరచి నీకు
　　గక్కన మోహా లనేకట్లా లిచ్చి
　　వెక్కసపుఁ దమకాల వియ్యాము లట్టె యంది
　　చిక్కని చనుగుబ్బలనేస వెట్టీ నదివో　　॥ అవ ॥

దొమ్మిఁ గాఁగిటనే గురుతుల సొమ్ము లెల్ల నించి
　　నెమ్మది నానందముల నెలవుకొని
　　కొమ్మ శ్రీవెంకటేశుఁడ కూడె నిన్ను మేడలోన
　　చిమ్ముఁజెమటల ముత్తేలనేస వెట్టీ నదివో　　॥ అవ ॥ 4

## ముఖారి

ఆయము లేఁక నిద్దరి కంటుఁ గాక
　　చేయివల్ల నుండ నేలె చేఁతల యాతనికి

---

‡ రేకులోని పాఠము 'నిదివో'

నిగ్గుల నాతఁ డన్నియు నీకెతోఁ జెప్పఁగాను
  యెగ్గు లేల పట్టేవె యేమే నీవు
  సిగ్గులు నిను రేఁచితె చిఁకఁ బొరలేదానవు
  దగ్గరి కూచుండ నేలె తమఃపాతనిని ॥ అయ ॥

నెమ్మది నీమోము చూచి నీవిభుఁడె నవ్వఁగాను
  యెమ్మె లేల నేసేవె యేమే నీవు
  కమ్మి నీకు మొక్కితేనె కాఁక రేఁగేదానవు
  చెమ్మఁజెమ టార్చ నేలె నేవల నాతనికి ॥ అయ ॥

వెకలి శ్రీవెంకటాద్రివిభుఁ డిట్టె కూడఁగాను
  యెకసక్కే లే లాడేవె యేమే నీవు
  వొకటొకటికి నీవు వొరసెటిదానవు
  మొకమిచ్చ లాడ నేలె మొదలె యాతనిని. ॥ అయ ॥ 5

రామక్రియ

దండ నుండేఁ గైకోఁడు దవ్వల నుండేఁ బైకొను
  చండి నేసేది ఆతని సాజమే కాదా ॥ పల్లవి ॥

పెనఁగి కానకుండేను పిలువ నంపు నని
  మొనసి నీతో నంటి మొదలే కాదా
  వొనిఁగి మీరు నాకు బుద్ధి చెప్ప రాకు మని
  మునుపనె చెలులాల మొక్కితిఁ గాదా ॥ దండ ॥

మంకుతోడ నూరకుండే మాటలాడించు నని
  అంకెల నీతో నవ్వితి నందుకే కాదా
  వంక లొత్తి మాకు మీరు వలపు రేఁచకు మని
  వొంకాన మీదాన నని వొం దైతిఁ గాదా ॥ దండ ॥

యింటిలో నే నూరకుండే యీడకే విచ్చేసు నని
  దంట నై సన్న నేసితి దానికే కాదా
  అంటుక శ్రీవెంకటేశుఁ డలమె దూరకుఁ డని
  గైపై మీ సమ్మతినె చక్క నుంటిఁ గాదా. ॥ దండ ॥ 6

302-వ రేకు నాదరామక్రియ

చవులు వేరె వేరె సరసులకు వలపు
యువిదలకుఁ బతుల కొక్కటే వలపు ॥ పల్లవి ॥

కనుకలివేళను కలుగు నొక్కవలపు
వినుకలిఁ బొడమేది వేరె వలపు
అనఁగి పెనఁగేవేళ నదియు నొక్కవలపు
వొనరినప్పు డిన్నియు నొక్కటే వలపు ॥ చవు ॥

సరస మాడెటివేళ సంగతౌ నొక్కవలపు
సరి నెదమాటలది జంటవలపు
తెరమరఁగున నుండి తేలించే దొకవలపు
వొరసి మర్మ మంటితే నొక్కటే వలపు ॥ చవు ॥

వుపరతి సమరతి నుండు నొక్కవలపు
యెపుడూనుఁ దలపోఁత లేకవలపు
రప మై శ్రీవెంకటేశ రతి నన్నుఁ గూడితివి
వుపమించి చూడ నింతా నొక్కటే వలపు. ॥ చవు ॥ 7

సామంతం

ఓర్చుక నావద్ద నున్నాఁడవు
తేర్చి నాగుణము తెలిసితివా ॥ పల్లవి ॥

నెలఁత నీకు నటు-నేర్పిననేర్పుల
మలకలమాటలు మఱచితివా
పలుకవు మాతోఁ బలుమారు నవ్వేవు
కెలయ కిందుననె గెలిచేవా ॥ ఓర్చు ॥

వనిత నీకు నటు వంతులు వెట్టిన
మనసులో పనులు మఱచితివా
పెనఁగక నాతోఁ బ్రియములు చూపేవు
ననుపు లిందుననె నడపేవా ॥

కాంత నీవు నను( గలయు మనిన యల
మంతనపురతులు మఱచితివా
యింతట శ్రీవెంకటేశ నను( గూడితి
నంతత మిట్లనె జరపేవా. ॥ ఓర్పు ॥ 8

## శుద్ధవసంతం

అందా(కా నీకు మొక్కు-తా నంతా నింతా నుండే( గాక
యిందరిలో( బదరితే నిది సిగ్గు గాదా ॥ పల్లవి ॥

ఆవల నీ వొకతెతో అట్టె మాటలాడ(గాను
చేవట్టి తియ్య(గ( బోతే సిగ్గు గాదా
వావిరి నాపెయు నీవు వసంతము లాడ(గాను
యీవేళ నీమోము చూచే దిది సిగ్గు గాదా ॥ అందా ॥

‡ కోరటు పరాకై నీవు కొమ్మను( గూడుండ(గాను
చేరి నీతో నవ్వ(బోతే సిగ్గు గాదా
గారవించి యాపెతో యాకతము(నీ వాడ(గాను
యీరీతి దగ్గరితేను యిది సిగ్గు గావా ॥ అంవా ॥

అక్కడిరతుల నీవు అలసి వుండేవేళ
చెక్కులు నే నొక్కితేను సిగ్గు గాదా
గక్కన శ్రీవెంకటేశ కలసితి విటు నన్ను
యిక్కడ నవి దడవే దిది సిగ్గు గాదా.. ॥అందా॥ 9

## మధ్యమావతి

కాంతలకు( బతులకు కల సాజమె యిది
వింతదానవా నీకు వెర వేలమ్మా ॥ పల్లవి ॥

కందువకు( దీసేది కన్నుల నదలించేది
యిందరికి( గలదె యే మమ్మా
యిందుకు(గా నాత(డు యెగ్గు వట్టినా విన్ను
విందుల వెరపు చల్లీ వెర వేలమ్మా ॥ కాంత ॥

---

‡ రే. పా. కోరెటు.

పెనఁగితేఁ దిట్టేది బెరసితే మెచ్చేది
వనితల కీపాటి వలె నమ్మా
చన విచ్చె నాతఁడు సలిగె గలదు నీకు
వెనక ముందరి కిఁక వెర పేలమ్మా ॥ కాంత ॥

కూడి యిట్టె చొక్కేది గురుతులు నించేది
పాడి వంత మెక్కె నీకు పైపై నమ్మా
వోడక శ్రీవెంకటేశుఁ డురమునఁ బెట్టె నిన్ను
వేడుకకు వెల లేదు వెర పేలమ్మా. ॥ కాంత ॥ 10

రామక్రియ

సిగ్గరి చెలులము నీచిత్తము వచ్చునో రావో
యెగ్గులు తప్పు లెంతుము యింతేసికి నోప ॥ పల్లవి ॥

చనవు లెల్ల నెరపి సలిగెలఁ దొరలుచు
ననుపు నీ కాపె నేసీ నాయెదుటనె
మనసు వచ్చు నీ కది మాకు నిన్ను నన నేల
చెనకి యింకాఁ బనులు సేయించుకో నీవు ॥ సిగ్గ ॥

తగులాలు చెప్పుకొని దండ నుండి కుంచ వేసి
నగీ నాపె నీతోను నాయెదుటనె
జిగి నీకుఁ బ్రియ మిది చింతలు రేచఁగ నేల
వొగరు లే కింకా నందె వోలలాడు నీవు ॥ సిగ్గ ॥

అంటి మేను దాఁకించి ఆకుమడిచి నీ కిచ్చి
నంటు సేసీ నీతోను నాయెదుటనె
గొంటవై శ్రీవెంకటేశ కూడితివి నన్ను నిట్టె
దంటతనమున నవి తలఁచుకో నీవు. ॥ సిగ్గ ॥ 11

కేదారగౌళ

వెలఁది నీరతుల వీఁగ దిఁక
నిలువున నెమ్మెలు నెరపకు వయ్యా ॥

పలుమరు నీతో పంతము లాడఁగ
చెలియకుఁ గుచములు చేఁ గెక్కె
చలమునఁ బైకొని సాములు సేయఁగ
మొలకలపులకలు మొన లాయ ॥ వెల ॥

సరసము నీపైఁ జల్లఁగఁ జల్లఁగ
వరుస గోరికొన వాఁ డెక్కె
సరుగఁ గూరిమి గొసరఁగఁ గన్నుల
నిరతపు మెఱుఁగులు నిండె నవే ॥ వెల ॥

వొప్పుగ మేనులు వొరయఁగ మీకును
చిప్పిలుఁ జెమటల చిత్తు కెక్కె
అప్పఁడ శ్రీవెంకటాధిప కూడితి
కప్పురగంధికి కళ లవె మించే. ॥ వెల ॥ 12

303 వ రేకు వసంతవరాళి

పంతపువా రెల్ల ‡నిటువలె మొక్కేరా
యింత నీవు నావలె *యెన సుండేవా ॥ పల్లవి ॥

యీకడ తమ అంకెల కింతె కాక కాంత లెల్ల
నీ కిచ్చకము లాడేరా నేనె కాక
మేకొని మీఁద మిక్కిలి మేనరికపువా రింతె
నాకొలఁది నీసేవకు నన్నుఁ బోలేరా ॥ పంత ॥

వలచినవారు తమవైపులె చూతురు గాక
నెల వై నిన్ను మెచ్చేరా నేనె కాక
వొలసి యిందరు నీ నవ్వులతోడివా రింతె
నలువంక నీపట్టుకు నన్నుఁ బోలేరా ॥ పంత ॥

పచ్చిగాఁ గూడినవారు పరవశు లింతె కాక
నిచ్చ నిన్నుఁ జొక్కించేరా నేనె కాక
యిచ్చఁ గూడితి శ్రీవెంకటేశ నన్నుఁ బరు లెల్ల
నచ్చుల నీలాగులకు నన్నుఁ బోలేరా. ॥ పంత ॥ 13

---

‡ రే. పా. నిటువలె. * రే. పా. యెన సుండేరా.

హిందోళవసంతం

ఆపాటి కాపాటి అంతే చాలు
యేపొద్దు నీజాడ లెల్ల నెరఁగనా నేను ॥ పల్లవి ॥

ప్రేమము లేనిమాట పెదవిపైనె వుండు
కామించని చూపు లెల్లఁగడల నుండు
ఆముకొని తలపోఁత లాతుమలోననె వుండు
యేమిటికి నను ముట్టే వెరఁగనా నేను ॥ ఆపా ॥

తమ్మి లేనిపొందికలు తనువుమీఁదనె వుండు
కొమరాఁక లెల్ల గోరికొనల నుండు
అమరని సరసాలు ఆసాస లై యుండు
యిమ్ముడకు మమ్ము నంతే నెరఁగనా నేను ॥ ఆపా ॥

అంకెకు రానివేడుక లరమరపుల నుండు
లంకె గానిపెనఁగులు లావుల నుండు
పొంకపు శ్రీవెంకటేశ భోగించితివి నన్ను
యింకా నేల అనుమానా లెరఁగనా నేను. ॥ ఆపా ॥ 14

పాడి

ఊరకుండవయ్యా నీవు వువిదతో మారాడక
ఆరయ నొచ్చము లేదు అంగనల కెపుడు ॥ పల్లవి ॥

యే మాడిన నాఁటదాని కెగ్గు లేదు తప్పు లేదు
నేమాన నూరకుండిన నేరమి లేదు
దోమటిగాఁ జూచినాను దొరతన మై తోఁచు
వేమారు నవ్విన నవి వేడుక లై నిలుచు ॥ ఊర ॥

తల వంచుకుండినాను తగ్గు లేదు మొగ్గు లేదు
పలుకక వుండినాను భయము లేదు
బలుము లై చూపినాను పంతము లై రతి కెక్కు
పెలుచఁజేఁత సేసినా ప్రియము లై తగులు ॥ ఊర ॥

మించి కాఁగిటఁ గూడిన మితి లేదు మేర లేదు
యించుక గుట్టున నన్న యెరవె లేదు
అంచల శ్రీవేంకటేశ అంగనఁ గూడితి విట్టె
మంచముపైఁ గూచుండిన మర్మము లై మించును. ॥ఊర॥ 15

బౌళి

ఎందు వొయ్యే మిఁకనూ యేఁగేము గాక నిన్ను
కందువలనె తెలిపేఁ గానీవయ్య యిపుడు ॥ పల్లవి ॥

యింతుల తిట్లకును యెగ్గు వట్టేవారె కాక
సంతసించి నవ్వు నవ్వేజాణ లెవ్వరు
అంతలో నే నని వచ్చే వాయము సోఁక నాడి
పంత మెల్లఁ గనుకొనే పదవయ్య లోనికి ॥ ఎందు ॥

కొమ్మల సణఁగులకు గోర సేసేవారె కాక
నమ్మతించి మెచ్చు మెచ్చేజాణ లెవ్వరు
కమ్మర దీకొనేవు నీకడమ లెల్లాఁ బాపి
పమ్మి నీవోపిక చూచేఁ బదవయ్య లోనికి ॥ ఎందు ॥

మగువల మేకులకు మట్టుపడేవారె కాక
జగములోఁ గా దనేటిజాణ లెవ్వరు
నిగిడి శ్రీవేంకటేశ నిన్ను నేనె కూడితిని
పగటు రేరుపరచేఁ బదవయ్య లోనికి. ॥ ఎందు ॥ 16

కేదారగౌళ

చిత్త మెట్టుండెనో నేఁడు చేసిన నాచేఁతలకు
అత్తి మొక్కి అందుకె నీ వానలు వెట్టితివి ॥ పల్లవి ॥

యీడు జోడై కూడి నీవె యిచ్చినచనవునను
ఆడినట్టె ఆడి నిన్ను నలయించితి
జాడతోడి నా వొళ్లి జవ్వనమదమునను
వోడక నీ వంటితేను వోప నంటిని ॥ చిత్త ॥

మంతనము లాడినట్టి మందెమేళముననె
పంతములే నీ యడకుఁ బచరించితి
అంతగా నీ విచ్చినట్టి అతిరాజసముననుఁ
సంతసాన నీకు మంచము దిగ నైతిని ॥ చిత్త ॥

మదనకేలిఁ జొక్కించి మన సిచ్చినందుపంక
పదిమారులును నిన్నుఁ బచ్చి సేసితి
యిదె శ్రీవెంకటేశ నీ వెనయుపరవశాన
వుదుటు మీరఁగ నీవురముపై నెక్కితి. ॥ చిత్త ॥ 17

శ్రీరాగం

ఎందరి [1]భ్రమించితివో యిటువలెనే
యెందును నీ మర్మ మిది యెరఁగ మైతిమిరా ॥ పల్లవి ॥

మచ్చికల నీతోడ మాటలాడి నిన్నటి
మచ్చరపుటలుకలు మరచితిని
ముచ్చట నీ విటువంటి మొకమాయకాఁడ వౌత
యిచ్చలోన నేము తొల్లె యెరఁగ మైతిమిరా ॥ ఎంద ॥

పక్కన నిన్ను దగ్గరి పంతపుమాట లెల్ల
మక్కళించి యాడ నీతో మరచితిని
గక్కన నీ వింతతమకములు నేరుచుకొంట
యిక్కువగా నేఁడు నేము యెరఁగ మైతిమిరా ॥ ఎంద ॥

పెనఁగి పెనఁగి నీతోఁ బెట్టుకొన్నవొ ట్లెల్ల
మన సిచ్చి కూడి నే మరచితిని
ననిచి శ్రీవెంకటేశ నాఁటకీఁడ వవుత నిన్ను
యెనసినవేళ నేమీ నెరఁగ మైతిమిరా. ॥ ఎంద ॥ 18

304-వ రేకు లలిత

ఇంక నేఁటి బిగువు యేల నీకును
వంక లొత్తి నొరగులా వాసిమీఁదను ॥

1. "భ్రై" వ్రాసి "భ్ర" అని తిద్ది యున్నారు.

తిలకించి నీచేఁతకు తిట్ట కేల మానును
చలిమి బలిమిఁ గల జవరాలు
అలుగ నీకుఁ దగదు ఆయములు సోఁక నాపె
అలమి లోనికిఁ దీసె నందుమీఁదను ॥ ఇంక ॥

చెనకే నీమాటలకు చేయి చాఁచ కేల మాను
మనసు మర్మము గన్న మదిరాక్షి
పెనఁగ నీకుఁ దగదు ప్రేమములు రేఁగ నాపె
అనువుగా కళ రేఁచె నందుమీఁదను ॥ ఇంక ॥

కూడిన నీకూటమికి కొన కెక్క కేల మాను
సూడుఁ బాడు నెరిఁగినసుదతీమణి
యీడనె శ్రీవెంకటేశ యెనసి ని న్నిదె యాపె
ఆదుకోలు చెల్లించె నందుమీఁదను. ॥ ఇంక ॥ 19

మంగళకౌశిక

చేసినంతే చేఁత గాక చెలు లెల్లా నీపట్టుకు
తాసువలె మెలఁగితే తగ వెఱిఁగేవా ॥ పల్లవి ॥

వద్దనుండి నీ కాపె వలపులు రేఁచఁగాను
బుద్ది చెప్పితే వినేవా పొరుగువారు
వుద్దండాననె నిన్ను వొడివట్టి తియ్యఁగాను
కొద్ది నుంటి వింతే కాక గుణ మెరిఁగేవా ॥ చేసి ॥

నలుగడ నాకె నీతో నవ్వు లట్టె నవ్వఁగాను
పిలిచినాఁ బలికేవా పెరవారు
చలము సాదించి నిన్ను సరిఁ గాఁగిలించుకోఁగా
కలయ వచ్చేవు గాక కరఁగేటివాఁడవా ॥ చేసి ॥

రతులచవులు చూపి రచ్చ నిన్ను వేయఁగా
యితవు నేసితేఁ జవులా యింటివారు
మితి మీరి నేఁ గూడఁగ మెల్లనె శ్రీవెంకటేశ
తతిఁ జేకొంటివి గాక తగిలేటివాఁడవా. ॥ చేసి ॥ 20

### సామంతం

ఊడిగపువారము నీ కొప్పించేము లోనిమాట
వేడుకఁ దెలుసుకొమ్మీ వేరె వేరె నీవు ॥ పల్లవి ॥

చిలుకలు వలికీని చెవి యొగ్గి వినవయ్య
కలువలు వికసించెఁ గైకోవయ్య
చెలిమి నేసీఁ దీగెలు చేత నందుకొనవయ్య
వెలి నీకుఁ జెప్పరానివిన్నప మిదయ్యా ॥ ఊడి ॥

[1]జక్కవలు మెదలీని సరవులు చూదవయ్య
నిక్కెను మేఘ మదివో నీ [2]వంటవయ్యా
మిక్కి లద్దాలు మెరిచీ మించి నీడ చూదవయ్యా
వెక్కసపుగుట్టుతోడి విన్నప మిదయ్య ॥ ఊడి ॥

వెన్నెల గాసీఁ [3]జంద్రుఁడు వెలయఁగ మెచ్చవయ్యా
సన్నల మోవిపండు చవి గొనవయ్యా
నిన్ను శ్రీవెంకటేశుఁడ నీరాణివాసము గూడె
వెన్నవంటి మెత్తని విన్నప మిదయ్యా. ॥ ఊడి ॥ 21

### సాళంగనాట

ఏఁటివో నీకే తెలుసు నివి యిన్నియు
మాటు లేని నీగుణాలు మట్టు లేనివె ॥ పల్లవి ॥

తేనెలు గారెడిమాట తేరకొన నాదేవు
కానుక వట్టెటిచూపు కదుఁ జల్లేవు
లోనైరి నీ కిందుకే లోకములో చెలు లెల్ల
వీనుల నీసుద్దు లైతే వినఁ గొత్తలె ॥ ఏఁటి ॥

కదు నీవినయములు కస్తురివంటివె
బడిబడి నీవలపు పాలవంటిదె
విదువరు ని న్నిందుకే వీదివీదిసతు లెల్ల
తదవితే నీవిధాలు తమకించేవె

1. "జిక్క" వ్రాసి "జక్క" అని శిద్ది యున్నారు. 2. "వంట" వ్రా
అని శిద్ది యున్నారు. 3. "జంద్దురుండు" వ్రాసి "జంద్దుౢిండు" అని శిద్ది

చెలఁగి నీకూటములు జిగు రయి అంటుకొను
అలయు నీముచ్చటలు ఆనందాలు
కలసితి విదె శ్రీవెంకటగిరీశ్వర నన్ను
బలు నీ మన్ననలు పైపై భాగ్యాలె. ॥ ఏఁటి ॥ 22

నాదరామక్రియ

ఇందరము నెరిఁగితి మిఁక నేలా
సందడి సవతులలో సరి నుండుఁ గాకా ॥ పల్లవి ॥

నిక్కి నిక్కి చూచి యాపె నీతో నేల సన్న నేసీ
రక్కసితనము మాని రమ్మన రాదా
దక్కి వున్నాఁడవు నీవు తనపాలిటికిఁ దొల్లె
వెక్కస మై నే నుండితే వెర పేల తనకు ॥ ఇంద ॥

అంత నింత నుండి నీతో ఆపె యాల నవ్వీని
వంతుకు నీతోఁ బెనఁగ వచ్చుఁ గాక
వింతవాఁడవా నీవు వేసు నే మింతే కాక
యింతేసి పనులు సేసె యిఁక నేల వెలపూ ॥ ఇంద ॥

పొరుగుపొంతల నాపె పూఁచి ని న్నేల కూడీని
సిరులు నీసొమ్ము గాఁగఁ జేసుకో రాదా
యిర వై నన్నుఁ గూడితి విదె శ్రీవెంకటేశుఁడ
తెర వాసె వెర పేల తెల్ల మాయఁ బనులు. ॥ ఇంద ॥ 23

మెంచబౌళి

అతఁ డెంత నీ వెంత బొ నవునే
ఘాతఁ బెద్దరిక మింతాఁ గట్టుకొంటివే ॥ పల్లవి ॥

పంతము లన్నియును నీపతిపైనె నెరపేవు
పొంతల ని న్నే మని పొగడుదునే
అంతటి నీకొనగోరు ఆతనిపై మోపితివి
దొంతరమొనలు చూప దొడ్డదానవే ॥ అత ॥

చలము లితనిపైనె సాదించ నేరిచితివి
నిలిచె నింత లాభము నీవద్దనే
పిలువఁగానె పెనఁగి బీరమునుఁ జూపితివి
కలికితనము లిందె కైకొంటివే ॥ అత ॥

యేతు లెల్ల శ్రీవెంకటేశ్వరునికె చూపేవు
నీతి నడచేవారిలో నీవే కదె
యీతల మామాటలకు నితని నిట్టె కూడితి
పోతరించి యిన్నిటా నీపుణ్య మాయఁ గదవే. ॥ అత ॥ 24

305-వ రేకు భైరవి.

సిగ్గు వడ దప్పటినాచిత్తము నన్నుఁ గొసరీ
అగ్గలపుచనవులు అప్పిచ్చినవారమా ॥ పల్లవి ॥

కరుణించి నీవు నన్నుఁ గాఁగిలించుకొంటి గాక
వరుసల మాపై నంత వల పున్నదా
సొరిది మన్నించి నన్నుఁ జూచితి వింతె కాక
సరవితో నే నీకుఁ జక్కనిదాననా ॥ సిగ్గు ॥

నేస వెట్టినవాఁడ వై చేకొంటివి గాక నాతోఁ
బాసి వుండనంత నాపైఁ బరా కున్నదా
బాస దప్పనందుకుఁగా పక్కన నవ్వితి గాక
ఆసలఁ బెనఁగ నీకు నందరిలోవారమా ॥ సిగ్గు ॥

నీవు ధర్మపుణ్యానకు నెల వై కూడితి గాక
దావతి నానలు వెట్టఁ దగ వున్నదా
శ్రీవెంకటేశ నన్నుఁ జెనకి మెచ్చితి గాక
వావులు చెప్పఁగ నీతో వడి మేనవారమా. ॥ సిగ్గు ॥ 25

దేసాక్షి

ఇతరు లే మెరుఁగుదు రేమని చెప్పఁగ వచ్చు
పతులకు సతులకు భావజుఁడే సాక్షి ॥

తలఁపు గలిగితేను దవ్వు లేమి చేరు వేమి
అలరి సమ్మతించితె నడ్డాఁక లేమి
కొలఁది మీరినప్పుడు కొంచ మేమి దొడ్డ యేమి
నెల విచ్చి యేకతానఁ జేసినది చేఁత ॥ ఇత ॥

యిచ్చకమె కలిగితే యెక్కు వేమి తక్కు వేమి
హెచ్చినమోహములకు నెగ్గు సి గ్గేది
పచ్చి యైనపనులకు పాడి యాల పంత మేల
చెచ్చెరఁ దమకుఁ దాము చెప్పినది మాట ॥ ఇత ॥

అన్నిటా నొక్కటి యైతే నైన దేమి కాని దేమి
యెన్నికల కెక్కితేను యీడు జో డేది
వున్నతి శ్రీవెంకటేశుఁ డొనగూడె నేర్పు లివి
కన్నెలుఁ దాఁ గూడినగతులే సంగతులు. ॥ ఇత ॥ 26

కాంబోది

ఎవ్వ రీ బుద్ధులు విన రెందాఁకాను
యివ్వల జాగరా లున్నా రెందాఁకాను ॥ పల్లవి ॥

చక్కెరమోవులు వాడె సరసములలోననె
యెక్కుడి అలుకలు మీ కెందాఁకాను
ముక్కున నూర్పులు రేఁగె [1]ముట్టీముట్టక తొల్లె
యిక్కువ పంతములు మీ కెందాఁకాను ॥ ఎవ్వ ॥

కన్నులఁ గావులు గప్పె కంచువనవ్వులలోనె
యెన్నేసి వొట్లు వెట్టే రెందాఁకాను
తన్నుఁ దానె చెమరించె తనువుల నిద్దరికి
యిన్నిటా మీ మతకము లెందాఁకాను ॥ ఎవ్వ ॥

మోమునఁ గళలు రేఁగె ముంచినసిగ్గులలోనె
యేమిటికి ననుమానా లెందాఁకాను
వేమారుఁ గూడితిరి శ్రీవెంకటేశుఁడును నీవు
యీ మాట లందరుఁ జెప్పే రెందాఁకాను. ॥ ఎవ్వ ॥ 27

1. "ముట్టె" వ్రాసి "ముట్టీ" అని తిద్ది యున్నారు.

## సౌరాష్ట్రం

ఏల బుద్ధులు చెప్పేరె యెందాఁకా నితనికి
తాలిమి గలితే నేమె తగ వెరిఁగేము ॥ పల్లవి ॥

తలఁ పొకచో నుండఁగ తనపైకిఁ దీసుకొని
బలిమి సేయఁగఁ బోతే పచ్చి దోఁచును
పెలుచుఁ జిత్త మాతనిఁ బెనఁగి యేమి సేసినా
చలములు రేఁగుఁ గాని చవి చాలదు ॥ ఏల ॥

అవ్వల మాటలాడఁగ నందుకె తా మాటాడితె
పువ్వక పూచినట్టు పుల్లఁబారును
రవ్వగా నాతని నెంత రతులకుఁ దీసినాను
నవ్వఁబా పై యిందరిలో నారటిలునూ ॥ ఏల ॥

యెందో యెమరు చూడఁగా నెదిటికిఁ బోతేను
సందడి యనుచు మతి సమ్మతించదు
చెంది యింత చెప్పఁగాను శ్రీవెంకటేశుఁడు గూడె
మందలించి యివి యల్లా మచ్చికల కెక్కెను. ॥ ఏల ॥ 28

## పాడి

ఇంకా నేల నాచేతి యెదమాటలు
అంకెకు వచ్చున్నవాఁడు ఆదనె నీ వాదవే ॥ పల్లవి ॥

తుచ్చము తే మాడితివో దూరు లెంత దూరితివో
ముచ్చట దీరఁ బతికి మొక్కవే నీవు
పచ్చిగా నీ మంచముపై పవళించి వున్నవాఁడు
యిచ్చకపుప్రియములు యేకతానఁ జేయవే ॥ ఇంకా ॥

యే మని చెప్పించితివో యెంతేసి పెనఁగితివో
మోము చూచి వొక్కమాటు మొక్కవే నీవు
చే ముట్టక నీవద్దనె సిరసు వంచుకున్నాఁడు
కామించి యాతనిమతి కరఁగించఁ గదవే ॥ ఇ

నవ్వు లేమి నవ్వితివో నాలి యెంత సేసితివో
ముప్పొంక నందుకుఁ దగ మొక్కవే నీవు
యివ్వల శ్రీవెంకటేశుఁ డిరవుగ నన్నుఁ గూడె
రవ్వలు సేయక లోలో రతుల మెప్పించవే. ॥ ఇంతా ॥ 29

బౌళి

కన్నవారిదె కాదా కందికుడు మన్నమాట
యెన్నఁ జెప్పఁగ విని యెరఁగవో కాక ॥ పల్లవి ॥

మక్కువ నీ రమణుఁడు మా యింటికి వచ్చె నంటా
యెక్కువతోఁ బిలువ నీ వేల వచ్చేవే
చొక్కుపు నోచినసొమ్ము లొకరికి నేల వచ్చు
పక్కనఁ గైకొన్నవారిభాగ్య మింతే కాక ॥ కన్న ॥

నాఁడు నీ వడిగేసొమ్ము నాకుఁ దెచ్చి యిచ్చె నంటా
వాఁడిమి నీ వేల యింత వాదించేవే
వేఁడయెట్టిమానిబంక వెట్టిమాన నేల యంటు
పోఁడిమిఁ జేసినవారిపుణ్య మింతే కాక ॥ కన్న ॥

నీ పదు నై వుండఁగాను నేఁడు నన్నుఁ గూడె నంటా
శ్రీవెంకటేశ్వరు నేల చిమ్మిరేఁచేవే
దేవర వర మిచ్చితే తేరకాఁడు పూజరి*
భావించి తొల్లిటి దానఫల మింతే కాకా. ॥ కన్న ॥ 30

306-వ రేకు దేసాళం

మాతో నేల తన కింత మచ్చరాలు నీవె
పోతరించినయాపెకు బుద్ధి చెప్ప రాదా ॥ పల్లవి ॥

పక్కన నీతో నేను పదరి నవ్వితి నంటా
అక్కడనుండె సణఁగు లాపె ఆడీని
తక్కె చలిమి బలిమి తన కింత గలితేను
చిక్కించుక ని న్నేమైనాఁ జేయఁగ వలెఁ బో ॥ మాతో ॥

* "పూజరిగా" అని కాని "పూజరివలె" అని కాని యుండఁదగును.

మంచముపై నీవు నేను మరిగి వున్నార మని
యించుకంత చూడ నోప కీసడించీని
నించి తన కంతేసి నేరుపే కలిగితేను
అంచల నిన్ను రప్పించి అదలించవలెఁ బో ॥ మాతో ॥

కందువ నీవు నన్నుఁ గాఁగిటఁ గూడితి వంటా
చెంది లోలోనె తాను చిన్నఁబొయ్యీని
యిందుకు శ్రీవెంకటేశ యిన్నిటా తా జాణైతేఁ
బొంది యిచ్చకము సేసి పొదుగఁగ వలెఁ బో. ॥ మాతో ॥ 31

రామక్రియ

చిత్తగించు నీకు నేఁ జెప్పినదానివా
యిత్తల నంతేసి నీ వెఱఁగనివాఁడవా ॥ పల్లవి ॥

నీవు మన్నించినదాన నీకు వలచినదాన
యీవల నల్లది నాతో యీడుజోడుదా
వావాత నావాదు నీవు వహించుకో కుంటేను
చేవలు మీరి నిన్ను మోచినదాఁకా రాదా ॥ చిత్త ॥

సేస వెట్టితివి నీవు చేయి చాఁచితి నేను
వాసితో నల్లది నాతో వంతు వచ్చేదా
బాసతో నాకుఁగా నీవు పట్టి పెనఁగ కుండితే
ఆసల నాస లని అందాఁకా రాదా ॥ చిత్త ॥

దక్కితివి నీవు నాకు తగులైతి నే నీకు
మొక్కక అల్లది నాతో మొన చూపేదా
యిక్కువఁ గూడితివి నన్నిట్టె మెరయించకుంటే
నిక్కి శ్రీవెంకటేశ్వర నిన్ను ముట్టి రాదా. ॥ చిత్త ॥ 32

వరాళి

అంత నేసినవాఁడవు పంత మీవయ్యా
చెంతల నీకుఁ బ్రియము చెప్ప దిదివో ॥

చెక్కులు నొక్కినవొక్క చిత్తమెల్లఁ బులకించి
మక్కువకామిని నీతో మాట లాడదు
అక్కడ నవ్వినవవ్వు లాయ మెల్లఁ గాఁడి పారి
చొక్కుచు నిన్నుఁ దప్పక చూడ దిదివో ॥ అంత ॥

సరస మాడినచేఁత సందుసందులనుఁ జిక్కి
వొరయదు చన్నుల నిన్నూఁకె చెలి
యిరవుగాఁ జూచినచూ పెదలోనఁ బాయదు
తెరమరఁ గెంతైనఁ దియ్య దిదివో ॥ అంత ॥

బిగియించినకాఁగిట ప్రియములు తల కెక్కి
వెగటుసంతోసముల విఱ్ఱవీఁగీని
నిగిడి శ్రీవెంకటేశ నీ వింతలోఁ గూడఁగాను
తగిలినరతులకె తమకించీ నిదివో. ॥ అంత ॥ 33

శ్రీరాగం

చలువలు వేండ్లు జరపఁగ నేఁటికి
నెల వగు మేలే నించఁగ రాదా ॥ పల్లవి ॥

మోహము చెలిపై ముంచినవాఁడవు
దాహపువిరహము తర వేల
సాహసి మొదలనె చలముల కోపదు
యూహల నీవే యెఱుఁగుదు వీఁకను ॥ చలువలు ॥

చేనన్నలనే చెనకినవాఁడవు
వాసులు సతిపై వంచుదురా
ఆసలనే కడు నలసిన దిందాఁక
ఆ సుద్దులు మ మ్మడుగకు మీఁకను ॥ చలువలు ॥

కాఁగిట నంగనఁ గలసినవాఁడవు
మాఁగినసిగ్గులు మరి యాల
చేఁగ దేర్చె నిదె శ్రీవెంకటేశ్వర
పీఁగక ననుపులు విడువకు మీఁకనూ. ॥ చలువలు ॥ 34

### మాళవిగౌళ

వలెఁగా వేసాలు వద్దన్న మానఁడు
  యెలయింపులమాటల నెంత సేసీనె

కన్నుల నే మొక్కితేను కాఁక లేల రేఁగీనె
  యిన్నిటాఁ జేతులు మోపి యేల చూపీనె
  వెన్నెలబయట నుండె వెత లేల రేఁగీనె
  నిన్న నేటనె కతలు నేరిచెఁ దాఁ గదవే ॥ వలెఁగా ॥

పొలసి నే నగితేను పులక లేల పుట్టీనె
  [1]యెలమిఁ జూడు మ నెన లేల పెట్టీనె
  చిలుకలు పలికితే చింత లేల పొడమీనె
  మలక లెల్లఁ బెనచేమాయకాఁడు గదవే ॥ వలెఁగా ॥

గక్కనఁ గాఁగిలించితె కడుఁ జెమరించ నేలె
  మిక్కిలి గోర నూరిచి మీఁదఁ జిమ్మీనె
  యెక్కువ శ్రీవెంకటేశుఁ డెనసె నన్నిటా నన్ను
  చక్కనిసరసముల జాణకాఁడు గదవే. ॥ వలెఁగా ॥ 35

### భైరవి

దైవము సేసినమాయ తగ నింతేసి కాఁబోలు
  నీవాళ్లికల్ల గాదు నిజమె యీమాఁట ॥ పల్లవి ॥

చెప్పేవు సలిగెలు సేసేవు చేఁతలు
  అప్పుడు అతఁడు నిన్ను నంటె నంటాను
  కప్పురపుఁబడి తోడికాంత లెల్లా నుండఁగాను
  దెప్పరపువారికి యీ తెక్కు లేల వచ్చును ॥ దైవము ॥

సారె సారె నవ్వేవు సంగడిఁ గూచుండేవు
  దూరి ని న్నాతఁడు కాలు దొక్కె నంటాను
  చేరినట్టి నేసపాల చెలు లెల్ల నుండఁగాను
  పోరచిసతుల కేల బూటకాలు వచ్చునూ ॥ దైవము ॥

---

1. "యెలమిఁ జూడు మ నాన లేల" అని యుండఁదగునా?

పెంచేవు పగటులు పెనచేవు వావులు
ముంచి యొందొకమాటు ముట్టె నంటాను
యెంచఁగ శ్రీవెంకటేశు నింటిదాన నేఁ గూడితి
పంచల నుండేవారికి బద్దు లేల వచ్చును. ॥ దైవము ॥ 36

307-వ రేకు హిజ్జిజి

ననుబోఁటి చెలు లెల్లా నవ్వరా నిన్ను[1] పతి
చెనకినదాఁకా గుట్టు సేయంగ వలదా ॥ పల్లవి ॥

కనుసన్న సేసితేనె కరఁగితి రమణుఁడు
తనువు సోఁకితే నెంత తమకింతువో
యెనసెటివేళనె యిన్నియు నయ్యీఁ గాక
అనువు నీ ప్రియములు అందరిలో వలెనా ॥ నను ॥

మాటలాడినంతలోనె మరులుగొంటి వాతఁడు
నాటఁగ నవ్వితే నెంత నయ మవుదువో
పాటించి యేకతమందె పచ్చి దేరీఁ గాక నీవు
వాట మైనసరసాలు వాకిటనె వలెనా ॥ నను ॥

ఇక్కువఁ గూడినంతలో యిచ్చితివి చన వెల్ల
మొక్కితే విభుని కెంత మోహింతువో
మక్కువ శ్రీవెంకటేశుమహిమ లీడేరుఁ గాక
చెక్కులు నొక్కక తొల్లె సిగ్గు లింత వలెనా. ॥ నను ॥ 37

ఆహిరి

ఇప్పటనుంటియు నేల యెరవు సేయకు వమ్మ
తప్పు లెల్ల వొప్పులుగాఁ దగఁ జేసేఁ గాని ॥ పల్లవి ॥

మచ్చిక నీ మా టతఁడు మన సొగ్గి వినీ నదె
విచ్చనవిడిని విన్నవించ ‡వమ్మా
చెచ్చెర యీవేళ నీకుఁ జెల్లి నంతాఁ జేయవమ్మ
మచ్చరపు మా సుద్దులు మరి చెప్పేఁ గాని ॥ ఇప్పట ॥

---

1. "పతి" అని వ్రాసి "పతి" అని తిద్ది యున్నారు.

‡ రే. పా. వమ్మా.

నెల వై నాయకుఁ డదె నీవంక చూచీని
　　సొలసి చక్కఁదనాలు చూపవమ్మా
　　బలి మెంత గలిగినాఁ బచరించవమ్మ యిట్టె
　　చలము వెనక నేనె సాదించేఁ గాని　　॥ ఇప్పట ॥

చేయి దాఁచి నీమీఁదఁ జెనకేననీ యాతఁడు
　　ఆయ మెరిఁగి సరసా లాడవమ్మా
　　యీయెడ శ్రీవెంకటేశుఁ డింత నేసి నిన్నుఁ గూడె
　　చాయ లేల సన్న లేల సంత మయ్యేఁ గాని.　　॥ ఇప్పట ॥ 38

ముఖారి

అందరుఁ జెప్పేరు విను అది దగవా
　　యిందరిలో బొంకను నీ కిది దగవా　　॥ పల్లవి ॥

చేరి గొల్లెతలు నీతో చీఁకటితప్పు సేసితే
　　ఆరితేరి నవ్వితివి అది దగవా
　　చీరలు దీసితి వట చేరి కొలనిదరిని
　　యీరీతి నింతటిదొర విది దగవా　　॥ అందరు ॥

చెలఁగి వుట్లపై దాఁచినవెన్నలునుఁ బాలు
　　అలమి ఆరగించితి వది దగవా
　　కలపితి వట వారికట్టినదూడల నాల
　　యిలపై నీ వుద్దండాలు యింత దగవా　　॥ అందరు ॥

చక్కిలాలు నురుగులు సతులు దాఁచిన వెల్ల
　　అక్కరఁ గైకొంటి వట అది దగవా
　　గుక్కక శ్రీవెంకటాద్రికోమలపుశృష్టుఁడ వై
　　యెక్కి వేసాలు సేసే విది దగవా.　　॥ అందరు ॥ 39

సాళంగం

నీవు నాతఁ దొక్కటె నేము నీవారమె
　　వోవరి లోవనే వుండి వొడఁబా ట్లేటికే　　॥

మొక్కిన నీమొక్కు లెల్ల మొదలిపెండ్లివిడేలు
చిక్కని నీనవ్వులె సేసపాలు
తక్కినసుద్దు లేఁటికి తగు లాయఁ బను లెల్ల
యిక్కడి కక్కడి కింక నెడమాట లేఁటికే ॥ నీవు ॥

చూచినచూపులు నీకు చుట్టపుసమ్మంధాలు
తాచినగంధాక్షతలు తలపోఁతలు
చేచేత మీ కిద్దరికి చేసినచేఁతలు దక్కె
యేచి యిందరునుఁ జెప్పే యియ్యకోళ్లేఁటికే ॥ నీవు ॥

కలసినకలయిక కందువసోబనములు
పలుసంతసాలె మీ మీ బాసికాలు
యెలమి శ్రీవెంకటేశు నిటు నీవె కూడితివి
యెలయింపుఁ జెలులచే నెగపోఁత లేఁటికే. ॥ నీవు ॥ 40

రామక్రియ

ఇచ్చకము సేయ వచ్చే వే మందును
బచ్చెనసటకాఁడవు భళరా మెచ్చితిని ॥ పల్లవి ॥

చేయి వట్టి పెనఁగేవు చెక్కు నొక్క వచ్చేవు
యీయెడ నీతో నింక నే మందును
చాయలకె నవ్వేవు సరసము లాడేవు
పాయపువగకాఁడవు భళరా మెచ్చితిని ॥ ఇచ్చ ॥

చెలఁగి విడె మిచ్చేవు చెమటలు దుడిచేవు
యెలయింపు నీచేఁతల కే మందును
వలపులు చల్లేవు వద్ద నిట్టె కూచుండేవు
బలిమి మాయకాఁడవు భళరా మెచ్చితిని ॥ ఇచ్చ ॥

చన్నులపయి నొరగేవు సారెఁ గాఁగిలించేవు
యెన్నేసి నీ వినయాలు యే మందును
యిన్నిటా శ్రీవెంకటేశ యిట్టె నన్నుఁ గూడితివి
పన్నినగండికాఁడవు భళరా మెచ్చితిని. ॥ ఇచ్చ ॥ 41

శంకరాభరణం

తక్కినసుద్దులు తడవ మిఁక
చొక్కులఁ బెట్టుచు సొలయకువయ్యా ॥ పల్లవి ॥

చెల్లుబడి గని చేసినచేఁతలు
చల్లనిమాటల సడి వాసె
తొల్లిటిదానసె తొడిఁబడఁ జెక్కులు
యిల్లిదె నొక్కి వి దేఁటికయ్యా ॥ తక్కిన ॥

పన్నినమాయలఁ బాసినకాఁకలు
కన్నుల నవ్వుల కసి దీరె
చిన్నదాననె చేతికి లోనె
చన్నులు ముట్టేవు సట లేలయ్యా ॥ తక్కిన ॥

అందనె కాఁగిట నలసిన అలయిక
నిందుమోవితేనెలఁ దేరె
వెందియు నిటు శ్రీవెంకటేశ నను
మెందుగఁ గూడితి మెచ్చితి నయ్యా. ॥ తక్కిన ॥ 42

308-వ రేకు మాళవి

ఇందుకుఁగా వట్టి వాదు లిఁక నీతో నేలయ్య
పొందు లెల్లఁ జేకొంటిమి పొద్దున రావయ్యా ॥ పల్లవి ॥

నీచేతి మాటలకు నీకన్నుల తేటలకు
యేచి లోనైనవారికి నేల కోపము
పూచినట్టె వుండుఁ గాని పున్నమనాఁటివెన్నెల
చూచితేఁ బువ్వులు లేవు సోద్య మింతే కాని ॥ ఇందుకు ॥

సేసెటి నీ మేకులకు సెలవుల నవ్వులకు
ఆసపడ్డవారము మా కలు కేఁటికి
[1]పూసినట్లనె వుండు పుప్పొడి పై రాలితేను
వోసరి గందమువలె వొళ్ల నేమి నంటదు ॥ఇందుకు ॥

1. "సూసి" వ్రాసి "పూసి" అని తిద్ది యున్నారు.

నిక్కపు నీ సేసలకు నిండిన నీ కాఁగిటికి
చిక్కినవారము మాకు చింత లేఁటికి
యిక్కువ శ్రీవెంకటేశ యేక మైతివి వలపు
లెక్కకు వచ్చిన ట్టుండు లేదు మితి మేరా. ॥ ఇందుకు ॥ 43

నాదరామక్రియ

ఏమయ్య నీ దొరతన మిటువంటిదా
నీ మనసు నాపై బత్తి నే నెరఁగనా ॥ పల్లవి ॥

ఆపె నిన్ను వెడమాట లాడఁగాను విని నీవు
యేపున నూరకుండితి వేమయ్య
నీ పొందు లిటువంటివా ని న్నిందరుఁ గనరా
వో పో నమ్మినదాని *నొప్పగింతురా ॥ ఏమయ్య ॥

వోరతోడ నాపె సేసే వుద్దండా లెల్లాఁ జూచి
చీరాన నీవు వచ్చి పెనఁగ వద్దా
నేరుపు [1]లేనివాఁడవా నీ వెరఁగవా యిన్ని
కోరి నీవే గతి యంటే కూడుక రావలదా ॥ ఏమయ్య ॥

పొంచి యాపె చేసేసుక పోఁగా నేఁ డా గర్వ మెల్ల
తుంచివేయకుంటె నది దోసము గాదా
మించి శ్రీవెంకటేశుఁడ మే లిచ్చి నన్నుఁ గూడితి
తెంచి నా పగ లన్నియుఁ దీరిచితి విపుడు. ॥ ఏమయ్య ॥ 44

పాడి

మాన వెప్పుడును నీ మాయ లెల్లాను
నానిన నా నసుపులు నవ్వించీఁ గాని ॥ పల్లవి ॥

వాలుకరెప్పలు నీపై వంచి నే నెంత లోఁచినా
తాలిమె చూపుదు గాక తత్తరించేవా
వాలాయించి రాతిగుండెవాఁడ వౌత యెఱుఁగుదు
పాలుమాలిన నా యాస పాయ నీదు గాని ॥ మాన ॥

---

* 'నొప్పరికింతురా' అని యుండ దగును.

1. "వాఁడవా" అనుచోట "ఁడవా" అను అక్షరములు మాత్రము ఏవో అక్షరములు చెరిపి చెక్కినట్లు తెలియుచున్నది.

ఆయములు సోఁక మాటలాడి యంత కొసరిన
చాయకాఁడవె కాక సమ్మతించేవా
కాయకపు నీసరిత గట్టిగా నే నెరుఁగుదు
పాయపు నా వేడుకలు పైకొలిపీఁ గాని ॥ మాన ॥

చిమ్ముచు నీ కాఁగిటిలో చేఁత లెంత సేసినాను
కుమ్మరించి నాతోను నీ గుట్టు చెప్పేవా
కమ్మటి శ్రీవెంకటాద్రి కడపరాయఁడ పై
నెమ్మదిఁ గూడితి విదె నిజమాయఁ గాని. ॥ మాన ॥ 45

## సాళంగం

ఇటువంటి తగవులే యెక్కడ చూచినను
నటనలు బూమిలోన నడచీ నయ్యా ॥ పల్లవి ॥

కన్నుల నవ్వినందుకు కాఁతాళించే వేమయ్యా
యెన్నికెగాఁ దిట్టితే నీ వేమి సేతువో
వున్నతి నెవ్వరుఁ దమ వొళ్లికల్ల చూచుకోరు
యిన్నిటాఁ దమ్ము సోఁకితే యెగ్గు పట్టఁ జూతురు ॥ ఇటు ॥

పైకొని మాటాడితేనె పగ చాటే వేమయ్యా
యీకడ చేత నంటితే యేమి సేతువో
ఆకడఁ దమచేఁతలు అందము లనుకొందురు
లోకు లవి గాదంటే లోఁచి వా దడుతురు ॥ ఇటు ॥

మొక్కి మొకము చూచితే మొరయుచు జంకించేవు
యిక్కువ గోర గీరితే నేమి సేతువో
మక్కువ శ్రీవెంకటేశ మంచివాఁడ వై కూడితి
తక్కక వా రిది గంటే దంటవు నీ వందురు. ॥ ఇటు ॥ 46

## రామక్రియ

ఎక్కినవానికిఁ జూడ యేనుగ గుజ్జై యుండు
వెక్కప మై వెలువ వేవేలు సేసునయ్యా ॥ ప

నన్ను నాడుకోఁ గాని నాయంతటిది లేదు
  వున్నత మయిన నీవూడిగానకు
పిన్నదాని కింత నీవు పెద్దరికము గట్టితి
  విన్ని నీ పెద్దరికమే యెంచి చూడవయ్యా ॥ ఎక్కిన ॥

వెల్లవిరి సేయఁ గాని వెలితి లేదు నాకు
  మెల్లనె రతుల నిన్ను ‡ మెప్పించేయందుకు
చెల్లుబడి సేసితివి జిగి నీ యాఁటదానిని
  కల్ల గా దివెల్లను నీ ఘనతే కాదా ॥ ఎక్కిన ॥

ఆన వెట్టుకోఁ గాని అన్నిటా జాణను నేను
  మోనాన నీపాదాలు మొక్కేయందుకు
పూని శ్రీవెంకటేశుఁడ భోగించితి విటు నన్ను
  యీ నగవు లీ సంతోస మిది నీదె సుమ్మీ. ॥ ఎక్కిన ॥ 47

కేదారగౌళ

అప్పటినాతో నేల అమరమాట లాడేవు
  తిప్పరాని నీవలపు దిష్ట మై వుండఁగను ॥ పల్లవి ॥

కప్పురవిడె మిచ్చితే కార మై తోఁచెఁగా
  చొప్పుగ నీమో మాపె చూడకుండఁగా
దప్పి దేరే మోముతోడ దగ్గరి నే నుండఁగాను
  చిప్పిల నీ మే నెల్లఁ జెమరించెఁగా ॥ అప్పటి ॥

వొగిఁ బన్నీరు చల్లితే వులివెచ్చ దోఁచెఁగా
  నగి నగి ఆపె నీతో నాలి సేయఁగా
* చిగురుచిత్తముతోనె చేత నిన్ను నంటఁగాను
  మొగచా తై రతు లెల్ల మొన చూపెఁగా ॥ అప్పటి ॥

గందము వుయ్యఁగ నీకు కడుఁ బచ్చి దోఁచెఁగా
  ముందరనే ఆపె నీకు మోవి యియ్యఁగా
యిందులోనె శ్రీవెంకటేశ నే నిన్నుఁ గూడితి
  యిందరిలోనె నాపొందు యితవాయఁగా. ॥ అప్పటి ॥ 48

‡ రే. పా. 'యందు' అనియే కలదు. * రే. పా. 'లోనె'

309-వ రేకు మంగళకౌశిక

విచ్చేయు మాయింటి కిట్టె వింతవాఁడవా
పచ్చి దేరెఁ బను లెల్ల పైపై నీవల్లనే ॥ పల్లవి ॥

యిచ్చక మై యుండేవాఁడ వెగ్గు లేల పట్టేవు
నచ్చుల నే తిట్టినాను నవ్వవలెఁ బో
చెచ్చెర నా కేల వలచితి నని యందువు
యెచ్చు కుందు లాయ మాట యిదివో నీవల్లనే ॥ విచ్చేయు ॥

చుట్టమ వైనాఁడవు సోలి చిన్నఁ బో నేల
అట్టె నే రాకు మనిన నంటవలెఁ బో
దట్టముగ నాకుఁగా వ్రతము వట్టితి నందువు
వెట్టిపొందు లెల్లాను వెలసె నీవల్లనే ॥ విచ్చేయు ॥

తగులు గలవాఁడవు తడఁబాటు లిఁక నేల
మొగము నేఁ జూచితేను మొక్కవలెఁ బో
నిగిడి శ్రీవెంకటేశ నీవు నేనుఁ గూడితిమి
తెగనిమహిమ లెల్లఁ దెలిసె నీవల్లనే. ॥ విచ్చేయు ॥ 49

శంకరాభరణం

మెత్తనిమనసుదాన మేలు దాఁచ నే నేర
కొత్తగా నింతేసికిని గురి యైతి నయ్యా ॥ పల్లవి ॥

సిగ్గువడి నీ వుండఁగ నెలవుల నవ్వు వచ్చీ
వొగ్గి మాటాడిన నవ్వు లొగి వచ్చీని
నిగ్గుల నీ రెంటికిని నీ మోవియే సాక్షి
యెగ్గులు న న్నేల పట్టే వేమి నేతు నయ్యా ॥ మెత్తని ॥

తలవంచు కుండినాను దయ నాకుఁ బుట్టీని
అలసి చూచిన దయ అట్టె పుట్టీని
మొలచి యీ రెంటికి నీ మోముకళలె సాక్షి
కులికి మ మ్మేల యింత గోర నేసే వయ్యా ॥

వూరకే నీ వుండినాను వొనరీని వలపులు
ఆరీతి నుండినా ఘన మయ్యా వలపు
యీరీతి నీ చక్కఁదన మీ రెంటికిని సాక్షి
చేరి శ్రీవెంకటేశ మెచ్చి కూడితి వయ్యా. ॥ మెత్తని ॥ 50

భైరవి

నీవు మంచివాఁడవె నే నెట్టుండితి నేమి
యీ విధము తెరఁగక యెడ్డదాన నైతిని ॥ పల్లవి ॥
నిండిన నీతలపోఁత నే నెరఁగఁగా నావద్ద
నుండఁగా నావాఁడ వని వుంటిఁ గాని
యెండమావులనీళ్లు యేరు లంటా నుండినట్టు
కొండవంటి యాసచేత కూళదాన నైతిని ॥ నీవు ॥
పంతాలు నే నెరఁగఁగా పలుకక నీ వుండఁగ
అంతలో నా కెదురాడ వని వుంటిని
బంతినె తెల్లని వెల్లఁ బాలంటా చవి గొన్నట్టు
రంతులబాసలు నమ్మి రాఁపుదాన నైతిని ॥ నీవు ॥
నీ మోహము తెరఁగఁగా నిక్కము నాకు మొక్కఁగ
ఆముకొని యెగసక్యా లని వుంటిని
చే ముంచి శ్రీవెంకటేశ చెఱకున పం డున్నట్టు
కామించి నీవుర మెక్కి ఘనురాల నైతిని. ॥ నీవు ॥ 51

కాంభోజమలహరి

కాంతలు పదారువేలు గలవాఁడవు
యెంత నేసే విటు నీతో నెదురాడే దానవా ॥ పల్లవి ॥
నన్ను మన్నించ వలసి నాతో నవ్వితివి గాక
యెన్నఁగ నావంటివారు యెంత లేదు
చిన్నఁబోకుండాను నాచెక్కు నొక్కే వింతే కాక
మిన్నక నేర్పుల నిన్ను మెప్పించేదాననా ॥ కాంతలు ॥

నామీఁది కృప గలిగి వనుపు సేసేవు గాక
యేమీ నే విందరిలో నేమి జాఁతి
దీమసము చెడకుండ తివిరి బుజ్జగించేవు
కామించి నీమన సంత కరఁగించేదానవా ॥ కాంతలు ॥

కదు నన్ను నేలె నని కాఁగిలించు కొంటి గాక
[1]యెదయవి నీరతికి యీడా నేను
బడినె శ్రీవెంకటేశ పాయకుండా మరపేవు
కద లేనిమోహానకు కాణాచిదానవా. ॥ కాంతలు ॥ 52

సామంతం

మనవి చెప్పితివి మఱవకుమీ
కనుఁగొని నామాఁట కదువకుమీ ॥ పల్లవి ॥

యిచ్చక మాడితి పీడనె వుంటివి
మచ్చిక * నా మేలు మఱవకుమీ
వచ్చి వేరొకతె వలపులు చల్లిన
పచ్చిదేరి మరి పదరకుమీ ॥ మనవి ॥

సరస మాడితివి చనవు లిచ్చితివి
మరిగిననాపొందు మానకుమీ
సరిగా మరొకతె సందులు దూరిన
తొరలి యపుదు మరి తొలఁచకుమీ ॥ మనవి ॥

కలసితి విప్పుదు కాఁగిలించితివి
పొలసి యిట్లనె భోగించుమీ
యెలమిని శ్రీవెంకటేశ్వర మరొకతె
పిలిచితేను మరి పెనఁగకుమీ. ॥ మనవి ॥ 53

రామక్రియ

ఈపాటివాఁడవా యిన్నీ నీవు
యేపున నీ దీమసము యేద నుండె నపుడూ ॥ పల్ల

1 "యొవయవి" వ్రాసి "యొదయవి" అని తిద్ది యున్నారు.

* రే. పా 'నీమేలు'

ఆయము సోఁకినమాట లాపె నీతో నాడఁగాను
కాయ మెల్లఁ గరఁగేవు కాఁక దేరఁగా
యీయెడ వద్ద నున్నవా రెవ్వ రవుతా నెరఁగవు
చేయి వట్టి తియ్యఁగానె సిగ్గు వడే విపుడు ॥ ఈపాటి ॥

చిప్పిల నెలవులను చెలి యట్టె నవ్వఁగాను
తప్పక చూచే వక్కడె దైవారుతా
చెప్పి చెప్పి నిన్ను గోరఁ జిదిమినా నెరఁగవు
కొప్పువట్టి తియ్యఁగా కొంకి లోఁగే విపుడు ॥ ఈపాటి ॥

చెక్కు నొక్కి సతి నీ సేవ లెల్లఁ జేయఁగాను
మిక్కలి లోలుఁడ వైతి మేర మీరఁగా
కక్కసించి నేఁ గూడితే గక్కన శ్రీవెంకటేశ
మొక్కుచు నాతో నింతలో ముచ్చటాడే విపుడు ॥ఈపాటి॥ 54

310-వ రేకు రామక్రియ

ఒద్దికతో మము నీవు వూరకె చూడఁగ రాదా
చద్దికి వేఁడికి మేమే సంతము లయ్యేము ॥ పల్లవి ॥

యిద్దరు నేకతము నాయెదుటనె ఆడఁగాను
వుద్దండాలు నేయక యె ట్టోరుతు నేను
వొద్ద నీ వుండఁగా నింతి నొరసితి నని వాధు
వద్దన్నా మానక యేల వహించుకొనేవు ॥ ఒద్దికతో ॥

జాలిక నీవుమ నాపె సన్నలు సేసుకోఁగాను
మూలలుగ నెటువలెఁ జూతు నేను
మీఁటి నీ మంచముమీఁదిమెలుత నంటితి నని
ఆలిడి నీ వేల ఆపె కద్దాలు వచ్చేవు ॥ ఒద్దికతో ॥

చెక్కు నొక్కి నీవు నది నెలవుల నవ్వుకోఁగా
తెక్కుల నెట్ల సమ్మతింతు నేను
చిక్కించి నిన్నుఁ గూడితి శ్రీవెంకటేశ్వర నేను
కక్కసించితే నాపెకుఁగా నేల మొక్కేవు. ॥ ఒద్దికతో ॥ 55

దేసాక్షి

ఇంతేసి దొరకొందు మెందుకు నైనా వచ్చు
చింత దీర నా మనసు చెలఁగించవయ్యా ॥ పల్లవి ॥

పలుమారు నీతోను పలచఁగా నే నవ్వితే
యెలమి నీ చిత్త మిఁక నెట్టుంఁడునో
పిలువఁగ నీతోను బిగిసి వూరకుండితే
అలరి కై కొనవి అదియు నెట్టుండునో ॥ ఇంతేసి ॥

పిక్కటిల్ల నీతోను బెరసి మాటలాడితే
యెక్కువ తక్కువలందు నెట్టుండునో
వక్కణించఁగా నీతో వడి గుట్టున నుండితే
అక్కజపు గర్వ మని అదియు నెట్టుఁడునో ॥ ఇంతేసి ॥

కదియఁగ నీతోను కడు నేఁ గొసరితేను
ఇదె శ్రీవెంకటేశ నేఁ డెట్టుండునో
పొదిగి కూడితి వింకఁ బూఁచి సిగ్గు వడితేను
అదను గా దని వంత మదియు నెట్టుండునో ॥ ఇంతేసి ॥ 56

పాడి

చెప్పఁగల మాట లింకఁ జెప్పవయ్య
ముప్పిరి నిందుకె నేను మోము వంచే నయ్యా ॥ పల్లవి ॥

చలివేఁడి సటకాఁడ చదురుల జాణకాఁడ
మొలకనవ్వులతోను మొక్కే మయ్య
వలపులయెండ గాసీ వాడికవెన్నెల గాసీ
అలరి యిందుకు వెర గందే మయ్యా ॥ చెప్ప ॥

వీదుల జాజరకాఁడ వేసాల వేడుకకాఁడ
యీదెసఁ బాయము కాను కిచ్చే మయ్యా
తోదోపువసంత మిదే తొక్కుడుసరస మిదే
ఆవరాన నిందులోనె అలసే మయ్యా ॥ చె

కై కోలు వేగిరకాఁడ [1]కందువల వగకాఁడ
చేకొని నీచెప్పినట్టు చేసే మయ్యా
యీకడ శ్రీవెంకటేశ యిట్టె నన్నుఁ గూడితివి
మేకొని యిన్నిటా నిన్ను మెచ్చే మయ్యా. ॥ చెప్ప ॥ 57

నాట

ఓరి నీకు నది యేమి వుండఁబట్టవా
వారి వీరివలె మాట వడిఁ బెట్ట వద్దురా ॥ పల్లవి ॥

యీసు రేఁచ నేఁటికి యిందరిలోపల నిన్ను
వాసి దెచ్చుకొని యెంత వంచఁ జూతునో
రాసి కెక్కితివి తొల్లె రచ్చకూ నెక్కితివి
బేసబెల్లి నా కోపము పెంచ నిఁక వొద్దురా ॥ ఓరి ॥

కన్నుసన్న లేఁటికి కడు సిగ్గునను నీ
మన్ననఁ గూడి యే మని మాటాడుదునో
వెన్న వేసినవారిని వెన రాత వెయ్య రాదు
అన్నిటా జాణఁ జేసితి వటు మీర వద్దురా ॥ ఓరి ॥

దొమ్మి సేయ నేఁటికి తొడిఁబడఁ గాఁగిటి మీ
యిమ్ముల ని న్నలయించి యే మందునో
నమ్మించి శ్రీవెంకటేశ నన్నుఁ గూడితివి నీవు
సమ్మతించినమీఁదటఁ జలపట్ట వద్దురా. ॥ ఓరి ॥ 58

కాంబోది

చలములు మాని అన్నిఁ జవి [2]సేసుకొంటిఁ గాక
తెలివి మొగమునను దేరునా వొరులకు ॥ పల్లవి ॥

చిత్తము నొవ్వకుండ చేతుల మొక్కితిఁ గాక
యిత్తల నీ చేసేచేఁత లెన్ని లేవు
వత్తివలె వాడక నీవద్దఁ జెలఁగేఁ గాక
కొత్తలుగ మోము చూడఁ గొలుపునా యిందుకు ॥ చలములు ॥

---

1. "కెందు" వ్రాసి "కందు" అని తిద్ది యున్నారు.

2. "సేసుకొంటి గాక" అని వ్రాసి "టి'గా" లకు పైని హంసపాది వేసి క్రింద "ం" ము చెక్కి "సేసుకొంటింగాక" అని తిద్ది యున్నారు.

కాఁకలు రేఁగకుండఁగఁ గానుక లిచ్చితిఁ గాక
యేఁకట నీ పొరపొచ్చే లెన్ని లేవు
ఆఁకలు నేయక నీకు నట్టె నే లో నైతిఁ గాక
వూఁకొన నైన రతికి నుద్యోగము వుట్టునా ॥ చలములు ॥

తగవులు దప్పకుండ దయతోఁ గూడితిఁ గాక
యెగసక్యాలు నీ వైతే నెన్ని లేవు
అగపడి శ్రీవెంకటాధిప కూడితి నన్ను
వెగ టైన యిందుమీఁద వేసటలు వుట్టునా. ॥ చలములు ॥ 59

## ముఖారి

వట్టి సటలకు నింత వాసు లేల
మెట్టుక వున్నాఁ డతఁడు మేలమాడ రాదా ॥ పల్లవి ॥

కూడి వుండినట్టిచోట గోప మేల ।మంచి।
జాడకు వచ్చియు మరిఁ జల మేల
వేడుకలలోపల విసు పేల
పీడె మిచ్చి నాతఁడు వేగ నందుకోవే ॥ వట్టి ॥

*మేర మీర రాని నీతో మెణ కేల । నిన్ను ।
గారవించఁగా యాదో కత లేల
నేరము లేనివెనక నెగు లేలా ।నిన్ను।
సారెకుఁ జెక్కు నొక్కని చనవు చేకోవే ॥ వట్టి ॥

మంతన మై యుండఁగాను మరఁ గేల
పంత మిచ్చినందుమీఁద బలి మేల
యింతలో శ్రీవెంకటేశుఁ డిటు గూడెను
మంతు కెక్కఁ దొల్లిటిమాట లిఁక నేలే. ॥ వట్టి ॥ 60

---

* రే. పా. మేర మీర రాని నీతో మెణ కేల।
నిన్ను గారవించఁగా యాదో కత లేల
నేరము లేనివెనక నెగు లేలా।
నిన్ను సారెకుఁ జెక్కు నొక్కని చనవు చేకోవే.

రేకులోని పాఠము యథాతథముగా నున్న యతిప్రాస భంగ మగును.
పైరీతిని ముద్రింపఁ బడినది.

311-వ రేకు దేవగాంధారి

నీవంటిచిత్తమె నాకు నిలుప రాదా
చేవ దేర నీ యిచ్చలోఁ జెలఁగే నయ్యా ॥ పల్లవి ॥

సంతస మయినవేళ సారె నవ్వు వచ్చుఁ గాక
చింతించేవేళా నట్టే చేకూరునా
పంతపు నీ చేఁతలు నా భావములో నుండఁగాను
చెంత సరస మాడేవు చెల్లు నయ్యా నీకు ॥ నీవంటి ॥

చెక్కు నొక్కేటట్టివేళ నేదదేర వచ్చుఁ గాక
కక్కసించేటట్టివేళ కైకొలుపునా
వెక్కసపు నీ మాటలు వింటా నే నుండఁగాను
తొక్కేవు పాదము నీకే తోఁచునయ్యా యిట్టివి ॥ నీవంటి ॥

మించఁ దనిసినవేళ మే మఱవ వచ్చుఁ గాక
అంచఁ దమకపువేళ ననువు లౌనా
యెంచఁగ శ్రీవెంకటేశ యెనసితి విటు నన్ను
నించితి వేడుక లెల్ల నేర్తు వయ్యా నీవు. ॥ నీవంటి ॥ 61

మలహరి

విన్నపము లేఁక నేల వేఁడుకో నేల
చిన్ననాఁటి సిగ్గు లెల్ల చిమ్మి రేఁగె నీఁకను ॥ పల్లవి ॥

మన్ననలకె మొక్కితి మాటలకే చొక్కితిని
యిన్నేసి నిన్నుఁ దూరఁగ నిఁకఁ జో టేది
అన్నిటా జాణవు నీవు ఆయము లెఱుఁగుదువు
పన్నిన నా జవ్వనము ఫలియించె నీఁకను ॥ విన్నప ॥

నవ్వులనె తనిసితి నయాలనే మొనసితి
యెవ్వరు నేమి చెప్పేరు యెడసుద్దులు
నివ్వటిల్లువిటుఁడవు నిజ మాడ నేరుతువు
రవ్వ లైన నాభాగ్యము రతి కెక్కె నీఁకను ॥ విన్నప ॥

ముచ్చటఁ దొప్పఁ దోఁగితి మోహాన విఱ్ఱవీఁగితి
వచ్చె నాసంతము లెల్ల వాసు లేఁటివి
యిచ్చట శ్రీవెంకటేశ యిట్టె నన్నుఁ గూడితివి
మెచ్చితి మొదల నిన్ను మే లాయ నిఁకను. ॥ విన్నప ॥ 62

దేసాళి

ఎంత మొగమాయకాఁడ వే మందు నిన్ను
పంతము నెరపఁ బోయి పైకొంటి నేను ॥ పల్లవి ॥

నే నిన్నుఁ గోపగించితే నీవు నవ్వితి వందుకు
మోనాన నంతలోన నే మొక్కే నిదె
అనుకొని మేటిదొర వన్నిటికి నేరుతువు
కాని మ్మని యీ పనికె కరఁగితి నేనూ ॥ ఎంత ॥

అవ్వలిమోము నే నైతే నద్దాలు వచ్చేవు నీవు
మువ్వంక నే నిందుకుఁగా మొక్కే నిదె
రవ్వ సేసి భోగించ రంటికి [1]వత్తువు నీవు
యివ్వల నీ వినయాల కియ్యకొంటి నేను ॥ ఎంత ॥

కడుగుట్టు నేఁ జేసితే కాఁగిలించుకొంటి విట్టె
ముడిదీరె నిటమీఁద మొక్కే నిదె
అడరి శ్రీవెంకటేశ అందగాఁడ కూడితివి
జడియక మెచ్చి మెచ్చి సత మైతి నేనూ. ॥ ఎంత ॥ 63

లలిత

మించుకొంటే వలపులు మొగచా టవును
మంచముపై జాగరాలు మరి యేలయ్యా ॥ పల్లవి ॥

పచ్చనిచిగురువంటి పల్లెపుమోవిచెలి
కుచ్చి తేనెలమాటలు కురిసీ నదె
ఇచ్చకానఁ జెవి యొగ్గి యియ్యకొంటి వన్నియును
మచ్చిక నాపైఁ జల్లేవు మరి యేలయ్యా ॥ ప

1. "వత్రువు" అని వ్రాసి చెరిపి "వత్తువు" అని దిద్ది యున్నారు.

కలువరేకులవంటి కన్నుల వెన్నెలతేట
పొలితి నీపై దిగఁబోసీ నదె
పొలసి విలువునవె పూజ గొంటివి నీ వందు
మలసి మాకు మొక్కేవు మరి యేలయ్యా ॥ ముంచు ॥

సారె విమ్మపండ్లవంటి చన్నులవొత్తులఁ జెలి
కోరిక రతుల నీపైఁ గురికీ నదె
కూరిమి శ్రీవెంకటేశ కూడితివి నన్ను నిట్టె
మారు గొసరేవు నీవు మరి యేలయ్యా. ॥ ముంచు ॥ 84

పాడి

ఏల వొడఁబరచేవు యింతలోననే నన్ను
నాలి నేసి నీతోను నవ్వేదాననా ॥ పల్లవి ॥

మన సిచ్చి నీవు నాతో మాట లెల్లాఁ జెప్పఁగాను
విని నవ్వవలెఁ గాక వేసరేనా
చనవు నీ విచ్చితివి సరి గాదా వను నేను
తనియఁగ వలెఁ గాక తప్పు లెంచేనా ॥ ఏల ॥

చేయి వట్టుకొని నీవు చేఁత లెల్లఁ జేయఁగాను
యీయకొనవలెఁ గాక యీసడించేనా
ఆయాలు సోఁకించితివి అరమరచి చొక్కితి
దాయ వేయవలెఁ గాక సాదించేనా ॥ ఏల ॥

కందువ మనిచి నీవు కాఁగిలించి కూడఁగాను
పొందు సేయవలెఁ గాక పొద్దు వుచ్చేనా
ముందె శ్రీవెంకటేశ మోహించితి కలసితి
చెంది మెచ్చవలెఁ గాక సిగ్గు వడేనా. ॥ ఏల ॥ 85

వరాళి

నీకు నాకు నీపాటినెయ్యము లెందు గలవె
కాకుగాఁ జేయ నేలొకో కడ నున్నచెలికి ॥ పల్లవి ॥

చనవు నేసుక నీతో సారె సారె నవ్వఁగాను
 యెన లేవియెగ్గు లెంచీ యీపె నాతోను
వానర నీ వన్నిటికి నోరుచుక వుండఁగాను
 తన కేల వచ్చెనొకో తమక మీచెలికి ॥ నీకు ॥

పొందు [1]నేసుక నిన్ను పువ్వులనె వేయఁగాను
 యిందు కే లడ్డాలు వచ్చీ నీపె నాతోను
సందడి నాచేఁత నీకు సమ్మతు లై వుండఁగాను
 అంది వాదు లిం తేలొకో అండ నున్నచెలికి ॥ నీకు ॥

తైవసము నేసుకొని కాఁగిట నిన్ను నించఁగా
 యీవల పంత మే లాడీ నీపె నాతోను
చేవదేరఁ గూడితివి శ్రీవెంకటేశ నన్ను
 యేవ లేల వచ్చెనొకో యెరవులచెలికి. ॥ నీకు ॥ 66

312-వ రేకు శుద్ధవసంతం

నీతోడిచుట్టరికాలు నిజ మాయను
 యేతుల నీ జాణతనా లివి నిజ మాయను ॥ పల్లవి ॥

వావి గద్దంటాఁ జెప్పి వద్దఁ గూచుండి మెల్లనె
 నీవు నవ్వినవవ్వులె నిజ మాయను
చేవ దేర బుజ్జగించి చెక్కులు నొక్కిన నేఁటి
 కోవరపు నీ చెనకులు నిజ మాయను ॥ నీతోడి ॥

గారవించి సందిగొందిఁ గన్నుయప్పు డెల్లాను
 నేరుపుల నీ మొక్కులు నిజ మాయను
వారివీరిచేత నీవు వడిఁబె ట్టెంపినయట్టి
 యీరీతి నీ పైఁడిలేక లివి నిజ మాయను ॥ నీతోడి ॥

కన్నులనె సన్న నేసి కాఁగిలించుకొన్నట్టి
 విన్నమొన్నటి సుద్దులు నిజ మాయను
మన్నించి శ్రీవెంకటేశ మరిగి నన్ను నేలితి
 మున్నిటి నీకోరికలు ముంచి నిజ మాయను. ॥ నీతో ॥

1. "నేసుకొ" వ్రాసి చెరిపి "నేసుక" అని దిద్ది యున్నారు.

### మధ్యమావతి

మనసు లొక్కటు లైతే మరి యేల మఱఁగూ
పని గలితేఁ జేసే బాయిట నే వేయనూ ॥ పల్లవి ॥

నీ కెంత సంతోష మైనా నేఁడు నా సంతోస మదె
ఆకడ నీవు నవ్వితే నది నానవ్వే
లోకలోడిమూఁట గాదు లోను వెలి నొక్కటె
ఆకె నీడకె తేవయ్య నవుఁగాము లెంచను ॥ మనసు ॥

నీవు లెస్స వుండితే నేనె లెస్స వుండిన దది
లావు నీకుఁ గలితే నా లావూ [1] నాదె
కావర మించుకాఁ గాదు కలగుణము నా కిది
వావులు చెప్పకోరయ్య వద్దని నే నననుః ॥ మనసు ॥

నీ మేలె నా మేలు నీ నేరుపె నా నేరుపు
ప్రేమపు నీ ప్రియమె నా ప్రియ మిదివో
కామించి శ్రీవెంకటేశ గక్కనఁ గూడితి నన్ను
దోమటి దొడికించితే దూరను నే నాపెను. ॥ మనసు ॥ 68

### రాయగౌళ

ఏల వేగిరపడేరె యింతలో మీరు
తాలిమి చూపి యతఁడె దయసేసీఁ గాకా ॥ పల్లవి ॥

చనవు లిచ్చినవాఁడు సరవు లేల తప్పనె
మనసు చూడ వలసి మాయలు గాక
నను పై యుండేవాఁడు నవ్వ కేల మానునె
పెనఁగించుకొని తానె బెరసీఁ గాకా ॥ ఏల ॥

యిచ్చక మాడెటివాఁడు యెగ్గు లేల పట్టునె
ముచ్చట లాడ వలసి మొరఁగీఁ గాక
మెచ్చినట్టివాఁడు మేలు మెరయ కేల మానునె
రచ్చ కెక్కినందాక రాఁపు నేసీఁ గాకా ॥ ఏల ॥

---

1. "వదె" వ్రాసి చెరిపి "నాదె" అని తిద్దియున్నారు.

కలసినయట్టివాఁడు కరఁగ కే ఉండునె
 అలపు దేరినదాఁకా ఆలించీఁ గాక
 యెలమి శ్రీవెంకటేశుఁ డిఁక నేల లోఁచీనె
 చెలఁగి తనబాసలు చెల్లించీఁ గాకా. ॥ ఏల ॥ 69

## సామంతం

వేసాలవాఁడు గదవే విట్ఠలేశుఁడు
 తా వేసారఁ డెందుకు నైనా విట్ఠలేశుఁడు ॥ పల్లవి ॥

వేడుకకాఁడు గదవే విట్ఠలేశుఁడు నాకు
 వీడె మిచ్చి నింతలోనె విట్ఠలేశుఁడు
 వీడ నాడసీఁడు నన్ను విట్ఠలేశుఁడు । అట్టె ।
 వేడెవెట్టీ వలపులు విట్ఠలేశుఁడు ॥ వేసాల ॥

వెన్నెలనవ్వులు నవ్వీ విట్ఠలేశుఁడు । యాదో ।
 విన్నపము లాలకించీ విట్ఠలేశుఁడు
 వెన్నముచ్చిమి విద్యల విట్ఠలేశుఁడు । నా ।
 విన్నఁదన మెల్లాఁ [1]బాపీ విట్ఠలేశుఁడు ॥ వేసాల ॥

విరులు నాపైఁ జల్లీ విట్ఠలేశుఁడు । కడు ।
 విరివికాఁడు గదవే విట్ఠలేశుఁడు
 అరిది శ్రీవెంకటాద్రి నందు నిందు నన్నుఁ గూడె
 వెరవరి [2]గదవె యీ విట్ఠలేశుఁడూ. ॥ వేసాల ॥ 70

## కన్నడగౌళ

నిచ్చ నిచ్చా నా బదుకు నీచేతిది
 యిచ్చక మై యెందు కైనా నియ్యకొందు నేనూ ॥ పల్లవి ॥

చెక్కు నొక్కినందుకె నేద దేరితిఁ గాక
 వెక్కసపుఁజింతతోడ వేగించనా
 గుక్కక నీ చేఁతలకుఁ గోపము వచ్చునంతలో
 పక్కన వేఁడుకొంటేను పైపై లో నౌదును

1. "బాపె" అని వ్రాసి చెరిపి "బాపె" అని తిద్ది యున్నారు.
2. "గదవె" వ్రాసి చెరిపి "గదవె" అని తిద్ది యున్నారు.

చేయి వేసినందుకె సెలవి నవ్వితిఁ గాక
చాయ సేసుక బొమ్మల జంకించనా
మాయపు నీ గుణాలకు మారుకొందు నంతలోనె
ఆయములు నీ వంటితే నన్నియు మఱతును ॥ విచ్చ ॥

కాఁగిలించుకొన్నందుకె కళల మించితిఁ గాక
చేఁగ దేరఁ దల వంచి చెమరించనా
కాఁగి మాటల దూరుదు కరఁగుదు నంతలోనె
ఆఁగి శ్రీవెంకటేశ ని న్నలమి నే మెత్తును. ॥ విచ్చ ॥ 71

శ్రీరాగం

వలపు విసికితేను వాసన గద్దా
చలము సాదించఁ బోతే చవి గావు పనులు ॥ పల్లవి ॥

మచ్చిక నీతో నిట్టె మాటలాడినప్పుడె
చెచ్చెర నీ పొందు నేఁ జేసినదాన
కొచ్చి కొచ్చి న న్నేల కొంగు వట్టి తీసేవు
వచ్చినదాననె యాల వడిఁబెట్టే వీఁకను ॥ వలపు ॥

కన్నుఁగొనలను నిన్నుఁ గనుఁగొన్నయప్పుడె
యిన్ని పనులకు నే నియ్యకొందాన
మన్నించి యేకతములు మరి యేల చెప్పేవు
విన్నదాననె తొల్లి వేసరించ కిఁకను ॥ వలపు ॥

గక్కనను నిన్ను మెచ్చి కాఁగిలించినప్పుడె
గుక్కక రతులలోఁ గూడినదాన
యిక్కువ శ్రీవెంకటేశ యేలితివి నన్ను నిట్టె
దక్కినదాననె తొల్లె దయఁ జూడు మిఁకను. ॥ వలపు ॥ 72

313-వ రేకు బౌళిరామక్రియ

ముందటనె నిలుచుండి మొక్కేము గాక
అందముగా [1]మారుమాట లాడఁ గలమా ॥ పల్లవి ॥

1. "వాఱు" వ్రాసి చెరిపి "మాఱు" అని తిద్ది యున్నారు.

అంగన నీమోము చూచె నట్టె నీవు చూచితివి
యింగితా లెరుఁగుదురు యిద్దరు మీరు
చెంగట నుండినయట్టి చెలులము నే మెల్ల
సంగ తెరఁగక మాటసరి తియ్య వచ్చునా ॥ ముందట ॥

వనిత నీతో నవ్వె వడి నీవూ నవ్వితివి
యెనలేని నేరుపరు లిద్దరూ మీరు
పనులు నేసేయట్టి పడఁతులము నేము
వెనక ముందటి మాట విన్నవించ వచ్చునా ॥ ముందట ॥

సతి నిన్నుఁ గాఁగిలించె సమ్మతించి కూడితివి
యితవు లెరుఁగుదురు యిద్దరూ మీరు
తతి శ్రీవెంకటేశుఁడ తగు మీవారము నేము
మతకాన నిఁక మారుమాట లాడ వచ్చునా. ॥ ముందట ॥ 73

గౌళ

ఏమే సంగ తెరఁగ వింతిరో నీవు
ఆమె కులువ చరించ కయ్యో నీవు ॥ పల్లవి ॥

సంకె లేక యాతఁడు జాణఁ డై తిరుగఁగాను
అంకెలకు వంక లొత్తే వప్పటినీవు
మంకుదానఁ దొలుతనె మారు మలయఁగఁ బైపై
నింకా బుద్ధులు చెప్పే వెట్టో నీవు ॥ ఏమే ॥

వొడ్డినందు కెల్లా నాతఁ డోపికతో నుండఁగాను
అడ్డాలు దుడ్డాలు వచ్చే వప్పటినీవు
వడ్డివారె శిగ్గుతోడి వనితను వానిఁ దెచ్చి
జిడ్డు దేర నవ్వించేవు చీచీ నీవు ॥ ఏమే ॥

బలిమిఁ గాఁగిటఁ గూడి బడలి వాఁ డుండఁగాను
అలపు సొలపుఁ దేర్చే వప్పటినీవు
యెలమి శ్రీవెంకటేశు నెదలోనిదాన నేను
చెలరేఁగించే విన్నిటాఁ జెల్లునె నీవు. ॥ ఏమే ॥ 7

భైరవి

చెచ్చెర నీవ్రతమే చెల్లెఁ గాక
 యిచ్చకురాల నేమ యింకా నేఁడ సుద్దులు ॥ పల్లవి ॥

చేసిన నీచేఁతలకు చెక్కు నొక్కేదానఁ గాక
 వేసరించి విన్నవించ నెంత వెంగె మాడేనా
 మూసినముత్యమువలె ముంగిటికి వచ్చితివి
 యీసులు నీతో నేల యింకా నేఁడ సుద్దులు ॥ చెచ్చెర ॥

నానాటి నీగుణాలకు నవ్వు నవ్వేదానఁ గాక
 కాని మ్మని పగ చాటి కాఁక రేఁచేనా
 మోనాన నా యెదుటను మోహము చల్లెటి నీపై
 యేనెపము వెట్టఁగల నింకా నేఁడ సుద్దులు ॥ చెచ్చెర ॥

గక్కనఁ గూడినందుకు కరఁగెటిదానఁ గాక
 యెక్కువతక్కువలు ని న్నెంచ వచ్చునా
 చిక్కితివి నాపాలికి శ్రీవెంకటేశ్వర
 యిక్కడనెవుండు నీవు యింకా నేఁడ సుద్దులు. ॥ చెచ్చెర ॥ 75

మాళవిగౌళ

చిత్తము వచ్చినప్పుడు చేర వచ్చే వింతే కాక
 యిత్తల నిందరిలోన నేమి బాఁతి నేను ॥ పల్లవి ॥

చెక్కులు నొక్కెటివారు నేసలు వెట్టెటివారు
 యిక్కువ లంటెటివారు యెందరు నీకు
 వెక్కస మీ సందడిలో వేసరించఁ బోతేను
 యెక్కడి కెక్కు నావల పేమి బాఁతి నేను ॥ చిత్తము ॥

ముచ్చట నుండెటివారు మొగము చూచెటివారు
 యిచ్చకా లాడెటివారు యెందరు నీకు
 పచ్చిగా నీమూఁకలలో పచరించఁ బోతేను
 యెచ్చటఁ గనేవు గురు తేమి బాఁతి నేను ॥ చిత్తము ॥

కమ్మిక కూడేటివారు కాఁకలు చల్లేటివారు
యెమ్మెలు నెరపేవారు యెందరు నీకు
దొమ్మిలో శ్రీవెంకటేశ తొల్లె నన్నుఁ గూడితివి
యిమ్మలఁ జెయి వట్టేవు యేమి వాఁతి నేను. ॥ చిత్తము ॥ 76

సామంతం

ఇందరు నవ్వే దెరఁగ దెవ్వతో యీపె
యెందు నైనాఁ దావె వచ్చి నెవ్వతో యీపె ॥ పల్లవి ॥

మచ్చికతో నీవు నేను మాట లాడఁగా విని
యెచ్చు కుందు లెంచ వచ్చీ నెవ్వతో యీపె
కుచ్చితాన తనలోన కోపము కొంత వెట్టుక
యిచ్చట మెచ్చులు మెచ్చీ నెవ్వతో యీపె ॥ ఇందరు ॥

నగుతా నిద్దరమును ననుపు నటించఁగాను
యెగసక్యములు నేసీ నెవ్వతో యీపె
తగవులు చెప్పుతాఁ గాఁతాళము గొంత రేఁచుక
యెగుసనఁ బెట్టీ రేసు లెవ్వతో యీపె ॥ ఇందరు ॥

నెయ్యపు శ్రీవెంకటేశ నేఁడు మనము గూడఁగ
యియ్యకొని వూఁకొపీ నెవ్వతో యీపె
చయ్యాటా లిన్నియు మాని చవి నేసుక పొదిగి
యెయ్యెడ నున్నదో తాను యెవ్వతో యీపె. ॥ ఇందరు ॥ 77

పాడి

ఆపెమారు విన్నవించే నదివో నేను
చేపట్టిన నీచేతివే నేనెటిపనులు ॥ పల్లవి ॥

అంగన నీ మాటలకు నాయములు గరఁగెను
పొంగుచునుఁ జెమరించెఁ బులకించెను
చెంగటి సిగ్గుతోడఁ జేరి నీతో మాటాడదు
యింగితాన నీ చేతివే యిటమీఁదిపనులు ॥ ఆపె ॥

నీవు చే చాఁచినందుకె నివ్వెరగులఁ బొందెను
భావము సంతస మందె పచ్చి దేరెను
తావుల కోరికల సందడిఁ బడి వున్న దదె
యేవిధాన నీ చేతివే యిటమీఁదిపనులు ॥ ఆపె ॥

ఆడెటి నీ సరసాన కంతరంగము దనిసె
వీడె మందుకొని ని న్నీవేళఁ గూడెను
జో డై శ్రీవెంకటేశ చొక్కులనె వోలలాడి
యేద నయినా నీ చేతివే యిటమీఁదిపనులూ. ॥ ఆపె ॥ 78

314-వ రేకు రీతిగౌళ

చాయ నేసుకొనుఁ గాక సతుల యడాటాన
పాయపు రమణుఁ డై తే పంతము గొనీనా ॥ పల్లవి ॥

చెక్కు నొక్కి నేద దేర్చి సేవలు సేసితిని
యెక్కువ తక్కువ లెల్లా నిఁక నేడవే
గక్కన మీరు చెప్పఁగాఁ గాని మ్మంటి మీమాట
అక్కడనె నిలుచున్నాఁ దప్పటిఁదా నేఁటిదే ॥ చాయ ॥

కొంకు వాయఁ గాఁగిలించి కూరిమి నవ్వు నవ్వి
యింకఁ జెమరించితిని యిఁక నేఁటిదే
మంకుదాన ననే రంటా మారుమాటలాడ మీకు
బింకము లింకా మానఁడు పెనఁగనే వలెనా ॥ చాయ ॥

మోవి యిచ్చి మొక్కు మొక్క మోహ మెల్లా జల్లితి
యీవల వట్టిగుట్లు యిఁక నేఁటికే
మే వెంచి శ్రీవెంకటేశు మీ మొకమోటఁ గూడితి
నావాఁడనె అనీఁ దాను నమ్మికలు వలెనా. ॥ చాయ ॥ 79

దేసాళం

ముందటికి వెనకకు మొక్కేము నీకు
కందువ లన్నియు నీవె కనుకొమ్మీ యిఁకను ॥ పల్లవి ॥

యిచ్చక మాడితి నేఁడు యింటికి నీవు రాఁగాను
కొచ్చి నిన్న రాకుండఁగఁ గొసరితిని
బచ్చెన వేఁడివలపు పచ్చి దోఁచి చిగురాయ
తచ్చి తొల్లిటియలుక తలఁచకు మీఁకను ॥ ముంద ॥

కమ్మి నీవు చూడఁగాను కాను కిచ్చితి విప్పుడు
తమ్మిని వేసితిఁ దొల్లి తల వంచఁగా
వుమ్మగిలి నాసరస మొగ రెక్కె నిండఁ బూచె
దిమ్మ రేఁగినచలము తిప్పుకోకు మీఁకను ॥ ముంద ॥

గక్కన నీవు గూడఁగఁ గాఁగిలించుకొంటి నిట్టె
మొక్కలాన నల్లప్పుడు మొరఁగితిని
చిక్కన య్యాసుకు నాయఁ జిత్తము శ్రీవెంకటేశ
నిక్కె నీకపటములు నెరపకు మీఁకను. ॥ ముంద ॥ 80

బౌళి

చేతికి నీవు లోఁ గాఁగఁ జెప్పేఁ గాని
యేతులఁ గుచ్చితా లుండె యిందాఁక నాకును ॥ పల్లవి ॥

మంతన మాడితివి మగువతో నీ వప్పుడు
పంతము లాడితినే నీ పదఁతితోఁద
యింతలో నీవు రాఁగానె యేకచిత్త మాయఁ గాని
దొంతర చలము లెక్కె తోడఁదోడ నాకును ॥ చేతికి ॥

చేతులు చాఁచితివి చెలియపై నీ వప్పుడు
కాతరాలు రేఁచితి నా కాయములోన
యీతలఁ జెక్కు నొక్కఁగా యియ్యకొంటి నే నన్నియు
వాతులు మోవఁగఁ బొంగె వాసు లెల్ల నాకును ॥ చేతికి ॥

[1]కన్నులనె మొక్కితివి కాంతకు నీ వల్లప్పుడు
సన్నలఁ దిట్టితి నిన్ను సారెకు నేను
అన్నిటా శ్రీవెంకటేశ అలమఁగ మెచ్చేఁ గాని
నున్ననిచెమట నిండె నొసలనె నాకునూ. ॥ చేతికి ॥ 8

1. "కన్నుల మొక్కితివి" అని చెక్క హంసపాది "ల x మొ" లకు క్రింద చెక్క పైన "నె" చెక్క యున్నారు.

రామక్రియ

ఇచ్చకుఁడ విన్నిటాను యే మంటివి
యెచ్చరించే వింతె విన్ను యే మంటివి ॥ పల్లవి ॥
కాంత విన్నుఁ దెమ్మనఁగఁ గాచుకున్నదాన నేమ
యింత వొద్దాయ వింక నే మంటివి
చింతతో నెదురు చూచి నేసవెట్టె నంటా నీకు
యెంత లేదు నీకుఁ బని యే మంటివి ॥ ఇచ్చ ॥
ఆకె నీకడ నన్ను అంపఁగా వచ్చితి నేను
యేకచిత్తమున నిట్టె యే మంటివి
లేకలు నీకడ కంపె లేచి విచ్చేయఁగదవయ్యా
యేకతాన నప్పుడు నీ వే మంటివి ॥ ఇచ్చ ॥
కొమ్మ లోననుండి వచ్చి కొంగు వట్టి నిన్నుఁ దీసె
యిమ్ముల నీ మొగమోట నే మంటివి
సమ్మతై శ్రీవెంకటేశ నరుగఁ గూడితి రిదె
యిమ్మనీ విడెము నిన్ను నే మంటివి. ॥ ఇచ్చ ॥ 82

వరాళి

చూచినవారికిఁ జూడ నోద్యా లివి
యేచినవేడుకె కాని యెంతైనా వీఁగదూ ॥ పల్లవి ॥
యెట్టు నమ్మెనో నీ చిత్త మింతి యెవ్వరు చెప్పిన
జట్టిగొన నవ్వుఁ గాని చంచలించదు
మట్టు లేని నీ వెంతమాట పట్టిచ్చితివో
గుట్టుతోనె మెచ్చుఁ గాని కొంతైన వెరవదూ ॥ చూచిన ॥
కలికి నీ నిజ మెట్టు గనెనో నీ సుద్దులకు
చెలరేఁగె వుండుఁ గాని చిన్నఁబోదు
చెలిమి నీ వాపె కెంత చేతికి లోనైతివో
వలపులె చల్లుఁ గాని వసివాడదూ ॥ చూచిన ॥
నీ మర్మ మెట్టెఱిఁగెనో నెలఁత నీరతులకు
వేమారుఁ బైకొనుఁ గాని వేసారదు
నేమపు శ్రీవెంకటేశ నీ వెంత చొక్కించితివో
ఆమనిభోగమె కాని అలయి కెరఁగదు. ॥ చూచిన ॥ 83

ఆహిరి

చెలులము మా కెప్పుడు సిగ్గె మేలు
    సొలసి నిన్నుఁ గన్నులఁ జూచుటె మేలు ॥ పల్లవి ॥

మంచిమాట లాడినాను మర్మములు సోఁకి విన్న
    యించుక గుట్టున నుండే దిదె మేలు
    అంచెల నీ వాన తీఁగా అట్టె విని చొక్కుకొంటా
    వుంచముతో సారె సారె నూఁకొనుటె మేలు ॥ చెలుల ॥

వూడిగాలు సేసినాను వొరసిన ట్లయ్యీని
    వోదక కొలిచి నిలుచుండుటె మేలు
    వేడుక నీవు చేయి వేయఁగాఁ బొగడుకొంటా
    వాడికెతోడ నీకుఁ గైవస మౌటె మేలు ॥ చెలుల ॥

చేయి వట్టి తీసితేను సేవలు గొన్న ట్టయ్యీని
    చాయల నీదాన ననేసలిగె మేలూ
    యీయెడ శ్రీవెంకటేశ యింతలో నన్నుఁ గూడితి
    పాయక యిట్ల నుండేభాగ్యమె మేలు. ॥ చెలుల ॥ 84

315-వ రేకు భైరవి

సకలాపరాధము శమియించుకోవయ్య
    అకలంక మైన నీ యానతిలో దానను ॥ పల్లవి ॥

చేరి నీ పాదములకు సేవ సేసే నంటినా
    నేరుపులు నీ వెరంగనివి లేవు
    యేరీతి నైనాను చే యెత్తి మొక్కే నంటినా
    కారణాలు నీ విన్నిఁ గాననివి గావు ॥ సకలా ॥

మన సిచ్చి నీతోను మాట లాడే నంటినా
    వెనక ముందర నీకు వింత గాదు
    చనవు మెరసి నీసరుస నుండే నంటినా
    వినికిగా నీవు తొల్లి విననిది గాదు ॥ స

గక్కనఁ గాఁగిట నిన్నుఁ గరఁగించే నంటినా
యిక్కువల నీకు నిది యెరవు గాదు
చిక్కి నన్నుఁ గూడితివి శ్రీవెంకటేశ్వర నేఁడు
పెక్కుసుద్దు లెల్ల నీకు భేదము గాదూ. ॥ పకలా ॥ 85

## శంకరాభరణం

తెలుసుకో యిఁక నీవు తేటతెల్లమిగ మమ్ము
తలఁచుకో వారివంటిదాననె యింతనుండి ॥ పల్లవి ॥

యిచ్చక మాడేటివారు యిన్నిటా నితవరులు
నిచ్చ బుద్ధి చెప్పేవారె నిష్ఠూరులు
యెచ్చుకుందు లింతేసి యెరఁగ నైతి నిన్నాళ్లు
తచ్చన నే వారిలోదాననె యింతనుండి ॥ తెలుసు ॥

మాయలు నేర్చినవారు మహిలోన జాణలు
నాయాలు నడచేవారె నాలికూళలు
బాయలుపందిలి వన్ని భ్రమించ నైతి నిన్నాళ్లు
దాయగత్తె నై వారిలోదాననె యింతనుండి ॥ తెలుసు ॥

గక్కన జంకించువారె కందువచనవరులు
చిక్కిలో నైనవారె జిగి వెట్టులు
యిక్కువ శ్రీవెంకటేశ యెనసితి నేఁ డిన్నాళ్లు
తక్కక నీవారిలోదాననె యింతనుండి. ॥ తెలుసు ॥ 86

## దేసాళం

ఎన్నఁడు నీ దయ మాపై నిఁకఁ బెట్టేవు
తిన్నని యెదమాటలఁ దెల్లవార వచ్చెను ॥ పల్లవి ॥

కొంగు వట్టినవాఁడవు గుట్టు గొంత నడపేవు
అంగవించి జాణవు గా వని యందునా
చెంగట నిందరిలోన సిగ్గువడి వుందానను
వుంగిటి దీరనివేళ నూరడించ వలదా ॥ ఎన్నఁడు ॥

4284

చెక్కు నొక్కినవాఁడవు చెప్పవు ఆమీఁదిమాట
 తెక్కించి నీప్రేమ నాపై లే దందునా
 తక్కక యాపనులకె తలవంచుకుందానను
 అక్కరతో యీవేళ నాదరించ వలదా ॥ ఎన్నఁడు ॥

యియ్యకొన్నట్టివాఁడవు యెదురు చేయి చాఁచేవు
 నెయ్యపు సరసములు నేర వందునా
 యియ్యెడ శ్రీవెంకటేశ యిందుకె కూడుందానను
 వొయ్యన నీ మన్ననల నోలలార్ప వలదా. ॥ ఎన్నఁడు ॥ 87

## సామంతం

కంటే సుంకము మరి కానకుంటే బింకము
 యింటికాఁడ మాతో మాయ లేల సేసే వీఁకను ॥ పల్లవి ॥

కప్పి యాపె తనచేతికానుక నీ కియ్యఁగాను
 ముప్పిరి నీ వప్పటి నామోము చూచేవు
 అప్పణ గొంటివా గోపాంగనల కెల్లఁ దొల్లి
 యిప్పుడు నాతో మాయ లేల సేసే వీఁకను ॥ కంటే ॥

పరగి యాపె నీకుఁ బనులు సేయ రాఁగాను
 సరి [1] నాకుఁ జేయు మంటా సన్న సేసేవు
 పొరుగు పొరచిగా నీ పొలఁతులకుఁ జేయించు
 యిరవు నాతో మాయ లేల సేసే వీఁకను ॥ కంటే ॥

కందువ నాపె నిన్నుఁ గాఁగిలించుకోఁగాను
 అంది నన్నుఁ గాఁగిలించి తందులోనసె
 పొందుమా శ్రీవెంకటేశ భూసతి శ్రీసతి నిట్టె
 యిందులోనె నాతో మాయ లేల సేసే వీఁకను ॥ కంటే ॥ 88

## వరాళి

ఎట్టు సేసిన నాతని నేమీ ననకురమ్మ
 గుట్టు సేసు కుండితేను *గుణవంతుఁ డౌనె ॥ పల్ల

1. "నాకు విడు మంటె" వ్రాసి "నాకుం జేఱ మంటా" అని తిద్ది యున్నఁ
* రే. పా. గుణవంతు. (1, 8. చరణములలోగూడ నిట్లే కలదు

మచ్చరించఁ బని లేదు మాపుదాఁకాఁ బతితోడ
పచ్చి దేర నవ్వితేనె పంత మాడుటా
యెచ్చుకుందు లేమి గల్ల నిచ్చగించి గక్కనను
కొచ్చి కాఁగిలించుకొంటె *గుణవంతుఁ డౌనె ॥ ఎట్టు ॥

వెంగె మాడఁ బని లేదు వేవేలైనా నాతని
సంగడిఁ గూచుండితేనె సాధింపుటా
సంగతి దప్పినవేళ సరసుని రతులకు
కొంగు వట్టి తీసితేను గుణవంతుఁ డౌనె ॥ ఎట్టు ॥

బాస గొనఁ బని లేదు పైకొని కాఁగిటిలోనె
నేసవెట్టి కూడితేనె చిక్కించుటా
యీసు దీర శ్రీవెంకటేశుఁ గలసితి వికఁ
గోసనాస గొనకుంటె *గుణవంతుఁ డౌనె. ॥ ఎట్టు ॥ 89

లలిత

మమ్ము నిన్నిటా నిఁక మన్నించుఁ గాక
చిమ్ముసిగ్గులఁ దడవు సేయ నేఁటికే ॥ పల్లవి ॥

వలపించుకొన్నవాఁడు వాకిటికె వచ్చుఁ గాక
పిలిపించుకొన నేలె పెనఁగ నేలె
చలి వాసినట్టివాఁడు సరసము లాడుఁ గాక
యెలయించి యెదమాఁట లిఁక నేఁటికే ॥ మమ్ము ॥

చేసుకొన్నయట్టివాఁడు చెప్పినట్టె సేసుఁ గాక
మూసి దాఁపిరము లేలె మొరఁగు లేలె
ఆసపడినట్టివాఁడు అండనె కూచుండుఁ గాక
వోసరించి మరి కొన్ని వొడఁబా ట్లేఁటికే ॥ మమ్ము ॥

చేయి చాఁచినట్టివాఁడు చెవకి కలసుఁ గాక
నాయములు వెట్ట నేలె నటన లేలె
యీయెడ శ్రీవెంకటేశుఁ డేక మై కూడినవాఁడు
చాయలకు లోలోనిసన్న లిఁక నేఁటికే. ॥ మమ్ము ॥ 90

316-వ రేకు శ్రీరాగం

ఏడ దాఁచుకుండెనో యి విందాఁకాను
వాడుదేరె నీవు తనవద్ద నుండఁగాను ॥ పల్లవి ॥

సెలవినవ్వులు గారె చెక్కులఁ గళలు దేరె
మలసి చెలితో నీవు మాటలాడఁగా
కలువకన్నులు విచ్చె కతలు చెప్పఁగఁ జొచ్చె
పొలసి పొలసి నీవు బుజ్జగించఁగాను ॥ ఏడ ॥

పొంచినయాసలు రేఁగె ‡ పులకలు విఱ్ఱవీఁగె
మంచముపై నుండి నీవు మన సియ్యఁగా
ముంచి పైపైఁ జెమరించె మోహము నీ కొప్పగించె
అంచెల మర్మములు నేఁ దట్టె నీ వంటఁగాను ॥ ఏడ ॥

కమ్మరఁ జేతుల మొక్కె కాఁగిట నీకుఁ జొక్కె
వుమ్మగిలురతులు నీ వొసఁగఁగాను
యిమ్ముల శ్రీవెంకటేశ యిన్నిటాను నిన్నుఁ గూడె
సమ్మతించి నీ విట్టె చన వియ్యఁగాను. ॥ ఏడ ॥ 91

ముఖారి

నయ మిచ్చి మాటలాడ నావంటిదా ఆపె
ప్రియముల బిగువులఁ బెనఁగెడుఁ గాక ॥ పల్లవి ॥

గుట్టు దెలిసిన దాపె గొసరునా నిన్ను మరి
వట్టి సణఁగులు చల్లి వంచుఁ గాక
అట్టడి మొదలనె యాఅడి కింక లోఁగినా
తిట్టులును దీవెనలు దిగఁబోసుఁ గాక ॥ నయ ॥

యింతచనవుల దాపె యిచ్చకము లాడీనా
పంతములనె నిన్నుఁ బంగించుఁ గాక
అంతేసి నేరిచినాపె అప్పణ వి న్నడిగీనా
వంతుల వాసులను మోవఁగఁ గూడుఁ గాక ॥

‡ రే. పా. పులకల.

మందెమేళముల దాపె మట్టున నుందునా నిన్నుఁ
గిందుపరచి తాఁ గరఁగించుఁ గాక
పొందితి శ్రీవెంకటేశ పొంచి నన్ను వీఁక నాపె
చందాలను చాయలను సమ్మతించుఁ గాక. ॥ నయ ॥ 92

సామంతం

కాకిబెగడశిరను కాళ వోసినాఁడు తాను
వాకిటికి వచ్చినాఁడు వలశితి ననవే ॥ పల్లవి ॥

పచ్చనిసాపమీఁదఁ బవళించు మనవే
కుచ్చి మాసూపులు దన్ను గురి దాఁకెను
చెచ్చెరఁ బారుటాకుల చెంచువార మనవే
తెచ్చేను మా దొండపంటితేనె లిదే అనవే ॥ కాకి ॥

కొండపడ మేడలలోఁ గూరుసుండు మనవే
నిండునెమలిగరులు నెత్తి కెక్కెను
దిండు మా వెలఁగపండ్లు తీపు లెక్కె ననవే
అండనె వుందాన తన కప్పగించే ననవే ॥ కాకి ॥

కొప్పుల మొలల నేస కుప్పవడె ననవే
కప్పురపు తనతమ్మ కాత మనవే
వొప్పుగా శ్రీవెంకటేశుఁ దొనగూడె ననవే
ముప్పిరి నేమీ నెఱఁగ మొక్కితి నే ననవే. ॥ కాకి ॥ 93

సౌరాష్ట్రం

కమ్మరఁ గమ్మరఁ జెప్ప కత లాయనే
చిమ్ముల నీపతి వాఁడె చిత్తగించవే ॥ పల్లవి ॥

చెక్కునఁ బెట్టినచేయి చెలువుఁ దింతలో రాఁగా
అక్కజపు నీ సిగ్గు కడ్డ మాయనే
తక్కక పయ్యెదలోన దాఁచిన నీ కుచములు
పుక్కటైన జక్కవల పోరు గాయనే ॥ కమ్మర ॥

సెలవి నవ్వినవవ్వు చేరి నీ పలుకులకు
చలువ లై యడనెడ చవు లాయనే
మెలుపున ముడిచిన మీ పైన నీతురుము
పొలయు తుమ్మిదలకు పూఁ టాయనే ॥ కమ్మర ॥

సేసెటి నీ విడెము శ్రీవెంకటేశు కూటమి
వీసరపోక మంచివిందు లాయనే
నేసపాల రతులలో చిప్పిలు [1]నీ కెమ్మోవి
రాసి కెక్కి చిగురులరచ్చ లాయనే. ॥ కమ్మర ॥ 94

నాదరామక్రియ

ఎదమాట లిఁక నేల యెదురుచూపు లేల
తద వాయ నిన్నిటాను తా నెరుంగునే ॥ పల్లవి ॥

మొగము చూచినఁ గాని ముచ్చటలు వాయవు
నగుతా నుండినఁ గాని నసువు లేదు
తగులాయ మైనఁ గాని తమకము వొడమదు
వగ దీర నాతనివద్ద నుండవే ॥ ఎద ॥

కందువ లంటినఁ గాని కరఁగవు మర్మములు
మందెమేళ మైనఁ గాని మాఁట లెక్కవు
చెంది చెనకినఁ గాని చిత్తము తనివి లేదు
విందువలె నిఁక వేరె విన్నప మేలే ॥ ఎద ॥

చెక్కులు నొక్కినఁ గాని చేతులకసి దీరదు
వొక్కచో నుండినఁ గాని వొద్దిక గాదు
యిక్కు వెరిఁగి శ్రీవెంకటేశుఁ డిట్టె నన్నుఁ గూడె
చక్క నాయఁ బను లెల్ల జాణ తా నవునే. ॥ ఎద ॥ 95

శంకరాభరణం

ఇంగితాకారము లెల్ల నెరిఁగినవాఁడవు
సంగ తాయఁ బను లెల్ల జయవెట్టే మయ్యా ॥ పల్లవి ॥

---

1. "నీక్కెమ్మోవి" వ్రాసి "క్" వత్తును చెరిపి "నీకెమ్మోవి" అని తిద్దియున్నారు.

చెలియభారము నీది సిగ్గులు నీ చేతివి
పలువిన్నపము లిఁకఁ బని లే దయ్యా
అలరి నే మాదేమాట లన్నియు నీ వాడితివి
చలువాయ మా మనసు సారె మొక్కె మయ్యా ॥ ఇంగితా ॥

వనితపాలిటి దిది వహించుకో కిఁకఁ బోదు
అనఁగి పెనఁగ నీతో నంత యే లయ్యా
ననుపు లెల్లా నెరపి నమ్మిక నీ విచ్చితివి
తనిసితి మిఁక నీ చేఁతలకు లో నయ్యా ॥ ఇంగితా ॥

కోమలి మన్నన నీది కోరికె లెల్లా నీవి
వేమరు మందాటాల వింత లే లయ్యా
కామించి శ్రీవెంకటేశ కలసితివి యింతిని
ఆముకొంటి మిఁక నిన్ను నట్టె మెచ్చే మయ్యా. ॥ఇంగితా॥ 96

317-వ రేకు శంకరాభరణం

అతివ ని న్నే మనిన నది యెగ్గా
చతురు లైనవారికి చవులే కాదా ॥ పల్లవి ॥

కూరిమి గొసరఁగాను కోపముగాఁ జేసుకొంటే
యీరీతిఁ జెలుల కెల్లా నేది గతి
మేర మీరేనవ్వులకే మిక్కిలి బీరా లాడితే
తారుకాణమోహాలకు తగులాయ మేది ॥ అతివ ॥

చనవు మెరయ రాఁగా [1]సారెకువేసారుకొంటే
వినయపుసతు లెల్ల వేగించు టెట్టు
కనుఁగొనలఁ జూడఁగ కాఁతాళాలు నెరపితే
ననుపుల లోపలికి నయగారా లేవి ॥ అతివ ॥

కుచ్చి కాఁగిలించుకోఁగా కుచములు నాటె నంటే
ముచ్చటాడేయింతులకు మొద లేది
యిచ్చకుఁడ శ్రీవెంకటేశ నన్నుఁ గూడితివి
విచ్చనవిళ్లలోన విన్నవించ నేది. ॥ అతివ ॥ 97

1. "సారెకువేసారుకొండె" వ్రాసి "సారెకువేసారుకొంటె" అని దిద్ది యున్నారు.

### శుద్ధవసంతం

చెలులాల మీ రిం తేల చెప్పే రాతనికి బుద్ధి
చలివలపులు చల్లి జాగులు సేసీనా ॥ పల్లవి ॥

నేస వెట్టినట్టివాఁడు చేరి కాఁగిలించుఁ గాక
ఆసలాసలె రేఁచి అట్టె వుండీనా
వాసి వుట్టించినవాఁడు వడిఁ జింత మిచ్చుఁ గాక
బేసబెల్లితనమున బిగువు లాడీనా ॥ చెలు ॥

సరస మాడినవాఁడు చన విచ్చి కూడుఁ గాక
తరఁగుమరఁగు లాడి తక్కి వుండీనా
కరఁగి మెచ్చినవాఁడు కందువకుఁ దీసుఁ గాక
సరవు లెరంగక సాదించీనా ॥ చెలు ॥

దగ్గరి వచ్చినవాఁడు దయ నాపైఁ జేసుఁ గాక
సిగ్గులు వడుచు పేరె చిమ్మి రేఁచీనా
యెగ్గు దీర శ్రీవెంకటేశుఁ డిట్టె నన్నుఁ గూడె
వొగ్గి నా సొమ్మాయఁ గాక వొల్ల ననీనా. ॥ చెలు ॥ 98

### మంగళకౌశిక

తానె యెరఁగఁడా తనలాగు
మోనాన నే నొక్కమాట [1]మొక్కితేనె చాలునే ॥ పల్లవి ॥

పిలువ నేర్చినవాఁడు ప్రియము చెప్ప నేరఁడా
వెలిని లోనను విన్నవించ నోపనే
తలఁపు దెలిసేవాఁడు తమకించ నేరఁడా
పలుమారు నతనిఁ జెయి వట్టి తియ్య నోపనే ॥ తానె ॥

ఆయము లంటినవాఁడు అవ్వలిపని నేరఁడా
రేయిఁ బగలు నాతని రేఁచ నోపనే
చాయగా [2]నవ్వినవాఁడు చవి గొన నేరఁడా
పాయపురచన లెల్లఁ బచరించ నోపనే

1. "మొక్కలెనె" వ్రాసి "మొక్కితేనె" అని తిద్ది యున్నారు.
2. "న్నవ్విన" వ్రాసి "నవ్విన" అని తిద్ది యున్నారు.

కన్నులఁ జూచినవాఁడు కాఁగిలించ నేరఁడా
వున్నతపుగుబ్బల నే నొత్త నోపనే
యిన్నిటా శ్రీవెంకటేశుఁ డిట్టె నన్నుఁ గూడెను
వెన్నెలబాయిట నంత వేసరించ నోపనే. ॥ తానె ॥ 99

దేసాక్షి

మాఁటలు నీతో మా కేల
ఆఁటదాని కన రంటీఁ గాని ॥ పల్లవి ॥

చెప్పక చెప్పిన చెలివిన్నపములు
తెప్పల తుదలనె తెట్టించే
వుప్పతించి ని న్నొకటీ నాడము
తప్పనిబాసలె తగిలీఁ గాని ॥ మాఁటలు ॥

అంపక యంపిన అంగన కానికె
[1]ముంపుకుచములనె మొన చూపే
గుంపెనతో నిఁక కూరిమి గొసరము
పెంపువిరహమె పెనగొనీఁ గాని ॥ మాఁటలు ॥

కూడక కూడిన కోమలికోరికె
వాడుమోవిని వన్నాయ
యీడనె శ్రీవెంకటేశ యేలితివి
వేడుకవలపులె వెతకీఁ గాని. ॥ మాఁటలు ॥ 100

హిందోళవసంతం

కడు ముద్దరాలు గన కక్కసించ నోపదు
వడిఁ బెట్ట కిఁక నిట్టె వర మియ్యవయ్యా ॥ పల్లవి ॥

నిన్నుఁ జూచి నవ్వు నవ్వి నివ్వెరగుఁ బొందెఁ జెలి
సన్నలు నీకే తెలుసు సరసుఁడవు
విన్నపము నేనే నంటె వెలఁది చిత్త మెఱఁగ
వున్నతి చెలిమోహము వొప్పు గొనవయ్యా ॥ కడు ॥

1. "ముంపుకుచములలె" వ్రాసి "ముంపుకుచములనె" అని తిద్ది యున్నారు.

అప్పసము చేయి చాఁచి ఆయములు గరఁగె యీ
చొప్పు నీవె యెరుఁగుదు సుజాణఁడవు
అప్పటిఁ గొసరే మంచె ఆపెమర్మ మెరఁగము
చిప్పిలువయసు నీకే నెలవు సు మ్మయ్యా ॥ కదు ॥
చేరతో దగ్గరుతానె మెచ్చె నిన్నిట్లా నీకె
ఆ రతి నీ వెరుఁగుదు వధికుఁడవు
కూరిమి శ్రీవెంకటేశ కూడితివి మగువను
నేరుతుమా నే మంత నీవే రక్షించవయ్యా. ॥ కదు ॥ 101

ముఖారి

నీవు సేసిన బాసలు నీ వెరఁగవా
రేవగలు [1]నెట్టు వేసరించేము నిన్నును ॥ పల్లవి ॥
ఆడినప్పటి మాటలో సత్తము నీ వెరఁగవా
యీడకు వచ్చుండఁగాను యిం తెరఁగవా
వేడుక పడ్డవాఁడవు వెలయించ నెరఁగవా
తోడనె ని న్నెందాఁక దూరేము నిన్నును ॥ నీవు ॥
నవ్వినవవ్వులలోని నయము నీ వెరఁగవా
రవ్వ సేసినవాఁడవు రా నెరఁగవా
జవ్వనపువాఁడ వాసలు నీ వెరఁగవా
రివ్వలుగ నెందాఁక రేఁచేము నిన్నును ॥ నీవు ॥
యిట్టె చూచినవాఁడవు యిచ్చక మెరఁగవా
జట్టి గొన్నవాఁడవు మెచ్చ నెరఁగవా
నెట్టన శ్రీవెంకటేశ నీవె నన్నుఁ గూడితివి
గుట్టుతోడ నెందాఁకా కొసరేము నిన్నును. ॥ నీవు ॥ 102

318-వ రేకు దేసాక్షి

మందెమేళమె నాకు మన్నింతువు గాన నీతో
యిందుకుఁగా నీవు యెగ్గు లెంచకుమీ అయ్యా ॥ ప

1. "నెట్టా" వ్రాసి "నెట్టు" అని తిద్ది యున్నారు.

వాలుకరెప్పలు వంచి వడి నేఁ గొసరితిని
తాలిమి లేక నీపైఁ దమకించితి
వేఁవే శెరఁగక వేసరించితిని నిన్ను
యీలీల నీచిత్త మెట్టో యెరఁగఁ జుమ్మీ అయ్యా ॥ మందె ॥

కుచ్చి కుచ్చి నిన్ను సారె గుబ్బల నే నొత్తితిని
తచ్చి తచ్చి నీతోఁ బంతము లాడితి
హెచ్చుగా నెలవి నిన్ను నిందరిలో నవ్వితిని
ముచ్చట నిన్నిటికిఁగా మొక్కేఁ జుమ్మీ అయ్యా ॥ మందె ॥

పాయపుమదాన నిన్నుఁ బట్టి చేతఁ దీసితిని
చాయల సన్నల నిన్ను జంకించితి
ఆయ మెరఁగక నిన్ను నలయించి కూడితిని
మాయల శ్రీవెంకటేశ మానఁ జుమ్మీ అయ్యా. ॥మందె॥ 103

ధన్నాసి

నీవు చేసినది చేఁత నీకు నద్దమాడ నేను
పావన మైతిని నీపాలిదాన నేను ॥ పల్లవి ॥

యిందరు నెరఁగ నన్ను నిటు మన్నించిన నీవు
మందలించి యిఁక వేరె మానఁ బొయ్యేవా
పొందిన నా పొందు లివె పూఁచి నా [1]మన సుండఁగ
సందేహ మిఁక నేల సత మైతి నేను ॥ నీవు ॥

కావలె ననుచు నన్నుఁ గై కొన్నవాఁడవు
వేవే లైన దిగ విడిచేవా
నీ వేలివుంగర మిదె నేఁడు నాచేఁ జిక్కినది
దావతి యిఁక నేఁటికిఁ దగు లైతి నేను ॥ నీవు ॥

కచ్చుపెట్టి నీవు నన్నుఁ గాఁగిలించినవాఁడవు
యిచ్చకమె సేతు గాక యెర వయ్యేవా
నిచ్చలు శ్రీవెంకటేశ నీకూటమి నాకు నబ్బె
మచ్చుమాయ లిఁక నేల మరిగితి నేను. ॥ నీవు ॥ 104

1. "మననండ" వ్రాసి "మనసుండ" అని తిద్ది యున్నారు.

భైరవి

నీ వెరఁగవా తగవు నీకు విన్నవించేమా
వేవేలు సతులలోన వెలయించ రాదా ॥ పల్లవి ॥

నలుదిక్కులుఁ జూచేవు నాదిక్కు చూడఁగ రాదా
వలపు నీపైఁ జల్లెటివనిత నేను
పిలిచినవాఁడవు ప్రేమ చూపక మానవు
తొలుతె కాఁగిట నించి దొడ్డ సేయ రాదా ॥ నీ వెరఁగ ॥

కానుక లందేవాఁడవు గక్కన నన్నంట రాదా
పానికుచముల [1]నిమ్మపండ్లదానను
పూని నవ్వినవాఁడవు భోగించక మానవు
నే నడిగినవేళనె నీవు లోఁగ రాదా ॥ నీ వెరఁగ ॥

కడు నా సోదకాఁడవు కాఁగిలించుకో రాదా
అడియాల మైన నీ యాఁటదానను
యెడయక శ్రీవెంకటేశ నన్నుఁ గూడితివి
కడమ లేకుండ నిట్టె గతి గూడ రాదా. ॥ నీ వెరఁగ ॥ 105

శ్రీరాగం

మేలు మేలు రమణుఁడ మెచ్చితి నిన్ను
చాలి నీచేఁతల కెల్ల సంతోసింతు నేను ॥ పల్లవి ॥

కలవు నామీఁద బత్తి కన్నులఁ జూచితి విదె
వలచినవలపులు వన్నె కెక్కెను
తలఁపులు దెలియక తమకింతు నింతె కాక
యెలమి నీవల్ల వెలితించుకంత లేదు ॥ మేలు ॥

నిక్కమె నీ మాట లెల్ల నేఁ డీడకు వచ్చితివి
తొక్కినపాదపుఁదొక్కు తుద కెక్కెను
యెక్కుడు నీ నవ్వులకు నీసడింతు వింతె కాక
యెక్కడా నీవొళ్లఁ దప్పు లెంచఁ జోటు గలదా ॥ మేల

1. "నిమ్మపండ్ల" వ్రాసి "నిమ్మపండ్ల" అని తిద్ది యున్నారు.

చెల్లెను నీ సేఁత లెల్ల చేపట్టి కూడితి విదె
యెల్లగా నా కోరికెలు యీడేరెను
కొల్లగా శ్రీవెంకటేశ కొసరుదు నింతె కాక
పొల్లు లేని నీగుణాల పొరపొచ్చ మున్నదా. ॥ మేలు ॥ 106

శంకరాభరణం

ఏ మందు నా గుణ మిదె యెంత మోహించితినో
చేముట్టి నీమీఁద నున్నచేయి దియ్యఁ జాలరా ॥ పల్లవి ॥

చెప్ప రానిమాట లైనఁ జేసేఁ గాని నీతో
నప్పటి నెదురు మాటలాడ నోపరా
కుప్పళించి పెంజెమట గురిసేఁ గాని నీకుఁ గా
తప్ప కిట్టె మోము చూచి తలవంచ నోపరా ॥ ఏ మందు ॥

సేయ రానిపని కైన చేరి వొడిగట్టేఁ గాని
ఆయెడ నిన్నుఁ బాసే అందు కోపరా
చాయల సరసమున సందడిఁ బొరలేఁ గాని
పాయపుమదాన సిగ్గువడఁగ నే నోపరా ॥ ఏ మందు ॥

యేకతాన నెందు నైనా నియ్యకొనేఁ గాని నిన్నుఁ
గాకుగా మందెమేళాలఁ గప్ప నోపరా
యీకడ శ్రీవెంకటేశ యిట్లాఁ గూడుండేఁ గాని
దాకొని జంకించి నిన్ను తక్కించ నోపరా. ॥ ఏ మందు ॥ 107

గౌళ

మోనాన నూరకె నీకు మొక్కేఁ గాక
కానికలు సారె నేమి కప్ప మంపే నీకును ॥ పల్లవి ॥

తలఁపు నామీఁద నీకు తగిలి వుండఁగాను
చెలు లేమి విన్నపాలు సేసేరు నీకు
చలిమి బలిమి నాకు సరి గలిగి యుండఁగ
మలసి సొలసి యేమి మాటలాడే నిన్నును ॥ మోనాన ॥

మంతనాన నీవు నాకు మనసిచ్చి యుండఁగాను
దొంతులబుద్ధులు యేమి దోఁచీ నీకు
పంత మిచ్చి నీవు నాపై పక్షమై యుండఁగాను
కొంత గొంత యిఁక నేమి గొసరేము నిన్నును ॥ మోనాన ॥

కందువల నీవు నన్నుఁ గాఁగిలించు కుండఁగాను
విందుల నాగుణములు వింతా నీకు
పొందుగా శ్రీవెంకటేశ పూఁచి నన్నుఁ గలసితి
చందముగా యిఁక నేమి జరసేము నిన్నును. ॥ మోనాన ॥ 108

319-వ రేకు కాంబోది

ఏ మని మెత్తు నిన్ను యింత మేలు చేసితివి
కామిని నామాన మిట్టె కాచితివి నీవు ॥ పల్లవి ॥

యెదురు చూడఁగానె యింతలో విచ్చేసి నీవు
అదన నా చేయి వట్టి ఆదరించితి
వదలుఁ బయ్యెదతోడ వసివాడే నన్నుఁ జూచి
పొదిగి పయ్యెద గప్పి పొది నేసితివి ॥ ఏ మని ॥

మొక్కఁగోఁగానె నీకు ముంచి నాకు వర మిచ్చి
చెక్కు నొక్కి బుజ్జగించి నేద దేర్చితి
లక్కవంటి మదితోడ లాచుక వుండిన నాతో
మక్కువలు చల్లి చల్లి మంతన మాడితివి ॥ ఏ మని ॥

చేయి చాఁచఁగానె నన్ను శ్రీవెంకటేశుఁడ కూడి
చాయల నవ్వులు నవ్వి సన్న నేసితి
పాయపువేడుకతోడ పదరుచు నుండేనన్ను
ఆయము లంటుచు మరి అట్టె మన్నించితివి. ॥ ఏ మని ॥ 109

ముఖారి

ఏల మాతోఁ జెల్లఁ బెట్టే వెమ్మెలు నీవు
నాలి నేయ కిఁక నీవు నవ్వు వచ్చీ మాకు ॥ పఁ

పంత మేల నీవు నాతోఁ బచరించే వప్పటిని
యెంత లేదు ని న్నిందరు నెరఁగనిదా
కాంత యైతేఁ జాలు నీవు కడు గుజ్జైనాఁ గాని
చింత దీర భోగించి నేస వెట్టవా ॥ ఏల ॥

వాసు లేల నెరపేవు వచ్చి వచ్చి నా ముందర
నీ సుద్దులు మా కెల్ల నేఁడు గొత్తలా
ఆసపడి ఆఁటదాని కడవు లెల్లాఁ దిరిగి
రాసి కెక్కఁ దెచ్చుకొని రవ్వఁ బడవా ॥ ఏల ॥

కడుఁ బరా కే లయ్యేవు గక్కన ఫేరునివలె
అదరి శ్రీవెంకటేశ అద వలెనా
మెడఁ గట్టుకొంటి విదె మించి యలమేల్మంగను
తొడిఁబడ నన్నుఁ గూడి దొర వై నిలువవా. ॥ ఏల ॥ 110

బౌళి

అన్ని నేరిచినవాఁడ వామీఁదు నేరవా
సన్న సేసినవాఁడవు చాయకు రా నేరవా ॥ పల్లవి ॥

కాయ మంటినవాఁడవు కప్పురము నోటి కిచ్చి
ఆయములు గరఁగించ నంత నేరవా
సోయగపుచూపులఁ జూచినవాఁడవు నీవు
పాయపుకోరికె లిచ్చి పచరించ నేరవా ॥ అన్ని ॥

నగినవాఁడవు నీవు నానారీతుల నాతో
అగపడి సరసము లాడ నేరవా
మిగుల నాచేఁతలతో మించినవాఁడవు యిట్టె
బిగువుఁగాఁగిటఁ గడు ప్రేమ రేఁచ నేరవా ॥ అన్ని ॥

మెచ్చినట్టివాఁడవు మేకులు నేసి నేసి
యిచ్చగించి కలయఁగ నింత నేరవా
కుచ్చి శ్రీవెంకటేశుఁడ కూడి మన్నించితి విదె
నిచ్చలు నీమేలు నాపై నెరపఁగ నేరవా. ॥ అన్ని ॥ 111

### పాడి

మూసినముత్యమువలె మూల లే లోయి
మోస మెల్లాఁ దీరె నిఁక మొరఁ గే లోయి ॥ పల్లవి ॥

పచ్చికస్తూరిబొ ట్టంటి పరిమళించే దెల్లా
మెచ్చులా యిద్దరిలో నీ మేననా వోయి
గచ్చుల నెవ్వ రవుతా కానకుంటి మిందాఁకా
మచ్చెము బాయిటఁ బడె మాటలాడ వోయి ॥ మూసిన ॥

ముడిచివేసే పువ్వులు ముంగిట రాలే దెల్లా
చిడుముడి నెరుల నీ సిరసా వోయి
యెడసి యీగురు తిది యేరుపడ దిందాఁక
అడియాలము గంటిమి ఆన లేల వోయి ॥ మూసిన ॥

కుంకుమచెమటబొట్లు కురిసె నీశ నెల్లాను
లంకె తైన నీ చెక్కుల లాగులా వోయి
అంకెల శ్రీవెంకటేశ అట్టె నన్నుఁ గూడితివి
సంకె తెల్లఁ దీరె నిఁక జాగు లేల వోయి. ॥ మూసిన ॥ 112

### మధ్యమావతి

ఎంతటిదానవు నీవు యేమి చెప్పేము
పంతము లన్నియు దక్కెఁ బలుకు లీడేరెను ॥ పల్లవి ॥

చింత లెల్లఁ బెడబాసె చెక్కుచెయి దియ్యవమ్మ
కాంతుఁ డింటికి విచ్చేసె కడమ దీరె
దొంతి నున్నవలపులు తొడికితేఁ జేతఁ జిక్కె
యింతయు నీ మహిమలె యిఁక నేల జాగులు ॥ ఎంతటి ॥

కోరికలు సమకూడె గోరివాఁత మానవమ్మ
గారవించె నాతఁడు నీ కైవస మాయ
చేరినట్టి జవ్వనము చెల్లుబడి కెక్కె నిదె
నేరు పెల్ల నీ సొమ్మె నీ కేల మరఁగు ॥ ఎంతటి ॥

తతి వచ్చె కూటమికి తలవంచ నే లమ్మ
అతఁడు శ్రీవెంకటేశుఁ [1]గంకెఁ గలసె
మతిలోని ముదములు మాటలసోన గురిసె
చతురత నీ పాలాయ సం కేల నీకును. ॥ ఎంతటి ॥ 113

సౌరాష్ట్రం

ఏలినవాఁడవు నీవె యే మయ్యా
మేలు నాకు నీవల్ల మీఁద మిక్కి లయ్యా ॥ పల్లవి ॥

అందగారి మాట లెల్ల నాడి నన్ను నమ్మించి
కందువకుఁ దీసితివి గదవయ్యా
చెందమ్మి రేకులవంటి చేరఁదేసి నా కన్నుల
కింద కెల్ల గురి యైతి విఁక నీ చిత్త మయ్యా ॥ ఏలిన ॥

యింట నూరకుండేదాన నెలయించి నవ్వించి
గంటి సేసితివి మోవి గదవయ్యా
గొంటరి నా చనుఁబువ్వుగుత్తుల పూజలకును
నంటున లో నయితివి నాఁడె కదవయ్యా ॥ ఏలిన ॥

కోరి నీవు కాఁగిటిలోఁ గూడినచనవు లెల్ల
గారవానఁ జెల్లించితి గదపయ్యా
యీరీతి శ్రీవెంకటేశ యెనసి నా చిత్త మనే
వూరిలో నెలకొంటివి వొడఁబాటే అయ్యా. ॥ఏలిన॥ 114

320-వ రేకు సామంతం

నాతోనె ఆన తీవయ్యా నంటున సంతసించేను
చేతికి లో నైతి విఁకఁ జేరె నాకు మేలు ॥ పల్లవి ॥

చెప్పి నే నంపినమాట చెవుల కిం పాయనా
తప్పులు లేవు గదా ఆతరవాతను
నెప్పున దాఁచఁగ నేల నిన్నుఁ బాయలే నంటి
యిప్పు డిట్టె విచ్చేసితి వియ్యకోలా నీకు ॥ నాతోనె ॥

1. "సంకె" అని తాటాకు చెక్కి చెరిపి "గంకె" అని తిద్ది యున్నారు.

జిగి నా కానుక నీకు చిత్తము వచ్చెనా నేఁడు
వెగటు లేవు గదా వేరె అందు
నిగిడి కొంకఁగ నేల నీ బాస దలఁచు మంటి
అగపడితివి నాకు అవునా నా పొంధులు ॥ నాతోనె ॥

మొక్కిన నా మొక్కు నీకు మొగమోట కెక్కెనా
మొక్కలము లేదు గదా మోహములోన
యిక్కు వెరిఁగి శ్రీవెంకటేశ నన్నుఁ గూడితివి
దక్కితివి యింత నాపై దయ గద్దా నీవూ. ॥ నాతోనె ॥ 115

సాళంగనాట

అప్పటి నాతో నీవు ఆడ వలెనా
కప్ప నేల పచ్చడము కాఁగి లుండఁగాను ॥ పల్లవి ॥

తప్పని నీ కృప నాపై తగిలి వున్నది గాన
ముప్పిరి నున్నవి నా మోముకళలు
నెప్పున నీ మహిమకు నేనె తారుకాణ
చెప్ప నేల నిఁక వేరె చేసి చూపఁగాను ॥ అప్పటి ॥

చెలఁగు నీ మాటలు నా చెవి సోఁకినవి గాన
పులకలు నా మేనఁ బొది గొన్నవి
అలరు నీ మంచితనా లన్నిటికి నే గురుతు
తెలుప వలెనా వేరె దిష్ట మై యుండఁగను ॥ అప్పటి ॥

అందపు నీ కూటమి నా కమరి వున్నది గాన
సందడించి నాలోని సంతసా లేల
యిందు మనలో శ్రీవెంకటేశ యివె కారణము
చెందఁగ వలెనా వేరె చేకొ నుండఁగాను. ॥ అప్పటి ॥ 116

హిజ్జిజి

చెప్పఁబోతేఁ దనతోను సిగ్గయ్యీ నాకు
యిప్పుడు వద్ద నున్నాఁడు యెచ్చరించరే ॥ పల్ల

చూడఁగానె నా కన్నులు సొరిదిఁ జేరఁడే సాయ
యీడఁ దన చక్కఁదన మెంతో కాని
దాడితో నెడతెగదు తన[illegible]ఁది తలపోఁత
వేడుకకు వెల లేదు విన్నవించరే ॥ చెప్ప ॥

కదిసితే నా చన్నులు కాఁగెఁడేసి కాఁ బెరిగె
యిదివో తనఘారము యెంతో కాని
వొదగాయఁ దనమీఁద నుదు టైనతమకము
యెదుట నా మోహ మెల్ల నెరిఁగించరే ॥ చెప్ప ॥

పైకొనఁగ నాతురము బారెఁడేసి కొన సాగె
యీ కొలఁది తననేర్పు యిటు నేసెను
దాకొని శ్రీవెంకటేశు తగు లైనకూటమి
మేకొని నామారు మీరు మెచ్చఁ గదరే. ॥ చెప్ప ॥ 117

గుండక్రియ

సారె నిన్ను వేసరించ సంగతే నాకు
మారాడ నే నాలిసొమ్ము మగనిదె కాదా ॥ పల్లవి ॥

నిన్ను వేగిరించేనా నీవె యెఱఁగవా
కన్నుల మొక్కితేఁ దానె కరఁగేవు
చన్నులె గొప్పలు గాని సరి నడుము బడలె
విన్నపము లిఁక నేల వింతదానఁ గాను ॥ సారె ॥

చలము సాధించేనా జాణఁడవు గావా
నిలుచుండఁగాఁ గరుణించేవు నీవె
అలిఁ గొప్పె గొప్ప గాని లాచి మోము చిన్నఁబోయ
బలిమి చూపఁగ నీతోఁ బంతగత్తెనా ॥ సారె ॥

నింద వేసేదాననా నీవు శ్రీవెంకటేశుఁడ
వందాలు నేసుకోఁగానె ఆదరించేవు
కందువకన్నులె గొప్ప గాని పాదాలు పన్నాలు
మందలించి నీతో మారు మలయంగఁ గలనా. ॥ సారె ॥ 118

## ఆహిరి

ఇట్టుండ వలదా నీవు యెవ్వతెకు మోహించినా
దట్టముగ నిచ్చితేను తప్పవు నీ బాసలు ॥ పల్లవి ॥

ఆపెమాట లైనా నీవు ఆలకించి మా యింటికి
యీ పొద్దు విచ్చేసితివి యెన్నికె గాను
దాపగు సవతులకు దయ పుట్టఁగాఁ గదా
కాపాడితి వికఁ నిన్ను కంటిమి నీ గుణము ॥ ఇట్టుండ ॥

అండ నుండి ఆపె నీకు అప్ప ణియ్యఁగా నైనా
గుండె వట్టి నావద్దఁ గూచుండితివి
వండిగ తోడివారు తగవు నడపఁగాఁగా
నింద నన్ను మన్నించితి నెగడె నీ పుణ్యము ॥ ఇట్టుండ ॥

మొక్కిన యాపెమొక్కు మొగిఁ జిత్తానఁ బెట్టినా
గక్కనఁ గాఁగిటఁ గూడి కైకొంటివి
దిక్కై శ్రీవెంకటేశ యిందిరకు నెలవుగఁగా
మిక్కిలి న న్నేలితివి మెరనె నీ కీరితి. ॥ ఇట్టుండ ॥ 119

## వసంతవరాళి

వినవే యెక్కడి సుద్ది వేగ మామాట
మనసులోఁ జల ముంచే మర్మములు మాన్పునా ॥ పల్లవి ॥

యెంతేసి మాట లాడినా యెచ్చు కుందు గలిగినా
కాంతలకు మగలకుఁ గలదా వేరు
చింత దీర నావేళకు చెక్కు చేయే మరఁ గింతె
పంతపునెలవినవ్వు బతిమాలింపించెను ॥ వినవే ॥

అవ్వలిమోము లై వున్నా నలుకలు ముంచుకొన్నా
జవ్వనపువలపుల చవి దప్పినా
దవ్వు లై యావేళకు తలవంపులే మరఁగు
చివ్వనఁ గనుచూపులె చెలుములు నేయవా ॥ విన

సిగ్గులు పైకొవినాను చేఁతలు గడు మీరినా
నగ్గళపు రతివేళ నడ్డమున్నదా
యెగ్గు దీర శ్రీవెంకటేశుఁ డిట్టె నిన్నుఁ గూడె
బెగ్గిలినాఁ దమకము ప్రియములు రేఁచునే. ॥ వినవే ॥ 120

321-వ రేకు మంగళకౌశిక

పడుచుఁజేఁతలు గావు బాలకృష్ణుఁడు
తొడికీ మోవిపంటికె దుండగపుఁగృష్ణుఁడు ॥ పల్లవి ॥

వెన్న చేతఁ బట్టుకొని వేలు చాఁచి వుట్లకు
సన్న చేసీఁ గదవమ్మ జాణ కృష్ణుఁడు
కన్నెలు ద న్నెత్తుకొంటె కాఁగిటిచవులు చూపీ
యెన్నిట తా నసకాఁడె యీ కృష్ణుఁడు ॥ పడుచు ॥

అంకెల దొంగెదు తానె అందపుచూపులు చల్లీ
లంకె మగనాండ్లపై లలిఁ గృష్ణుఁడు
పొంకపుచెక్కు గీఁటితె పుక్కిట లోకాలు చూపీ
సంకె లేక యశోదకు సటకాఁడు కృష్ణుఁడు ॥ పడుచు ॥

గొల్లెతలు ముద్దాడితె గురుతు లెల్లా నించె
[1]చల్లచాడెలకాడనె సరిఁ గృష్ణుఁడు
అల్ల శ్రీవెంకటాద్రిని అదె తుంగభద్రదరి
కొల్లలుగా వరా లిచ్చీ గోవిందకృష్ణుఁడు. ॥ పడుచు ॥ 121

బౌళి

వలెనా యింకా నంత వలపు గలయఁ బెట్ట
సళుపుఁజూపుల నాయ సమతారుకాణలు ॥ పల్లవి ॥

చేసినట్టిచేఁత లెల్లఁ జెల్లించ నీవు గలవు
ఆస చూపి నీకు మొక్క నాపె గలదు
యీసు లేక వోరుచుక యియ్యకొన నేఁ గలను
రాసి కెక్క నీకు నవ్వు రాకుండునా యిఁకను ॥ వలెనా ॥

1. "చల్లదాడెం" వ్రాసి "చల్లచాడెల" అని శిద్ది యున్నారు.

పసిఁడిపట్టెమంచము పవళించి వుండఁ గల
దసమున భోగించ నాపె గలదు
పసగా నుండఁగను నా బంగారుమేడ గలదు
వెస సంతసాల విఱ్ఱవీఁగ వద్దా యిఁకను ॥ వలెనా ॥

వుంగరము వేలఁ బెట్ట నొరసి యాపె గలదు
సింగారించుకొనను నీ చేయి గలదు
అంగవించి నిన్నుఁ గూడేయందుకు నేనూఁ గలను
చుంగుల శ్రీవేంకటేశ చొక్క వద్దా యిఁకను. ॥ వలెనా ॥ 122

వరాళి

సొమ్ము గలవాఁడవు సోఁపు గని యిచ్చె కాక
సమ్మతిఁ గాక వంచన సేయ వచ్చునా ॥ పల్లవి ॥

సిగ్గువ డుండుత గాక చెనకే నీ చేఁతలకు
తగ్గి తప్పించుకొంటేను తప్పు వెంచవా
వొగ్గి మొదలనె నీకు వొప్పగించిన దీ మేను
దగ్గరి పైకొంట గాక దాఁచ వచ్చునా ॥ సొమ్ము ॥

మోనాన నుండుత గాక మోహపు నీ మాటలకు
దానికె నే మారాడితేఁ దమకించవా
నానినది మొదలనె నానోరు నీ యెంగిటనె
పూని పట్టుకుందుఁ గాక బొంకె నన వచ్చునా ॥ సొమ్ము ॥

ఆసతో నుంకుత గాక అంటిన నీరతులకు
వీస మంత నే మీరినా వెర గందవా
నీ సొమ్ము మొదలనె నా నెయ్యము శ్రీవేంకటేశ
మూసి దాఁచుకుందుఁ గాక మొరఁగఁగ వచ్చునా.॥సొమ్ము

భైరవి

ఏమో యెరఁగను యెట్టైనాఁ గాని
వేమరు నీ కెక్కినది వేడుక నా బదుకు ॥ ప

చింత దీర నీ మన్నన చెప్పుకొనఁగా విని
పంతపుసతులు పకపక నవ్వేరు
మంతనాన నీ చేఁతలు మరి యే మైనాఁ గలవో
యెంత వలచినది సి గ్గెంచ దంటానో ॥ ఏమో ॥

సమరతి నీ పాన్పుపై సరి నే నుండఁగాఁ జూచి
జమళిఁ దమలోననె సన్న నేసేరు
[1]అమరదో నీవు నేనూ నంటుకొన్నపొందులు
తమితో నాగర్వ మింత తగ దంటానో ॥ ఏమో ॥

చేరి వేడుకొంటా నే నీ చెక్కు నొక్కఁగాఁ జూచి
సారెఁ దమమోకా లిచ్చలఁ జూచేరు
యీరీతి శ్రీవెంకటేశ యిచ్చఁ గూడితిమి మన
నేరుపుల నన్నిటాను నీవె నే నంటానో. ॥ ఏమో ॥ 124

కన్నడగౌళ

మరుఁడు నేసినమాయ మరి తెలియదు గాక
సరవు లిద్దరివిని సరికి బే సాయనా ॥ పల్లవి ॥

చనవు నేసుక నిన్ను సరిఁ గొంగు వట్టితిని
యెనసి యింత నేయ నీ యాడుదాననా
పెనఁగ కంతలో నీవు బెరసి లో నైతివి
ననిచి కరుణ యింత నా మీఁద నుండెనా ॥ మరుఁడు ॥

నవ్వు నేసుకొని నీపై నలిఁ జేయి వేసితిని
రవ్వ నిన్నింత నేయ బీరపుదొరనా
చివ్వన నీ వప్పటిని చేరి బత్తి నేసేవు
యివ్వల నీ మోహము న న్నింత దొడ్డ నేసెనా ॥ మరుఁడు ॥

బలిమి నేసుక నే నీపయిఁ జేయి వేసితిని
కలసితి [2]వింతేసికిఁ గలనా నేను
నెల వై శ్రీవెంకటేశ నీ వింకాఁ జెక్కు నొక్కేవు
సలిగె లిన్నియు నీవె సమ్మతించితివా. ॥ మరుఁడు ॥ 125

1. "అమర" వ్రాసి "అమర" అని తిద్ది యున్నారు.
2. "దింతే" వ్రాసి "వింతే" అని తిద్ది యున్నారు.

హిందోళవసంతం

ఏల వేగిరించేవె యీతనితోడ
మూలలనె వుండ నీరె ముచ్చటల మాఁటా ॥ పల్లవి ॥

చిత్తము వచ్చినచోట నేసినదె విన్నపము
హత్తి పొసఁగనిచోట ననుమానమె
యిత్తలఁ దన నా సంది యీ రెండుఁ దెలియుదాఁకా
పొత్తులనె వుండ నీరె పొరుగుల మాఁటా ॥ ఏల ॥

ఆస గలిగినచోట నాడినదె సరసము
పేసట లయ్యినచోట విచారములె
వాసితోఁ దనకు నాకు వైపులు గూడినదాఁకా
మూసినట్టె వుండ నీరె ముందరి ఆమాఁటా ॥ ఏల ॥

వొడఁబాటు గలచోట నొనగూడి వుండు నవ్వు
వెడవెడ లైనచోట వేరువేరులె
యెడయక శ్రీవెంకటేశుఁ డిట్టె నన్నుఁ గూడె
వొడికమై వుండ నీరె వొరపుల మాఁటా. ॥ఏల॥ 126

322-వ రేకు దేసాళం

రసికుఁడ వౌదు పండరంగినాథా నీ
పసలఁ జిక్కితి మిదె పండరంగినాథా ॥ పల్లవి ॥

యివ్వల నవ్వల నేఁడు యిటు నీతో నవ్వి నవ్వి
[1]రవ్వైతిమి గదో పండరంగినాథా
కువ్వ లాయ నీ చేఁతలు గురి యయితి మింతకు
పవ్వళించితిరి మేలు పండరంగినాథా ॥ రసికుఁడ ॥

రుచు లైన నీ మాఁటలె రూఢి కెక్కించెను మమ్ము
రచనకాఁడ వో పండరంగినాథా
యిచట నీ రాకలకు నెదురు చూపించి మేలె
పచరించితివి బాపు పండరంగినాథా ॥ రసికుఁడ ॥

1. "రవ్వైతివిగ" అని వ్రాసి చెరిపి "రవ్వైతిమిగ" అని తిద్దియున్నారు. "తి-గ" లమధ్య "వి" పెద్దదిగా వ్రాసి యుండుటచే చెరిపి "తి-గ" లమధ్య "మి" చెక్కియున్నారు.

సారెఁ దీసితివి కొప్పు చన్ను లంటి చూచితివి
రారాదా యిఁక పందరంగినాథా
కూరిమి శ్రీవెంకటాద్రిఁ గూడి చొక్కించితి మమ్ము
పైరు లాయఁ బులకలు పందరంగినాథా. ॥ రసికుఁడ ॥ 127

శ్రీరాగం

సరసుఁడవు నీ వైతే చదురాలు నీ కాపె
అరు దాయ నన్నిటాను అమరు నిద్దరికే ॥ పల్లవి ॥

చెప్పఁగలవల పెల్లఁ జెలి [1]నీతోఁ జెప్పి చెప్పి
చెప్పరానిమాటలకు సిగ్గు వద్దది
చిప్పిలునవ్వులఁ గొంత శిరసువంపులఁ గొంత
అప్పగించీఁ దెలుసుకో అవ్వలివిన్నపము ॥ సరసుఁడ ॥

సేయఁగలవూడిగాలు సేసి సేసి నీ కాపె
సేయరానిచేఁతలకు సిగ్గు వద్దది
చే యెత్తి మొక్కులఁ గొంత చిమ్మనిట్టూర్పులఁ గొంత
కాయము సోఁకఁగఁ జేసీ కదమ వూడిగెము ॥ సరసుఁడ ॥

చెక్కు నొక్కు నొక్కి యిట్టె శ్రీవెంకటేశ్వర నిన్ను
చెక్కు చేతితోడనె తా సిగ్గు వద్దది
పుక్కిటి విడేలఁ గొంత పొరచిచేఁతలఁ గొంత
గక్కన నీ కంది యిచ్చీ కదమదొడమలు. ॥సరసుఁడ॥ 128

పాడి

చెప్పరా దిందాఁక నైతె చెలి యున్నభావము
వుప్పతిం దినుమడించె నుండ నుండఁగాను ॥ పల్లవి ॥

మగువకు నేఁడుగా మనికిత మెల్లఁ బాసె
వెగటు వో నీ వింటికి విచ్చేయఁగాను
మొగచాటు లే దాయ ముచ్చట లెల్లఁ దీరె
పొగిసి నీవు మొగము చూడఁగాను ॥ చెప్పరా ॥

1. "నీతి" అని వ్రాసి "నీతో" అని తిద్దియున్నారు.

సుదతి కీ వేళ గా షోడశకళలు నిండె
మదనజనక నీవు మన్నించఁగాను
తుదిపదమున కెక్క తుందుడుకు లెల్లఁ బోయ
పొదిగి పట్టి కాఁగిట బుజ్జగించఁగాను ॥ చెప్పరా ॥

అంగన కిట్టె కా అతు మెల్లఁ జల్ల నాయ
సంగతిగా రతిఁ గూడి చన వియ్యఁగా
చెంగట శ్రీవెంకటేశ చేరఁగలమేలు చేరె
సింగారించి మీఁద మీఁద చెక్కు నొక్కఁగాను. ॥చెప్పరా॥ 129

సాళంగనాట

మేలు మేలు బాపు బాపు మెచ్చితి నిన్ను
తాలిమితో నున్నాఁడవు తగవరి వౌదువు ॥ పల్లవి ॥

యేకడనో వుంటి వట యే మేమో నేసితి వట
ఆకె నాతోఁ జెప్పినవి ఆ మాటలె
వాకున నాడ నోపక వాసితో నూరకుండితే
నీకు నీకె నవ్వేవు నెరజాణ వౌదువు ॥ మేలు ॥

మంతనా లాడితి వట మరికొన్ని గల వట
యింతి నాకు మొక్కినది యీ సుద్దికె
అంత నిన్నుఁ బచ్చి సేయ కట్టె అణఁచుకొంచే
దొంతి [1]వెట్టేవు సటలె దొరవు నీ వౌదువు ॥ మేలు ॥

వొరఁబరచితి వట వొక్క పై కూడితి వట
పదఁతి యొచ్చరించె నీ పనులకునె
తడవక నే నుండితె తలపించే వప్పటిని
అదరి శ్రీవెంకటేశ అంతవాఁడ వౌదువు. ॥ మేలు ॥ 130

రామక్రియ

ఏమగలతోడ నేల యేలాటాలు
కానుక లిచ్చె గుట్టు గనుకొనేను ॥ పల్ల ॥

---

1. "వెట్టేవ్వ" అని వ్రాసి "వెట్టేవు" అని తిద్ది యున్నారు.

రమ్మన నేఁటికి నిన్ను రాకు మన నేఁటికి
  వుమ్మడి నుండెదె నీ వోజ చూచేను
  సమ్మతించఁగా నెట్టొ జగడించఁగా నెట్టొ
  నిమ్మపంటిచేతితోడ నివ్వెర గందేనూ ॥ ఏనుగల ॥

నవ్వు నవ్వ నేఁటికి నాలితన మేఁటికి
  దవ్వులనుండె నీ తమి చూచేను
  వువ్వు లనఁగా నెట్టొ పూఁప లనఁగా నెట్టొ
  మువ్వంక సాసముత్యాల ముగ్గులు వెట్టేను ॥ ఏనుగల ॥

వొడఁబరచ నేఁటికి వోప నన నేఁటికి
  కదలేనిమోహముతోఁ గాఁగిలించేను
  వదుమనె కూడితివి నమ్మించి శ్రీవెంకటేశ
  చిదుముడి నుంగరాలచేతఁ జెక్కు నొక్కేను. ॥ఏనుగల॥ 131

నాదరామక్రియ

మన మెఱిఁగినవె మాయ లిన్నియును
  వెనకసుద్దు లెంచితె వేవేలుఁ గలవూ ॥ పల్లవి ॥

మొగము చూచితిఁ గా మొక్కితిఁ గా నీకు నిట్టె
  జగడా లింకా నేల చాలించు
  తగవు చెప్పకు మింక తడవ నే నా సుద్ది
  వగ లెన్నైనాఁ గలవు వడిఁ దప్పించుకోనూ ॥ మన ॥

నెలవి నవ్వితిఁ గా చెప్పినట్టె వింటిఁ గా
  చలము లింకా నేల చాలించు
  బలిమి నేయకు మింక పంతము లిచ్చితి తొల్లె
  వలపు రేచఁగఁ బోతే వసము గా దిఁకనూ ॥ మన ॥

కన్నుల మెచ్చితిఁ గా కాఁగిట నించితిఁ గా
  సన్నలు చాయలు నీకేఁ జాలించు
  వున్నతి శ్రీవెంకటేశ వొద్ది కైతి నీతోను
  వన్నెలు వాసులు నెంచ వలెనా యిందులోనూ. ॥ మన ॥ 132

323-వ రేకు ముఖారి

ఎంత కెంత సేసేవు యే
చింత దీర నాతనిపైఁ జెయి వేయ వమ్మా ॥ పల్లవి ॥

చేతిమీఁది చెక్కి- దేల చెలువుఁడు వేఁడుకొనీ
ఆతనిమాటలు కాని మ్మన వమ్మా
రాతిటనుంటియు జాగరములె సేయఁగఁ బట్టె
యీ తరుణులఁ జూ చైన యియ్యకొన వమ్మా ॥ ఎంత ॥

కొప్పు ముడువ వి దేల కోపము దీర్చె నాతఁడు
చెప్పిన ట్లల్లా నిఁకఁ జేయ వమ్మా
తెప్పలు రిచ్చవడె మీ తేసు లెల్లాఁ జూచి చూచి
చిప్పిల నీ నవ్వులనె సేసవెట్ట వమ్మా ॥ ఎంత ॥

వట్టి మోనా లిఁక నేల వాఁడె సరసము లాడీ
పట్టినచలము మాని పలుక వమ్మా
యిట్టె శ్రీవెంకటేశుఁ డితఁడు గూడె నిన్ను
నెట్టుకొని రతుల నిన్నిటా మెచ్చ వమ్మా. ॥ ఎంత ॥ 133

దేసాళం

ఏమి చూచుకున్నాఁడవో యెఱఁగ నేను
కామించి నీ మన్ననలో కడమలూఁ గానము ॥ పల్లవి ॥

దవ్వుల నుండిననన్ను దగ్గరఁ బిలుచుకొంటే
చివ్వన నీకు మేలు చేరదా నేఁడు
రవ్వగా నీ కొలువులో రాజసమె చూపఁగాను
యివ్వల నవ్వల నీవు యేమి గట్టుకొంటివి ॥ ఏమి ॥

దట్టపువిరహి నన్నుఁ దప్పక చూచితేను
అట్టె దయ గలవాఁడ వని మెచ్చనా
గుట్టుతోడ నిందరిలో కొంచి కొంచి నవ్వఁగాను
యెట్ట నెదురుకట్ల నెందు కెక్కెఁ బనులు ॥ ఏమి

యింటిలో నుండిననన్ను యిటు నీవు గలసితే
జంట పై పొందులు నేయ జాణవు గావా
అంటితివి శ్రీవెంకటాధిప తెరలో నన్ను
వెంట వచ్చి కూడితివి వింత లాయఁ జేఁతలు. ॥ ఏమి ॥ 134

సామంతం

కందము నీ సరితలు కరదాఁకాను
యిందరిలో నన్నమాఁట లేల బొంకే వీఁకను ॥ పల్లవి ॥

పంతగాఁడ వౌదువు పదఁతి నింత యెంచితి
వంత నీకుఁ బెద్దరిక మైతేఁ జాలు
వంతు లాడేవు పిలువ వచ్చినమాతోనె నీవు
యింత గుండెవాఁడ వైతే నెటు వొయ్యీఁ బనులు ॥ కందము ॥

నేరుపరి వౌదువు నెలఁతఁ బాసి వుంటివి
ఆరయ నీ కింత చవు లైతేఁ జాలు
చేరువకు వచ్చి లో లో సిగ్గు వదే వప్పటిని
యీ రీతి నుండితేఁ జాలు నీదేరె మోహము ॥ కందము ॥

మంచివాఁడ వౌదువు మగువఁ గూడితి విట్టె
అంచెల నీ కిదే పని యైతేఁ జాలు
మంచిన శ్రీవెంకటేశ మొదలె యి ట్టుండ రాదా
యెంచేము నీ గుణములు యే మాయ నిపుడు. ॥కందము॥ 135

శుద్ధవసంతం

వేవేలు జాగు లిఁక విడవయ్యా
యీ వేళ నాకుఁ జన వియ్యవయ్యా ॥ పల్లవి ॥

శిర నేల వంచేవు సిగ్గు లేల పెంచేవు
సొరిది మా వంక నిటు చూడవయ్యా
మరిగి యున్నదాన మాయ లెల్ల విన్నదాన
యిరవు సేయఁగ నిఁక నేఁటి కయ్యా ॥ వేవేలు ॥

యేఁద పరాకై వున్నాఁడ వేమి దలఁచుకొన్నాఁడ
వాదఁగలమాట లెల్ల నాడవయ్య
మేడెపువల పిదివో మెత్తనిపర పిదివో
వాడిక నీమేలు నాపై వంచవయ్యా ॥ వేవేలు ॥

చెక్కు లేల నొక్కేవు చెంది యేల చొక్కేవు
పక్కన యింటిలోనికిఁ బదవయ్యా
యిక్కువ శ్రీవెంకటేశ యెనసితి వింకా నాస
నిక్కి నాకు నన్నిట్టె మన్నించవయ్యా. ॥ వేవేలు ॥ 136

ఆహిరి

వలపులె కాఁడి పారి వరుస నిద్దరికిని
నిలువుఁదమకములు నీవే యెరుఁగుదువూ ॥ పల్లవి ॥

యెన్నఁ డొకో నీవు నన్ను యెనసి మన్నించేది
చన్నుల నే నిన్ను నొత్తి సాధించేది
వున్నదాన మేడమీఁద నొంటి నేఁ బొడవునను
సన్న నేసేవు నీవైతే సారెకు దిగువను ॥ వలపులె ॥

[1]యెప్పుడొకో నామేను యిటు నీ మేను సోఁకేది
అప్పటి నే మారుకు మా రప్పళించేది
కప్పురపుబాగాలు కట్టివేసితిని నీపై
నెప్పున నందుకొంటివి నిచ్చె నెక్కి నీవూ ॥ వలపులె ॥

యేవేళకో నా మంచ మెక్కి నీవు గూచుండేది
తావుల నేనె నిన్ను దక్కఁ గొనేది
శ్రీవెంకటేశ్వర నిన్ను చేవట్టి యెక్కించుకొంటి
మోవి యిచ్చి కూడితివి ముచ్చటతో నీవూ. ॥ వలపులె ॥ 137

కన్నడగౌళ

నీ మేలులోనిదాన నీవు మన్నించేటిదాన
దోమటి నన్నియు నీ చేతుల నున్న వీఁకను ॥ పల్లవి ॥

1. "యెప్పుడు" అని వ్రాసి "యెప్పుడొ" అని తిద్ది యున్నారు.

నేస వెట్టి నవ్వినట్టిచెలియను నేను నాకు
ఆసలు రేఁచితి విఁక నలయించకు
వాసితో నీ వే మనినా వద్దనేటిదానఁ గాను
దోసముఁ బుణ్యము నీ చేతుల నున్న విఁకను ॥ నీమేలు ॥

యిల్లాల నయినయట్టి యిచ్చకురాల నా
వుల్లము దెలుసుకొంటి వొరసితివి
వెల్లవిరి నీ వెటున్నా వెంగె మాడేదానఁ గాను
తొల్లిటిబాసలు నీ చేతుల నున్న విఁకనూ ॥ నీమేలు ॥

పట్టపుదేవిని నాపంత మెల్లా నీడేరించి
జట్టిగొంటివి నామాట సమ్మతించితి
గుట్టుతో శ్రీవెంకటేశ కూడితివి వింతగాను
తొట్టి నా భోగము నీ చేతుల నున్న దిఁకనూ. ॥ నీమేలు ॥138

324-వ రేకు సాళంగనాట

జయ మాయ నీకు నాపె సరసములూ
నయగారి ముడియమునారసింహా ॥ పల్లవి ॥

మోము చూచి నీతోడ ముచ్చట లాడ వలసి
కోమలి నీ తొడమీఁదఁ గూచున్నది
ఆముకొని అట్టె మాట లాడ వయ్య ఆపెతోడ
నామాట విని యిట్టె నారసింహా ॥ జయ మాయ ॥

మన్నన నీ యలుకల మంకు దెలుప వలసి
చన్ను లురమునఁ బెట్టి సత మైనది
చెన్నుఁడ వాపె చనవు చెల్లించ వయ్య యిట్టె
న న్నడిగే దింకా నేమి నారసింహా ॥ జయ మాయ ॥

చేతుల నిన్ను నలమి చెక్కుఁ జెక్కుఁ గదియించి
నీతితో నీ మెడనొ మ్మై నెలకొన్నది
యీతల శ్రీవెంకటాద్రి నెనసితి వాపెతోడ
నా తలఁపు లీడేరించి నారసింహా. ॥ జయ మాయ ॥ 139

వరాళి

చెప్ప నే మున్నవి నీ నేసెటిచేఁతలు
 అప్పటి కప్పటివేళ అను వింతే కాకా ॥ పల్లవి ॥

చేరి మొక్కఁగా నీవు సెలవి నవ్వేవు గాక
 వూరకుండవా నీయంత నొగి నిందాఁకా
 యేరీ తని యాడ వచ్చు నిటువంటి నీ చిత్తము
 వారికి వారికి భాగ్యవశ మింతే కాకా ॥ చెప్ప ॥

చెనకఁగా నీ వంతలో చిమ్మి రేఁగే వింతే కాక
 తనిసి గుట్టున నుంటేఁ దడవేవా
 ఘన మైన నీ మహిమ కానఁగ నెట్ల వచ్చు
 గొనకొన్న నీ యిచ్చకొలఁదే కాకా ॥ చెప్ప ॥

బలిమి గూడఁగా నీవు పైకొంటి విపుడె కాక
 తెలుసుకొంద మ నెంటే తేటపడేవా
 నెల వై శ్రీవెంకటేశ నిచ్చలించ నెట్టు వచ్చు
 కులికెటి నీ వలపు కొలఁదే కాకా. ॥ చెప్ప ॥ 140

శంకరాభరణం

బడిబడిఁ [1] దిరిగాడీ బాలకృష్ణుఁడు
 యెడయనిజాణ గదె యీ బాలకృష్ణుఁడూ ॥ పల్లవి ॥

సొక్కుచు సోలుచు వచ్చి సుదతులు యెత్తుకొంటె
 పక్కన నవ్వులు నవ్వీ బాలకృష్ణుఁడు
 యిక్కువకుఁ జేయి చాఁచీ నేడ నైనాఁ దొంగి చూచీ
 యెక్కుడు గామిడి గదె యీ బాలకృష్ణుఁడు ॥ బడిబడి ॥

చన్ను లంటి సారె సారె చవిగా ముద్దులు వెట్టి
 పన్నీఁ గదె మోహ మెల్ల బాలకృష్ణుఁడు
 సన్నలనె మొక్కు మొక్కీ సమ్మతిఁ బయ్యెద దీసీ
 యెన్నేసి నేరిచినాఁడె యీ బాలకృష్ణుఁడు ॥ బడిబడి

1. "దిరిగాడీవి" అని వ్రాసి "వి" చెరిపి "దిరిగాడీ" అని తిద్ది యున్నారు.

నిండుఁగాఁగిట నించి నేరుపులు పచరించి
బందుమాట లాడీఁ గదె బాలకృష్ణుఁడు
అందనె శ్రీవెంకటాద్రి నాయ మెరిఁగి తాఁ గూడె
యెంద నీడ కన్నులతో నీ బాలకృష్ణుఁడూ. ॥ బడిబడి ॥ 141

రామక్రియ

ఊరకె గుట్టున నీఁక నుండవయ్య
యే రీతి కైనా వచ్చు యీ చేఁత లయ్యా ॥ పల్లవి ॥

కన్నుల నీవు నవ్వితె గక్కనఁ గోపము వచ్చీ
వున్నతిఁ జలము రేఁచ కుండవయ్య
వన్నెలు వాసులతోడ వడి బతికేవారము
నిన్నువలెనా నేము నిలవయ్యా ॥ ఊరకె ॥

కొంగు వట్టే విట్టె నీవు కొలఁది మీరేను నేను
వుంగిటాయ సరసము ఉండవయ్య
కుంగనిబీరముల యెగ్గులపుట్టలము నేము
మెంగిలి కోరుతువు నిన్నె మనేమయ్యా ॥ ఊరకె ॥

బలిమి సేసేవు నీవు పంతము లెక్కె నాకు
వొలిసిన వెల్ల నాయ వుండవయ్య
కలసితి విట్టె నన్ను కాఁగిట శ్రీవెంకటేశ
చెలిమి మనకు నేఁడు చెల్లునయ్యా. ॥ ఊరకె ॥ 142

నాదరామక్రియ

ఇద్దరు నున్నారు యెదురెదురనె మీరు
బద్దులు మీతో నాడఁ బని [1]లేదు మాకు ॥ పల్లవి ॥

నెలవి నవ్వినవ్వు సిగ్గులకు మొదలాయ
పలుక దందుకె నీతోఁ బలుమారును
నెలఁత నెచ్చరించేది నీ చేతిదె యిఁక
బలిమి సేయఁగ మాకుఁ బని లేదు యిఁకను ॥ ఇద్దరు ॥

1. "లేదా" అని వ్రాసి "లేదు" అని దిద్ది యున్నారు.

చెక్కునఁ బెట్టినచేయి చేఁతలకు మూల మాయ
చక్కఁగా నందుకె నిన్ను సారెఁ జూడదు
నిక్కి యాపె బుజ్జగించ నీ చేతిదె యిఁక
చిక్కించుక నేము బుద్ధి చెప్పఁ బని లేదు ॥ ఇద్దరు ॥

మించినవూరుపు లెల్ల మోహానకె తగు లాయ
పంచల నందుకె నిన్నుఁ బాయ నోపదు
కొంచక శ్రీవెంకటేశ కూట మిది నీచేతిదె
మించి యప్పటి నేల మెచ్చేరు చెలులు. ॥ ఇద్దరు ॥ 143

బౌళి

తానె యెఱుఁగుఁ గాక తరవాతి చేఁతలు
పీనుల మా బుద్ధు లిఁక వినేవా నీ వయ్యా ॥ పల్లవి ॥

పైకొని చెలియ నీకుఁ గానుక వట్టు కుండఁగ
యేకదో పరా కై వుంటి విందాఁకను
సాకిరి వెట్టెను న న్నీ సరితలు చూడు మంటా
యీకడ నిన్ను నేమ యే మనఁగల నయ్యా ॥ తానె ॥

దగ్గరి విన్నపానకు తరుణి గాచు కుండఁగా
వొగ్గక వుంటివి తడ వున్నదాఁకాను
యెగ్గు వట్టి మాఁటు నేసీ నిటువంటివాఁడ వని
దిగ్గన నీ వోజలు దిద్దేనా నే నయ్యా ॥ తానె ॥

లోనికిఁ దీసి వి న్నింతి లోను నేసుకొనఁగాను
మోనాననే వుంటి వట మొక్కుదాఁకను
పూని శ్రీవెంకటేశ నీ పొందిక నాతోఁ జెప్పె
నే నవకున్న నంతేసి నేరవా నీ వయ్యా. ॥ తానె ॥

325-వ రేకు సామంతం

దగ్గర నున్నా నతఁడు తానె యెరుఁగును
వెగ్గళించకురె మీరు విచారించె నన్నియు ॥ ప

ఆస పడినట్టివాఁడు ఆయములె అంటుఁ గాని
వోసరించి గుట్టుతోడ నూరకుండఁడు
వాసితో నే నుండఁగానె వల పెల్లాఁ గాన వచ్చి
వేసరించకురె మీరు విచారించె నన్నియు ॥ దగ్గర ॥

సత మైనయట్టివాఁడు చనవులె యించుఁ గాని
రతికి నెక్కక వేరె రవ్వ సేయఁడు
తతి దప్పకుండఁగానె తగ వెల్లా నీదేరీ
వెత సేయకురె మీరు విచారించె నన్నియు ॥ దగ్గర ॥

చెక్కు నొక్కినట్టివాఁడు చెప్పినట్టె సేసుఁ గాని
తక్కించి వేరె తానుఁ దమకించఁడు
యిక్కు వెరిఁగి శ్రీవెంకటేశుఁ డిట్టె కూడె నన్ను
వెక్కసము [1]లాడకురె విచారించె నన్నియును. ॥ దగ్గర ॥ 145

**ముఖారి**

తమకించఁ దన కేలే తానే నేను
సమకూడేదానఁ గాక సాదించేదానవా ॥ పల్లవి ॥

చేసన్న చేసితి నింతే చెక్కులు నొక్కితి నింతే
వాసులు వంతుల కేల వచ్చినె తాను
రాసి కెక్కె తనమేలు రచ్చ కెక్కె చేఁత లెల్ల
ఆసపడేదానఁ గాక అడ్డ మాడేదానవా ॥ తమకించ ॥

కన్నుల నవ్వితి నింతే కాయము సోఁకితి నింతే
పన్ని నవారపు లేల పట్టినె తాను
యెన్ని కాయఁ దనపొందు యిర వాయఁ గోరికలు
మన్ననలోదానఁ గాక మారుకొనేదానవా ॥ తమకించ ॥

సిరసు వంచితి నింతే చేతుల మొక్కితి నింతే
కెరలి న న్నేల గిలిగించినె తాను
యిర వై శ్రీవెంకటేశుఁ డిన్నిటాను నన్నుఁ గూడె
పెర రేఁచేదానఁ గాక బిగినేటిదానవా. ॥ తమకించ ॥ 146

---

1. "లాడుకురె" అని వ్రాసి "లాడకురె" అని తిద్ది యున్నారు.

రామక్రియ

కైవసమై తనకు నేఁ గలదానను
తావుల నా మన సెల్ల తా నెఱుఁగునే ॥ పల్లవి ॥

పెక్కుసతులు గలిగి పెద్దగా బదుక నీవే
చొక్కపుఁగన్నుల దన్నుఁ జూచేఁ గాని
యిక్కువ నందరి సొమ్ము లెల్ల ధరించుకో నీవే
చక్కఁగా నేఁ బెట్టినంత సంతోసమూ ॥ కైవసమై ॥

వియ్యా లంది వీడుకూళ్ల వేమారుఁ గుడువ నీవే
వొయ్యనె తనకు లోనై వుండేఁ గాని
పయ్యాడినవారిచేతి బాగా లందుకో నీవే
యియ్యకోలై ఆకు మడి చిచ్చేఁ గాని ॥ కైవసమై ॥

సమరతి నుపరతిఁ జల్లఁగా వెలయ నీవే
తమితో సేవలు సేసి దక్కేఁ గాని
అమర శ్రీవెంకటేశుఁ డట్టె నన్నుఁ గూడ నీవే
గుమి గూడి నేఁ గూడి గురియైతి నిపుడూ. ॥ కైవసమై ॥ 147

దేసాళం

కడవారి నీ మా టడుగవే నీవు
వెడగు నీ గుణములు విచారించుకొనవే ॥ పల్లవి ॥

నీసవతి నైతిఁ గాక నిన్ను నే మైనా నంటినా
వాసు లెక్కించుక వట్టివా దేలే నీకు
ఆసల నిద్దరికిని ఆతఁడే గురుతు గాక
రేసులు వుట్టించి యాల రేఁచేవే మమ్మును ॥ కడవారి ॥

తప్పక చూచితిఁ గాక తడవితినా నిన్ను
వుప్పటించి యంతేసి మ మ్మొరసేవే
తప్పులుఁ దాఢులు వాప తగ వాతఁడే యెఱుఁగు
చప్ప నాయ మానవే నీసట లెల్ల నీఁకను ॥ కడవా

తెలిసితి నన్నియు నీ తెరువు వచ్చితినా
చలము లిక్కడ నింక సాదించకువే
అలరి శ్రీవెంకటేశుఁ డన్నిటాను నన్నుఁ గూడె
పెలుచవు ని న్నెఱుఁగు పెనఁగ నేమిటికే. ॥ కదవారి ॥ 148

వసంతవరాళి

ఇదివో నా భాగ్యము యేమి చెప్పేనే
ముదముతోఁ దన కిట్టె మొక్కితి నే ననవే ॥ పల్లవి ॥

చుట్ట మైన యట్టివాఁడు సులభుఁ డై నట్టివాఁడు
దట్ట మై నా కిన్నిటాను తానే కదే
[1]పొట్టఁబొరుగున నుండి పొరచి వె ట్టంపి నేఁడు
గట్టిగా నింతకరుణ గలదు గా నాకు ॥ఇదివో॥

అంతరంగ మైనవాఁడు ఆయ మెరిఁగినవాఁడు
చెంతలఁ దానే అని చెప్పేఁ గదే
వంతులు వాసు లెంచక వాకిటికి వచ్చె నేఁడు
యింత మన్నించఁ దాఁ గాక యిఁక నెవ్వరే ॥ ఇదివో ॥

వహించుకొనేవాఁడు [2]వద్ద నిట్టె వుండేవాఁడు
విహరించ నా కిన్నిటా వెలసె తానె
వహి కెక్క శ్రీవెంకటవల్లభుఁ డితఁడే నన్ను
తహతహ దీరఁ గూడె తగవరి అవుఁ గదే ॥ ఇదివో ॥ 149

భైరవి

తొల్లే నీకంటే నే దొడ్డదాననా
బల్లిదుఁడ నీవే నన్ను పాలింతువు గాకా ॥ పల్లవి ॥

చిత్తము రా నీకు నే సేవ సేయఁ గలనా
సత్తగు నీ దయ నాపైఁ జల్లుదు గాక
నిత్తెము నిన్ను మెప్పించ నేరుతునా యే మైనా
కొత్తగా నన్నిట్టే దిద్దుకొందువు గాకా ॥ తొల్లే ॥

1. "పొట్టఁబొరుదున" అని వ్రాసి "పొట్టఁబొరుగున" అని తిద్ది యున్నారు.
2. "వద్దట్టె" వ్రాసి "ద్ద-ట్టె" లకు మధ్య "ని" యిరికించి చెక్కి యున్నారు.

యిట్టి దని నీ మహిమ యెరుఁగుదునా నేను
నెట్టన బుద్ధి చెప్పి మన్నింతు గాకా
వొట్టి నీకు విన్నవించ నోపఁ గలనా నేను
వట్టి నీవే [1] తెలుసుక పయికొందువు గాకా ॥ తొల్లే ॥

కందువ లెరిఁగి నిన్ను కాఁగిలించఁ గలనా
అందాలు నేసుక నీవే అంటుదు గాక
యిందుకే శ్రీవెంకటేశ యియ్యకొని కూడితివి
మందలించఁ గలనా మరుగుదు గాకా. ॥తొల్లే॥ 150

326-వ రేకు సాళంగనాట

రచ్చలఁ బెట్టక యిట్టే రావయ్యా
గచ్చులు మాని యిన్నీఁ గనుకోవయ్యా ॥ పల్లవి ॥

పంతము దప్పదు నీతోఁ బలికినమాత్రమున
వంతుకుఁ జెలి కిందులో వాసి వోదు
యింతిచేత నేఁ జెప్పించేయెదమాట లీద నేల
వింతల నీ సుద్దు [2] లిందే వినుకోవయ్యా ॥ రచ్చల ॥

సూటి దప్ప దింతలోనే చూచినమాత్రమున
ఆఁటదాని కిందుకుఁగా నాస వోదు
కూటమి నాపెచేత గురుతులు పట్టింపించే
దీఁట నైనా నాచేఁతలు తెలుసుకోవయ్యా ॥ రచ్చల ॥

ఘనత లేమీఁ దప్పదు కాఁగిలించినంతలోనే
పెనఁగించె ఆపెచేత పెరిమె వోదు
చెనకి కూడితి విట్టే చేరి శ్రీవెంకటేశుఁడ
మన సిచ్చి రక్షించి మన్నించుకోవయ్యా. ॥ రచ్చల ॥ 151

గౌళ

ముంచి ని న్నే మనఁ జాల మొక్కే మయ్యా నీ
మంచితన మెల్లఁ గంటి మరఁ గే లయ్యా ॥ ॥

1. "తెలుసుక్క" అని వ్రాసి "తెలుసుక" అని దిద్ది యున్నారు.

2. "లిందే" అని వ్రాసి "లిందే" అని దిద్ది యున్నారు. ("ద"
సున్న తీసివేసినారు.)

యేకతాన నే నిన్ను నే మంటినో యంటా
ఆకడఁ జెలులతోడ నాడుకొనేవు
చేకొలఁది వైన నిన్నుఁ జేసినచేఁతలు మరి
రాకల పోకల నింత రచ్చ వేతురా ॥ ముంచి ॥

తరితీపులను నీపైఁ దమకించితి నంటా
యిరుగుపొరుగు లేల యెరిఁగించేవు
సరసుఁడ వైన నిన్ను చనవునఁ గొసరితే
విరివి గొనుచు వెల్లవిరి సేతురా ॥ ముంచి ॥

[1] గెంటక పెనఁగేవేళ గిలిగించితి నంటా
యింటివా రెల్ల వినఁగ నేల నవ్వేవు
జంట వై శ్రీవెంకటేశ సరి నన్నుఁ గూడితివి
నంటుతమకము లింత నాన వేతురా. ॥ ముంచి ॥ 152

## వరాళి

ఏ మని చెప్పుదు మయ్య యీాపె వలపు
నీ మేని రతులఁ జొక్కి నేర మెంచీ నిపుడు ॥ పల్లవి ॥

అద్దము చూచి చెలి యంతలోనే నవ్వు నవ్వి
గద్దరిచూపుల నీ మొగము చూచెను
యిద్దరుఁ గూడి యున్నప్పు డెరఁగ దాయనో కాని
చద్దిగురుతులకే సాధించీ నిపుడు ॥ ఏ మని ॥

పొలిఁతి బాగా లందుక పుక్కిట నీ విడినట్టి
తొలుతటితమ్మ చూచి తల వంచెను
కలసినప్పటివేళ గతు లె ట్టుండెనో కాని
సొలసి యందుకుఁ గానె సూడు వట్టీ నిపుడు ॥ ఏ మని ॥

పవళించఁ బోయి నీవే పర పయి వుండఁగఁ జెలి
జవళిపేడుకలకు సంతసించెను
యివల శ్రీవెంకటేశ యే మని మెచ్చెనో కాని
కవ గూడి మన్ననల కడు మించీ నిపుడూ. ॥ ఏ మని ॥ 153

1. "గెంటక్క" అని వ్రాసి "క్క" చెరిపి "గెంటక" అని తిద్ది యున్నారు.

## శ్రీరాగం

బలిమి సేయకురే పట్టి పెనఁగకురే
పొలసి పోయివచ్చినాఁడు పోనియ్యఁ గదరే ॥ పల్లవి ॥

కొసరే మా మాటలు కూరిములో తేటలు
నసలు నేఁ డిం పౌనా నాఁడే కాక
వస మైనాఁ డెవ్వతెకో వలసీ నొల్లము లీడఁ
బొసఁగీనా వాని [1]కట్టై పోనియ్యఁ గదరే ॥ బలిమి ॥

రవ్వల మా పిలుపులు రాయిడించే పొలపులు
నవ్వులు నేఁ డిం పౌనా నాఁడే కాక
యెవ్వ తాస యిచ్చినదో యింతకు నేరఁడు తొల్లి
పువ్వువంటిది వలపు పోనియ్యఁ గదరే ॥ బలిమి ॥

తనివోనిరతులును తలపోఁతమతులును
ననుపు నేఁ డిం పౌనా నాఁడే కాక
యెనసెను శ్రీవెంకటేశుఁ డింత నేసి నన్ను
పొనిగి పోయినసుద్ది పోనియ్యఁ గదరే. ॥ బలిమి ॥ 154

## ముఖారి

అప్పుడే బలిమి సేసే వందు కేమి
చిప్పిలఁ బనివనిగాఁ జెప్పర నాతోను ॥ పల్లవి ॥

వోప నంటాఁ బెనగఁగ వొడివట్టి తియ్యకురా
కోపపుఁజూపులు కనుఁగొనేవారము
చేపట్టి తీదీపులను చేయి దాఁకుఁ గాలు దాఁకు
ఆఁపి మాట మాటగాఁనె ఆదరా నాతోను ॥ అప్పుడే ॥

పెదమర లుండఁగాను పేరునఁ బిలువకురా
వడి మురిపెముల గర్వపువారమూ
తడవఁగఁ బలుమారు తప్పు లానో వొప్పు లానో
నడుమ నవ్వు నవ్వుగ నవ్వరా నాతోను ॥ అప్పు

1. "కుట్టించిని" అని వ్రాసి "కట్టైపోని" అని దిద్ది యున్నారు.

పవళించి వుండఁగాను పైపైఁ బదేవ దేమిరా
 చివురుచేఁ గల గోరిచేతివారము
 యివల శ్రీవెంకటేశ యిట్టె కూడితివి నన్ను
 చవిగా ముద్దుముద్దుగాఁ జన వీరా నాకునూ. ॥ అప్పుదే ॥ 155

కాంభోదమలహరి

ఇద్దరి మనసులు నేక మైనఁ గా
 కొద్దిక విరివో బొనరీనా ॥ పల్లవి ॥

చెలువుఁడు యేమో చింతించఁగ నే
 కలయు మనుట సంగతు లౌనా
 వలవనియలపుతో వడఁబడి యుండఁగ
 యెలమి నేఁ జెనకు టిం పవునా ॥ ఇద్దరి ॥

అదె పొడిఁ బడి పతి యసు రుసు రనఁగా
 పదరి నేఁ బిలుచుట పాడి యౌనా
 నిదురమోముతో నెరి విరి గుండఁగ
 గుదిగొని నేఁ బైకొనఁ దగవా ॥ ఇద్దరి ॥

తమకించి యతఁడు దవ్వుల నుండఁగ
 జమళిఁ గలయఁ బోతే సర వెవునా
 తిమిరి శ్రీవెంకటదేవుఁ డతఁడె నను
 ప్రమదమునఁ గలసెఁ బాసీనా. ॥ ఇద్దరి ॥ 156

327-వ రేకు శంకరాభరణం

కోపము దీరినమీఁదఁ గూడేవు గాక
 కైపుగ నీ వొళ్లిదె కల్ల యనవయ్యా ॥ పల్లవి ॥

యే మంటివో కాని యింతి గడుఁ జిన్నఁ బోయ
 వేమారు నలుక దీర వేఁడుకోవయ్యా
 ప్రేమతో బలిమి నేసి పెనఁగి యేమి నేసితో
 వాములుగఁ దిట్టుకొనీ వ ద్దనవయ్యా ॥ కోపము ॥

యింతిచిత్తము నొవ్వఁగ యెవ్వరిదిక్కు చూచితో
అంతలోఁ దల వంచె లే దనవయ్యా
అంతటఁ బోక నీవు అట్టె యేమి నవ్వితివో
చింతతో లోనికిఁ బోయీ చేరి పట్టవయ్యా ॥ కోపము ॥

మితి యేమి మీరితివో మెలుఁత నిట్టూర్పు నించె
చతురతఁ గూరిములు చల్లవయ్యా
తతితో శ్రీవెంకటేశ దగ్గరి కూడితి వాకె
రతి నలసెను మోవిరస మియ్యవయ్యా. ॥ కోపము ॥ 157

దేసాళం

ఏల మమ్ముఁ జెనకేవు యెద్దవా నీవు
వేలఁ జూపేరు నిన్నునె వినుకొన రాదా ॥ పల్లవి ॥

యేరా మా కస్తురిబొట్టు యె ట్టుండె నేమి నీకు
గోర దిద్ద వచ్చేవు కూళవా నీవు
గారవపు నీ మేనఁ గస్తురిరేక లవిగో
తేరకొన వంక లెల్ల దిద్దుకొన రాదా ॥ ఏల ॥

చెల్లఁబో నా హారములు చిక్కువడితే నేమి
మల్లాడి దిద్ద వచ్చేవు మంకవా నీవు
చిల్లా పొ ల్లాయ నీ మెయిఁ జెమటము త్తెము లెల్ల
పెల్లు రేఁగి నీవె చక్కఁబెట్టుకొన తాదా ॥ ఏల ॥

చనుఁగొంగు జారె నంటాఁ జక్క దొబ్బ వచ్చేవు
చనవున నన్నిటాను జాణవా నీవు
చెనకి కాఁగిలించితి శ్రీవెంకటేశ నీవు
ననిచి నీ పచ్చడము నాకుఁ గప్ప రాదా. ॥ ఏల ॥ 15

సామంతం

వలపు చప్పఁ జేసెటివగకాఁడ నీ
బలిమి నా మనసుకుఁ బల్ల కట్ట వలెనా ॥ పల్లవి

పలికేవు కమ్మటిని పరాకు నయ్యేవు
అలిగినాఁ బోనీవు ఆదేరా నీవు
పిలిచితే వచ్చినది పెనుఁ దప్పు నావొళ్లఁ
గలదు నీ వింక నన్నుఁ గాకు సేయ వలెన ॥ వలపు ॥

పైపైఁ గొంగు వట్టేవు పరులతో నవ్వేవు
వోప నన్నుఁ బోనీవు వోరి నీవూ
పాప మింతే నీవు సేసే భ్రమకు లో నయినది
యేపున నెంతైనాఁ గద్దు యింత సేయ వలెనా ॥ వలపు ॥

యిచ్చగించి కూదేవు యే మేమో తలఁచేవు
హెచ్చి మూల నుండనీవు యేరా నీవూ
అచ్చపు శ్రీవెంకటేశ అన్నిటాను నిన్నుఁ గూడి
మెచ్చినదె మే లాయ మేకు సేయ వలెనా. ॥వలపు॥ 159

సాళంగనాట

పొద్దు వోదా తన కేమి పోరు వెట్టి వేగి లేచి
ఉద్దండీఁడు తన కేమి వూరకుండఁ బట్టదా ॥ పల్లవి ॥

యెప్పటి కుత్తర మిచ్చే దప్పుడే యిచ్చేఁ గాక
యిప్పటనుండియు మాట లేలే నాకు
కప్పి నిజ మాడు మంటా కమ్మర నానవెట్టీని
తప్పు లౌతా వొప్పు లౌతా తా నెరఁగఁడా ॥ పొద్దు ॥

చేయవలసినప్పుడే చేయి ముంచి చేసేఁ గాక
యీ యెడ నుండియుఁ బంతా లేలే నాకు
ఆయ మంటి వేగిరించినప్పుడె తనకుఁ దానే
కా యౌతా పం డౌతాఁ గనీఁ గాకా ॥ పొద్దు ॥

దగ్గరితి మిద్దరము తరవాయి వచ్చీఁ గాక
యెగ్గులు నెమ్మలుఁ బట్టనేలే నాకు
బిగ్గన శ్రీవెంకటాద్రిపతి నన్నుఁ గూడె నింక
ముగ్గుపిండి అట్లకు మొద లయ్యానా. ॥ పొద్దు ॥ 160

కేదారగౌళ

అన్నియు నేరుచుకొన్నాఁ డలవాటే యాతనికి
యెన్ని యైనఁ గల విట్టే యింటి కింక రావే ॥ పల్లవి ॥

వట్టిమాకు లిగిరించు వాఁడు మాట లాడితేను
యిట్టె నన్నుఁ గరఁగించు టేమి సోద్యమే
వెట్టికి వింటేఁ జాలు వేగుదాఁకఁ జెప్పీఁ దాను
బట్టబయ లీఁద నోపఁ బదవే మాయింటికి ॥ అన్నియు ॥

ఱాతికి గిలిగింత లౌ అట్టడివానిచేఁతల
యీతల నన్ను నవ్వించే దేమి సోద్యమే
చేతికి లో నైతేఁ జాలు సేయఁగల ట్టెల్లాఁ జేసి
పోతరించి వున్నవాఁడు పోదమే మా యింటికి ॥ అన్నియు ॥

యేరు లైన నెదు రెక్కు యిట్టి పీనిఁ బొదగంటే
యీరీతి మనము వచ్చే దేమి సోద్యమే
చేరి నన్ను నిటు గూడె శ్రీవెంకటేశ్వరుఁడు
ఆరెఁ దేరెఁ బిలువవే ఆతని మాయింటికి. ॥ అన్నియు ॥ 161

లలిత

చక్కని యీ వెన్నుఁడూ సంబటూరి చెన్నుఁడూ
అక్కడ నిక్కడ చూపి ఆసలు రేఁచీని ॥ పల్లవి ॥

చెన్నునిఁ జూడఁ గదరే చెలులాల నేఁడు
చిన్ని లేనవ్వులనె చెలరేఁగీని
సన్నలు నేసీ వాఁడె సటకాఁడు నాతో
యెన్నటి కెన్నటి పొందు యిపుడే రేఁచీని ॥ చక్కని ॥

యే మనీనె చెన్నుఁడూ యేకతాన నన్నునూ
దోమటివావులు నాపైఁ దొరలించీని
కోమలపు చేయి చాఁచీ కొత్తపెండ్లికొడుకు
గామిడితనాల నన్నుఁ గాఁకలు రేఁచీని ॥ చక్కని ॥

శ్రీవేంకటాద్రిమీదఁ జేరి కూడెఁ జెన్నుఁడు
భావించి పచ్చడము పైఁ గప్పిని
మోవి చూపీఁ గమ్మటి మొక్కఁ-శీఁడు వీఁడు
దేవుఁడు గదవే వీఁడు తీపులు రేఁచీని. ॥ చక్క-ని ॥ 162

328-వ రేకు మధ్యమావతి

చెనకితే బిగియఁగఁ జెల్లదా నేఁడు
జినుగుసిగ్గుల నవ్వు చెల్లదా నీకూ ॥ పల్లవి ॥

కాయ మట పాయ మట కదు వలచితి నట
నేయఁగల ట్టెల్ల నీకుఁ జెల్లదా నేఁడు
నాయంతనె వచ్చెనా నాతుల కిదె చాలు
చేయి మీఁ దాయను నేఁడు చెల్లదా నీకు ॥ చెనకితే ॥

కలి మట బలి మట కదిసి నవ్వే వట
చెలఁగి నీ వే మన్నఁ జెల్లదా నేఁడు
చల మెన్నఁటికె యిఁక సాదించవలెఁ గాక
చెలరేఁగి మాటలాడఁ జెల్లదా నీకు ॥ చెనకితే ॥

యి ల్లట మంచ మట యేకత మిదే యట
చెల్లఁబో యేమి నేసినఁ జెల్లదా నేఁడు
కొల్లగా శ్రీవేంకటేశ కూడితివి నన్ను నిట్టే
చిల్లరపొందులు మానఁ జెల్లదా నీకూ. ॥చెనకితే॥ 163

సాళంగనాట

దేవ నీ చెలువములోఁ దిర మై మిక్కిలి నీ
దేవి చెలువము దెచ్చెఁ దేటతెల్లమిగాను ॥ పల్లవి ॥

గరిమ నీ వురము కౌస్తుభమాణికముతో
సరి దూఁగి యెక్కు-డాయ సతిమణి
వరుస నీదు బాహువల్లుల నడుమను
పెరిగి నీ లలితాంగి పెద్దరిక మందె ॥ దేవ ॥

నీలమేఘమువంటి నీ మేనికాంతికి
మేలిమివన్నె దెచ్చె మెరుఁగుఁబోఁడి
[1] పోలింప నీదు తమ్మిబొడ్డుకంటెఁ బొడవున
కాలు దొక్కి నిలిచెను కమలాలయ ॥ దేవ ॥

అదివో నీ బంగారుహారముల నడుమను
పొదిబంగారై నిలిచె పుత్తడిబొమ్మ
పొదిగి శ్రీవెంకటేశ భోగించె నీ కాఁగిటికి
అదనఁ బుట్టుభోగాయ నలమేలుమంగ. ॥ దేవ ॥ 164

సామంతం

ఈపాటివాఁడవు యేల కోపగించితివి
చేపట్టినటులానె సేయ రాదా ॥ పల్లవి ॥

చెక్కు నొక్కకుర నీవు చేయి చాఁచకుర నాపై
చక్క నీ మంచితనాలు చాలుఁ జాలు
పక్కనఁ గోపించ వద్దు పైకొని వేఁడుకో వద్దు
వొక్కమారె యింతేసికి నోపను నేను ॥ ఈపాటి ॥

కాలు దొక్కకుర నీవు కమ్మటి నవ్వకు నాతో
జాలి నీ [2] యిచ్చకములు చాలుఁ జాలు
తాలిమిఁ దిట్టా వద్దు దగ్గరి మొక్కా వద్దు
మేలు మీఁదనె వుండే మేరతో నడవరా ॥ ఈపాటి ॥

మాటలాడకుర నీవు మాయలు సేయకురా
చాటు వాయ నీ వలపు చాలుఁ జాలు
గాఁటపు శ్రీవెంకటేశ కరఁగించి కూడితివి
మేటి నీ గుణములకు మెచ్చితి నే నిదివో. ॥ ఈపాటి ॥ 165

సామంతం

తా నేల నిలుచున్నాఁడు తడవుల నుండీని
పానిపట్టి చెలులాల పద మనరే ॥ పల్లవి ॥

---

1. "పోలింపె" అని వ్రాసి "పోలింప" అని దిద్ది యున్నారు.

2. "యిచ్చకములుంచాలు" అని వ్రాసి "ం" ను చెరిపి "యిచ్చకములుచాలు" అని దిద్ది యున్నారు.

మనసు రాని తలఁపు మాటలోనె కాన వచ్చు
పెనఁగి యప్పటి వీఁడు పిలిచీఁ గొంతా
ననుపు గల దెల్లాను నవ్వినందే తెలిసితి
పని గద్దు వచ్చేఁ గాని [1]పద మనరే ॥ తా నేల ॥

నెరమెచ్చువలపులు నిలిచినందే తోఁచె
సరసాన వీఁడె చేయి చాఁచీఁ గొంతా
కరుణ గల దెల్లాను కనుచూపులనె కంటి
పరిణామ మాయ నాకుఁ [2]బద మనరే ॥ తా నేల ॥

కలిగిన తమకము కాఁగిటిలోఁ గాన వచ్చె
అలరి తాఁ బెట్టుకొనీ అనలూఁ గొంతా
వెల లేని వేడుక శ్రీవెంకటేశుఁ డిటు గూడె
పలుకు లేఁటికి నిఁకఁ [3]బద మనరే. ॥ తా నేల ॥ 166

శంకరాభరణం

చెల్లఁ బో నాకె సుద్దులు చెప్పకువయ్య
పల్లదాన నీవు నీవే బదుకవయ్యా ॥ పల్లవి ॥

యేమయ్య నేము నీ కేమిటి కయ్యా
నేమాన నీ కిచ్చ లాద నేరనయ్యా
చే ముంచి యాపె కీ మేలు సేయవయ్యా
మోము చూచి సంతసించి మొక్కేనయ్యా ॥ చెల్లఁబో ॥

తలవయ్య మమ్ము నేల తడవేవయ్య
నెల వై నే నిజ మాడి నిష్టూరి నింతే
కెలసి యాకెనె బుజ్జగించవయ్యా
వలచి నే నెపుడు నీ వద్ద నుండే నయ్యా ॥ చెల్లఁబో ॥

చెల్లు నయ్య యే మైనాఁ జేయవయ్యా
యెల్లవారివలె నేమీ నెరఁగ నయ్యా
కొల్లగా శ్రీవెంకటేశ [4]కూడితివి నన్ను నిట్టె
తెల్లముగ నీ వెంటఁ దిరిగే నయ్యా. ॥ చెల్లఁబో ॥ 167

1, 2, 3. లలో "వద మనవే" అని వ్రాసి "పద మనరే" అని తిద్ది యున్నారు.

4. "కూడితివన్ను" అని చెక్కి "తి"న" లకుపైన హంసపాదివేసి "తి"న"లకు క్రింద "వి" చెక్కి "కూడితివినన్ను" అని తిద్ది యున్నారు.

సాళంగనాట

దూరఁ బోతేఁ గోపము దొరకు మక్కువ నుందు
వూరకే తోడుక రారే వొదఁబరచేనూ ॥ పల్లవి ॥

అవుఁ గా దనకురే ఆడినట్టే ఆడనీరే
యివల నేనే చెప్పే నిన్ని బుద్ధులు
తివిరి మీ రిందాఁకాఁ దెచ్చినదే మీపాలు
అవల నంతటిమీఁద నాతఁడు నాపాలు ॥ దూర ॥

చేచేతఁ బెనఁగకురే సేసినట్టే సేయనీరే
యేచి నేనే సేవ సేసే నీడుకు నీడు
కాచిన మ మ్మిద్దరినిఁ గదియించుట మీ పని
చూచి వానిఁ గరఁగించి చొక్కుట [1]నా పని ॥ దూర ॥

పంత మెట్టైనా వచ్చి బలిమి సేయకురే
మంతనాన మెచ్చు నేనే మంకు లెల్లాను
యింతలో శ్రీవెంకటేశుఁ డిదే కదే నన్నుఁ గూడె
వంతులే నీకుఁ జెల్లె వాసి నాకుఁ జెల్లె. ॥ దూర ॥ 168

329-వ రేకు ఆహిరి

ఇంతి యలిగితేఁ గన యెవ్వరి వసము గాదు
సంతసాన నవ్వేటి సతితోడ నగవూ ॥ పల్లవి ॥

యెక్కడ పరాకో యేమి భావించేవో
మొక్కేటిచెలిఁ గాఁగిట ముంచి యెత్తవు
మక్కువ నీకుఁ జాలదో మనసులోఁ గోపమో
నిక్కి చూచేసతితోడ నీ వేమీ ననవూ ॥ ఇంతి ॥

సిగ్గు వద్ద విధమో చెప్పేవారు లేకో
దగ్గరి యున్నసతితోఁ దమకించవు
నిగ్గుల రాజసమో నీ వొళ్లిగుణమో
[2]వెగ్గళించి పిలువఁగ వినియును వినవూ ॥ ఇ

1. "నాపాలు" అని చెక్కి చెరిపి "నాపని" అని తిద్ది యున్నారు.
2. "వెగ్ల" అని వ్రాసి "వెగ్గ" అని తిద్ది యున్నారు.

యేమి దలఁచుకొంటివో యీ వనిత భాగ్యమో
చే ముంచి సరస మాడి చెక్కు నొక్కేవు
కాముఁడు పెర రేఁచెనో కరుణ నీకుఁ బుట్టెనో
నేమపు శ్రీవెంకటేశ నీవే కూడితివి. ॥ ఇంతి ॥ 169

శంకరాభరణం

ఒంటి నున్న నన్ను వచ్చీ నో యమ్మా
వుంటవింట వేయు మనీ నో యమ్మా ॥ పల్లవి ॥

సుద్దు లవి విను మంటా సొరిదిఁ జెక్కులు ముట్టీ
వొద్దన్నా మానఁడే వో యమ్మా
గద్దించి యందుకు నేను కదు జంకించఁ బోతేను
వుద్దండపుమాట లాడీ నూరకే వో యమ్మా ॥ ఒంటి ॥

బది బది రమ్మంటాఁ బట్టఁ బట్టఁ బైకొని
వొడిసీ నా పయ్యదకు నో యమ్మా
[1] తడవకు మని నేను తన్ను నాన వెట్టితేను
ఉడికి తప్పక చూచీ నూరకే వో యమ్మా ॥ ఒంటి ॥

పనిమాలి నేఁడు తన పాదములు గుద్దు మంటా
వొనర బలిమి సేసీ నో యమ్మా
యెనసెను శ్రీవెంకటేశుఁ డిటువలె నన్ను
వుని కై నిలిచితిమి వూరకే వో యమ్మా. ॥ ఒంటి ॥ 170

వరాళి

పలుమారుఁ బెనఁగక పదవే నీవు
నిలుచున్నాఁ డెదుటనే నీ కెంత పగటే ॥ పల్లవి ॥

నెట్టుకొని రమణుఁడు నిన్నే తప్పక చూచీ
పట్టినచలము మాని పదవే నీవు
అట్టె దొర యాతఁడు నిన్నడిగే మాటల కెల్ల
యె ట్టైన నుత్తర మియ్య వెంత గుండే నీకు ॥ పలు ॥

1. "తడవకడవి" అని కాకోలు చెక్కి "కవి" ల మధ్య చెరిపి "తడవకు మవి" అని తిద్ది యున్నారు.

చేపట్టి పెనఁగీని చెలువపు నీ విభుఁడు
పైపయిఁ దప్పించుకోక పదవే నీవు
యేపున నాతఁడె నీయింటికి వచ్చి యుండఁగా
కోపము మానవు యేఁటి కొత్తలే నీవూ ॥ పలు ॥

చింత దీర నాతఁడు చిరునవ్వు నవ్వఁగాను
పంతాలు చెల్ల దింకఁ బదవే నీవూ
అంతలో శ్రీవెంకటేశుఁ డాదరించి నిన్నుఁ గూడె
యెంతటిదానవు నీవు యెదు రేదే నీకూ. ॥ పలు ॥ 171

## హిందోళవసంతం

అల్లదె నీ రమణి ఆయిత్తమై వున్నది
పెల్లుగ జాజరాడఁ బిలిచీఁ బోవయ్యా ॥ పల్లవి ॥

వనితచూపులు కలువలవసంతములు
ఘన మైనమోహము గంధము వసంతము
మనసులో కోరికలు మంచినీళ్ల వసంతము
పెనఁగి జాజరలాడఁ బిలిచీ నయ్యా ॥ అల్లదె ॥

కలికినవ్వులు నీకు కప్పురవసంతము
నిలిచినకళలు వెన్నెలవసంతములు
పలుకులకొసరులు బంగారువసంతము
బెళకక జాజరాడఁ బిలిచీ నయ్యా ॥ అల్లదె ॥

కేలు వట్టి తీసినది కెందామరవసంతము
చాలుఁ బులకలు ముత్యాలవసంతము
యీలాగుల శ్రీవెంకటేశ ఆకెఁ గూడితివి
పేలరి యై జాజరాడఁ బిలిచీఁ బోవయ్యా. ॥ అల్లదె ॥ 172

## మాళవిగౌళ

నీకే చెల్లుఁ గాని నే నింత కోపను
కాకరితనా లెపుడుఁ గలవే నీకును ॥ పల్ల

రమణితో నొకమాట రతి నాతో నొకమాట
అమరదు యెన్నఁడు నీ వాదకురా
కమలము వొకకన్ను కలువయు వొకకన్ను
జమళి రెండు నదప సాజమే నీకును ॥ నీకే ॥

కంటే [1]నిందు వచ్చే వాకడిమో మైతే రావు
అంటి నన రాదు నాతో నంత యాలరా
వొంటనిపా మొకటియూ వొగి గరుత్మంతుని
[2]బంటులఁగా గాడిఁ గట్టి పరచేటివాఁడవు ॥ నీకే ॥

కాఁగిలించే విటు నన్ను కన్ను గిరిపే వాపెతో
దాఁగిలిముచ్చు లాడేవు తగ దేలరా
యేఁగి మింటి కొక కొండ యెత్తి శ్రీవెంకటగిరి
నాఁగితి రెండు వాదాలు నౌరా నీవూ. ॥ నీకే ॥ 173

శంకరాభరణం

ఏ మందునె యిందు కిట్టె నిన్ను
కామిను లి ట్లైతే కాలమహి మెట్లో ॥ పల్లవి ॥

[3]అతఁడు నాతో నవ్వినట్టినవ్వు నీ మీఁదికి
యేతులకుఁ దీసుకొనే విది మేలే
పోతరించి వుప్పు వేసి పొత్తు గలయ వచ్చేవు
చేతులఁ బట్టఁగ రాదు చెలి కూ శై తేను ॥ ఏ మందునె ॥

పేరుకొని న న్నతఁడు పిలువఁగ నది విని
యీరీతి నీవే పలికే విది మేలే
నీరువట్టు గొన్నవేళ నెయ్యి వోనే వాతనికి
ఆరయ సిగ్గు లేనియాఁటదె పసురమూ ॥ ఏ మందునె ॥

---

1. "వింఁదు" అని వ్రాసి "విందు" అని తిద్ది యున్నారు. 2. "బంట్లుంగా" అని చెక్కి "ట్లు+ం" లకు పైన హంసపాది వేసి "ట్లు+ం" లకు క్రింద "ల" చెక్కి "ట్లు" క్రిందనున్న "ల" వత్తును "ట" గా తిద్ది "బంటులంగా" అని తిద్ది యున్నారు.
3. "అతఁడు" అని వ్రాసి "ఆతఁడు" అని తిద్ది యున్నారు.

చేయి నాపై వేయఁ బోతే శ్రీవెంకటపతికి
యీయెడఁ గైదండ యిచ్చే విది మేలే
పాయక యీ శ్రీవెంకటపతియే నన్నునుఁ గూడె
చాయ యెఱఁగనియట్టి సతియె వో మలుచా. ॥ఏమందునె॥ 174

330-వ రేకు ఆహిరి

మూల నున్నవారి మమ్ము ముంగిట వేసితివి
పోలిమి నాఁడువారు నీ పొరు గవుటే దోసమా ॥ పల్లవి ॥

వచ్చి వచ్చి చేయి వట్టి వట్టియాన లెల్లఁ బెట్టి
చెచ్చెర నన్నిట్టె లోను సేసుకొంటివి
యిచ్చకుఁడ నన్నువలె నెవ్వతిఁ జేసితివో
యెచ్చి మగనాండ్లకు నీ యింటికి రాఁ బాసెరా ॥ మూల ॥

సారె సారె నవ్వు నవ్వి జవ్వాది చెక్కులఁ బూసి
పారి పారి నన్ను నింత భ్రమయించితి
వూరివారి నెల్లా నంతా వోరి కలయఁ గొంటివో
వారించి మానాపతులు వాడ నుంటే నేరమా ॥ మూల ॥

మెల్లనె మెల్లనె మొక్కి మేర మీరఁ గాఁగిలించి
కొల్లగా శ్రీవెంకటాద్రిఁ గూడితి నన్ను
వెల్లివలపులు చల్ల వెన్నముద్దకృష్ణుఁడా
గొల్లెతల కెల్ల నీ కుల మౌటే తగులా. ॥ మూల ॥ 175

ముఖారి

నీవే యెరుఁగుదువు నిన్నాతఁడు పిలువఁగ
వావాత నూఁకొనవు వద్దు చల మమ్మా ॥ పల్లవి ॥

ముక్కున నూర్పులు రేఁగ ముంజేయి వట్టి పెనఁగీ
వెక్కసపు పతిమాఁట వినవే యిఁక
యెక్కువ నంతటివాఁడు యింత నిన్ను వేఁడుకోఁగ
చిక్కి కిట్టె బిగిసేవు చెల్లునా వో యమ్మా ॥

పూవుల కొప్పెల్ల జార పుడిసిట నిన్ను నెత్తె
వోపల పతికి లోనై వుండవే కొంతా
వేవేలు కాంతలవాఁడు వెస నిన్నుఁ బొదుగఁగ
నీ వెంతైనా గుట్టియ్యవు నీకుఁ దగ దమ్మా . ॥ నీవే ॥
తా నాతఁడు నీకు లోనై తమకానఁ గూడఁగాను
అన వెల్లఁ బెట్ట వచ్చే వ దేమే యింకా
పూని శ్రీవెంకటపతి భోగించె నిన్ను రతి
కాని మ్మని పాయకువే కలకాల మమ్మా. ॥ నీవే ॥ 176

సామంతం

ఇందుకే పో నేను మీ యింటికి వచ్చితి
పొంద కింక నేఁ బోనియ్య నిన్ను ॥ పల్లవి ॥
కలికి నీ చూపులు కన్నుల నుండఁగ
నలువంక మమ్ము నాఁటీ నేలే
పిలువక మమ్ముఁ బిలిచే నీ మోవి
వొలుకుఁదేనెల నూరించీని ॥ ఇందుకే ॥
బాపు నీ కుచములు పయ్యద నుండఁగ
రేపువలపులు రేఁచీ మమ్ము
నీపైనే వుండఁగ నీ చక్కఁదనము
యేపున నా మన నెలయించీని ॥ ఇందుకే ॥
చేయి చెక్కుతోడఁ జిమ్మే నీసిగ్గులు
ఆయములు దాఁకీ నద్దో మమ్ము
యీయెడ శ్రీవెంకటేశుఁడ నే నిన్నుఁ
బాయక కూడఁగఁ బంత మాదేవూ. ॥ ఇందుకే ॥ 177

శ్రీరాగం

కొత్తపెండ్లికూఁతురు కొంతు దేరీఁ దేరదు
చిత్తగించి నీ వైనాఁ జేయి వట్టవయ్యా ॥ పల్లవి ॥

చిమ్ముచు నీ మోము చూచీ సిగ్గుతో దగ్గరదు
కొమ్మసంగడి నీ పైనఁ గూచుండవయ్యా
కమ్మి నవ్వులును నవ్వీఁ గలసి మాటలాడదు
పమ్మి నీ మైన నాపెతోఁ బలుకవయ్యా ॥ కొత్త ॥

ఆలవట్టము విసరే నంటి ముట్టి పెనఁగదు
తేలించి యాపె వెరపు తెలుపవయ్యా
కాలు దొక్కీ నిన్ను నిట్టె కాఁకదేరఁ గలయదు
పోలిమి నీవే కాఁగిటఁ బొదుగవయ్యా ॥ కొత్త ॥

తనలోనె మోహించీ దంటతనము నేరదు
ననుపులే యాకెతోడ నడపవయ్య
యెనసె శ్రీవెంకటేశ యింతి నిన్ను మెల్లనె
మన సిచ్చి యిటులానె మన్నించవయ్యా. ॥ కొత్త ॥ 178

కాంబోది

చింతలఁ జిగురులు చెనకులఁ జేఁగలు
వంతల నీ చలములు వద్దే యిఁకను ॥ పల్లవి ॥

చెలి నీ సిగ్గు లివిగో నెలవి వెన్నెల గాయ
యెలమి బొమ్మలజంకె యెండ గాసీనె
వలచి విభుఁ డిందుకే వాడుచు వాడుదేరీని
కలువచూపు లయినఁ గప్పవే మీఁదను ॥ చింతల ॥

మాటలతేనెలలోన మధురము గురియఁగ
గాఁటపు నీ బిగువులు కార మయ్యానె
వీఁటనే విభుఁ డిందుకు వీఁగీని లోఁగీని
పాటల రాగాల చిలుపా లైనఁ బోయవే ॥ చింతల ॥

కాంత నీ కాఁగి లనేటి కమ్మఁబూఁదీగెఁ బొదిగి
యింత నీ మూండ్లగోళ్ల నేల వొత్తేవే
పంతపు శ్రీవెంకటాద్రిపతి యిట్టె నన్నుఁ గూడె
అంతలో మె తనివినయము లైనఁ జేయవే. ॥ చింతల

పాడి

విచ్చేయవయ్యా వేఁగుదాఁకా జాగు లేల
కొచ్చి చెలులము నేము కొండేలు చెప్పేమా ॥ పల్లవి ॥

ఈకడ నన్నే మడిగే వింటికి విచ్చేసితేను
ఆకెచేతనే వినేవు అప్పుడు నీవు
జోక నిన్నేఁటికో పిలుచుకొని రమ్మనఁగాను
దాకొని వచ్చితి నింతే తలఁ పెరుఁగుదునా ॥ విచ్చే ॥

ఆన లేఁటికిఁ బెట్టేవు అందకు నీ వేఁగితేను
కానఁబడీ నన్నియును కాంతవల్లనే
తానె నీ వేద నున్నా వెదకి తోడి తె మ్మనఁగ
మోనాన వచ్చితి నింతే ముంద రెరుఁగుదునా ॥ విచ్చే ॥

[1]కరికరఁ బెట్ట నేల కాంత నీవుఁ గూడితేను
అరయఁగ మంచి వయ్యీ నన్ని పనులు
యిరవై శ్రీవెంకటేశ యింతివద్దఁ గూచుంటివి
సరసా లాడఁగాఁ గంటి సర వెరుఁగుదునా. ॥ విచ్చే ॥ 180

331-వ రేకు శ్రీరాగం

అయ్యయ్యో భూమిమీఁద నన్నియుఁ గంటిఁ జెరువు
ముయ్య మూకు డడిగేటి మూఢులు గలరుగా ॥ పల్లవి ॥

కద నీ చెక్కుల గోళ్ల కాఁడినపో ట్లుండఁగ
నొడిగే నా మాట నీకు నొప్పు లాయఁగా
ఐడి ఐడి తల్లిదండ్రి పగ లుండఁగా లంజ
గొడవలకుఁ బెనఁగే కూళలు గలరుగా ॥ అయ్యయ్యో ॥

పెక్కు సతులు నీ మోవి పిప్పి నేసి వుండఁగాను
యిక్కడ నే వగచుట హీన మాయఁగా
మిక్కిలి రాళ్ల కోపక మెత్త నైనందు గుద్దలి
యెక్కువ వాఁడి చేసేయెద్దులు గలరుగా ॥ అయ్యయ్యో ॥

---

1. "కరికరి" అని వ్రాసి "కరికర" అని తిద్ది యున్నారు.

తగనియెవ్వతో కాలితాఁకులు నీమై నుండఁగ
బిగువు నా చన్నులొత్తు బిరు సాయఁగా
అగపడి శ్రీవెంకటాధిప కూడితి విట్టె
నగవు విజాలు నేసేనాథులు గలరుగా. ॥ అయ్యయ్యో ॥ 181

పాడి

ఎంత గట్టువాయతన మి దేమే వీఁడు
అంతకంత కేమన్నా నన మీఁదే వీఁడు ॥ పల్లవి ॥

నిద్దుర కన్నులఁ దేరి నీకంటే లే దంటా
గద్దించి తప్పక చూచీఁ గదే వీఁడు
ముద్దుతో నెగసక్కెల మోవికెంపులు రేఁచితే
వొద్దన లేక వోరిచి వున్నాఁడె వీఁడు ॥ ఎంత ॥

ముక్కున నూర్పులు నీకు ముంచె నంటె లే దంటా
అక్కలించి లోలోనె ఆఁపీనె వీఁడు
అక్కడ నలసి వచ్చె నందుపై నేఁ బెనఁగితే
అక్కరతో రతులకై ఆసపడీ వీఁడు ॥ ఎంత ॥

చెమటల తన మేను చెరఁగునఁ గప్పితేను
అమర ముసుఁగు వెట్టీ నప్పటి వీఁడు
తమితో శ్రీవెంకటేశుఁ దగ నిందుకె మెచ్చితే
భ్రమసినట్లఁ బైపైఁ గూడీ వీఁడు. ॥ ఎంత ॥ 182

రామక్రియ

సిగ్గరి పెండ్లికొడుకుఁ జేరి చూతము
వొగ్గి [1]సదమదము లై వున్నాఁ డటా ॥ పల్లవి ॥

వద్ది కిట్టె రమ్మనరే వచ్చీనో రాఁడో
గద్దరి తన లాగులు కందము నేఁడు
బద్దులో నిజమో కాని పచ్చివెచ్చిచేఁతల
వొద్దికతో [2]బందుబం దై వున్నాఁ డటా

1. "సమద" అని వ్రాసి "స'మ" లకు పైన హంసపాది వేసి క్రింద "ద" "సదమద" అని తిద్ది యున్నారు. 2. "బందబం దై" అని వ్రాసి స్థలము "బందబం దై" లోని "ద" కు చిహ్నకొమ్ము నిరికిం[illegible] [illegible]బందుబం దై" అని తిద్ది య[illegible]

మాట మాట దియ్యరే మన నెట్లున్నదో
గాఁటపు తన విద్యలు కందము నేఁడు
చీటకపుచెమ టట చిట్లుగందా లట
మేటిదొరఁ బిలువరే మెరసీ నటా ॥ సిగ్గరి ॥

ముసుఁగు దెరవరే మొకము చూతము నేఁడు
కసుగాటు చేఁత లెల్లఁ గందము గాని
పసతో శ్రీవెంకటపతి నన్ను నిటు గూడె
నస చేసి నాతోనె నవ్వీ నటా. ॥ సిగ్గరి ॥ 183

దేసాళం

పెనుఁ బండుగలు నేసి పిలిపించె నిన్నమాపె
పెనఁగీఁజిత్తపు చింత పెనులంపటముల ॥ పల్లవి ॥

చెవులఁబండుగ నేసె చెలి నీ సుద్దులు విని
నవకపు వేడుక నిన్నటిమాపె
తివిరి వేగుదాఁకా దీపాళిపండుగ నేసె
జవకట్టి నినుఁ బాసి జాగరాలను ॥ పెను ॥

కన్నులపండుగ నేసె కలికి మేడపై నుండి
నిన్నుఁ దప్ప కిట్టె చూచి నిన్నమాపె
వున్నతి నొక నిమిష ముగాదిపండుగ నేసె
తన్నుఁ దానె తనలోని తమకానను ॥ పెను ॥

నిచ్చపండుగలు నేసె నీతోడి మాటలనె.
నెచ్చెలి యల్లంతనుండి నిన్నమాపె
పచ్చిగా లక్ష్మిదేవి పండుగలు నేసె నిదె
యిచ్చకుఁడ శ్రీవెంకటేశ నిన్నుఁ గూడెనూ. ॥ పెను ॥ 184

నాగవరాళి

ఎట్టున్నదో నీ మనసు యేమి నేతురా
యెట్ట నెదుటఁ బాయ లే నేమి నేతురా ॥ పల్లవి ॥

చూచుదాఁకా వేగిరింత సొంపుగా విభుఁడ నీతో
దాఁచి మాటాడినదాఁకఁ దమకింతును
చేచేతఁ దమకింతు చేరువదాఁకా నిట్లనె
యేచి తమకమే నిండె నేమి సేతురా ॥ ఎట్టు ॥

అట్టె నీ చెనకులకు నాసగింతుఁ దనివోక
ముట్టి యాసగింతు నీ మోవితేనెకు
గట్టిగా నంతటిమీఁద కాఁగిటికి నాసగింతు
యెట్టైనా నాసలే నిండె నేమి సేతురా ॥ ఎట్టు ॥

అదన నీ మే నంటి అట్టె పరవశ మవుదు
వదలక కూడి పరవశ మవుదును
పొదలి శ్రీవెంకటేశ పొందితివి నన్ను నిట్టె
యెదిరించెఁ బరవశా లేమి సేతురా. ॥ ఎట్టు ॥ 185

శ్రీరాగం

నన్నుఁ బాసి వుండ నేల నాయాలకు రా నేల
వున్నట్లానె వుంటే వోరనేరా నిన్ను ॥ పల్లవి ॥

కాంతలఁ దిట్టఁగ నేల కాని కాని వో ట్లేల
యింతట నీ గుణము నే నెఱఁగనిదా
పంతపుసాకిరు లేల పతితారుకాణ లేల
వంతున నా [1]వద్ద నుంటే వచ్చీనా నిందలు ॥ నన్ను ॥

పదరి కోపించ నేల బాసలు సేయఁగ నేల
కదిసి నీ మోహము నేఁ గన్నదె కాదా
వదరుఁబెదవు లెంద వాదు లడువఁగ నేల
అదన నావద్ద నుంటే ఆదేరా నిన్నును ॥ నన్ను ॥

నే నెంతైనా నమ్మ నంటా నీకె యలుక లేల
కానీ లేరా యిన్నియు నేఁ గన్నవె కావా
పూని శ్రీవెంకటేశుఁడ వొడఁబరచి కూడితి
నేను నీవూ నిట్టె వుంటే నేఁ దనేరా నిన్నునూ. ॥నన్ను॥

1. "వద్దన వుంటే" అని వ్రాసి గోరుగత్తితో "నవుం"ల మధ్యభాగమును రేఖమ యెత్తి వేసి "వద్దనుంటే" అని దిద్ది యున్నారు.

332-వ రేకు హిజ్జిజి

కాంతలాల యింతులాల కంటిరా యిది
 మెంత కెంత కెత్తుకొంటి వెరఁగరా నేను ॥ పల్లవి ॥

వొక్కమాట నిన్నంటె వూరివారిపైఁ జూట్టేవు
 మిక్కిలి ముదికాఁడవు మేలురా నీవు
 మక్కళించి నీ చేఁతలు మాయ వలసి యీరీతి
 యెక్క డెక్కడో పెనచే దెరఁగరా నేను ॥ కాంత ॥

వాదు నీతోఁ బెట్టుకొంటె వాడవారిపైఁ బెట్టేవు
 మేదకపుకొయ్య వవుదు మేలురా నీవు
 ఆదెస నీ నేరాలు అందులోనే పులిమేవు
 యేది తుది మొద లౌటా నెరఁగరా నేను ॥ కాంత ॥

పొంచి నీవె కల్ల వంటె పొరుగు కప్పగించేవు
 మించెను నీ చలములే మేలురా నీవూ
 యెంచి నట్టె శ్రీవెంకటేశ నన్నుఁ గూడితివి
 యించుకంత కపటము యెఱఁగరా నేను. ॥ కాంత ॥ 187

రామక్రియ

వరుస నే నెరుఁగుదు వాని గుణము
 [1]కరఁగి నా పేరు వింటే కానుక లందియ్యరే ॥ పల్లవి ॥

తగ నేఁ గోపగించిన దయ గల దాతనికి
 బిగియఁడు వచ్చీఁ గాని పిల్వరే వాని
 వొగి నే నెంత దిట్టినా వోరుపు గ ద్దాతనికి
 నగుతా వచ్చీఁ గాని నా పేరు చెప్పరే ॥ వరుస ॥

మోనాన నేఁ గొసరినా మోహము గ ద్దాతనికి
 పేని పట్టి వచ్చీఁ గాని పిల్వరే వాని
 పూని నే నెం తలిగినా బుజ్జగించ నేర్చు వాఁడు
 వానికిఁ బొదచూపరే వచ్చీ నిందాఁకను ॥ వరుస ॥

1. "కరంగ్గి" అని వ్రాసి "కరఁగి" అని దిద్ది యున్నారు.

ముంపు నే గరివి నైనా మొదల వినయి వాఁడు
పెంపునఁ దానె వచ్చిఁ బిల్వరే వాని
యింపుల శ్రీవెంకటేశుఁ డిప్పు డిట్టె నన్నుఁ గూడె
పంపున నీడనె వుండీ పై పైనె మొక్కరే. ॥ వరున ॥ 188

శంకరాభరణం

దొరతో సంగాతము దొరకినపాటే చాలు
వొరసి మీరఁగఁ బోతే నొక్క రీతి నుండునా ॥ పల్లవి ॥

యేకతాన లోన నుండి యేల నన్నుఁ బిలిచేవు
వాకిటికి రావయ్య వలసితేను
చేకొని యొకతె యుంటె సిగ్గువడి వెళ్లి వచ్చి
కూతులు వత్తులు గాను కూళదానినా ॥ దొరతో ॥

మరిగించి మరఁగున మాట లే లాడించేవు
తెర దియ్యవయ్య అంత తీఁట గలితె
వరుసకు వచ్చినాపె వాదు నాతోఁ బెట్టుకొంటె
విరస మై యూరకుండ వెట్టిదాననా ॥ దొరతో ॥

పట్టెమంచముపై నుండి పైఁ గాలు చాఁచ నేల
యిట్టె వుర మెక్కవయ్య యింత గలితె
జట్టిగా శ్రీవెంకటేశ సరి నొకతె గూచుంటె
వట్టి యితవు నేసుకో వాసి లేనిదాననా. ॥ దొరతో ॥ 189

శ్రీరాగం

వలసితే రేపు మాపు వచ్చేవు గాని
అలమి చే యెత్తి మొక్కి అంపించుక రావె ॥ పల్లవి ॥

యేద లేనిమాఁటలు యెందాఁక నైనఁ బెనచి
ఆడేవు మాఁటలు నీవు అతనితోను
[1] తోడ నంపించుక రావె తుద లేదీ యాసలకు
నీ దనవు యెం దనవు నిలుచుండే వీడను ॥ వలసితే

1. "తోడన అంపించుకఅరావె" అని వ్రాసి "తోడ నంపించుక రావె" అని
యున్నారు. రెండు "అ" లను చెరిపి యున్నారు.

కూరి మెల్లఁ బెట్టి పెట్టి కొనచూపు నాఁటఁ జూచి
ఆరగించఁ బోఁ జాల వాతనిఁ బాసి
యీ రీతి నింత గలితె యింటి కైనాఁ ద్రోడి తేవె
తీరవు మీ ముచ్చటలు దీవెత్తుఁబొ ద్దాయను ॥ వలసితే ॥

గయ్యాళి వై నవ్వి నవ్వి కాఁగిట బిగించుకొని
యెయ్యెడఁ బోనీవు యేమే యితని
నెయ్యపు శ్రీవెంకటేశు నీవుఁ గూడితివి ఆతఁ
డియ్యడనె వుండీఁ గాని యిల్లు వెళ్ల నీకువే. ॥ వలసితే ॥ 190

## పాడి

ఏమి సేయ వచ్చుఁ గాల మెవ్వరి నెంత సేసునో
నేమాన నవ్వేటి నన్ను నివ్వెర గందించెను ॥ పల్లవి ॥

పలుకు [1] బంతపు నన్నుఁ బ్రాయముగ నింత సేసె
చెలుల కెల్లాఁ బ్రియము చెప్పించెను
అలరు రాజసపు నన్నాసలుగా యింత సేసె
నలి రమణునింటికి నడపించెను ॥ ఏమి ॥

వాసితో నుండేటి నన్ను వలపుగా యింత సేసె
వేసాల ఆతని మాటె వినిపించెను
వోసరించి వుండేనన్ను పొందుగా యింత సేసె
పాసితే విరహవేదనపాలు సేసెను ॥ ఏమి ॥

సిగ్గుతో నుండేనన్ను చిత్తమెకా యింత సేసె
తగ్గనితమకములఁ దగిలించెను
వెగ్గళించి యింతలో శ్రీవెంకటేశుఁ డిటు గూడె
అగ్గలపు నా రతులె కా అన్నిటాను మించెను. ॥ ఏమి ॥ 191.

## సామంతం

కూచుండఁ బెట్టుకొనవే కోప మేఁటికి
కాచుకున్నరమణునిఁ గరుణించ వలదా ॥ పల్లవి ॥

---

1. "బింపలు" అని వ్రాసి "లు" చెరిపి "ం+వ" లకు పైన హంవపాది వేసి, క్రింద "త" వ్రాసి "వ" ను "పు" చేసి "బింతపు" అని తిద్ది యున్నారు.

నాటుకొన నిన్నుఁ జూచి నవ్వేటిపతితోడ
మాట లాడఁ గదవే మౌన మేఁటికి
ఆఁటదాని కింత యేలే అంతవాఁడు వేఁడుకోఁగ
కోటి నేరా లేమి గల్లాఁ గూడుకొన వలదా ॥ కూచుండ ॥

కొంగు వట్టి నిన్నుఁ దీసి కొసరేటిపతి నిట్టే
సంగడిఁ గాఁగిలించ వేసట లేఁటికి
యింగితాన నొక్కవేళ యిద్దరిలోఁ గలఁగితే
సంగతిఁ జవి సేసుక చన వియ్య వలదా ॥ కూచుండ ॥

యిర వై తమ్ములము నీ కింద మనీ నాతఁ దదే
సిర నెత్తఁ గదవే సిగ్గు లేఁటికి
నిరతి శ్రీవెంకటాద్రినిలయుఁడు నిన్నుఁ గూడె
తొరలిన నీరతులఁ దోడు చూప వలదా. ॥ కూచుండ ॥ 192

333-వ రేకు ధన్నాసి

నే నైతే నేమీ నెరఁగ నీకు నీవే బెదరేవు
తానే బయటఁ బడీని తగని నీచేఁతలు ॥ పల్లవి ॥

కొండవంటి దొర నిన్నుఁ గోరి వెంగె మాడుదునా
దుండగము నీకు నీకే తోఁచీఁ గాకా
అండకు వచ్చి నీగుట్టు అరయఁగ వచ్చితినా
వుం దుండి నీకు నీవే వులికేవు గాక ॥ నే నైతే ॥

నడుమను నిన్నుఁ జూచి నవ్వులు నవ్వితినా
వడి నీకు నీవే తల వంచేవు గాక
వెడ నీ మేనిచేఁతలు వెదకి చూచితినా
తడవి కప్పుక నీవే దాఁచేవు గాక ॥ నే నైతే ॥

నీవు గాఁగిలించుకోఁగా నేరము లెంచితినా
భావించ నీవే సిగ్గు వడేవు గాక
యీవేళ శ్రీవెంకటేశ యిట్టె నన్నుఁ గూడితివి
కోవిదుఁడ వై రతిఁ గొంకేవు గాకా. ॥ నే నైతే ॥

భౌళిరామక్రియ

అద్దో మానవుగా అదేమే నీవు
గద్దించి నీవు చూచితే కాళ్లు వణఁకీనా ॥ పల్లవి ॥

మచ్చిక నాతఁడు నేఁడు మా యింటికి వచ్చె నంటా
పచ్చి గొంతా వెచ్చి గొంతాఁ బలికే వేమే
బచ్చెనల నతఁడు నీ పొంగెములో వాఁ డై
నెచ్చెలి నీకుఁ గొంకితే నే నీకు వెరతునా ॥ అద్దో ॥

చెప్పి యిందరిలో వాఁడు చేయి నాపై వేసె నంటా
అప్పటనుండి వుడికే వ దేమే నీవు
దెప్పర మాతఁడు నీచేఁ దిట్టించుకొనుఁ గాక
నిప్పువంటిదాన నేను నీచేతఁ బడేనా ॥ అద్దో ॥

గక్కన శ్రీవెంకటాద్రిఘనుఁడు నన్నుఁ గూడితే
పక్కన నాతనిఁ గొంగు వట్టే వేమే
చక్క నీ వంద నుంటె సాదించఁ జెల్లుఁ గాక
యిక్కడ వచ్చే మనేవే యిఁక నే నోరుతునా. ॥ అద్దో ॥ 194

దేవగాంధారి

ఈతఁడె నీ కెంత చన విచ్చెనో కాక
యేతుల నీ గుణముల [1]కిందరూను మెత్తురా ॥ పల్లవి ॥

పదరి యాతఁడు నిన్నుఁ బైపైఁ బిలువఁగాను
యెదిటికి రావు లోన నేమి సేసేవే
మదిఁ గోపము గలితె మాటల [2]నాడుదు గాక
కదిసి మోనాన నుంటే గర్వ మనరా ॥ ఈతఁడె ॥

అలరి మాటాడి యాడి యాతఁడు లేప వచ్చితే
యెలమి నిద్దుర బొయ్యే విది యేఁటిదే
చలము నీకుఁ గలితే సాదించవలెఁ గాక
నిలిగి [3]ముసుఁ గిడుటే నిష్ఠూరము గాదా ॥ ఈతఁడె ॥

---

1. "కింఠ" అని వ్రాసి "కింద" అని తిద్ది యున్నారు. 2. "నాడుదుం గాక" అని వ్రాసి సున్నను చెరిపి "నాడుదు గాక" అని తిద్ది యున్నారు. 3. "ముసుగి" అని వ్రాసి "సు+గి"లకుపైన హంసపాది వేసి "ం" నుంచి "ముసుంగి" అని తిద్ది యున్నారు.

శ్రీవెంకటేశ్వరుఁడు చేరి కాఁగిలించుకోఁగా
యీవేళ సిగ్గు పడేవు యిఁకఁ దగునా
వేవేలు గలిగిన వెనకకె చెల్లుఁ గాక
భావించి కూడిన మీఁదఁ బచ్చి దోఁచదా. ॥ ఈతఁడె ॥ 195

పాడి

మతకాలు నేరిచినమాయదారివి
తతి నీ వద్దము రాక తలరా వోరి ॥ పల్లవి ॥
దవ్వుల నే రాఁగానె తగఁ బలుకరించేవు
యెవ్వతెకు నా రాక యెచ్చరించేవో
అవ్వల నప్పటనుండి అనుమాన మయ్యీ నాకు
పవ్వళించే లోను చూచేఁ బదరా వోరి ॥ మతకాలు ॥
యింతట నేఁ జొచ్చి రాఁగా నెదురుగా వెళ్లి వచ్చే
వంత నాకె గోపగించీ నంటానో వోరి
యెంతైన నీవు నన్ను నేమరించఁ జోటు లేదు
చెంత నెవ్వతెఁ దెచ్చితి చెప్పరా వోరి ॥ మతకాలు ॥
చేరి నే మంచ మెక్కఁగా చెలులనే పిలిచేవు
వారిలో నాపెఁ గలపేవగలా యివి
యేరా శ్రీవెంకటేశ యిట్టె నన్నుఁ గూడితివి
తేరెఁ బను లింక తెర దియ్యరా వోరి. ॥ మతకాలు ॥ 196

రామక్రియ

అందు కేమి నీవు మాతో నన వలెనా
చందముగ నొడఁబరచఁగ నింత వలెనా ॥ పల్లవి ॥
ఈ యడకు రా కుండితే యేడనుం డైనా నీకు
చే యెత్తి మొక్కిన దొక నెలవే కాదా
పాయ మెంత వెంచినాను ప్రాణము నీ కొప్పగించి
కాయముతో బదికేది ఘనత నీదే కాదా ॥ అందు

కన్నులఁ జూడ కుండినా కడ నీ వార మని
వున్నట్టే వుంచుట నీకే వొప్పు గాదా
మన్ననలు దప్పినా మనసు నీపైఁ బెట్టి
యున్నిటా నుండుట నీకు నిది కీర్తి గాదా ॥ అందు ॥

మునుపఁ జెప్పంపకున్నా మొక్కలాన నిట్టే వచ్చి
చనవు చేకొనుటే చాలదా మాకు
యెన లేక శ్రీవెంకటేశ నన్నుఁ గూడితివి
ననిచితి నిది నీకు నయమే కాదా. ॥ అందు ॥ 197

నాదరామక్రియ

కలఁడుగా యిటువంటి గడుసరి భూమిమీఁద
తెలిసితి మిన్నాళ్లకు దిష్టముగ వీనిని ॥ పల్లవి ॥

తగని వెల్లాఁ జేసీ తనమాఁటె ఘనము
జిగి నా మొగము చూచీ సిగ్గు వడఁడు
నగువారి నెరఁగఁడు నాపై నానలు వెట్టీ
యెగసక్కెఁడు వీని దెంత నేరుపే ॥ కలఁడుగా ॥

తప్పుజగడాలు రేఁచీ తానె మంచివాఁడు
యిప్పుడె వావులు చెప్పీ యేవగించఁడు
ముప్పిరిఁ దల వంచిన మోవితేనె లియ్య వచ్చీ
చప్పుడు గాకుండాఁ జేరీ జాణ గదే వీఁడు ॥ కలఁడుగా ॥

తమకించు నిన్నిటాను [1]తగవరిఁ దానె
అమరఁ గతలు చెప్పీ నందు కాతఁడు
తిమిరి శ్రీవెంకటాద్రి దేవుఁ డిట్టె నన్నుఁ గూడె
సమరతి నిన్నిటాను సరసుఁడు గదవే. ॥ కలఁడుగా ॥ 198

334-వ రేకు సౌరాష్ట్రం

నీ విదె నే నదె నెమ్మదిఁ దానూ నదె
ఆవలి మొగము లేల అద్దరిపా టాయను ॥ పల్లవి ॥

1. "తగనరి" అని వ్రాసి "తగవరి" అని తిద్ది యున్నారు.

వచ్చినట్టిపరాకున వనిత నన్నుఁ గానక
    యిచ్చ నీవద్దఁ గూచుండి యిటు చూచి
    యెచ్చరి నీ పే రడిగి [1]నెరఁగనిదాని వలె
    తచ్చన లిం కేల సమతారుకాణ లాయను ॥ నీవిదె ॥

యీడ నాగురు తెరఁగ కీపె వచ్చి వోయి నీతో
    యేడలేనిముచ్చ టాడె యేకతానను
    తోడ నీ వెచ్చరించఁగా తొయ్యలి యామాటలె
    యేదో కతలు సేసీ నిఁక నేల బొంకులు ॥ నీవిదె ॥

పరపుపై నిద్దరము పవళించు టెరఁగక
    యిరవుగఁ గాఁగిలించె నిద్దరి నీపె
    గరిమ శ్రీవెంకటేశ కలసితి విట్టె మమ్ము
    దరి చేరెఁ బను లెల్ల తన కేల సిగ్గులూ. ॥ నీవిదె ॥ 199

నాదరామక్రియ

నీవల్ల దోసము లేదు నేరము నావొళ్ళి దింతే
    చేవ దేర నిఁక నీవు నేసినంతాఁ జెల్లురా ॥ పల్లవి ॥

కోరి నిన్నుఁ జూచి చూచి కోపగించఁ జాలఁ గాని
    చేర నీవు రానందుకు చిమిడీరా నా మనసు
    వోరి నీవు నేసినందు కొల్లక వుందే నంటే
    భారపు నాజవ్వనము పైతరవు వెట్టురా ॥ నీవల్ల ॥

దీకొని నీ పట్టుకు నేఁ దెగఁ జాలకుందుఁ గాని
    కాకరి నీ నవ్వు లెల్లాఁ గాఁడిపారె నన్నునూ
    వాకున వెళ్లనా డైనా వడిఁ దీర్చుకొనే నంటే
    యీకడ నా మొగమోట మింత నేనె [2]నన్నును ॥ నీవల్ల ॥

కాఁగిలించి నిన్ను నంత కస్తి నేయ నోపఁ గాని
    రాఁగిన నా వలపులు రాసు లై వున్నవిరా
    వీఁగక శ్రీవెంకటవిభుఁడ కూడితి నన్ను
    మాఁగి నీ కెమ్మోవి మరిగించెఁ దీపులు. ॥ నీవల్ల ॥ 200

---

1. "నెరఁగవిదాన" అని వ్రాసి "నెరఁగనిదాని" అని తిద్ది యున్నారు.

2. "నన్ను ॥౨॥ కాఁగి" అని వ్రాసి "న్ను ॥" పైన హంసపాది వేసి క్రింద వ్రాసి "నన్నును" అని తిద్ది యున్నారు.

## కేదారగౌళ

ఇంకమీఁద వచ్చేఁగాని కిప్పు డేఁటికే
మంకు దీరఁ దన్నింతలో మంచివానిఁ జేసేనా ॥ పల్లవి ॥

కానీ లేవె తనమాట కల్లనేనా యిందరిలో
నాన నిచ్చి వెనకనె నవ్వేఁ గాక
ఆన లేల పెట్టుకొనీ నంతలోనె లే దంటా
నే నిట్టే యిందుకు తన్ను నిజమరి అనేనా ॥ ఇంక ॥

వదవ *నేలె నేను తనగుణా లిందరిలో
వడి వెట్టి మరఁగున వంచేఁ గాని
తొడిఁబడఁ జేయి వట్టీ దోస మన్నా మానఁడు
వాదఁబడి యిందుకే నే నొక్కటి యైతినా ॥ ఇంక ॥

దంట నై యలుగ ‡లేనె తనుఁ గోపించేవేళ
వొంటిఁ జిక్కించుక వేరె వారసేఁ గాక
యింటిలోన శ్రీవెంకటేశుఁ డిట్టె నన్నుఁ గూడె
అంటి ముట్టి తొంటివెంగే లాడక మానేనా. ॥ ఇంక ॥ 201

## బౌళిరామక్రియ

పాప మంటా నోరిచితేఁ బదరీఁ దాను
కోపగించి యెవ్వతె యైనఁ గుమ్మీ లేవే ॥ పల్లవి ॥

వంతులకు వచ్చి వచ్చి వలపులే చల్లీని
పంతగాఁడు తన కేమి పని లేదా
యింత గలితే తన్ను యెవ్వ తైనాఁ బట్టుకొని
చెంతనె సదమదము నేసీ లేవే ॥ పాప ॥

దీమసాన రతులకుఁ దిట్టి తిట్టి పిలిచీని
బూమిలోన వీని కేమి పొద్దు వోదా
ఆముకొని యింత లేసి ఆసలకుఁ బెనఁగితే
గామిడి యెవ్వతె యైనాఁ గలిగీ లేవే ॥ పాప ॥

* రే. పా. లేనె. ‡ రే. పా. లేవె.

తొడిఁబడ నవ్వి నవ్వి దొమ్మి సేసి కాఁగిలించి
వొడి పట్టి వీని కేమి వుండఁ బట్టదా
బడినె శ్రీవెంకటపతి నన్ను నిదె కూడె
కడ నింకా నెవ్వ తైన కాచుకుండీ లేవే. ॥ పాప ॥ 202

దేసాళం

కంటిమి నీ సుద్దు లెల్లఁ గానీరా వోరి మా
యింట నున్నప్పుడే నీ యిచ్చలు వోరి ॥ పల్లవి ॥
చెక్కు లేల పులకించెఁ జెప్పరా వోరి నాతో
నిక్కి నిక్కి నీ విజాలె నెరపేవు
యెక్కడికిఁ బోనివాఁడ వేరా వోరి
యిక్కడనె బుసకొట్టేవు యేఁటికిరా వోరి ॥ కంటిమి ॥
యేదది కుంకుమపూఁత యీ మేన నోరి
యేదలేనియాచారాలు యీడఁ జేతువు
ఆడి తప్పనివాఁడవు అవురా వోరి
యీడ నీ వెంట వచ్చిన దెవ్వతెరా వోరి ॥ కంటిమి ॥
తమకించే వింతలోనె తలరా వోరి । నాతో ।
జమళి నక్కడి మేలు చల్లేవా వోరి
అమర శ్రీవెంకటేశ అట్టె నన్నుఁ గూడితివి
సముకాన నీ మాఁట సమ్మతించే నోరి. ॥ కంటిమి ॥ 203

హిందోళవసంతం

ఎరవు నేసుకొనేవు యింకా నేలా
సిరసు నీవు వంచితే చేఁత లెల్ల మానునా ॥ పల్లవి ॥
నేసకొప్పులోడిది చెమటముత్యాలది
నేసిన నీ పొందు మాతోఁ జెప్పుకొన్నది
పూసినజవ్వాదిపూఁత బుగులుకొనఁ బయ్యద
వేసిన వల్లెవాటుతో వేలఁ జూపి నిన్నునూ ॥ .

దొరతనములది యేతుల చిట్లుగందాలది
మురిపేన నీ దిక్కు మొక మైనది
సురతాంతమున నీ సోఁకినగురుతు లెల్ల
పరగఁ జెలుల కెల్ల బయలు నేసీని ॥ ఎరవు ॥

కన్నుల మొక్కులది గయ్యాళి చేఁతలది
తన్నుఁ దానె నిన్నుఁ జూచి తనియనిది
యిన్నిటా శ్రీవెంకటేశ యిటు నీవు గూడఁగాను
పన్ని నీ పరపుమీఁదఁ బవళించినది. ॥ ఎరవు ॥ 204

335-వ రేకు దేసాక్షి

ఇద్దరి జాడలూఁ గంటి మిప్పుడే నేము
ముద్దులు మోవులు మీలో మోఁపి గొణఁగితిరి ॥ పల్లవి ॥

మంతనాన నీతోడ మాటలాడేవేళ
యింతి బొమ్మముడి వెట్టె నేఁటికో కాని
చెంతల నందుకుఁ గానె చెప్పరానితిట్టు దిట్టి
అంతలోఁ గాఁగిలించితి వౌ నయ్య నీవు ॥ ఇద్దరి ॥

ఆరజాన నాపె నీకు ఆకు మడి చిచ్చి యిచ్చి
యీరసానఁ గోపగించె నేఁటికో కాని
చేరి నీ వందుకుఁ గానె చేయి వట్టి తీసుకొని
కూరిమి తొడపై నిడుకొంటివయ్యా నీవు ॥ ఇద్దరి ॥

మంచముపై నుండి యాకె మలగుపై నొరగుతా
యించుకంత గోర నూఁదె నేఁటికో కాని
[1]చంచుల శ్రీవెంకటేశ సన్నెరిఁగి కూడితివి
మించిన మీ నేరుపులు మే లయ్యా నేఁడు. ॥ ఇద్దరి ॥ 205

ఆహిరి

ఒత్తి నీవు దగ్గరితే నొద్దనదు సతి నిన్ను
చిత్త మెరఁగక గుట్టు నేసీఁ గాని ॥ పల్లవి ॥

---

1. "చచ్చుల" అని వ్రాసి "చ+చ్చు" లకు పైన హంసపాది వేసి "చ" క్రింద సున్న నుంచి "చంచుల" అని తిద్ది యున్నారు.

నిలు వెల్లఁ బులకలే నిన్నుఁ జూచేప్పటనుండి
కలికి పయ్యద నట్టె కప్పీఁ గాని
తలఁ పెల్లఁ దమకమే తనకు నీ విటు పై పైఁ
బిలువఁగా నూరకె బిగిసీఁ గాని ॥ ఒత్తి ॥

వెలి యల్ల చింతలే వినుకలి నాటనుండి
తల వంచి నీకుఁ గొంత దాఁచీఁ గాని
పలు కెల్ల దైన్యమే పడఁతి నియ్యేడకు
చలి వేఁడి రాజసాలు జరపీఁ గాని ॥ ఒత్తి ॥

వయ సెల్ల వలపులే వనిత నిన్నటనుండి
నయము సేసుక నీతో నవ్వీఁ గాని
క్రియ యెరిఁగి [1]కూడితి కెలన శ్రీవెంకటేశ
జయ మందెఁ జెలి నీతో సరసము గాని. ॥ ఒత్తి ॥ 206

శంకరాభరణం

ఆడనె ఆకెచే వెంగె మాడించుకోవయ్యా
తోడనె నీ సుద్ది విన దోస మయ్యా ॥ పల్లవి ॥

చిత్తము రా కొకమాట చిత్తము వచ్చొకమాఁట
వొత్తి నీతో నాడ నే నోప నయ్యా
హత్తిన ఆకెకు నీకే అలవాటు గాని మాకుఁ
దత్తరించి యింత సేయఁ దగ దయ్యా. ॥ ఆడనె ॥

కూడినప్పు డొకచూపు కూడనప్పు డొకచూపు
యీడా నాడా రెండూ నెరఁగ మయ్యా
యేడో ఆకెకు నీకు యే మన్న నమరుఁ గాని
పీడుపడ నింత సేయ వెరతు మయ్యా ॥ ఆడనె ॥

సంతసించి వొకనవ్వు సంతసించ కొకనవ్వు
మంతు కెక్కె తొల్లె యివి మానితి మయ్యా
చెంతలఁ గూడితి నన్ను శ్రీవెంకటేశ యాకె
పంత మాడుఁ గాని మాకుఁ బాడి గా దయ్యా. ॥ ఆడనె ॥

1. "కూడితివి కెలన" అని వ్రాసి "వి" ని చెరిపి "కూడితి కెలన" అని దిద్దియు

హిందోళం

రమ్మనఁగాఁ దనతో నే రా నంటినా
చిమ్ముచు నింత ప్రియము చెప్ప నేలె నాకు ॥ పల్లవి ॥

వెల్లవిరిఁ దనమాఁట విన నైతినా నేను
చెల్లఁబో నా కేల సేవ సేసీనె తాను
యెల్లవారిఁ దా నేలీ నెవ్వరిఁ బోలుదు నేను
బల్లిదుఁడు నా కేల బాఁతి పడీఁ దానూ ॥ రమ్మనఁగా ॥

చెప్పిన ట్టెల్లా నేను సేయకుండేదాననా
అప్పటి లేక లేఁటికి నంపీనె తాను
కప్పురపుపడిగల కాంతలు గాచుకుండఁగా
విప్పుచు నాకుఁ గా నేల వేగించీనె తానూ ॥ రమ్మనఁగా ॥

గక్కనఁ దాఁ గూడఁగాను కాదు గూడ దంటినా
ముక్కు మోవ సాగి లేల మొక్కీనె తాను
యెక్కువ శ్రీవెంకటేశుఁ డెనసెఁ దా నన్ను నిట్టె
పెక్కు సతులలోననె పెద్ద సేసీఁ దాను. ॥ రమ్మనఁగా ॥ 208

సౌరాష్ట్రం

ఇంతకంటె నాతఁడు మ రేమి సేసునే
యింతులాల రమణుని నేల దూరేరే ॥ పల్లవి ॥

కన్నుల మొక్కనె పట్టె కాఁకలఁ బెనఁగఁ బట్టె
వెన్నెలనవ్వులు నవ్వ వేళ లేదే
పన్ని నెత్త మాడఁ బట్టె పరాకు సేయనె పట్టె
యిన్నిటా జాణఁడు వాని నేల దూరేరే ॥ ఇంత ॥

సరస మాడఁ బట్టె సంగడిఁ గూచుండఁ బట్టె
విరులు ముడువ నైన వేళ లేదే
కురులు దువ్వనె పట్టెఁ గొలువు సేయనె పట్టె
యిర వెరుఁగు నాతఁడె యేల దూరేరే ॥ ఇంత ॥

చొక్కుచు నుండనె పట్టె సుద్దులు చెప్పనె పట్టె
వెక్కసపురతులకు వేళ లేదే
పక్కన శ్రీవెంకటాద్రిపతి నన్ను నిటు గూడె
నిక్కడ నే విన నోప నేల దూరేరే. ॥ ఇంత ॥ 209

సామంతం

వినవే యీ మాటఁ వెలఁది నీకు నీవె
అనవే నీ నోటనే అందుకు నుత్తరము ॥ పల్లవి ॥

పిలిచీఁ గదవె తాను బెట్టుగ సిగ్గు వడఁడు
పిలిచెటిపెద వెందో పిప్పి గట్టెను
కలయు మనీనె కమ్మటిని నన్నును
కలసే తన వురము కాయ గాచె నదివో ॥ వినవే ॥

నవ్వీఁ గదవె తాను నాతోనుఁ గమ్మటిని
నవ్వెటి తన చెక్కులు నంజు లాయను
పవ్వళించీఁ గదె నా పక్కనె తా నప్పటిని
పవ్వళించే యందె తన పను లెల్లఁ [1] దెలిసే ॥ వినవే ॥

చేతులు చాఁచీఁ గదె చేరి నా కాఁగిటికి నా
చేతికి లోనైనవారు చెలులెల్లాను
యీతల శ్రీవెంకటేశుఁ డిప్పు డిట్టె నన్నుఁ గూడె
యీతలాతలిపనులు యెన్ని కాయఁ గదవే. ॥ వినవే ॥ 210

336-వ రేకు సాళంగం

ఇంచుకంతా నెరఁగరు యేఁటిదే మీరు
మంచివారు గలితిరి మానరుగా చెలులు ॥ పల్లవి ॥

మంకుల వొట్టు వెట్టుక మాటలాడ మన్నమీఁద
యింకా నామాటలా యెరఁగరటే
అంకెల నన్నుఁ గలయు మనేరు దోసాలకుఁ
గొంకరు అప్పటి మీరు కూళలటే చెలులు

1. "దెలిసె" అని వ్రాసి "దె" పొట్టలోవి నున్నను తీసి "దె" గ తిద్ది "దెఁ

తోడనె వాదు వెట్టుక తొలఁగి వచ్చినమీఁద
యీడా నాడాఁ దగవులా యిదిఁ గొంతా
వీడనీ కాతని నా వెంటఁ దోడి తెచ్చితిరి
ఆడికెకు వెరవరు హంత లటే చెలులు ॥ ఇంచు ॥

యెదురెదురుకట్ల నింతకు వచ్చినమీఁద
అదిమి కాఁగిలింపించే రౌనే మీరు
అదన శ్రీవెంకటేశుఁ డంతలోనె నన్నుఁ గూడె
సదరాన నవ్వేరు జాణలుగా చెలులు. ॥ ఇంచు ॥ 211

సామంతం

చెల్లఁ బో యిందుకు నేల చిన్నఁ బొయ్యేవు
అల్లాడ నీ కేమైన నది నే నచ్చేరా ॥ పల్లవి ॥

సరి నెందు వొయ్యే వంటే సకినాలు వాటించి
తిరిగి తిరిగి వచ్చి తిట్టే వేరా
అరుదు నీ కింతైతే నందు వొయ్యేపనులకు
వెరవుతోడఁ జేటవేలుపులఁ జూడరా ॥ చెల్లఁ బో ॥

ఆరగించి పొమ్మంటే నదియునుఁ గాని దంటా
గోర నేసి ఆనవెట్టి కోపగించేవు
ఆరయ నీ మనసుకు ననుమాన మైతేను
పోరచి నీ పొరుగునఁ బోచిఖ్ఖ చల్లరా ॥ చెల్లఁ బో ॥

వొగి నీకు మొక్కినాను వొకచోటి కేఁగేవేళ
తగ దంటా నీకు నీవే తప్ప నాదేవు
జిగి నన్నుఁ గూడితివి శ్రీవెంకటేశ యిట్టె
[1]పొగరుల నిఁకఁ బోయి పులుగు నర్చించరా. ॥చెల్లఁ బో॥ 212

బౌళి

నే నెంత చిన్న నైనా నీకే సులభము గాని
పూని నా సరివారికిఁ బొడవే సుమ్మీ ॥ పల్లవి ॥

---

1. "పొరుగుల" అని వ్రాసి "రు" ను "గ" చేసి "గు" ను "రు" చేసి "పొగరుల" అని తిద్ది యున్నారు.

యిచ్చకపుపతివి నీ వేమన్నా నితవే నాకు
  కొచ్చి కొచ్చి తిట్టినాను కోప మున్నదా
  తెచ్చుకొన్న నీసతులు తేనెల మాఁటాడినాను
  మచ్చరము లై పెరిగి మర్మములు నాఁటురా ॥ నే నెంత ॥

నీఁటునఁ బ్రాణవిభుఁడ నీవేమి సేసినా
  వాఁట మై మొక్కుదుఁ గాక వాసి వట్టేనా
  నాఁటకపు సవతులు నయగారాలు సేసినా
  యీఁటెల పోట్లే కాక యింత కోపేనా ॥ నే నెంత ॥

చేరి నన్ను నేలినట్టి శ్రీవెంకటేశ నీవు
  యేరీతి నుండినాను యెరవున్నదా
  సారెకు నీవు ముట్టినసవతులు వద్ద నున్నా
  నీరసమె రేఁగుఁ గాని యీయకోలు గాదురా. ॥ నే నెంత ॥ 213

గుండక్రియ

చీ చీ యిందుకే పో సిగ్గయ్యీ నాకు
  యేచి యంతరు మాలిన యీడు జోడు లేలరా ॥ పల్లవి ॥

చెప్పిన ట్టెల్లా నేను సేసేఁ గాని యిందరితో
  వొప్పగు వరుసవంతు లొల్లరా యింక
  యెప్పుడు నీ [1] దీవెనె యిదె నన్ను మన్నించుట
  కప్పి వల పెల్ల నొక్కగాడిఁ గట్ట వద్దురా ॥ చీ చీ ॥

అంది నీ యా [2] నాజ్ఞలోన నణఁగి వుండేఁ గాని
  సందడిలో కొలువులు చాలురా నాకు
  ముందు నీవు నావాఁడవె మొక్కేఁ గాని గాజు దెచ్చి
  చందపుమాణికముతో సరి సేయ రాకురా ॥ చీ చీ ॥

సరుసఁ గూచుండేఁ గాని జంగిలి విడేలలోన
  వారిమెకుఁ జేయి చాఁచ నోపరా నేను
  గరిమె శ్రీవెంకటేశ కాఁగిటఁ గూడితి విట్టె
  పరగఁ దెల్లని వెల్లాఁ బా లంటా నుండకురా. ॥ చీ చీ

1. "దీవినె" అని వ్రాసి "వి"ని "వె"గా మార్చి "దీవెనె" అని తిద్దియు
2. "యానిజ్ఞ" అని వ్రాసి "యానాజ్ఞ" అని తిద్ది యున్నారు.

శంకరాభరణం

[1]చేరి నీకుఁ దగ బుద్ధి చెప్పుఁ గాక
వే రొకతె నీచేత వేఁగఁ బోయీనా ॥ పల్లవి ॥

అచ్చట నీ వెవ్వతెనో అంటుకొన్నది చాలక
యిచ్చగించి నాతోఁ జెప్ప విది యొకటె
నిచ్చ నేఁ గాఁగానె కాక నీచేత మరొకతె
పచ్చి వెచ్చి రోఁతలఁ బడఁ బోయీనా ॥ చేరి ॥

కానకుండ వింతసతిఁ గైకొన్నదిఁ గాక నన్ను
దానిపేరఁ బిలిచేవు తగురా నీవు
కానీరా నాకంటె వేరె గయ్యాళి దొక తైతె
పూనిన నీ సుద్దులకు వోరుచు కుండీనా ॥ చేరి ॥

వీదిఁ బోయేదానితోడ వెస నవ్వుతాఁ గాక
యీదెసకుఁ బిలిచేవు యింత వలెనా
వేద దీర నిను శ్రీవెంకటేశ కూడితిని
ఆదరించి వింతది నీ వాడిన ట్లాడీనా. ॥ చేరి ॥ 215

ఆహిరి

ఎంత చెప్పినా మాన దిందాఁక నే మెల్ల
పంతపుఁ దమ కోపాలు పచరించఁ బట్టెను ॥ పల్లవి ॥

ఆలవట్టముగాలికి అంగన పయ్యద జారి
పాలిండ్లు గాన రాఁగాఁ బతిఁ గాఁగిలించెను
మేలు మేలు దీని నేఁడు మెచ్చవలె నిందుకే
వోలి నూరకున్నవారి నొక్కటిగాఁ జేసెఁగా ॥ ఎంత ॥

కప్పురము నోటి కీఁగా కాంత చలిగొని పతి
కప్పినపచ్చడమే కప్పుకొనెను
కుప్పలుగా దీనినె కొనియాడవలె నేఁడు
తప్పక చూడనివారిఁ దగులుగాఁ జేసెను ॥ ఎంత ॥

1. "చేలి" అని వ్రాసి "చేరి" అని దిద్ది యున్నారు.

పన్నీరు ఛల్లఁగాను పడఁతిమై పులకించి
తన్నుఁ దానె సిగ్గువడి తల వంచి నవ్వెను
అన్నిటా మొక్కఁగ వలె నందుకే నేఁడు దీనికి
యెన్నఁగ శ్రీవెంకటేశు నింతినిఁ గూడించెను. ॥ ఎంత ॥ 216

337-వ రేకు శంకరాభరణం

అప్పటి నుంటిఁ గోప మాఁప లేను
వొప్పుగ నీవే నాకు వొడఁబడఁ జెప్పరా ॥ పల్లవి ॥

మేఁటి వై నీ వొక్కఁడవే మేడమీఁద నుండితివి
ఆఁటది మాఁటలాడిన ట్టాయ నందు
యేఁటికి బొంకేవు నాతో యెవ్వతెఁ దెచ్చితి వోరి
నాఁటకుఁడ నా మనసు నమ్మించరా ॥ అప్పటి ॥

నిద్దిరించి పానుపుపై నీవే యంటా నుంటి
యిద్దరుఁ బవళించినయిర వున్నది
వద్దురా మరఁగు నాతో వనిత నెందు దాఁచితి
గద్దరీఁడ నాలోని కలఁ కెల్లఁ బాపరా ॥ అప్పటి ॥

కాఁగిటిలో నీవు * నేనుఁ గలసితి మిద్దరము
రేఁగి నీ మేనిపై వింతరేక లున్నవి
దాఁగ వీ పసులు నేఁడు దక్కితి శ్రీవెంకటేశ
పాఁగినజాణఁడ నాతోఁ బలికి మెప్పించరా. ॥ అప్పటి ॥ 217

సామంతం

ఎప్పటి కెప్పటి వాదు లిఁక నేఁటికి
కుప్పలుగాఁ బంత మిచ్చేఁ గూచుండఁ గదరా ॥ పల్లవి ॥

ఊరకున్నవారి మమ్ము నుడికించి నవ్వ నేల
ఆరయ నా మాఁటఁ బడి యలుగ నేల
కూరిమి గలుగువారు కొసరితే నే మాయ
మేరతోనె వేఁడుకొంటి మెచ్చి నన్నుఁ జూడరా ॥

* రే. పా. నను.

చింతతో నుండిన నాపైఁ జేయి చాఁచ రా నేల
యింతలో విదిలించి వేయించుకో నేల
యింతు లైనవా రేమన్నా నే మాయఁ బురుషులకు
రంతు లేల నీకు మొక్కే రారా మా యింటికి ॥ ఎప్పటి ॥

పాయపువారిఁ గూడి పాసి కొంత వేఁచ నేల
నేయరానిచేఁతఁ బడి సిగ్గు లిం తేల
యీయెడ శ్రీవెంకటేశ యిట్టె నే నిన్నుఁ గూడితి
కాయము గాయముఁ గూడె కడమ మా టాడరా. ॥ఎప్పటి॥ 218

గౌళ

తా నెంత నే నెంత తగునా తాను
తేనె వూసి మాటలను తేలించీఁ దానూ ॥ పల్లవి ॥

రమ్మనఁగా తనతో నే రా నంటినా నాకు
అమ్మరో ప్రియము చెప్పీ న దేమే తాను
కమ్మి సారెకు నలుగఁ గడదాననా
చిమ్ముచు నా కిచ్చకాలు సేయ నేలే తానూ ॥ తా నెంత ॥

చలమునఁ దన మాఁట జవదాఁటేనా
చెలులచేఁ జెప్పించీ చెల్లఁబో వీఁడు
చలిమి బలిమి నాతో సారెఁ జెల్లదా
వెలి న న్నొడఁబరచీ వెర పేలే తానూ ॥ తా నెంత ॥

యితరులవలెఁ దన్ను నెగ్గు లెంచేనా
అతివినయాలు చేసీ నౌనే తాను
యిత వై శ్రీవెంకటేశుఁ డిట్టె కూడెను
మతిలోని వెలుతులు మరి యాలే తానూ. ॥ తా నెంత ॥ 219

సామంతం

ఇంత నేరకున్నవాఁడె యిన్నిటాఁ గూళ
వంతు వాసు లెంచకుండేవాఁడె జాణ ॥ పల్లవి ॥

కూరిమితో నాఁడువారు కోపగించినట్టివేళ
వైరము లేక నవ్వేటివాఁడు వో జాణ
ఆరయ నలుకతోడ నట్టె యంత దిట్టినాను
గారవించి వేడుకొన్నఘనుఁడు వో జాణ ॥ ఇంత ॥

అలిగి ప్రాణేశ్వరి అవ్వలిమో మైనవేళ
వలపుతో బుజ్జగించేవాఁడు వో జాణ
చలి వేఁడి సిగ్గుతోడ సటలకు బిగియఁగా
బలిమి సేసి పైకొన్న పతియ పో జాణ ॥ ఇంత ॥

అల్లప్పుడే రావైతి వని సాదించేవేళ
వల్లె వేసి చెక్కు నొక్కేవాఁడె జాణ
వెల్లవిరి గాఁగ శ్రీవెంకటేశ కూడితివి
చల్లని నీవంటి మంచి సరసుఁడే జాణ. ॥ ఇంత ॥ 220

ముఖారి

తతి గాని తతి నేల తమకించేరే
మతిలోని నొప్పి గొంత మాన నియ్యరే ॥ పల్లవి ॥

పతిఁ బాసి వున్నదాన బలు విరహపువేళ
యిత వంటా విరులు నా కేల యిచ్చేరే
రతిరాజునమ్ము లివి రంట దెప్పరపువేళ
కతుకున నాఁటుఁ జేసు గవిశన నిదరే ॥ తతి గాని ॥

కందువ జవ్వనమునఁ గావరించి వున్నవేళ
యింద మంటా గందము నా కేల పూసేరే
మందమారుతాన కవి మచ్చు చల్లే చొక్కుమందు
యిందు కేల పెట్టెఁ గట్టి యింటిలోన నిదరే ॥ తతి గాని ॥

శ్రీవెంకటేశువొద్ద సిగ్గువడి వున్నదాన
చేవ దేర నిప్పు డేమి సింగారించేరే
యీవల నాతఁడు గూడె యీ సొమ్ము లిన్నియును
వేవే లాతఁ డిచ్చినవె వేగిర పడకురే. ॥ తతి గాని ॥

సాదరామక్రియ

నీవే నాపై బత్తి యైతే నేఁ డి ట్లేఁటి కయ్యా
కావరపు నీ బత్తి కల్ల యేమో కాక ॥ పల్లవి ॥

కొప్పు వీడెఁ గదరా కోరి నీకు మొక్కఁగాను
యొప్పుగా నే నీకు మొక్కే దొమ్మరదో కాక
దప్పి గొంటిఁ గదరా తగ నీతో నవ్వఁగాను
అప్పటి నీతో నవ్వు లయి రావో కాక ॥ నీవే ॥

కాలు జారెఁ గదరా కమ్మి నీ కెదురు రాఁగ
తూలుచు నీ తెరువు రా దోసమో కాక
వోలిఁ జెమరించెరా వొగి నిన్నుఁ జూడఁగాను
తాలిమి నిన్నుఁ జూచేది తగనిదో కాక ॥ నీవే ॥

కాఁక రేఁగెఁ గదరా కాఁగిట నిన్నుఁ బట్టఁగ
వేఁకపు నీతో రతి వెంగెమో కాక
యేఁకట శ్రీవెంకటేశ యిత వాయఁ గదరా
మాఁకు పద మరుఁ డింత మరిపెనో కాక ॥ నీవే ॥ 222

338–వ రేకు మాళవిశ్రీ

ఎంత కెంత నేసేవు యేరా [illegible]
పంతగాఁడ మేలు మేలు పైకొని వచ్చేవు ॥ పల్లవి ॥

వాడివట్టి తీసేవు వోప నంటేఁ దిట్టేవు
పదఁతులతో నేర బలువా నీకు
అదరి నా వెంట వచ్చే వప్పులవానివలె
విడువ వింత పనికి వెరతురా నీకు ॥ ఎంత ॥

ఆదిగొని పై నొరగేవు అట్టట్టే పోతేఁ బట్టేవు
సాదులతోనే యింత చలమా నీకు
గోదిలి సాదించేవు గొనుకొన్న వానివలె
యీ దెస నీ గాతికిని యింత కోపఁ గలనా ॥ ఎంత ॥

కామించి నగ వచ్చేవు కాఁగిట బిగించేవు
యేమి నననివారితో యేతులా నీకు
దోమటి దొడికితివి దొడ్డచుట్టమువలెనె
నేమపు శ్రీవేంకటేశ నీవె నే నయితిరా. ॥ ఎంత ॥ 223

కాంబోది

ఏమి సేయు మన్నఁ జేసీ యెరపరికము లేల
చే ముంచితి నా యడకు శిబ్బితి పడకురా ॥ పల్లవి ॥

చేరి నాతో నేమో మాట చెప్ప వచ్చినవాఁడవు
కోరి యంతలోనే గుక్కకొందురా నీవు
వూరకే మా యింటిదాఁక నొంటి వచ్చినవాఁడవు
పోరచి పై యట్టె మళ్లి పోదురా నీవు ॥ ఏమి ॥

మొదల నాతో నవ్వ మొగ మెత్తినవాఁడవు
వదలి యంతలోఁ దల వంతురా నీవు
పదిమారులు నన్నుఁ దప్పక చూచినవాఁడవు
చెదరి యట్టె పరాకు సేతురా నీవు ॥ ఏమి ॥

యిట్టె నన్నుఁ గాఁగిటిలో యెచ్చరించినవాఁడవు
అట్టు కెక్క నీ మేను మఱతురా నీవు
గుట్టున శ్రీవేంకటేశ [1] కూడినట్టివాఁడవు
యిట్టైన వెనక ముందు లెంతురా నీవు. ॥ ఏమి ॥ 224

కేదారగౌళ

నీకు బాఁతి గాక ఆకె నేరుపులు మాకు బాఁతె
దాకొని యా సుద్ది నీతోఁ దడవ వచ్చితిమా ॥ పల్లవి ॥

అంత బత్తి గలవాఁడ వాకె నింటికిఁ గొంపోయి
చెంత నెత్తిఁ బెట్టుక పూజించ రాదా
యెంత లే దాపె మాఁటలే యీదఁ జెల్లఁ బెట్టి వచ్చే
వంతలో సాకిరి నిన్ను నడుగ వచ్చితిమా ॥

1. "కూడినట్టై" అని వ్రాసి "కూడినట్టి" అని తిద్ది యున్నారు.

మించి నీ వాపెకుఁ గడు మేలువాఁడ వైతేను
యెంచి నీ మేనిలో సగ మియ్య రాదా
మంచి దంటా నాపె నీడ మంతనానఁ బొగదేవు
యించుక కైనాఁ దేగ మియ్యఁగ వచ్చితిమా ॥ నీకు ॥

తిరముగ నాపెఁ గొని తెచ్చుకొన్నవాఁడ వైతే
యిర వై నీ గద్దెమీఁద నెక్కించ రాదా
వొరిమ శ్రీవెంకటేశ పురముపై నే నుందాన
సిరసు వంచేవు నీకు సిగ్గులు రేఁచితిమా. ॥ నీకు ॥ 225

సామంతం

నెఱజాణ విన్నిటాను నీ వెఱఁగవా
యెఱిఁగియును పతి నింత యెలయింతురా ॥ పల్లవి ॥

చలము సాదించఁ బోతే సతులు లోఁబడుదురా
పలపించి పైకొనవలెఁ గాక
బలిమిఁ బిసుకఁ బోతే పసురు వేసు విరులు
యెలజవ్వనిని నేఁడు యింత సేతురా ॥ నెఱజాణ ॥

రాజసానఁ దిట్టితేసు రాములు మరుగుదురా
తేజమున దగ్గరి బోధింతురు గాక
సాజము దప్పఁగఁ బోతే సరసమే విరస మౌ
వోజతోడి యీపె నింత వుడికింతురా ॥ నెఱజాణ ॥

పంతాలు నెరపఁ బోతే పడఁతులు లోఁగేరా
చెంత రతులఁ గూడి మెచ్చింతురు గాక
యింతలో శ్రీవెంకటేశ యిద్దరు నేక మయితిరి
అంత కంత కొాక రొాక రలయింతురా. ॥ నెఱజాణ ॥ 226

వసంతం

గుమితాన రేపు మాపుఁ గోసి [1]రాపించఁగ నేల
సముకాన దాని నన్ను జగడించ విడరా ॥ పల్లవి ॥

---

1. "రాపించంగంనేల" అని వ్రాసి "గ నే" లమధ్య నున్న "ం" ను చెరిపి "రాపించంగ నేల" అని తిద్ది యున్నారు.

దుండగాన నాపెచేతఁ దుటారము లాడించేవు
అండకు రావ ద్దంటే నే నట్టే మాననా
చండి పెట్టి యాఁటదాని జవ్వనము గాకు సేసి
కండ గట్టుకొంటేఁ జాలు కా దనేనా నేను ॥ గుమిఁతాన ॥

చన విచ్చి యాపె నాతో సరి వోరించఁగ నేల
తనువు నీ కిమ్మన్న దక్క నియ్యనా
మనసు రానివాఁడవు మాతోడి గొడ వేల
కొన. మాటాడితేఁ జాలు కొసరేనా నేను ॥ గుమిఁతాన ॥

యిద్దరిఁ గాఁగిలింపించి యేకము సేయఁగ నేల
అద్దో నీ చెప్పినట్టు సేయక మానేనా
గద్దరి శ్రీవెంకటేశ కమ్మటిఁ గూడితి నన్ను
వొద్ద నీ విట్టే వుంటే వొరసేనా నేను. ॥ గుమిఁతాన ॥ 227

శుద్ధవసంతం

ఎట్టు నమ్మ వచ్చురా యిటువంటి నిన్నును
వట్టి మాయలఁ బెట్టేవు వద్దు వద్దు తలరా ॥ పల్లవి ॥

మంచివానివలెనె నా మాటలు వెలుచుకొని
యెంచి చూచి నీలోనె యేల నవ్వేవు
చుంచుల నా చుట్టమవో సూఁకుబంటవో నీవు
అంచల నన్నియు నాయ నప్పటి నంటకురా ॥ ఎట్టు ॥

వలచినవానివలె వద్దికి రప్పించుకొని
తలఁపు చేకొని జాణతనా లాడేవు
యిల నీ గుణ మిదెయోయింతయు నా భాగ్యమో
కలపుకో లేక నేల కంటి నూరకుండరా ॥ ఎట్టు ॥

బత్తి గలవానివలె పట్టి యాకు మడి చిచ్చి
యిత్తల మదన మెత్తించి యెమ్మె చూపేవు
హత్తిన శ్రీవెంకటేశ అట్టె ఫలమో చలమో
చిత్తగించి కూడితివి సిగ్గు లేక నేలరా. ॥ ఎట్టు ॥

339-వ రేకు ముఖారి

ఊరకున్నవారితోడ వూరోప దన్నమాఁట
నేరుచుకొంటి నేను నీ వేమి నేసేవే ॥ పల్లవి ॥

చుట్టము లయినవారు సొలసి సొలసి యంత
తిట్టినా యెగ్గు లౌనా తేజమే కాక
వొట్టి నీవు కోపగించి వూరకే యే మనినాను
నట్టనడుమను నాకు నవ్వు వచ్చీనే ॥ ఊరకున్న ॥

చేతికి లో నైనవారు చెనకి యంత మీరినా
ఘాతలను హీన మౌనా ఘనతే కాక
ఘోతరించి నీవు నన్ను పూఁచి యేమి నేసినాను
జాతి నా మన సన్నిటా సమ్మతించీనే ॥ ఊరకున్న ॥

కాఁగిటఁ గూడినవారు కడుఁ దమకించినాను
మూఁగి వేసట వుట్టునా ముదమే కాక
యేఁగి వచ్చి శ్రీవెంకటేశుఁడ కూడితి నన్ను
వీఁగని నీ రతు లెల్ల విందు లయ్యీనే. ॥ ఊరకున్న ॥ 229

శంకరాభరణం

ఏఁటి జన్మ మెత్తితి నే నిదె నీకు వెగ టైతి
గాఁటపు నీకుఁ గుంటెనకత్తె నైన మేలూ ॥ పల్లవి ॥

చూచిన నీ చూపు లివి చుఱుకున నాఁటీ నన్ను
చేచేత నీ కేమి పగ చేసితి నేను
యీ చాయ నాకే వెఱచే వెవ్వతె నీతో నవ్వినా
కాచి గుండెదిగు లైతిఁగా నీకు నేను ॥ ఏఁటి ॥

ఆడిన నీ మాఁట లెల్ల అట్ట లదరించీ నన్ను
కోడెకాఁడ నీకు నెంత కొల మైతినో
వోడక యిందరిచేతా నొడఁబఱపించేవు
యీడ నీకు మోచి దిం పై యింతేసి అ ట్టైతిఁ గా ॥ ఏఁటి ॥

నడుమ నీ వలపులు నాకుఁ గాల్లఁ బెనఁగిని
కడు నీకు నెన్నాళ్ల సంగర మైతినో
యెడయక శ్రీవెంకటేశ నన్నుఁ గూడితివి
బడి బడిఁ గాచుకుండఁ బాలైతిఁ గా. ॥ ఏఁటి ॥ 230

సామంతం

వేవేలు దండాలు నీకు విడరా నన్ను
యీవల నింత లేకున్న యెట్లు దరించేవురా ॥ పల్లవి ॥

వాడుఁగన్నుల చూపుల వడి నాపై [1] నొరగేవు
యేడ నేరుచుకొంటివి యేరా నీవు
ఆడికెకు నామీఁద నంత బత్తి గలయట్టె
వీడె మియ్య వచ్చేవు వెరతురా నీకు ॥ వేవేలు ॥

నవ్వుల జాణతనాలు నయగారి వినయాలు
యెవ్వతె నేరిపెరా యేరా నీకు
పవ్వళించి యింతలోనె పైఁ గాలు చాఁచేవు
జవ్వని నింత యాఁప దోసమురా నీకు ॥ వేవేలు ॥

కామించి కలయు మని కాఁగిటిలో దైన్యములు
యేమి అభ్యసించితివి యేరా నీవు
చేముంచి శ్రీవెంకటేశ చెలఁగి కూడితి నన్ను
వాముల ని దెల్లా మరవకురా నీవూ. ॥ వేవేలు ॥ 231

బౌళిరామక్రియ

అన్నిటా ఘనుఁడు దాను అందు కేఁటిదే
వున్నట్టె చెప్పఁ గదరే వూరకుండ నేలా ॥ పల్లవి ॥

చెలులఁ దా నంపినాఁడు చెంత నే రాకుండఁగాను
అలిగి వుందానఁ దొల్లె అందు కేఁటిదే
కలఁగి ముంగోపమున కానివొట్టు వెట్టుకొంటి
పిలిపించ రాదు నాకు పిన్నదాన నేను ॥

1. "నెంరగేవు" అని వ్రాసి యున్న చెరిపి "నొరగేవు" అని దిద్ది

మంచి లేక లంపినాఁడు మొక్కితి నే నన్నాఁడు
యెంచితే నెం తయినఁ గద్దు యే మందునే
పంచుక యిందరిలోనఁ బంత మెల్ల నాడుకొంటి
అంచల నాకు రారాదు ఆఁటదాన నేను ॥ అన్నిటా ॥

సంగడిఁ గూచున్నాఁడు చన వెల్ల నిచ్చినాఁడు
యెంగిలిమో వడిగీని యే మందునే
సంగతై శ్రీవెంకటేశ్వరుఁ డిట్టె నన్నుఁ గూడె
చెంగట మెచ్చఁగ రాదు సిగ్గుతోడి నేను. ॥ అన్నిటా ॥ 232

పాడి

చిత్తమునఁ గలయట్టు సేతువు గాని
హత్తి మాకుఁ బని గద్దు అంపవయ్య మమ్మును ॥ పల్లవి ॥

విన్నపాలు సేయఁ బట్టె వెంటఁ దిరిగాడఁ బట్టె
నిన్నుఁ బొదుగుచు మాకు నేఁ డెల్లాను
కన్నెవద్ది కేఁగ [1]లేదు కలసుద్ది చెప్ప లేదు
అన్నిపనులును నాయ నంపవయ్య మమ్మును ॥ చిత్తమున ॥

యిచ్చకాలె ఆడఁ బట్టె యియ్యకోలె సేయఁ బట్టె
నెచ్చెలుల మిదె నీతో నేఁ డెల్లాను
వచ్చేది నెరఁగము వడి రాని దెరఁగము
అచ్చుపడెఁ జేఁత లెల్ల నంపవయ్య మమ్మును ॥ చిత్తమున ॥

తోవ నడవనె పట్టె తోడుక రానె పట్టె
నీవు నేముఁ జేరితిమి నేఁ డెల్లాను
శ్రీవెంకటేశ్వరుఁడ చెలితోడఁ గూడితివి
ఆవల వాకిట నుండే [2]నంపవయ్య మమ్మును. ॥ చిత్తమున ॥233

సామంతం

చేరి మెల్లనె పొందులు సేయ వచ్చేవు
నేరుపుల మాటాడేవు నే మరచితినా ॥ పల్లవి ॥

---

1. "వేదు" అని వ్రాసి "లేదు" అని తిద్ది యున్నారు. 2. "నుంపవయ్య" అని వ్రాసి "నంపవయ్య" అని తిద్ది యున్నారు.

అలిగి యప్పుడు నీతో నాడుకొన్నమాఁట లెల్ల
పలుకుఁబంతాలె కాక బతిమాలేనా
చెలిమి నీతో నింకాఁ జేయ వచ్చితేఁ గనక
పలుమారు నీ వప్పుడు పంగించ రాదా ॥ చేరి ॥

చేయి ముట్టి [1]నిన్నప్పుడు నేసినట్టిచేఁత లెల్ల
యీయెడ [2]దక్కించుకోక యిఁక మానేనా
వోయి నేఁ బ్రియాలు చెప్ప నొగి వచ్చితేఁ గనక
నాయెడ చూచి నీవు నవ్వ రాదా ॥ చేరి ॥

కొసరి యప్పుడు నిన్నుఁ గోపించినది యల్లా
పసు రెక్కుఁ గాక యిఁకఁ బంత మిచ్చేనా
యెసగి శ్రీవెంకటేశ యింతలో నన్నుఁ గూడితి
అసము దిగితేఁ గన కప్పు దన రాదా. ॥ చేరి ॥ 234

340-వ రేకు భైరవి

నవ్వేతా నేఁ దిట్టితేను నయ మిచ్చీనా
జవ్వనపు చల్లజంపు చలమరివాఁడు ॥ పల్లవి ॥

మింగినచదువు వోతే మిట్టి మీ సై పడ్డవాఁడు
కుంగినకొండకుఁ దల గుట్టుకొన్నాఁడు
ముంగిట నొకసతిని మోరతోపు సేసినాఁడు
సంగతిగ నీ పడుచుజగడాలవాఁడు ॥ నవ్వేతా ॥

అడిగేఁడు నేలకుఁ గా నాకస మంటినవాఁడు
గొడవకె తిరిగేటి కోపకాఁడు
అడరి వృత్తమురాలి నగ్గిబాస గొన్నవాఁడు
సడిఁ బెట్టి మేనమామఁ జంపినవాఁడు

1. "నిన్నప్పుడు" అని వ్రాసి "నిన్నప్పుడు" అని తిద్ది యున్నా

2. "దక్కించు" అనుచోట "వెక్కెక్కన్పు" అని కాబోలు చెకి చెరిపి "దక్కించు" అని తిద్ది యున్నట్లు తెలియుచున్నది.

చిల్లో యంటే పొల్లో యని సిగ్గు విడిచినవాఁడు
పెల్లు రేఁగి పరువులు పెట్టెటివాఁడు
యిల్లిదె శ్రీవెంకటాద్రి యెక్కి నన్నుఁ గూడె నేఁడు
బల్లిదుఁ డై దేవతల పట్ట మేలేవాఁడు. ॥ నవ్వుతా ॥ 235

ముఖారి

ఔనే నీ సుద్దులకు అడ్డము చెప్పఁగ రాదు
కాననియడల కైనఁ గలహాలు వుట్టవా ॥ పల్లవి ॥

యింటికి వచ్చెఁ జాలదా యేతువ లెత్తఁగ నేల
కంటు లేని దొడ్డవానిఁ గల్ల సేతురా
అంటి ముట్టి యిందు కెల్ల నాతఁడు గాఁగానె కాక
గొంటరి చెలుల కైనఁ గోపములు రేఁగవా ॥ ఔనే ॥

పంత మిచ్చెఁ జాలదా పై పై బిగియ నేల
చెంత నీ ప్రాణవిభునిఁ జిన్నఁ బుత్తురా
అంతే పో నినుబోఁటి కాతఁడే తగుఁ గాక
యింతయు మాకుఁ జూచితే యేవ వుట్టదా ॥ ఔనే ॥

చెక్కు నొక్కెఁ జాలదా చేతఁ దీసి వేయ నేల
దక్కి శ్రీవెంకటేశుఁ దప్పు లెంతురా
నిక్కము నాతఁడు నీవు నేరుచుకొంటిరి గాక
తక్కిన మావంటివారు తగ వందురా. ॥ ఔనే ॥ 236

*పాడి

ని న్ననఁగ దోసమురా నీకు సాజ మీ గుణము
యిన్నిటా నా మొగమోటే యింత దెచ్చె నాకు ॥ పల్లవి ॥

కక్కసించి పెనఁగేవు కటారికాఁ [1]డవా వోరి
వొక్కమాఁటె యిం తయితే నోపరా నేను

---

* రేకులలో రాగముపేరును దాని తర్వాత పల్లవిని వ్రాసి, ఆ తర్వాతనే కీర్తన మారంభింతురు. ఇచట "పాడి" అని వ్రాసి "పల్లవి" అని వ్రాయుట మరచి, రేకుల కిరుప్రక్కల వదలి యున్న స్థలమున "పల్లవి" అని చెక్కి యున్నారు.

1. "డవా" అనుచోట రెండక్షరములు చెరిపి "డవా" అని దిద్ది చెక్కినట్లు తెలియుచున్నది కాని చెరిపిన యక్షరములు గుర్తింప వీలు కాలేదు.

యెక్కు వైన సటకాఁడ వెవ్వ రిచ్చి రీ బిగువు
మొక్కలపువలపులు మొన లాయ నాకు ॥ నిన్ననఁగ ॥

అద్దగించు కొంటివి నా కప్పులవాఁడవా వోరి
గొద్దేరు నీ కొద్ది గాదు కోపము నాకు
యెద్దతనాలనె తొల్లి యెందరి భ్రమయించితి
వద్దితో నా నవ్వుతె పై వచ్చెరా నాకు ॥ నిన్ననఁగ ॥

[1]కూరిమిఁ గాలు చాఁచేవు కొనుకొంటివా వోరి
వూరకె పతికిఁ బతి వోపనా నేను
వేరు లేక నన్ను శ్రీవెంకటేశ కూడితివి
మేరతో నింత నోమితి మేలురా నాకు. ॥ నిన్ననఁగ ॥ 237

రామక్రియ

నేరుపరి వవుదువు నీ కే మమ్మ ఆతఁ
డీరానిచనవు లిచ్చె నిఁక నీ కే మమ్మ ॥ పల్లవి ॥

మావంటివారికె మన సియ్యఁడు గాక
నీవె ఆతఁడు గావా నీ కే మమ్మ
తోవల నీవును మాతో దట్టె సొలసే వాతఁ
డీవల నీయింట నున్నాఁ డిఁక నీ కే మమ్మా ॥ నేరుపరి ॥

మే మేమి చెప్పినాను మేరలు మీరుఁ గాక
నీ మాఁట దోయఁడు నీ కే మమ్మ
మోము చూచి మాకు మాకె మొగ మోడితిమి గాక
యేమర వాతని నీవు యిఁక నీ కే మమ్మా ॥ నేరుపరి ॥

వట్టి సట మా కై తె వరుస వం తిచ్చెఁ గాక
నెట్టుకొనె నిన్నతఁడు నీ కే మమ్మ
జట్టిగొని మమ్ముఁ గూడి సారె శ్రీవెంకటపతి
[2]విట్టె నీవుఁ గూడితివి యిఁక నీ కే మమ్మా. ॥ నేరు

1. "కూరిమికాలు" అని వ్రాసి "మిత్రా"ల క్రింద హంసపాది పే నుంచి "కా"ను "గా" గా చేసి "మింగాలు" అని తిద్ది యున్నారు.

2. "విట్టి" అని వ్రాసి "విట్టె" అని తిద్ది యున్నారు.

కాంబోధి

తెలిపించుకొ మ్మనవే దేశము వారిచేతనే
కులికి సారెకు నా కొం గేల పట్టీనె ॥ పల్లవి ॥

వాడలలో తననింద వడిఁ దెచ్చుకొనుఁ గాక
యీడ నన్ను నొట్టు వెట్ట నెంతవాఁడే
ఆడితిఁ బో వెరపా అందరు నాడెటిమాఁట
చూడవె తనకు నింత సులభమా నేను ॥ తెలిపించు ॥

సారెకు దేవుళ్లవొద్ద సత్యము నెరపుఁ గాక
వూర కైనా నన్ను ముట్టీ నుండఁ బట్టదా
తారుకాణించెఁ బోవె తగిలితే నిందరిని
వోరుచుకుండితే నూరకుండఁడు గా తాను ॥ తెలిపించు ॥

తనయింటిలోనఁ దానె తగవులు వెట్టుఁ గాక
విను నా తోవ వచ్చితే వెట్టీవాఁడే
అనఁగానె శ్రీవెంకటాధిపుఁడు నను( గూడె
మన సొక్కటాయ నేఁడు మరఁ గేలె యిఁకను. ॥ తెలి ॥ 239

రామక్రియ

ఏ మని యెంతునె వల పేరు లై పారఁగఁ జొచ్చె
కామించి కామించి లో లో కాయము మరచెనే ॥ పల్లవి ॥

పానుపుమీఁదనె వుండి పని గద్దంటాఁ బిలిచి
మానిని విభునిఁ జూచి మనసు దనియదే
పూని పట్టి నవ్వుతాను బుజముపైఁ జేయి వేసి
నానీఁ జెమటనీట నామాఁట వినదే ॥ ఏ మని ॥

ఆరగించి కూరలు చ వాయ నంటాఁ గళ్లు నేసి
చేరి పతి కం దిచ్చి సిగ్గు గొంతాఁ బడదే
పోరచిగా మాఁటలాడి పులకలఁ జిగిరించి
ఆరితేరీ జాము వోయ నంపు మన్నా నంపదే ॥ ఏ మని ॥

అట్టె నవ్వులు నవ్వి ఆన లెల్లాఁ బెట్టి పెట్టి
పట్టి శ్రీవెంకటపతిఁ బైకొని తాఁ గూడెనే
నెట్టన నుద్దాలు మెట్టి నిలుచుండి తమకము
మెట్టుక నెరపీఁ గాని మీఁదు కిం దెరఁగదే. ॥ ఏమని ॥ 240

341-వ రేకు నాగవరాళి

పొద్దు వోక నీవు నాతో బొంక వచ్చే వింతే కాక
గద్దించి నీవె ట్టుండినఁ గాదు గూడ దనేనా ॥ పల్లవి ॥

న న్నొడఁబరచకుర నమ్మికలు నేయకుర
ని న్నే మయిన నంటినా నీవు గొంకేవు
అన్నిట లోకమువారు ఆడుకొందు రింతే కాక
విన్న నీ సుద్దులు నేను వెల్లవిరి సేసేనా ॥ పొద్దు వోక ॥

యింత న న్నుబ్బించకుర యిచ్చకాలు నేయకుర
జంత నై ని న్నిఁక నే సాదించేనా
కాంతుఁడ నీ చుట్టాలు పక్కాలు నమ్మ రింతే కాక
మంతనాన నీపై నింద మరి వేసేనా ॥ పొద్దు వోక ॥

గడ్డము వట్టకురా కాఁగిట నించకురా
యెడ్డ నై నీమాటకు నే నెదు రాడేనా
వెడ్డు వెట్టి యిట్లు శ్రీవెంకటేశ కూడితివి
దొడ్డదొర వైన నిన్ను దూరు కెక్కించేనా. ॥పొద్దు వోక॥ 241

సామంతం

నావంటి సతులు తననగర నెందరు లేరే
భావమున తనుఁ దలఁచి బతికే నేనూ ॥ పల్లవి ॥

తగుల వలచుటె కాని తప్పు నేయుట లేదు
జిగి నేల పిలిచీనె చెప్పఁ గదరే
అగడు నేయఁగ మిమ్ము నంపెనా నేఁ దతఁడు
నగుఁబాటు గాక తనకు నాకుఁ బని యేమే ।

నవ్వు టొక్కటె కాని నసువు దొంగిలితేను
రవ్వ నాకడకుఁ దా రా నేఁటికే
పువ్విళ్ల నిది పూరకుండ నే లనుచునా
అవ్విభుఁడు చలముకొనె నాఁడుగోల యేలే ॥ నావంటి ॥

యిచ్చ లాడుట గాని యెందు వోతి వన లేదు
పచ్చిగా నా చెరఁగు పట్ట నేలే
అచ్చలాన శ్రీవెంకటాధిపుఁడు నన్నుఁ గూడె
తచ్చన లింతే కాక తానే నేఁ గానా. ॥ నావంటి ॥ 242

సాళంగనాట

చాలు నూరకుండవయ్య సడి కేల వచ్చినో
నాలి నే మోనాన నుంటే నన్నుఁ దడవేవా ॥ పల్లవి ॥

ఆడితి నే నొకమాఁట అందరివలెనె నేను
యీడ నెగ్గైనఁ జేసుకో యిత వైనఁ జేసుకో
వీడె మియ్య నే రాఁగా విందు వెట్టి పగ లాయ
వాడలో నాయింట నుంటే వాదు వెట్టుకొనేవా ॥ చాలు ॥

మగిడి చూచితి నింతే మగఁడ వంటా నేను
నగినా నగుమ కా దన్నా నన్నుఁ గా దను
వగచితి నీకు నేను వడిఁ జల్ల వేఁ డాయ
మగవాఁడ నై పట్టితే మచ్చరించేవా ॥ చాలు ॥

పాదము లొత్తితి నింతే బడలి వచ్చితి వంటా
నేదతో వెంగెము నీకు నేవగాఁ గైకొంటివో
ఆదరించి శ్రీవెంకటాధిప నన్నుఁ గూడితి
వేద దీర నే మొక్కితే వీడఁగ నాడేవా. ॥ చాలు ॥ 243

మధ్యమావతి

లేలే యిది యంత లేదు లేమలాల
కాలమందే మన మిది కన్నది గాదా ॥ పల్లవి ॥

వల పింత గలవాఁడు వడి నే నలిగి రాఁగా
పిలిచి మాఁటాడ రాదా ప్రియుఁ డప్పుడే
తలఁచుక తలఁచుక తా నేఁ డెవ్వరితోను
బెళకుప్రియాలు చెప్పి బేరి జోకొట్టినే ॥ రేరే ॥

తగ వెరిఁగినవాఁడు తారుకాణించఁగ నాతో
నగవు నేసుక నన్ను నమ్మించ రాదా
సగము నగము గొంకి సత్యము లెవ్వరితోడ
నిగిడించి మొక్కి యేరు నిద్దుర వుచ్చినే ॥ రేరే ॥

గక్కనఁ గూడెటివాఁడు కన్నీరు నించఁగాను
అక్కరతో నా వగ పారుచ రాదా
యెక్కువ శ్రీవెంకటేశుఁ డిప్పుడుగా నన్నుఁ బొందె
మిక్కిలి చెరువునీళ్ల మేలు వడసీనే. ॥ రేరే ॥ 244

కేదారగౌళ

నీవే జాణ నందు వాపె నీకంటేఁ గడు జాణ
యేవిధాన నీపంతా లిఁక నీడఁ జెల్లవూ ॥ పల్లవి ॥

కలికి పువ్వులచెండు కన్నులనె అద్దుకొంటా
వలపుతో వసివాడు వాడుకొంటాను
అలిగినదిఁ గాక అట్టె కూడినది గాక
మలయుచు చెలులతో మాఁటలాడీ నదివో ॥ నీవే ॥

పదిమారులును నిమ్మపం డెగర వేసుకొంటా
చెదరినచింతతోఁ జింతించుకొంటా
యెదుట నున్నది గాక యెడసినదిఁ గాక
వొదిగి మలగుపై నొరగీ నదివో ॥ నీవే ॥

మక్కువ యంతో వడికి మడిచినా కందుకొంటా
అక్కరతో వున్ను రన్ను రనుకొంటాను
యిక్కు వంటినదిఁ గాక యియ్యకొన్నదిఁ గాక
గక్కన శ్రీవెంకటేశ కాఁగిలించె నదివో. ॥ నీవే ॥

బౌళి

చూడవే యప్పటినేనే జూటరి నట
జాదలు తాఁ గట్టినపచ్చడమే యెరుఁగు ॥ పల్లవి ॥

ముప్పిరిఁ దా రా కుండఁగ [1]ముసుఁగు వెట్టుక వుంటి
అప్పటినేనే కల్ల నటవే చూడు
నెప్పునఁ దమవాళ్లిది నేర మందురా యెవ్వరు
తప్పులు నేసిన వెల్ల దయ్య మెరుఁగుఁ గాక ॥ చూడవే ॥

యెయ్యదకో తాఁ బోఁగా నిందుకు రమ్మంటి నింతే
గయ్యాళి నేనే యట కమ్మటిఁ జూడు
నెయ్యమునఁ దనతోడ నిజము నా దేడ కెక్కు
అయ్యో తనవాళ్లకడ మాతుమే యెరుఁగూ ॥ చూడవే ॥

చెంత దాఁ బిలుచుదాఁక సిగ్గున నుండితి నింతే
పంతము నాదే యట బలువు చూడు
యింతిరో శ్రీవెంకటేశుఁ డీప్పు డిట్టె నన్నుఁ గూడె
పొంతల తనతగవు పొరు గెల్లా నెరుఁగూ. ॥ చూడవే ॥ 246

342-వ రేకు శంకరాభరణం

ఊర కుండ నీరా మమ్ము నుడికించకా
గారవించే నీ నవ్వు గాలమువో నాకు ॥ పల్లవి ॥

చిఱుతనవ్వు నవ్వఁగా చెక్కు నొక్కి యెత్తి నన్ను
[2]కఱఁచేవు మరికొంత కారింపే కాదా
తఱి నీ మనసుననుఁ దలఁచిన ట్లుండు
గుఱిగా నదివో నాకు గుండెలోని అమ్ము ॥ ఊరకుండ ॥

మంచముపై నుండఁగాను మచ్చిక నావొద్దఁ బండి
ముంచి చేయి వేసే వది మోపే కాదా
యెంచి నీకుఁ జూడ నది యిచ్చక మైన ట్లుండు
తెంచరాని పొద్దు వొద్దు దిగులువో నాకు ॥ ఊరకుండ ॥

---

1. "ముసుకు" అని వ్రాసి "కు" ను "గు" గా తిద్ది "సు⁺గు" లకు పైన హంసపాది వేసి క్రింద "ం" మంచి "ముసుంగు" అని తిద్ది యున్నారు.

2. "కఱచే" అని వ్రాసి "ఱ⁺చే" లకు క్రింద హంసపాది వేసి పైన "ం" మున్న నుంచి "కఱంచే" అని తిద్ది యున్నారు.

భ్రమసి నే నుండఁగాను పట్టి నన్నుఁ గాఁగిలించి
తమకించే విది గొంత తగులే కాదా
అమర శ్రీవెంకటేశ ఆదరించి కూడితివి
చెమటలు నీకుఁ గాని సేసలువో నాకు. ॥ ఊరకుండ ॥ 247

## హిజ్జిజ్జి

పాప మంటాఁ దనమీఁద బత్తి సేయఁ బోతేను
కోపగించుకొన వచ్చీ కొమ్మలాల చూడరే ॥ పల్లవి ॥
అయ్యో యేమే తనకు నే నంటే నెంత సదరమే
కొయ్యగదే ముక్కునవే కోప మున్నది
చయ్యన నెవ్వతెతోనో జగడ మడిచి వచ్చీ
వొయ్యన నే నడిగితే నుడికిపడీని ॥ పాప మంటా ॥
చెల్లఁ బో నే నెంత దనచేతికల సత్తినే
పల్లదము దననోరఁ బైపై నున్నది
కెల్లు రేఁగి యాదనో తా గిజి గిజి యై వచ్చీ
కల్లగదె చూడఁ బోతే గదరుకొనీని ॥ పాప మంటా ॥
మేలు మేలె తన కెంత మిక్కిలి యనాదనే
కీలుకొని బొమ్మల జంకెన లున్నది
వే శిరిఁగి శ్రీవెంకటవిభుఁ డిట్టె నన్నుఁ గూడె
కేలు చాఁచి పెనఁగితే కేరుచు నవ్వీనే. ॥ పాప మంటా ॥ 248

## నాదరామక్రియ

మగవారి కేఁటి మేలు మరతురు వేగిరమే
బగివాయ కుండఁగానె పరాకై తైతివిరా ॥ పల్లవి ॥
ఆకె విలిచీ నంటా నట్టె విచ్చేసేవు గాని
పైకొని మా యింటికి రాఁ బాపమా నీకు
యీకడ నేఁ జూడఁగానె యించుకంత దయ లేక
కైకొని తోసి విచ్చేయఁ గా క్లెట్లాడెరా ॥ మగవా

అల్లది వచ్చి నంటా అక్కడ చూచేవు గాని
వొల్లనె మామొగ మైతే వొచ్చమా నీకు
తొల్లిటిదాననె నీతొడమీఁదఁ బం డుండఁగ
మల్లడి యంతదవ్వు నీ మన నెట్టు వారెరా ॥ మగవారి ॥
మంతన మది యాడఁగ మరిఁ జె వొగ్గేవు గాని
కొంత నామాట వింటే కొరతా నీకు
చెంతల శ్రీవెంకటేశ చెప్పఁగా నన్నుఁ గూడితి
వంతలోనె నీగుణము అ దెట్టు దిరిగెరా. ॥ మగవారి ॥ 249

శంకరాభరణం

ఇంత నీవు మన్నించుట యిందుకా నన్ను
వింతవారిఁ బతి వెట్ట వేడుకా నీకు ॥ పల్లవి ॥
ఆపె నన్ను నాడఁగా నే నాపెతో వా దడువఁగ
యేపున వినేవు నీకు యేమి గూడెరా
వోపి కల్ల గలవారి నొద్దంటే దోసమా
చేపట్టి నీ కేమి పగ నేసితిరా నేను ॥ ఇంత ॥
సవతి పగ చాటఁగ సారె నేఁ బగ చాటఁగా
భువిలోఁ జూచేది నీకుఁ బుణ్యమా నేఁడు
వివరించి మా మొర విచారించఁ దగదా
కవ కవ నవ్వి నవ్వి గండి గట్టుకొంటివా ॥ ఇంత ॥
చేతు లాపె చాఁచఁగాను చేరి నే నొట్టు వెట్టఁగ
యీతల నడ్డము రావు యిదె తగునా
జాతిగ శ్రీవెంకటేశ చన విచ్చితివి నాకు
యేతుల నిన్నుఁ గూడితి యిఁక నేల మరఁగూ. ॥ఇంత॥ 250

రామక్రియ

ఊరకున్నఁ బోనీవు వొక టొకటే రేఁచేవు
గోర గిరితే నే రా మాకూటమి కోపుదువా ॥ పల్లవి ॥

చిగురుఁగెమ్మోవి సోఁకఁ జేరి నే మాడెటిమాఁట
వొగరు లై తోఁచు నందు కోపుదువా
పొగరుతమ్మికన్నుల పూఁచి నేఁ జూచెటిచూపు
నిగుడునమ్ము లై తోఁచు నీ వోపుదువా ॥ ఊరకున్న ॥

కొండలవంటి చన్నులు కోరి నిన్నుఁ దాఁకించితే
వుం డుండె కుమ్మెలు వోవు నోపుదువా
బండిపంటి మాపిరుఁదు బడి నీకుఁ దగిలితే
అండ నీపైఁ బారుఁ జేసు నందు కోపుదువా ॥ ఊరకున్న ॥

చల్లు మావూరుపుగాలి సమరతివేళల
వుల్ల మెల్లఁ జిందు సేసు నోపుదువా
యెల్లగా శ్రీవెంకటేశ యిట్టె నన్నుఁ గూడితివి
పెల్లు రేఁగి నేఁడు నాతోఁ బెనఁగ నోపుదువా. ॥ఊరకున్న॥ 251

గౌళ

ఆపెమీఁద మోహ మైతే నౌదువు గాక
మోపుగా నా మీఁద నెపములు వేయ వలెనా ॥ పల్లవి ॥

నిన్ను నేమైన నంటినా నేనె తిట్టుకొంటిఁ గాక
కన్ను లెఱ్ఱఁ జేసి నీవె కాఁగి పదేవు
వన్నెల కెందో పొయ్యేవాఁడ వట్టె పోదు గాక
అన్నిటా నాతో నేఁడు అలిగి పోవలెనా ॥ ఆపెమీఁద ॥

చేరి నిన్ను దొబ్బితి నా చే వట్టకు మంటిఁ గాక
పారి పారి రొమ్ము దట్టి పగ చాటేవు
ఆరీతిఁ బెండ్లాడేవాఁడ వట్టె పెండ్లాడుదు గాక
యీరీతి వాదు వెట్టుక యింత సేయ వలెనా ॥ ఆపెమీఁద ॥

చెల్లఁ బో కైకో కుంటినా సిగ్గున నుంటిఁ గాక
వొల్లనె న న్నింత దూరి వోల వేసేవు
కొల్లగా శ్రీవెంకటేశ కూడితివి నన్ను నేఁడు
చిల్లర సతివి నాచేతి కియ్య వలెనా. ॥ ఆపెమీఁద ॥

343-వ రేకు వరాళి

చెల్లఁబో నీ చెప్పినట్టు సేయ నైతినా వోరి
కల్లతో నిజ మోపదు కల దింతే కాక ॥ పలవి ॥

కోపగించుకొన నేల కోరి వేఁడుకొన నేల
యేపున నిట్టె రెండూ యెద్దతనమే
పై పై చేఁదు దిన నేల పంచదార నంజ నేల
పూపవయసులవారి పుణ్య మింతే కాక ॥ చెల్లఁబో ॥

అట్టె కల్ల లాడ నేల ఆనలు వెట్టుకో నేల
యెట్టివారి కైన యివి యెద్దతనమే
మెట్టి చలిఁ బడ నేల మించి సీతు గాయ నేల
పట్టి వలచినవారి భాగ్య మింతే కాక ॥ చెల్లఁబో ॥

చలము సాధించ నేల సారెకు వగవ నేల
యెలమితో నివి రెండు యెద్దతనమే
పిలిచి శ్రీవెంకటేశ పెనఁగి నన్నుఁ గూడితి
పలుకుఁబంతాన నీ నా బలు వింతే కాక. ॥ చెల్లఁబో ॥ 253

ధన్నాసి

మోనాన నుందాన వేమే ముని వైతివా
మేనులు సోఁకిన మంచెమేళ మైన లేదా ॥ పల్లవి ॥

అలిగితే నే మాయ అట్టె వూరకుండ నేల
పలుకుల నైనఁ దూరఁ బాడి గాదా
మలయుచుఁ బోట్లాడే మాసటీలు సయితము
అలరి పగలు చాటే రది యైన లేదా ॥ మోనాన ॥

రా కుండితే నే మాయ రతి నాపై నెరపి
దాకొని చెప్పంప నైనఁ దగవు గాదా
కాకుగాఁ గొట్లాడేటి కడవారు సయితము
ఆకడఁ జేతులు చాఁతు రదియూ లేదా ॥ మోనాన ॥

పంత మైతే నే మాయ పైకొని నే వేఁడుకోఁగా
అంతట కోపము దీర నైనఁ జెల్లదా
వింతగా శ్రీవెంకటాద్రివిభుఁడ నింతే నేను
యింతలో నన్నుఁ గూడితి యెర వింత లేదా. ॥ మోనాన ॥ 254

ఆహిరి

ఏమి చూచేవు నావంక యిం దేమైన తప్పు [1]గద్దో
ప్రేమము నీ కొప్పించితి బిగు వింక నేలా ॥ పల్లవి ॥

నిక్కి నా విరహము నీకు మే లై తేఁ జాలు
ముక్క వోయి నా మోహములోన
వొక్కరి కైన నెలవు వున్నదిగా యీ బదుకు
చక్కని వో రమణుఁడ చాలదా యీజన్మము ॥ ఏమి ॥

చింతతోడ నే నుండేది నెలవు నీ కై తేఁ జాలు
పంతము దప్పెనా నాబలువుకును
వంతు వాసి కెక్కఁగా నా వగ పొకచోట నైన
సంత మైననాయకుఁడ చాలదా నాజన్మము ॥ ఏమి ॥

ఆసలచే వేఁగేది నీ కంత వేడు కై తేఁ జాలు
దోసమా నా సైరణకు దొండి వోయీనా
యీసు లేక శ్రీవెంకటేశుఁడ నన్నుఁ గూడితి
శాసించ నేఁటికి నిన్నుఁ జాలదా నా జన్మము. ॥ ఏమి ॥ 255

వరాళి

ఎప్పుడును వారు వారు నేకము గాక మానరు
యిప్పటికిఁ దగినట్టు యిచ్చకమె ఆడరే ॥ పల్లవి ॥

కొసరి విభునిఁ దిట్టి కోపగించి మాఁట లాడి
అసురుసు రై యలసి అట్టె పవ్వళించెను
పసగా నారగించదు పగలును యిప్పు డైన
అసము దించఁగ లేపి ఆరగించఁ బెట్టరే ॥ ఎ॥

1. ఏదో అక్షరమును చెరిపి "గ" అని తిద్ది యున్నారు. "గ" యక్షరము గుర్తింప వీలు కాలేదు.

తానె వొట్టు వెట్టుకొని తరుణి యాతఁ డిచ్చిన
కానుకకప్పుర మెల్లి కదఁ బారఁ జల్లెను
మోనమున దప్పి గొనె మంచి మీ రైన విడెము
ఆనవెట్టి యిచ్చి యిట్టె ఆకుమడి చియ్యరే ॥ ఎప్పుడును ॥

[1]వోవలనె వేగిరించి వూరకె నిందలు గట్టి
శ్రీవెంకటేశ్వరుఁ జూచి శిగ్గువడి వున్నది
కైవస మై ఆతఁడె గారవించి చెలిఁ గూడె
యీవల నూడిగములు యేమరక సేయరే. ॥ ఎప్పుడును ॥ 256

నాగవరాళి

ఎంత చెల్లుబడి నీకు యెవ్వ రిచ్చి రోరి నీకు
చెంత దొరతనము చెప్పి చూపేవా ॥ పల్లవి ॥

మౌనముతో నుండఁగాను మాఁట లాడించ వచ్చేవు
నే నాఁటదాన నై తే నేమము లేదా
పూని జలక మాడఁగఁ బొంచి యాడకు వచ్చేవు
మేనబావ వైనంతనే మేర మీరేవా ॥ ఎంత ॥

మోము వంచుకుండఁగానె మొక్కులు మొక్క వచ్చేవు
బాముతో జవ్వను లై తే బలువు లేదా
నోము నోమఁగానె చెక్కు నొక్కి రతికిఁ దీసేవు
యేమిరా నీవారు గై తే నింత సేసేవా ॥ ఎంత ॥

మంచముపై నుండఁగానె మరి కాఁగిలించేవు
అంచె నీవొద్దనుంటే అడ్డము లేదా
యెంచఁగానె శ్రీవెంకటేశ నన్నుఁ గూడితివి
కంచము[2]పొత్తున నుంటే కాఁక రేఁచేవా. ॥ ఎంత ॥ 257

సామంతం

తుదను దాఁచఁగ రాదు తోడ దిష్ట మై వుండఁగ
మది మది యి ట్లైతి మగఁ డూర లేఁడూ ॥ పల్లవి ॥

1. "వోవలన" అని వ్రాసి "వోవలనె" అని తిద్ది యున్నారు. 2. "పొత్తై" అని వ్రాసి "తై"ని "త్తు"గ తిద్ది "పొత్తు" అని తిద్ది యున్నారు.

యిందరితో నీ మాఁట యే మని చెప్పుదు నమ్మ
చెంది యీక్రిష్ణుఁడు చీర చిక్కించెను
అందము నేసుక నేను అణఁచుక వుండే నంటే
మంద నున్నాఁ డిదె [1]నామగఁ డూర లేఁడూ ॥ తుదను ॥

ముంచిన మా యింటివారి మొగ మెట్టు చూతు నమ్మ
పెంచిన క్రిష్ణునికిఁ గా బిడ్డఁ గంటిని
పొంచి లోనఁ బెట్టుకొంటే పొరుగిరుగుల నింద
మంచి దాయ బొంకే నంటే మగఁ డూర లేఁడూ ॥ తుదను ॥

వెనక చుట్టాలతోడ వియ్య మె ట్టందుదు నమ్మ
యెనసి శ్రీవెంకటేశుఁ డింట నున్నాఁడు
పనివడి నేఁడు వచ్చి భ్రమసి చూచీ నదె
మని కై యిన్నాళ్లదాఁక మగఁ డూర లేఁడూ. ॥తుదను॥ 258

344-వ రేకు లలిత

కపటము మాన వైతి కలకాలము
ఉపమ లింతేసి యాపె కున్నవా మొదలను ॥ పల్లవి ॥

యే మని చెప్పించితివో యింతితో యేకతమున
ఆమాఁట వింటానె ఆకె వచ్చెను
నీమతకమె కాఁబోలు నేఁడు నాతో జగడించీ
యీ మగువకు నిన్నాళ్లు యింత బలు వున్నదా ॥ కపటము ॥

సన్న యేమి నేసితివో సరి నాపెమోము చూచి
పన్ని నీ సంగడి వచ్చి పవ్వళించెను
కన్నెకు నీ యప్పణి కాఁబోలు నన్ను గద్దించీ
యెన్నఁ డైనా యీపె నాతో యీసడించ వచ్చునా ॥కపటము॥

యెప్పుడు నేరిపితివో యీపెకు నీగుణములు
వొప్పుగ నా కిటు మొక్కి వొక్క టాయను
తప్పు దీరఁ గూడితివి దగ్గరి శ్రీవెంకటేశ
మెప్పించితి నీవు నన్ను మే లిం తెరుఁగునా. ॥ కప



1. "చ" కాబోలు వ్రాసి చెరిపి "నా"గ దిద్ది యున్నారు.

దేసాక్షి

పని గలప్పుడు వచ్చి పలికేఁ గాని
వొనరి నీ యింటిలోనె వుండేరా నేను ॥ పల్లవి ॥

చిత్తము వచ్చినవేళ చేర వచ్చేఁ గాని నేను
అత్తి యందాఁక లోని కంపరా నన్ను
కత్తిఁ గోసిన ట్లయీఁ గడు నీమాఁటలు వింటే
వొత్తిలి దవ్వుల నైన వుండేరా నేను ॥ పని గల ॥

నిక్కము నే నాల నై నీతో నవ్వేఁ గాని
యిక్కువఁ దలవంచుకో నియ్యరా నన్ను
ముక్కు వట్టినట్లయీ మోహము నీవు చల్లితే
వొక్క నీసేవ సేసుక వుండేరా నేను ॥ పని గల ॥

వలసినప్పుడె నీవద్దఁ గూచుండేఁ గాని
యిల నందాఁక నలుగ నియ్యరా నన్ను
బలిమి శ్రీవెంకటేశ పట్టి నన్నుఁ గూడితివి
వొలిసే నీతలఁపులోన వుండేరా నేను. ॥ పని గల ॥ 260

మలహరి

నీవే యెరుఁగుదు వింతే నీచిత్తము
యీవేళ నే నోరిచితి యింకా నీచిత్తము ॥ పల్లవి ॥

చెంతల నవ్వ వచ్చేవు చెయి వట్టి పెనఁగేవు
అంతటి కోపితేఁ జాలు నైతే నీచిత్తము
యింతటిదొర వంటాను యేమీ ననఁ జాల నింతే
యెంత కెంత వెరచెనా యింకా నీ చిత్తము ॥ నీవే ॥

కప్పురము చల్లేవు కాలు మీఁద వేసేవు
అప్పటి పంతా లాడే వైతే నీచిత్తము
యిప్పుడె నీకు మొక్కితి నిందరునుఁ జూడఁగాను
యెప్పుడు నన్నేరఁగవా యింకా నీచిత్తము ॥ నీవే ॥

బెట్టి కాఁగిలించేవు పిప్పి సేసేవు నామోవి
అట్టె కానీ లేర అయితే నీచిత్తము
నెట్టన శ్రీవెంకటేశ నేఁడె నన్నుఁ గూడితివి
యిట్టైతే నేఁ గాదనేనా యింకా నీచిత్తము. ॥ నీవే ॥ 261

ముఖారి

ఇన్నిటా దొరవు నీవు యింత సేతురా
చన్ను లంటే విదె నీకు చల మాయఁగా ॥ పల్లవి ॥

చెఱఁగు మాసినవేళ చేరి పట్ట వచ్చేవు
కొఱ తంటా వద్దంటేఁ గోపగించేవు
మెఱసీ తొల్లిటి దోసమె నేఁ గురియఁగాను
నెఱి నిది యిప్పుడె నీకు బాఁ తాయఁగా ॥ ఇన్నిటా ॥

యింట నే భోఁ సేసేవేళ యెంగిలి ముట్ట వచ్చేవు
అంటకు మన్నంతలోనె అలిగేవు
వెంటనె నా నోటనుండి వేమారుఁ జిందఁగాను
జంటల నీ కదియును సర కాయఁగా ॥ ఇన్నిటా ॥

జలక మాడెటివేళ సంగడికి వచ్చేవు
తొల మంటే కాఁగిలించి దొమ్మి సేసేవు
మలసి శ్రీవెంకటేశ మలినముఁ బాయఁగాను
తిలకించే వది నీకు దిష్ట మాయఁగా. ॥ ఇన్నిటా ॥ 262

లలిత

నీ వేడ నే నేడ నేఁడు సిగ్గు వడఁ గాక
భావించి నీకొంగు వట్టబలువు నా కున్నదా ॥ పల్లవి ॥

నిగిడి పదారువేలు నెలఁతలు గల నీకు
జగతి నింకా సతులు సర కయ్యేరా
వగలతో నెరఁగక వలచినదాన నై
జిగి నా మగఁడ వంటాఁ జెప్పుకొనేఁ గాక ॥ నీ వేడ ॥

తొరలి సీత నడవిఁ దోసి రప్పించిననీకు
తరుణులమీఁదఁ గొంత దయ వున్నదా
గరిమ నీ భ్రమఁ బడి గతి లేనిదాన నై
పరులు చూడఁగ నీపాద మొత్తేఁ గాక ॥ నీ వేద ॥

తొడపై శ్రీసతిఁ బెట్టి దొడ్డకొలు వున్ననీకు
తడవి నాపొందు లింకాఁ దలఁ పయ్యీనా
యెడయక శ్రీవెంకటేశ కూడినదాన నై
బడి వాయక నీవొద్ద బతికితిఁ గాక. ॥ నీ వేద ॥ 263

రామక్రియ

చెప్పకువే నాతోడ చేరి నీసుద్దులు నేఁడు
కప్పిన నీ నేరు పెల్లాఁ గలది నాతోనా ॥ పల్లవి ॥

కానీ లేవె నే నతనిఁ గరఁగించ లే కుండితే
నానఁ బెట్టి కొంత నీవు నవ్వుదు గాని
పోనీ వూరకుండవే యేపొద్దుదాఁకఁ గెలసేవు
దాని కేమి నీ యాఁటదానితన మిందుకా ॥ చెప్పకువే ॥

కొంత సయించవె పతి కొరత దీయచ కుండితే
చెంతల నప్పుడె సంతసింతువు గాని
పంతము లిప్పు డేఁటికె పని గలప్పుడె కాక
యింత నంతటఁ బడెనా యిలు జాణతనము ॥ చెప్పకువే ॥

యిట్టె వోరుచు కుండవె యీతని రతిఁ జిక్కితే
వట్టి సట నీవు దోడై వత్తువు గాని
గట్టిగ శ్రీవెంకటాద్రిఘనుఁ డిట్టె నన్నుఁ గూడె
పట్టినచలము నీకు బందె దెచ్చినా. ॥ చెప్పకువే ॥ 264

345-వ రేకు ముఖారి

ఊరకున్న నన్ను నేల వుడికించ వచ్చేవు
చేరి నీకు యెంత పగ నేసితినో కాని ॥ పల్లవి ॥

కొంగు వట్టి తియ్యకురా కూచున్నదాని నన్ను
వుంగిటి నే రా నోప నొళ్లు నొచ్చీని
యింగితాన నన్నుఁ జూచి యించుకంత దయ లేవు
సంగడి నే నెంత పాపజాతినో కాని ॥ ఊర ॥

బలిమి శాయకురా పలుకఁగ నోప నీతో
అలి నామనసు వొకలా గయ్యీని
తలఁపు నీ వెరిఁగియు తతిగొని పోరేవు
యెలమి నే [1] నేఁటిజన్మ మెత్తితినో కాని ॥ ఊర ॥

కాఁగిలించి పట్టకురా కమ్మటి యిట్టె పొంది
వీఁగి నిన్నుఁ బాయ నోప వేస టయ్యీని
దాఁగక శ్రీవెంకటేశ తగ నన్నుఁ గూడితివి
రాఁగి యెంత భాగ్యవంతురాలనో కాని. ॥ ఊర ॥ 265

మంగళకౌశిక

చెలులాల మీరె యింత నేసితి రిద్దరి నేఁడు
కలయనిమాసటీలఁ గదియింతురా ॥ పల్లవి ॥

తక్కరీఁ డంటిఁ గదవే దంట వీఁ డంటిఁ [2] గదవే
అక్కడికతలే చెప్పీ నంటిఁ గదవే
యెక్కువ నాతో నాడేదె మాఁటకె మాఁట
యిక్కడికి వచ్చు టెల్ల యిందుకొరకా ॥ చెలులాల ॥

చలమరి యంటిఁ గదే చల్లజం పంటిఁ గదవే
అలపు సొలపె ఘన మంటిఁ గదవే
తలవాకిటనె వుండి తనకు నా కేఁటి పొందే
వలపు నామీఁదఁ జల్లేవరుసా యిది ॥ చెలులాల ॥

వేసదారి యంటిఁ గదే వేగిరకాఁ డంటిఁ గదే
ఆసలు చూపిన లో నౌ నంటిఁ గదవే
బాసతో శ్రీవెంకటాద్రిపతి నిన్ను నిటు గూడె
మోస మెల్లఁ దీరె నింక మొక్కించేరా. ॥ చెలులాల ॥

1. "నేఁటిజన్మ" అని వ్రాసి "నేఁటిజన్మ" అని తిద్ది యున్నారు.
2. "దగవే" అని వ్రాసి "గదవే" అని తిద్ది

మాళవిగౌళ

ఎంతైన నీగుణము యేల మానును
చింతతో నీకుఁ బ్రియము చెప్పుదుము గాక ॥ పల్లవి ॥

కడు నెదురు చూచి మాకన్నులె ఘనము గాక
వడి మాయింటికి నేఁడు వచ్చేవా నీవు
వుడివోనితమకాన వుండజాల కొకమాఁట
అడియాసలనె నిన్ను నాడుదుము గాక ॥ ఎంతైన ॥

నవ్వి నవ్వి యిదె మానదుమె సన్నము గాక
అవ్వలఁ గొంతైన లోనయ్యేవా నీవు
జవ్వనభారముచేత జడిసి నీభ్రమఁ బడి
పువ్వులపానుపుమీఁదఁ బొరలుదుఁ గాక ॥ ఎంతైన ॥

సారె నిన్నుఁ గాఁగిలించి చన్నులె గట్టాయఁ గాక
చేరువ నామేలు దలఁచేవా నీవు
కూరిమి శ్రీవెంకటేశ కూడి నేను తమకించి
యీరీతి నీవురమె యెక్కుకొంటిఁ గాక. ॥ ఎంతైన ॥ 267

సామంతం

నిక్కి నిక్కి చూచేవు నీ కేల నీకు
దక్కితిమి తొల్లె మాపైఁ దర వేలా ॥ పల్లవి ॥

కల్లరి వై నీవు రోలఁ గట్టువడుదువు గాక
గొల్లదాన నాతోడి గొడ వేలా
వుల్లసాన నీవు పాలవు లెక్కుదువు గాక
పిల్లఁగోవిరాగాలఁ బిలువ నేలా ॥ నిక్కి ॥

పిన్నవాఁడ వైననీవు పేయలఁ గాతువు గాక
కన్ను లారిచెటిమాతోఁ గాఁక లేలా
అన్నిటా నిందరిచేతి ఆడికెఁ బడుదు గాక
సన్నలఁ జాయల మాతో చల మేలా ॥ నిక్కి ॥

పుక్కిటి లోకాలు చూపి బూమెలు సేతువు గాక
కక్కసించి మాతోఁది కాఁపిరే లేలా
యెక్కువ శ్రీవెంకటేశ యిర వై కూడితి నన్ను
మిక్కిలి కృష్ణుఁడ నాతో మేకు లేలా. ॥ నిక్కి ॥ 268

సాళంగం

మేలు మేలు యిందుకె నే మెచ్చితి వీని
కే లెత్తి నే మొక్కితేను కినిసీనె తాను ॥ పల్లవి ॥

చిన్నఁబోయి వుండఁగాను నెలవి నే నవ్వితేను
మిన్నక నన్నుఁ గోపించీ మేలే వీఁడు
యెన్నిక నెవ్వతెచేత నేమి మాఁటఁ బడి వచ్చో
కన్నవారిమీఁద నెల్ల కసరీనె తాను ॥ మేలు మేలు ॥

తలవంచు కుండఁగాను దగ్గరి మాఁటాడించితే
మెలుపునఁ దిట్ట వచ్చీ మేలే వీఁడు
వలచి తా నెక్కుడనో వాదు వెట్టుకొని వచ్చి
పొలసి వొద్దివారితోఁ బోరీనె తాను ॥ మేలు మేలు ॥

గక్కన నొంటి నుండఁగఁ గాఁగిలించుకొంటేను
మిక్కిలి తాఁ బెనఁగీని మేలే వీఁడు
యెక్కుడనో శ్రీవెంకటేశుఁ దలిగి వచ్చి
దక్కినరతులకె తమకించీఁ దాను. ॥ మేలు మేలు ॥ 269

పాదరామక్రియ

చిమ్ముచుఁ దియ్యనినోరఁ జేఁ దేల
నెమ్మది నాకె వుండఁగ నే మేలా ॥ పలవి ॥

మన సిచ్చి నీతోడ మాఁట లాడేవారితోనె
అనవయ్య పోయి నీ వామాఁట
వెనకటిమాఁటలకె వేదనఁ బొరలేమమ్మ
చెనకి మరిఁ గొంత చింత రేఁచ వలెనా ॥ ట

మొగము చూచి నీకు మొక్కెటివారితోనె
నగవయ్య పోయి నీవు నయమునా
జగడించి పైఁ జేయి చాఁచి మూల నున్ననన్ను
తగిలి తగిలి యింకఁ దతి గొన వలెనా ॥ చిమ్ముచు ॥

పలుమారు సిగ్గుదేరి పారితెంచేవారినె
పిలువవయ్య పోయి ప్రియమునా
అలిగిననన్ను నిట్టె ఆదరించి కూడితివి
యెలమి శ్రీవెంకటేశ యింకఁ గొంత వలెనా. ॥చిమ్ముచు॥ 270

346-వ రేకు శుద్ధవసంతం

నే నెంత నీ వెంత నిక్కేమా యిది
కానీ లేరా యిది యొక్కకాకు సేసేజాడలా ॥ పల్లవి ॥

కోరి పేఁడి తగిలినగోపసతు లుండఁగాను
ఆరయ నా కొంగు వట్టే వల సతినా
మేరతోఁ బెండ్లాడినరుక్మిణిదేవి వుండఁగాను
యేరా నాతో నవ్వేవు యెగసక్కేమా ॥ నే నెంత ॥

చన విచ్చి మన్నించినసత్యభామ వుండఁగాను
చెనకేవు నే నీకుఁ జిక్కితినా
పనివడి తెచ్చుకొన్నపదారువే లుండఁగాను
ననుఁ జెక్కు నొక్కేవు నాఁటకములా ॥ నే నెంత ॥

గంద మిచ్చి మెప్పించినకలికి యొకతె యుండ
అంది నన్నుఁ గాఁగిలించే వాగడములా
కందువ శ్రీవెంకటేశ కలసితి విటు నన్ను
చిందేవు మోహము నాపై చిత్త మింత వచ్చెనా. ॥నే నెంత॥ 271

శంకరాభరణం

ఏల చెనకేవు నన్ను నిప్పుడె నీవు
తాలిమితోఁ బవరెటిదానఁ గాను నేను ॥ పల్లవి ॥

పూర కిట్టె నా మీఁద నొళ్లు[1] వేసితివి నేఁడు
కారణ మేఁటిదో కాని కంద మిఁకను
సారెఁ జుట్టి పట్టితివి జారినపయ్యదకొంగు
తేరకొన నిది యేమో తెలిసేరా నేను ॥ ఏల ॥

మన సిచ్చి నాతోడ మాఁటలాడే విదె నేఁడు
కొన మొద లేదో చూచుకొంద మిఁకను
చన విచ్చి మంచముపై సంగడిఁ గూచుంటి విదె
పని నిన్ను నడిగేరా పలుమారు నేనూ ॥ ఏల ॥

గక్కనఁ గాఁగిలించుక కందువ లంటేవు నేఁడు
యెక్కువగా నవ్వేరా యిందుకే నేను
నిక్కము శ్రీవెంకటేశ నీవు నన్నుఁ గూడితివి
మిక్కిలి నీజాడలకు మెచ్చేరా నేను. ॥ ఏల ॥ 272

శంకరాభరణం

ఏల వేగిరించేవు యింటిపని గద్దు నాకు
గోలవై వెలుపుల అరఁగుపై నుండవయ్యా ॥ పల్లవి ॥

మందలోన నున్ననేము మాపటంతఁ గాని రాము
దిందుపడఁ గొంగువట్టి తియ్యకువయ్య
పొంది ఆవులు దూడలుఁ బొలానఁ గలసుఁ జేసు
అందాఁకా నీవు మాయింటియాడ నుండవయ్యా ॥ ఏల ॥

చల్ల దచ్చి తచ్చి నేఁడు సందు లెల్ల నాకు నొచ్చు
వొల్లనె విదె మిమ్మనే వోపనయ్య
గొల్లఁడు దెచ్చినపాలకుంద లందుకొనవలె
యిల్లు చొచ్చి అట్టుగపై నెక్కు కుండవయ్య ॥ ఏల ॥

వెన్న గాఁచేవేళను విను మనఁ జాలను
చన్ను లేల పిసికేవు సారెకు నయ్య
యెన్నికతో శ్రీవెంకటేశ నన్నుఁ గూడితివి
పన్నిన మామంచముపైఁ బవ్వళించవయ్యా. ॥ ఏల

1. "వేసితి" అని వ్రాసి "వేసితివి" అని తిద్ది యున్నారు.

### శంకరాభరణం

లెస్స బుద్ధి చెప్పరే లేమ లిందరుఁ గూడి
వున్న రన్న రనఁగానె వొద్దికి నేఁ బోదునా ॥ పల్లవి ॥

పై పై నవ్వేవారితోడ పలుకఁగ వచ్చుఁ గాక
కోపగించఁగా కూరిమి గొసరఁగ వచ్చునా
యేపున రమణుఁ డయితే యెదురు రా నైతి నంటా
ఆఁప లేక తిట్టఁగాను అందకుఁ బిలుతునా ॥ లెస్స ॥

వలచినవారితోడ వా దైన నమరుఁ గాక
యిలఁ బగవారితోడ యిచ్చకము చెల్లునా
కులికి యప్పుడు నేను గోరు దాఁకించితి నంటా
[1]అలిగేటివానికే ఆకుమడి చిత్తునా ॥ లెస్స ॥

ఆదరించేవారితోడ నంటి పొందవలెఁ గాక
గోదిలేటి మగవాని కొంగు వట్ట వచ్చునా
యీదెస శ్రీవెంకటేశుఁ డింత నేసి నన్నుఁ గూడె
పొదుకొని వుండఁగాను పంత మిచ్చే నందునా. ॥ లెస్స ॥ 274

### రామక్రియ

నే నున్న దెస యెంత నేఁడు దనవేడు కెంత
పానిపట్టి యింతలో నే బాఁ తైతినా ॥ పల్లవి ॥

అలిగి నే నవ్వలిమో మై వూరకుండేదాని
[2]వలరి పాదము లొత్తు మనీనె తాను
తలఁకి సిగ్గు వడఁడు తనకు నా కంత పొందా
మలసి తనచేఁతలు మరచెనా తాను ॥ నే నున్న ॥

చింతతోడ చెక్కు చేత సిగ్గువడి వున్నదాని
యింతలో నాకు మడిచి యిమ్మనీఁ దాను
మంతనా లాడఁగ వచ్చి మంచి [3]చుట్టమె నాకు
వింత దన కానోటనె వెళ్లైనా ప్రియము ॥ నే నున్న ॥

---

1. "తలిగేటి" అని వ్రాసి "అలిగేటి" అని తిద్ది యున్నారు. 2. "అలరి" అని వ్రాసి "వలరి" అని తిద్ది యున్నారు. 3. "చ్చుట్టమె" అని వ్రాసి "్చ" చెరిపి "చుట్టమె" అని తిద్ది యున్నారు.

పట్టెమంచముపై వొంటిఁ బవ్వళించి వున్నదాని
అట్టె తా వచ్చితిని లె మ్మనీనె తాను
దిట్ట యై శ్రీవెంకటాద్రిదేవుఁడు న న్నిటు గూడె
గుట్టునను గతి గూడుకొనెఁ గదె యిపుడు. ॥ నే నున్న ॥ 275

ముఖారి

ఇంకాఁ బెనఁగ నేల యింత చాలదా
వుంకువగా నింతపని కోరిచినదాననా ॥ పల్లవి ॥

వొద్దికి నే రాఁగానె వొక్కరితో మాఁటలాడే
వద్దో నాకు సిగ్గయ్యీ నంపరా నన్ను
పెద్దరికేలకె నేఁ బెనఁగెటిదాన నింతే
సుద్దు లెల్లాఁ గంటి నంత చులుకనిదాననా ॥ ఇంకా ॥

దగ్గరి నే నుండఁగానె తలవంచు కుందితివి
అగ్గల మయ్యీఁ గోప మంపరా నన్ను
సిగ్గుతోడి బతు కొక్క చీమం తయినఁ జాలు
యెగ్గు లెంచ మీఁద బెత్తు యెరఁగనిదాననా ॥ ఇంకా ॥

కాఁగిలించుకుండఁగానె కన్నులు మూసేవు నీవు
ఆఁగితిఁగా ని న్నిందాఁకా నంపరా నన్ను
చేఁగ దేరఁ గూడితివి శ్రీవెంక టేశ నన్ను
రాఁగిన నీపొందు లెల్ల రచ్చ వేసేదాననా. ॥ ఇంకా ॥ 276

347-వ రేకు సాళంగం

సమతారుకాణ లై తే చల మెంత యెక్కునో
అమర దింతక తొల్లె యలిగి యెరఁగను ॥ పల్లవి ॥

కోపగించే మాఁటలకు గురి గాఁగఁ బని లేదు
రాపుగా నావద్ది కింక రాకు మనరే
యేపునఁ [1]జెలులు చెప్పేయెదమాఁటలే చాలు
తీపుల నెన్నఁడుఁ దమ్మఁ దెగనా డెరఁగను ॥ సమతారు ॥

1. "జెలునె" అని వ్రాసి "జెలులు" అని దిద్ది యున్నారు.

దారి తప్పి నందుమీఁద దగ్గరి రాఁ బని లేదు
సారెకు నన్నుఁ బిలిపించకు మనరే
యీరస మణఁగుదాఁక యేకతములే మేలు
బీరమునఁ దనతో నేఁ బెనఁగి యెరఁగను ॥ సమతారు ॥

బలిమి లో నైన మీఁదఁ బంత మాడఁ బని లేదు
వొలిసి కాఁగిట నిట్టె వుండు మనరే
యెలమి శ్రీవెంకటేశుఁ డింత నేసి నన్నుఁ గూడె
మలసి తన కెదురు మాఁటా డెరఁగను. ॥ సమతారు ॥ 277

సౌరాష్ట్రం

నిజ మాడితేఁ గనక నీవే నాదేవరవు
గజరు నీచేఁతలకుఁ గలఁగీ నాచిత్తము ॥ పల్లవి ॥

యిందరు వినఁగ నిన్ను యెందు వోతి వంటిఁ గాక
నింద లే మైన నీకు నేఁ గట్టితినా
కందువ యింత గలితే గడించుకొందువు నీవు
అందుకె పో నిన్నుఁ గంటే నదరీ నామేను ॥ నిజ ॥

యింతు లెల్లఁ జూడఁగాను యి ట్టట్టు రమ్మంటిఁ గాక
వింతగురుతులు నీమై వెదకితినా
కాంతలఁ గంటేఁ జాలు కాకు సేయ నేరుతువు
యెంతై న నిందుకె మాఁట యియ్యకొనఁ జాలను ॥ నిజ ॥

నీ సతుల ముందరనె నే నిటు నవ్వితిఁ గాక
నేస వెట్టి నిన్ను గేలి సేసితినా
ఆసల శ్రీవెంకటేశ అట్టె నన్నుఁ గూడితివి
వేసరక యిందుకె పో వేఁడుకొందు నిన్నును. ॥ నిజ ॥ 278

దేసి

ఇటమీఁది పనులకు యిట్టె వేగిరింతునా
కటకటా [1]నే నంత కక్కూరితి సేతునా ॥ పల్లవి ॥

1. "నే నెంత" అని వ్రాసి "నే నంత" అని తిద్ది యున్నారు.

యెగ్గు లెంచేదాననా యే మేమి నీవు నేసినా
వొగ్గి నీకు నావయసు వొప్పింతుఁ గాక
దగ్గరి నీ కెవ్వతో తప్పఁ జెప్పె నింతే కాక
వెగ్గళపు టలుకకు వేళ మీఁద లేదా ॥ ఇటమీఁది ॥

వెంగె మాడేదాననా వే రొకతెతో నవ్వితే
అంగము నీ కెక్కినది యందుఁ గాక
ముంగిట నీ కెవ్వతో ముడివెట్టె నింతే కాక
కంగి నిన్నుఁ దిట్టే నంటె కా దనేరా వొరులు ॥ ఇటమీఁది ॥

చలపట్టేదాననా సారె నీవు వేఁడుకొంటే
తెలిసి నీతోఁ దెప్పలఁ దేలుదుఁ గాక
బలిమి శ్రీవెంకటేశ పట్టి నన్నుఁ గూడితివి
చెలులు నాతోడివారా చేతి కిచ్చే వాపెను. ॥ ఇటమీఁది ॥ 279

మాళవిశ్రీ

కానీ కానీ మీఁదటెత్తు కంటిమి లేరా
యీనెపమె నేనుఁ జేసే నెందు వొయ్యే వీఁకను ॥ పల్లవి ॥

సతి నిన్నుఁ గొంగు వట్టె సబలోన నుండఁగాను
రతికిఁ దీసుక పోయ రా ననఁగానె
యితరకాంతల కెల్ల నిదె చా లాయ నీఁక
యిత వై నీగుట్టు గంటి మెందు వొయ్యే వీఁకను ॥కానీ కానీ॥

మానిని నీ నోరిలోన మక్కువఁ దమ్ములమిడె
పానుపుపైఁ బడఁ దోసి పట్టుకోఁగానె
ఆనుక కడమవారి కప్పు తెచ్చిన ట్లాయ
యీనటన మాకుఁ జిక్కె నెందు వొయ్యే వీఁకను ॥కానీ కానీ॥

కలికి బూతులఁ దిట్టి కాఁగిలించి యంటఁ బట్టి
తలుపు మూసుక వుండెఁ దడవుగాను
లలి శ్రీవెంకటేశుఁడ లంచ మిచ్చి నన్నుఁ గూడే
విల నా కలవా టాయ నెందు వొయ్యే వీఁకను. ॥కానీ కానీ॥ 2

నాదరామక్రియ

ఏమి సేసినాఁ జెల్లురా యీవేళ నీకు
కామించి నీకుఁగా నేను కడు వలచితిరా ॥ పల్లవి ॥

వొల్లనివాఁడ వై వుండి వొక్కొక్కనెపము వేసి
కల్లయలుకలు గాఁ గాటారించేవు
చెల్లు లేరా నీకు నిది సేన పతులు గలరు
వెల్లవిరి నొక్కతెనె వెట్టి నైతి నేనెరా ॥ ఏమి ॥

యెందు వోఁ దలఁచితివో యెదో పని గడించక
విందువలెఁ బోయే నంటా వేగిరించేవు
నింద లేదురా నీకును నీ విట్టె మగవాఁడవు
అంగి పొంది నేనె నీకు అల నైతిఁ గదరా ॥ ఏమి ॥

చేరి నన్ను భ్రమించి నాచిత్తము చూడ వలసి
వారి వీరిఁ జూపి నాకు వాసి రేఁచేవు
యేర శ్రీవెంకటేశుఁడ యిట్టె నన్నుఁ గూడితివి
ధారుణి నీ రప మాయ తగు లైతిఁ గదరా. ॥ ఏమి ॥ 281

పాడి

ఏఁటి తలఁ పేఁటి పొందు యిస్సీ రోఁతరా
ఆఁటదాని బతు కెల్ల ఆగడమె ఆయఁగా ॥ పల్లవి ॥

చిత్తము రావలె నంటాఁ జెప్పిన ట్టెల్లఁ జేసితి
హత్తి యేమిటాఁ గరఁగ వయ్యో యేలరా
పొత్తుకు రా నైతి నంటా పూఁచి కోపించుకొంటివి
యిత్తల నీ నా పొందులు యింతలోని వాయఁగా ॥ ఏఁటి తల ॥

చనవరి నయ్యే నంటా పర వెల్ల వడపితి
మనసులో తమకాలు మాన వేలరా
మునుపె నే నవ్వ నంటా మోము ముడుచుకొంటివి
వెనకటి నామే లెల్ల వేరే వేరే ఆయరా ॥ ఏఁటి తల ॥

కందువ నెరవు లేక కాఁపురమెల్లఁ జేసితి
యిందులోన మెచ్చఁ జాల వింకా నేలరా
విందువలె నేఁటిదో శ్రీవెంకటేశ కూడితివి
చెందిన నా ఆయము నీ చేతికి లోనాయఁగా. ॥ఏఁటి తల॥ 282

348-వ రేకు దేసాళం

అయ్యో ఆఁడుఁదవము అంగడి వేయఁ దగున
యియ్యెడ నేఁ బ్రియమైతే యింత పచ్చి గలదా ॥ పల్లవి ॥
సిగ్గువడి నే నుండఁగఁ జేవట్టి తీసీఁ బైపై
యెగ్గెరఁగఁ డించుకంత యేమి నేతునే
దగ్గరనె వున్నవారు తరుణు లందరు నదే
బగ్గనఁ దాఁ బైకొంటే పకపక నగరా ॥ అయ్యో ॥
యిదివో వంచనతోడ యేమీ ననకుండఁగాను
యెదురు మాఁటాడు మవీ నేమి నేతునే
అదన నెదుటనె అత్తమామ లున్నవారు
వదరు లింతే లంటా వారైనఁ దిట్టరా ॥ అయ్యో ॥
ముప్పిరి మంచముమీఁద మొగి నేఁ బ దుండఁ గాను
యిప్పుడె తా నిలుచున్నాఁ డేమి నేతునే
అప్పఁ డిదె శ్రీవెంకటాద్రిపతి నన్నుఁ గూడె
దప్పి వోఁ బొరుగువారు తన్ను నే పొగడరా. ॥ అయ్యో ॥ 283

రామక్రియ

ఏ మంచిదాననై నీయెదుట నుండే నేను
వేమారు నూదితేఁ జల్ల వేఁడియై తోఁచురా ॥ పల్లవి ॥
నే నే మనిన నీకు నెరుసులై తోఁచీని
మౌనాన నుండేఁ గాని మాఁట లాడించకురా
వూవి నేఁ దొలుతె నీకు వొల్లనిదాన నింతే
తేనెలు వోయఁ బోయినా తెగి చేఁదే తోఁచురా ॥ ఏ ॥

కడు నే దగ్గరి యుండే కావ లై తోఁచీని
మొదసి వుండేఁ గాని యిట్టె పిలువకురా
గొడవ పెట్టుక నేను గుండెబెద రైనదాన
వదుమను గోఁ గిరివా నే రై పారురా ॥ ఏ మంచి ॥

పైకొని కాఁగిలించితే బలుము లై తోఁచీని
యేకతాన నుండేఁ గాని యిక్కువ రేఁచకురా
యీకడ శ్రీవెంకటే శ యెనసితిఁ గాని నిన్నె
నీకు నే నిజ మాదితె నిష్టూర మై తోఁచురా. ॥ ఏ మంచి ॥ 284

బౌళి

ఎప్పటి కప్పుడె కాక యింత గలదా
వు ప్పొలికి యినుమ డౌ నొక్కరీతి వచ్చునా ॥ పల్లవి ॥

అద్దో ర మ్మనుచు నీ వానలు పెట్టకువే
చద్దివల పేడ నైన సంగర మౌనో
[1]తిద్దుబడి నీ కిచ్చినదె మాఁటపట్టు దొల్లి
వుద్దండాన తప్పేఁదారు వూహించిన ట్టుండునా ॥ ఎప్పటి ॥

అంట నుందు మని నన్ను నంత వాలాయించకువే
అంటుకొని మరుఁ డేద నాయ మేసునో
మెంటుగా నీకు నిట్టె మీఁ దెత్తినవయసు
బందు నేసి యెవ్వతింటి పంచపాలు నేసునో ॥ ఎప్పటి ॥

కూటంటు మనుచు నన్నుఁ గొంగు వట్టి తియ్యకువే
చూచి చూచి యెవ్వ తైన సూటు వట్టునో
యేచి శ్రీవెంకటేశుఁడ యిట్టె నిన్ను నేఁ గూడితి
యీబాయతమకమున యిఁక నెంత నేసునో. ॥ ఎప్పటి ॥ 285

సాళంగం

ఇల్లాలి కిది వోజా యిచ్చకమే వలెఁ గాక
వొల్లనె అతఁడు దానే వొద్దికయ్యీఁ గాక ॥ పల్లవి ॥

---

1. "తిద్దంబడి" అని వ్రాసి "ం"ను 'ద్దు'తో చేర్చి కొంత చెరిపి 'తిద్దుబడి' అని దిద్ది యున్నారు.

పొత్తుకోలుమోహములు పొగి నెందాఁకా వచ్చి
హత్తి మనసునఁ గలయంతే కాక
తత్తరించి వాని వీఁకఁ దడవకురే మీరు
కొత్తగా దయ వుట్టితేఁ గోరి వచ్చీఁ గాక ॥ ఇల్లాలి ॥

పూసుక వాసుక వచ్చేపొందు లెందాఁకా వచ్చి
ఆసతోడ నంత నైతే నమరుఁ గాక
వేసరించ వీఁక నేలె వేఁగుదాఁకా నాతని
బాసతో నమ్మి వుండఁగఁ బాలించీఁ గాక ॥ ఇల్లాలి ॥

బలిమిఁ బట్టేకాఁగిలి బడిబడి నేల వచ్చీ
అలరుఁ గూరిమి సరి యైతేఁ గాక
యెలమి శ్రీవెంకటేశుఁ డిప్పు డిట్టె నన్నుఁ గూడె
యిలఁ దనసొమ్మెతి నిట్టె యేలీఁ గాక. ॥ ఇల్లాలి ॥ 286

వరాళి

అప్పటి నిచ్చక మాడే వట్టె నాకు
తప్పని బొంకని మంచి తగవరి వౌదువు ॥ పల్లవి ॥

చాపలాన మాయిద్దరి జగడాలు దిద్దవచ్చి
ఆపెమాఁటె వంక లొత్తే వప్పటినీవు
తీపు నీ కామాఁట లైతే తిట్టించుకొందు గాని
పోపో నే నందు కోప పోటిదొర వౌదువు ॥ అప్పటి ॥

యెదుట మాకల్లా నిజ మేరుపరచఁగ వచ్చి
ఆదె పతివాది వయ్యే వప్పటినీవు
బెదరితే నీ వాకెకె ప్రియము చెప్పుదు గాని
కదిసి నన్నుఁ బట్టకు కదు జాణ వౌదువు ॥ అప్పటి ॥

పెద్దు వెట్టి మమ్ము నేఁడు వేఁడుకొన విటు వచ్చి
అడ్డము లాపెకు వచ్చే వప్పటినీవు
వొడ్డినకోపము దీర వొక రొకరిఁ గూడితి
పెద్దవు గావు శ్రీవెంకటేశ్వరుఁడ వౌదువు. ॥ అప్పటి ॥

కన్నడగౌళ

చెప్పదుబుద్ధు లెందాఁక చిత్తములో నిలిచినె
యిప్పుడె నాకుఁగాఁ బ్రియ మేల చెప్పేరే ‖ పల్లవి ‖

తగులమి లేకుండితే తలఁపులో తమి లేదు
నగవులు లేకుండితే వనుహూ లేదు
తెగినపనులకును తిరిగి చూచుట రోఁత
యెగసక్కెనకు వాని నేల పిలిచేరే ‖ చెప్పదు ‖

చూపు నాఁట కుండితేను చుట్టరికమే లేదు
పై పైఁ బదర కుండితే బత్తే లేదు
తీపులు చాలనిమాఁట తియగ నాడుట రోఁత
యేపున వానితో మీరు యేల పోరేరే ‖ చెప్పదు ‖

జంటలు వాసి వుండే సమ్మతించుటే లేదు
వెంట వెంట రాకుండితే వేడుకే లేదు
నంటుతోఁడ నన్నుఁ గూడె నమ్మనిదె రోఁత *యింక
యింటిలో శ్రీవెంకటేశు నేల కొసరేరే. ‖ చెప్పదు ‖ 288

349-వ రేకు బలహంస

కానీ కానీ యిఁక నేల కడమ దీరుతు గాక
ఆన సుమ్మీ నీవు వచ్చి అట్టటు వోతేను ‖ పల్లవి ‖

ఆస యిచ్చుకొని వద్ద నాతఁడు నిలుచుండఁగ
వేసిన ట్టెల్లా నీకుఁ జెల్లదా నేఁడు
వోసరించి ముడివెట్టి వూర కాతఁడు నవ్వఁగ
యీసునఁ జేతులు చాఁచ యిఁక నెప్పుడే ‖ కానీ కానీ ‖

మంతనాన నేమో చెప్పి మౌనాన నాతఁ డుండఁగ
యెంతైనా వాదుకు రాక [1]యేల మావేవే
యింత విన్నుఁ జేసినట్టి యీతని దూరుత గాక
వింతగా వి న్నే మన వెత్తినా నేను ‖ కానీ కానీ ‖

---

* రే. పా. యింర్క.

1. "ఏవేల" అని వ్రాసి "వివే" లను చెరిపి "యే" వ్రాసి "యేల" అని దిద్ది యున్నారు.

వొకరి నవఁ జాలక వొప్పగిం చాతఁ డుండఁగ
అకట నీ రప మాయ నట్టె కాపీవే
వెకలి యై యిత్తరి శ్రీవెంకటేశుఁడు గూడఁగ
మొకమోట నుంటిఁ గాక మోసపొయ్యేనా. ॥ కాపీ కాపీ ॥ 289

దేసాళం

సాకిరి మీరే సుండీ సతులాలా
యీకడ నన్నే నేరా లెంచ రాదు రమ్మా ॥ పల్లవి ॥

వుడివోని తమకాన వొక టొక టాడ వచ్చీ
తడవము తాఁకము తా నేమే వీఁడు
నడుమ నే నే మన్న నానోరె గనమే
వుడుకు నూరుపుతోడ నూరకుండే నమ్మా ॥ సాకిరి ॥

చిత్తిణిగుణముతోడ చేతులు చాఁచఁగ వచ్చీ
బత్తి గలవానివలె పై పై వీఁడు
అత్తి నేఁ గోపగించితే నందరు నన్నే దూరేరు
కొత్త నివ్వెరగుతోడఁ గూచుండే నమ్మా ॥ సాకిరి ॥

యెవ్వరి [1]ముందర నైన యెమ్మెకే నవ్వఁగ వచ్చీ
పవ్వళించాఁ బోసీఁడు పదరి వీఁడు
యివ్వలఁ గడపరాయఁ డిదె శ్రీవెంకటగిరి
నివ్వటిల్ల నన్నుఁ గూడె వెయ్యమైతి నమ్మా. ॥సాకిరి॥ 290

మధ్యమావతి

పొదిగి మమ్ము రేఁచక పో పో నీవు
పొదరు లాడక నీవు పో పో నీవు ॥ పల్లవి ॥

గద్దరి నీమాఁటలకు కడ మొదలే లేదు
పొద్దు వోయ నలసితి పో పో నీవు
అద్దలించి నన్నే నీవు ఆన వెట్టి వచ్చేవు
బుద్ధు లంత నేరవు పో పో నీవు ॥ పొదిగి

1. "మనర్గడ" అని వ్రాసి కొట్టివేసి "ముందర" అని దిద్ది యున్నారు.

కడ నున్నయాఁడువారి కాలు దొక్క వచ్చేవు
 పొడవులు చూపక పో పో నీవు
విడు విడు నీసుద్ది వింతలా మా కేమి నీవు
 పుడుకక మ మ్మంత పో పో నీవు ॥ పొదిగి ॥

కెరలించ కంత మమ్ము కేరి నీగుట్టే చాలు
 పొరుగువారు నవ్వేరు పో పో నీవు
గరిమ శ్రీవెంకటాద్రికడపరాయఁడ నన్ను
 పురిగొనఁ గూడితివి పో పో నీవు. ॥ పొదిగి ॥ 291

కేదారగౌళ

ఆన లింకాఁ బెట్టుకొనే వౌరా నీవు
 కానవచ్చె నీచేఁతలె కనుకోరా నీవు ॥ పల్లవి ॥

కొప్పుపువ్వు లవె కందె గురుతుచెమట చిందె
 అప్పటినాతో బొంకే వౌరా నీవు
దప్పి దేరీఁ గెమ్మోవి తగిలెఁ [1]గన్నులకావి
 తప్పించుకొనేవు మాఁట తగురా నీవు ॥ ఆన లింకా ॥

చిటిలె గందపుఁబూఁత చెక్కు లెల్లఁ గడు రోఁత
 అటమటించేవు నన్నే అవురా నీవు
నిటలాన నలకలు నిండె మేనఁ బులకలు
 యిటువంటివా శ్లేల యేమిరా నీవు ॥ ఆన లింకా ॥

ముక్కున నిట్టూర్పుగాలి మొగాన నిద్దురజోలి
 అక్కడనుండె తెచ్చితి వౌరా నీవు
యిక్కడ శ్రీవెంకటేశ యిట్టె నన్నుఁ గూడితివి
 మిక్కిలి జాణ వౌదువు మేలురా నీవు. ॥ ఆన లింకా ॥ 292

ముఖారి

ఎంత వడి కెంత వడి యేమి దలఁచుకొంటివో
 యింత వాలిసీ నొల్లము లెరఁగ దాచెలియా ॥ పల్లవి ॥

1. "గమ్మల" అని వ్రాసి "గన్నుల" అని తిద్ది యున్నారు.

అప్పుడె మావిన్నపము లవధరించినవాఁడ
   విప్పు దేల అడిగేవు యిం కొక్కమాఁటు
   వుప్పరిగలోన నుండి వువిద నిన్ను ర మ్మని
   చెప్పి ర మ్మన్నది యింతే చిక్కిన వెరఁగము ॥ ఎంత వడి ॥

కచ్చుపెట్టి యల్లప్పుడె కాను కందితివి మాచే
   [1]వచ్చినప నడిగేవు వడి నిప్పుడు
   విచ్చేయు మనుచు నింతి వెనఁ గొంగువట్టు మని
   యిచ్చె మాకు నెల వింతే యి దేమి నెరఁగదు ॥ ఎంత వడి ॥

ముందె నేము రాఁగాను మించి నవ్వినవాఁడవు
   యిందుముఖిసుద్దు లిప్పు డే లడిగేవు
   కందువ శ్రీవెంకటేశ కలసె నాపె విచ్చేసి
   విందు నీకుఁ జెప్పు మన్నె వేరు సేయ నేరదు. ॥ఎంత వడి॥ 293

దేసాక్షి

[2]అప్పటి బీరముతోనె అట్టె వుండుదువు గాక
   పిప్పి సేసినందుమీఁదఁ బిసుకఁగ వత్తురా ॥ పల్లవి ॥

వొట్టి నీతో మాటలాడ నొల్ల నొల్ల ననఁగానె
   పట్టేవు నాకొంగు బలువా యిది
   చిట్టకాన వా దడిచి సిగ్గు గలవాఁడ వట్టె
   గుట్టున నుందురు గాక కొసరంగ వత్తురా ॥ అప్పటి ॥

ఆరయ నేఁ గోపగించి అన లెల్లఁ బెట్టఁగానె
   సారె నాతో నవ్వేవు చలమా యిది
   యేర నాతోఁ బంత మాడి యింటికి రా నన్నవాఁడ
   వూరకే వుండుదు గాక వొరయంగ వత్తురా ॥ అప్పటి ॥

తక్కరి నీసుద్దులకు తలవంచు కుండఁగాను
   మొక్కేవు నాకు నింకా మోహమా యిది
   యెక్కువ శ్రీవెంకటేశ యింత బత్తి గలవాఁడ
   వక్కరతో నుందు గాక అగడాలు వలెనా. ॥ అప్పటి ॥

1. "వచ్చినప నిడిగేవు" అని వ్రాసి "వచ్చినప నడిగేవు" అని దిద్ది యు

2. "ప్పటిబీర" అన్నచోట ఏవో అక్షరములు చెరిపి "ప్పటిబీర" అ
   పూర్వపు అక్షరములు గుర్తింప వీలు కాలేదు.

350-వ రేకు నాదరామక్రియ

ఇంతలోనివాఁడవా యేరా నీవు
చెంతల నీకే యివి చెల్లురా నేఁడు ॥ పల్లవి ॥

దగ్గరి రా వని నిన్నుఁ దమకానఁ దిట్టితేను
యెగ్గులు సిగ్గులు నెంచే వేరా నీవు
అగ్గల మైై నీతోడి అంకెకత్తైనా నేను
దగ్గరినంతాఁ గలిగె తగురా నాకు ॥ ఇంతలోని ॥

తప్పక చూడ వనుచు తామరఁ గొని వేసితే
యిప్పు డింతలో నలిగే వేరా నీవు
కప్పి నీకు నే వింత కంటకపుదాననా
చెప్పినంతాఁ గలిగెను చెలు లెల్ల నాకు ॥ ఇంతలోని ॥

పరవశ మైతి వని పక్కన గోర నూఁదితే
యెరవుగాఁ జూచేవు యేరా నీవు
సరవి శ్రీవెంకటేశ చన విచ్చి కూడితివి
సరవు లన్నియుఁ గలిగె చాలురా చలము. ॥ఇంతలోని॥ 295

పాడి

ఇయ్యకొన వద్దా నీ వింతట నైనా
అయ్యో యే మయ్య నీకు ఆసపడీఁ జెలియా ॥ పల్లవి ॥

చెక్కుల జవ్వాది జార చిరునవ్వు మోవిఁ దేర
నిక్కి చూచి మోహించె నీకు నల్లదె
చక్కని యా లలితాంగి సారె సారె మాఁటలలో
మక్కువ వలపు చల్లీ మదనరాగమునా ॥ ఇయ్యకొన ॥

తను వెల్లఁ జెమరించి తరి పులకలు నించి
మనసు నీ కప్పగించి మలసీ నదె
అనుఁగుఁబాయపునతి ఆడనుండి సన్న వేసి
తనుఁ దానె కరఁగిని దప్పి దేరే మోవిని ॥ ఇయ్యకొన ॥

ముచ్చట సిగ్గులు వీఁగ ముక్కున నూర్పులు రేఁగ
యిచ్చటికి విచ్చేసె నింతలో నాపె
పచ్చిగా శ్రీవెంకటేశ పడఁతి వి న్నిటు గూడి
తచ్చన నీతో నాడీ తమకపురతులా. ॥ ఇయ్యకొన ॥ 296

## శంకరాభరణం

కడవారు నవ్వేది కానవు గాక
గొడవల మమ్ముఁ జూచి గుద్దిరము లేఁటికే ॥ పల్లవి ॥

విందుఁ బరితాపమున నీ వేల సొలసేవు
అందనె నాతో నవ్వే వాతనిఁ జూచి
చంది పెట్టి మగవాని సాదించి వలవు మంటా
బందు నేసే యాఁటదాని బదు కేఁటి బదుకే ॥ కడవారు ॥

నిక్కి చూచే యాతని నీ వేల కోపగించేవే
మక్కువ నతఁడు నాతో మాఁట లాడఁగా
వొక్కటెపై తరితీ పై వుండెటివిభునిఁ జూచి
గుక్కిళ్లు మింగేదానిగుణ మేఁటి గుణమే ॥ కడవారు ॥

బలిమి శ్రీవెంకటేశుఁ బగ లేల చాటేవే
కలసి యాతఁడు నన్నుఁ గాఁగిలించఁగా
పిలువనిపేరటము ప్రియునివద్దికి వచ్చి
చలముకొనేటిదాని చల మేఁటి చలమే. ॥ కడవారు ॥ 297

## లలిత

తాలిమి చక్కన గాని తమక మెం తైనాఁ గద్దు
మేల మాడ వయ్య చెలి మీఁద మీఁద నున్నది ॥ పల్లవి ॥

వనిత పువ్వులవేసి వలపు నీపైఁ బూసి
తనుఁ దానె సిగ్గువడి తల వంచీని
మనసు నీపైఁ బెట్టి మాఁటలు మాతో నాడీ
పెనఁగి పిలువవయ్య పేరుకొని నీవు ॥ తాలి

వద(తి నీతో నవ్వి పాయపుటాసలు దవ్వి
చిదుముడి సిగ్గుతోడఁ జెమరించీవి
కదు వి న్నాట్టె చూచి కాయము మాపై వేసీ
వొ్డి వట్టి తియ్యవయ్య వొద్దికతో నీవు ॥ తాలిమి ॥

కలికి నీకాలు దొక్కి కమ్మటి నీకు మొక్కి
వలవనిసిగ్గుతోడ వడఁ బడీని
నెల పై శ్రీవేంకటేశ నిన్నుఁ గూడె తన్నుఁ దానె
అలమి పైకొన వయ్య అప్పటివి నీవు. ॥ తాలిమి ॥ 298

మంగళకౌశిక

నావలెనే నీవు నంటా నమ్మితి నేను
దేవర వవుత యింత తెలియరా నేను ॥ పల్లవి ॥

మంతనాన నాడినట్టి మాఁట లాకెతోఁ జెప్పి
పంతానకే నవ్వేవు పలుమారును
చింత మది దరికొని శిరసున వెల్లఁ బొచ్చె
యింతే శవుతఁ దొల్లి యెరఁగరా నేను ॥ నావలెనే ॥

నే నిచ్చినపదకము నీ వాకె మెడఁ బెట్టి
పూని యెమ్మెలు చేసేవు పూఁట పూఁటకు
కానీ లేరా అందు కేమి కాయ మెల్లా నుడికీని
యీ నీ గుణము నాఁడె యెంచ నైతి నేనూ ॥ నావలెనే ॥

పీఁటమీఁద నిన్నుఁ దెచ్చి పెట్టుకొంటే నీ వాపెను
పాటించి వద్దఁ బెట్టుక పాయఁగ లేవు
మాటాడి నే నలమేలుమంగ నంటాఁ గూడితివి
నీటున శ్రీవెంకటేశ వేరరా నేను. ॥ నావలెనే ॥ 299

వరాళి

మంచివాఁడ వౌదువయ్య మావివి అటుండఁగాను
మంచ మెక్కి చెలులతో మాఁట లేఁటి వయ్యా ॥ పల్లవి ॥

కామిని నీవు రాఁగానె గక్కన లేచి నిలిచి
దోమతెరమాటు కేఁగి తొంగి చూచీని
కోమల మయినసతిఁ గూచుండు మనవయ్య
జా మాయ నప్పటిమండి చాలు నీ సరసము ॥ మంచివాఁడ ॥

తప్పక నీవు చూడఁగ తరుణి సిగ్గున నవ్వి
వొప్పుగాఁ దల వంచుక వూర కున్నది
ముప్పిరి నీచేత నాకెమో మెత్తి మాటాడవయ్య
యిప్పు చింతవడి యాయ నేఁటి కీ సరసము ॥ మంచివాఁడ ॥

కొంగు వట్టి తియ్యఁగాను కోమలి మేను మరచి
వుంగిటి నీ మేనిమీఁద నొరగున్నది
అంగవించి శ్రీవెంకటాధిప కూడితి విట్టె
చెంగట నలమేల్మంగచేతి దీ సరసమూ. ॥మంచివాఁడ॥ 300

351-వ రేకు గౌళ

ఆటమీఁద నయిన ట్లయ్యీఁ గాని
సట లింతే తాముఁ దామే సంతము లయ్యేరు ॥ పల్లవి ॥

పలికినంతే చాలు పచ్చి సేయకురే యింతి
నలుక దేరినమీఁద నడిగేఁ గాని
చెలువుఁ డీసుద్ది వింటే చేర వచ్చునో రాదో
కలయిక కిద్దరినిఁ గదియింత మిపుడు ॥ ఆటమీఁద ॥

నవ్వినపాటే చాలు నానఁ బెట్టకురే మీరు
నెవ్వగ దీరితే బుద్ధి నేనే చెప్పేను
అవ్వల నీపా టైతే నాతనిఁ దేరుచ రాదు
దవ్వుల నిద్దరి సమతారుకాణ సేతము ॥ ఆట ॥

తానె చూచినంతే చాలు తరవులు వెట్టకురే
మేనులు సోఁకినమీఁద మించీఁ గాని
ఆనుక శ్రీవెంకటేశుఁ డలమేలుమంగఁ గూడె
పాచిపట్టి యింతలోనె పంగింత మిపుడు. ॥ ఆటమీఁద

పాడి

పిలువరె యింకాను ప్రియము చెప్పేఁ గాని
చల మేల నెరపీనె సారెకుఁ దానూ ॥ పల్లవి ॥

తప్పు లెంచఁ బని లేదు తానె నే నైనచోట
కప్పురము గొమ్మనవె కపటా లేల
యిప్పుడు నాప్రియములు యిందాఁకా నియ్యకొనె
అప్పటి నేల వున్నదె ఆడనె తాను ॥ పిలువరె ॥

కోపగించఁ బని లేదు కూడితి మిద్దర మీద
చూపులఁ జూడు మనవె సూడుఁబా దేల
యీ పొద్దుదాఁకా మాట లియ్యకొన్నట్టె వుండె
యేపునఁ దెరలోని కే లేఁగీనె తాను ॥ పిలువరె ॥

ఆన వెట్టఁ బని లేదు ఆయా లిద్దరికి సోఁకె
పూని కూచుండు మనవె బూటకా లేలా
నేనె శ్రీవెంకటపతిఁ దానె యలమేలుమంగ
మానక కూడితి మిఁక మంచ మెక్క నేఁటికే. ॥పిలువరె॥ 302

బౌళి

ఎంత చెప్పినా మాన విదేరా నీవు
కాంత లైన వారి నింత కాకు సేతురా ॥ పల్లవి ॥

యిట్టె చన్ను లంటకుర యిస్సీ యిందరుఁ జూడ
వొట్టి నీవద్దికి వచ్చి వున్నదేరమా
తిట్టుదుఁ జుమ్మీ నాతెరువు వచ్చితేఁ గన
గుట్టున నుండుదు గాని కొంటై న నోరి ॥ ఎంత చెప్పినా ॥

తొడ మీఁద వేయకుర తోతో యిందరు నవ్వేరు
యెడయక దగ్గరితే నిదే పనా
కడుఁ గోపిఁ జుమ్మీ నేను కలదె విన్నవించితి
బడలించకుర నన్ను పలుమారు నోరి ॥ ఎంత చెప్పినా ॥

పచ్చిమాఁటలాడకుర వడఁతు లెల్లా వినేరు
అచ్చ మై నే నీతో మాఁట లాడినందుకా
యిచ్చగించి శ్రీవెంకటేశ నిన్నుఁ గూడితి
నిచ్చ నలమేలుమంగ నేఁ జుమ్మీ వోరి. ॥ఎంత చెప్పినా॥ 303

సాళంగనాట

మొక్కరో మొక్కరో మీరు మోమునఁ గళలు దేరె
యెక్కువ శ్రీవెంకటేశుఁ డింతులలో వాఁడె ॥ పల్లవి ॥

తేరుమీఁద నెక్కి హరి దేవుళ్లుఁ దానును వాఁడె
భోరునను దేవదుందుభులు వాఁగఁగా
తోరపుమోఁకులు వట్టి దొరలు బ్రహ్మాదు లెల్ల
దీరతఁ దీశే రదే తిరువీధులందును ॥ మొక్కరో ॥

వేడుక రథముమీఁద వెలసే శ్రీపతివొద్ద
ఆదేరు పాదేరు అచ్చర లెల్ల
వీదెపునెలవులతో వెలఁదులతో హరి
యీడు లేక యేఁగి వచ్చీ నింటింటి వాకిటను ॥ మొక్కరో ॥

శ్రీవెంకటేశుఁడు వాఁడె చేరి యలమేలుమంగ
సావధానమున సరసము లాడఁగ
దేవాసనం బెక్కి తేఁకువ నారగింపులు
వావిరిఁ జేకొనీ వాఁడె వాదవాదలను. ॥ మొక్కరో ॥ 304

ఆహిరి

ఇందుకా యింత నేసితి విందాఁకాను
అంది పొంది నీవే బదు కాఁటదాన నేనూ ॥ పల్లవి ॥

వాలిసీ నొల్లనివాఁడ వూరకే ఆసియ్య నేల
పొలసి అప్పుడే నన్నుఁ బొమ్మన రాదా
కులికి నేఁ గొసరేఁగఁ గోమటిమేనరికమా
నెల వై సుఖాన నుండు నీవే వొక్కఁడవే ॥ ఇందుకా

మనసు రానివాఁడవు మాతో నవ్వఁగ నేల
అనువు గా దని విడనాడఁగ రాదా
చనవున నిన్ను నాఁగ పరిఁ బత్రసాలమా
యెనయుచు నేకరాజ్య మేలవయ్యా నీవే ॥ ఇందుకా ॥

మాయలు సేసేవాఁడవు మమ్ము జాలిఁ బెట్ట నేల
రాయి దేల మా యింటికి రా నన రాదా
ఆయ మంటి కూడితివి అలమేలుమంగ నేను
పాయపు శ్రీవెంకటేశ బడి నుందు మిఁకను. ॥ ఇందుకా॥ 305

వరాళి

ఎంత వని కెంత వని యిది యేఁటిదే
పంతమె సతుల కిది పాలతోడఁ బోసిరో ॥ పల్లవి ॥

నవ్వుతా నే నన్నందుకు నాలి నెగ్గు నేసుకొని
యివ్వల నట్టె మాటాడే విది యేమే
పువ్వువంటి యాఁట దైతేఁ బొగరు ముంపుఁదవమె
నివ్వటిల్లునో కాక నీకే తెలుసునే ॥ ఎంత వని ॥

తప్పక చూచినందుకె తగఁ గోపము నేసుక
కొప్పు దువ్వినఁ గసరుకొనే వేమే
చిప్పిల జవ్వని యైతె చెంది యాడ లేవి వాసు
లెప్పు డెం దుండి వచ్చునో యెరఁగమే నేము ॥ ఎంత వని ॥

సరస మాడినందుకె చాల నలుక నేసుక
వొరసి చేయి వట్టిన నులికే వేమే
యిర వైన శ్రీవెంకటేశుఁడ నిన్నుఁ గూడితి
గరిమె నిచ్చగించితి కడు మేలె నీవూ. ॥ ఎంత వని ॥ 306

352-వ రేకు ముఖారి

ఓసి పోపో నీకు నేమె వుండఁబట్టదా
వాసులు రేసు లెక్కించి వాదుకు వచ్చేవా ॥ పల్లవి ॥

విరతి నామీఁదట నీ కోప మెంత గల్ల
 సొరిది యాతనిమీఁదఁ జూపవే పోయి
 మరిగినవారితోఁద మాటలాడఁ గానెనా
 వరుస నిల్లురి కేల వాదుకు వచ్చేవే ॥ ఓసి పోపో ॥

సారె సారె న న్నెంత సాదించఁ గలిగినాను
 మేర మీరి ని వాతనిమీఁద వెళ్లించు
 కూరిమి గలుగుచోటఁ గూడినదె నేరమా
 వారి వీరి మాట కేల వాదుకు వచ్చేవే ॥ ఓసి పోపో ॥

మలసి నామీఁదని మచ్చర మెంత గల్లాను
 నెలవుగా నతనిపై నెరపఁగదే
 యెలమి శ్రీవెంకటేశుఁ డింతలోనె నన్నుఁ గూడె
 వలవనిజోలి నేల వాదుకు వచ్చేవే. ॥ ఓసి పోపో ॥ 307

నాదరామక్రియ

ఆసలును రేసులును అవి రెండు నేలే
 కాను వేయనిపనికి కాఁతాళ మేలే ॥ పల్లవి ॥

అలిగినవాఁడు తా నాదనే వుండుఁ గాక
 పిలిచి వాదుకు వచ్చి పెనఁగ నేలే
 కలయనివాఁడు తాను కడు వాసి నుండుఁ గాక
 వొలిసి దగ్గరి తగవుకుఁ దియ్య నేలే ॥ ఆసలును ॥

మాటలాడనివాఁడు తా మారుమోమై వుండుఁ గాక
 తేటలుగా సారె మమ్ముఁ దిట్టఁగ నేలే
 సీటున నుండెటివాఁడు నిక్కము బిగుసుఁ గాక
 చీటికి మాటికి మాపైఁ జెయి చాఁచ నేలే ॥ ఆసలును ॥

కాఁకలు నేసెటివాఁడు కన్నులనె చూచుఁ గాక
 యేఁకటఁ గాఁగిలించి న న్నింతలో నేలే
 వేఁకపు శ్రీవెంకటాద్రివిభుఁ డిట్టె నన్నుఁ గూడె
 మాఁకువలె నన్ను మేను మరపించ నేలే. ॥ ఆసలును ॥ 3

శ్రీరాగం

ఏఁటికి జాగులు సేసే రింకా మీరు
చాటి చెప్పి పతి నిట్టె జరయరమ్మా ॥ పల్లవి ॥
వలచినవలపులు వనితమేనిమీఁదికి
పులకలై మొలచె నిప్పుడు చూడరే
యెలమిఁ గాఁక లనేటియెన్నులు వెళ్లక తొల్లె
నెలవై చలిమందులు నించరమ్మా ॥ ఏఁటికి ॥
చిత్తములో చింత లెల్ల చెమటలై సతిమేన
జొత్తులు గారఁగఁ జొచ్చెఁ జూడరె యిది
యెత్తినతమకముల యేరులు వారక తొల్లె
వొత్తి పువ్వుఁబొట్లాల నొగిఁ గాఁచరమ్మా ॥ ఏఁటికి ॥
కద లేనిజవ్వనము కలికి నిట్టూరుపులై
విడువక చెలరేఁగి వేఁచఁ జొచ్చెను
తొడరి విరహ మనేదుమ్ములు రేఁగక తొల్లె
అదరి శ్రీవెంకటేశుఁ డాదరించె నమ్మా. ॥ ఏఁటికి ॥ 309

శుద్ధవసంతం

అందుకే వెర గయ్యీనె అప్పటనుండియు మాకు
అందినవారికి మిన్ను అరచేతిదే ॥ పల్లవి ॥
పతిమాఁ టాడ విదేమే పలుమారుఁ దమకాన
అతఁడు నీతో మాట లాడఁగాను
యితవై యెక్కినవారి కేనుగ గు జ్జన్నమాట
కతలుగా నీయందె కంటిమే నేము ॥ అందుకే ॥
గక్కన రా వది యేమే ఘనుఁడు నవ్వుతా నిన్ను
తెక్కులనె చేయి వట్టి తియ్యఁగాను
వొక్కపై పాలు వోసితే వొకిలింత లన్నమాఁట
మిక్కిలి నీవల్లనె మెరపెనే నేఁడు ॥ అందుకే ॥

శ్రీవెంకటేశ్వరుఁడు చేయి నీపై వేయఁగాను
 నోవ దనక వాఁడిచన్నుల నొత్తేవు
 పూవులవేసినవారిఁ బొంచి రాల వేసినట్టి
 భావము నీయందె కంటి భళి భళి గుణములూ. ॥అందుకే॥ 310

ఆహిరి

కా దనేనా నీమాట కానీ లేవే
 నా దె నేమి చూచేవు నవ్వేఁ గానీ లేవే ॥ పల్లవి ॥

నమ్మించి నీవు వానినయగారాలు చెప్పఁగ
 కమ్మి నామై కాఁక రేఁగె కానీ లేవే
 నెమ్మది వాని నిజాలు నీవు గల్లలాడే [1]వటే
 అమ్మరో అన వెట్టకు మట్టె కానీ లేవే ॥ కా దనేనా ॥

పిలిచీ ననుచు వాని ప్రియము నీవు చెప్పఁగ
 కలిగెఁ బెద్దరికము కానీ లేవే
 నెల వై వానిచేఁతలు నీవు నాకు దాఁచే వటే
 అలుక లన్నియుఁ దీరె నట్టె కానీ లేవే ॥ కా దనేనా ॥

శ్రీవెంకటేశ్వరుని చేతికి నీ వియ్యఁగాను
 కైవస మయితి నట్టె కానీ లేవే
 నీవల్లనే కాదా నే మిద్దర మొక్కటైతి
 మావటించి యిఁకఁ బాయ మట్టె కానీ లేవే. ॥కా దనేనా॥ 311

ముఖారి

ఎవ్వరికి బుద్ధి చెప్పే నెఱఁగ మరి
 యివ్వల నే నుండదాన నెఱఁగ మరి ॥ పల్లవి ॥

చెక్కు చెలిచేత నుండె చింత మదిలోన నుండె
 యిక్కడికి నే వచ్చితి నెఱఁగ మరి
 పక్కన నంపవు మమ్ము పదరి నీవు రావు
 యెక్కువ నీ చిత్త మెట్టో యెఱఁగ మరి ॥

1. "వట్టే" అని వ్రాసి "ట" వత్తు చెరిపి "వటే" అని దిద్దియున్న

వుమ్మచెమటలఁ దోఁగె నువిద కాఁకల రాఁగె
యిమ్ముల వన్నీఁద కంపె నెఱఁగ మరి
కొమ్మనుద్దు లడిగేవు గుట్టునఁ దల వంచేవు
యెమ్మె లేమి సేసేవో యెఱఁగ మరి ॥ ఎవ్వరికి ॥

యిందాఁకాఁ దమకించె యింతి యిట్టె పవ్వళించె
యిం దున్నదాన నేఁ యెఱఁగ మరి
అంది శ్రీవెంకటేశుఁడ ఆడకె నీవు విచ్చేసి
యిందుముఖిఁ గూడితివి యెఱఁగ మరి. ॥ ఎవ్వరికి ॥ 312

53-వ రేకు దేసాక్షి

అప్పటి మానవుబీరాల దేమే నీవు
యిప్పు దేమి దప్పి పోయ వీఁకఁ జూడ రాదా ॥ పల్లవి ॥

యేతు నీకుఁ గలిగితే నెందైనాఁ జూపుదు గాక
ఆతని నావద్దఁ దిట్టే పదేమే నీవు
నీ తెరువు వచ్చితిమా నీ కేమి గారణమె
తోతో నా రమణుని దూఱుదు గాక ॥ అప్పటి ॥

బలువు గలిగితేను బతుకుదు గా కతని
అలమేవు నా యెదుట నదేమే నీవు
తలవే నిన్నుఁ దడవ దగ్గరి నాయకుని
వలసినట్టు నేసితే వద్దనేవా నీవు ॥ అప్పటి ॥

వాసి నీకుఁ గలితేను వద్దఁ బెట్టుకుందు గాక
ఆస పదేవు నాపతి కదేమే నీవు
యీసరి శ్రీవెంకటేశుఁ డింవరిఁ గూడినమీఁద
గోస నాస నేయఁ బోతే కోప మేలే నీకు. ॥ అప్పటి ॥ 313

రామక్రియ

మేరతో నే మండఁగాను మీచేతి బాధ బెట్టు
వూరకున్నవారి నేల వుడికించేరే ॥ పల్లవి ॥

వొట్టి పతికిఁ బాదము లొత్తి వచ్చితి విందాఁకా
యిట్టె యలిగితి నంటా నేల పోరేరే
వెట్ట దీరఁగ సురటి విసరితి నాతనికి
చిట్టకాన కింకా నేమి సేయు మనేరే ॥ మేరతో ॥

సన్నతో నే విందాఁక సముకాననే వుంటి
చిన్నఁబోతి నంటా నేల చేయి వట్టేరే
మున్నె యాతనూడిగాన ముక్కు చెమట జారితే
కన్నీరు రాలె నంటా గడియించే రేటికే ॥ మేరతో ॥

మక్కువ శ్రీవెంకటేశు మాటలు వింటి విందాఁక
వొక్కటి గమ్మంటా నేల వాడి వట్టేరే
అక్కరతో నాతఁడె ఆదరించి [1]నన్నుఁ గూడె
మొక్కనైతి నంటా నేల మొరఁగు లాడేరే. ॥ మేరతో ॥ 314

తెలుఁగుఁగాంబోది

అందరూ విన్నవి నే నాడేఁ గాని
సందడింపుమేకులకు చాలఁ బో నేనూ ॥ పల్లవి ॥

నేయ రానిపను లైనఁ జేసేఁ గాని
వో యయ్య నీ వినయము లోల్లఁ బో నేను
పాయరానిరాజసానఁ బడేఁ గాని
వే మైన నీయానలు వినలేఁ బో నేనూ ॥ అందరూ ॥

నగవు రాకుండినను నవ్వేఁ గాని
వొగరు మోహము చల్ల నోపఁ బో నేను
మొగమోటఁ గొంత దెత్తిన మోచేఁ గాని
తెగువతో నీ గుణము దిద్దలేఁ బో నేనూ ॥ అందరూ ॥

వొదిగి పానుపుమీఁద నుండేఁ గాని
చెదర ని న్నింత పచ్చి సేయఁ బో నేను
పొదిగి శ్రీవెంకటేశ భోగించితి నీవు
వెదకి నీ వెం దున్న విడువలేఁ బో నేనూ. ॥ అందరూ ॥

1. "నమ్ము" అని వ్రాసి "మ్ము" ను "న్ను" గ దిద్ది "నన్ను" అని చేసి యున్నా

సామంతం

పో పో యిదేఁట సుద్ది పోయినది వో నీవే
రేపు మాపు విదే పనే రేసు లేల పెంచేవు ॥ పల్లవి ॥

పంతములే ఆడేవు పట్టేవు చలము
యింతులకుఁ బతిమీఁద నింత గద్దరే
కొంత నీ చెక్కు నొక్కఁగ గోరు దాఁకె నింతే కాక
అంత నీతోఁ బగ పాదే ఆతఁడు వో చెలియ ॥ పో పో ॥

పిలిచితేఁ గసరేవు పెనఁగితే విసిగేవు
వలచినయీతనితో వాదు లేఁటికే
బలిమి నిన్నుఁ బట్టఁగ పాపట చెదరెఁ గాక
వలె వలె వని నీతో వాదులకు వచ్చెనా ॥ పో పో ॥

నిట్టూర్పు నించేవు నివ్వెరగుఁ బొందేవు
యిట్టె శ్రీవెంకటేశు నేఁప నేఁటికే
గుట్టుతోఁ గాఁగిలించఁగఁ గొప్పు వీడె నింతే కాక
తొట్టిన రతులలోన దొమ్మి సేయ వచ్చెనా. ॥ పో పో ॥ 316

రామక్రియ

మగవాఁడు వలచితే మరి చేతఁ బట్ట రాదు
తగుదునా నే నీకు తమకించే విపుడు ॥ పల్లవి ॥

ఆన వెట్టకుర నీ వన్నట్టె వినేఁ గాని
మాన వెంత చెప్పినా నీ మంకువోజలూ
కాని మ్మన్నా మొక్కేవు కాఁ గాని దోసాన
నే నెంత నీ వెంత నీకు నే బాఁ తైతిఁ గా ॥ మగవాఁడు ॥

చెక్కు నొక్కకుర నీవు చెప్పినట్టే సేనేఁ గాని
యిక్కడ నవ్వేవారి నెఱఁగ వోరి
యిక్కువ లంట వచ్చేవు యెంగి లని చూడవు
చక్కనివాఁడవు నే నీసాటికి రాఁ గలనా ॥మగవాఁడు॥

పొగడకురా నే నీ పొందులు విడువఁ గాని
నగవులు మానవు నాతో నీవు
తగు లై శ్రీవెంకటేశ తతి నన్నుఁ గూడితివి
మొగము చూచే వింకా మోహ మింత గలదా. ॥మగవాఁడు॥317

రామక్రియ

ఈ కోపా లీతాపా లిట్టె వుండినా
సాకిరి నేఁ దెలిపేఁ గా సాదించేదానిని ॥ పల్లవి ॥

ఆతఁ డీడకు రాఁగానె ఆన వెట్టుకొందు గాక
కాతరాన( జెప్పి పంపఁ గారణ మేమే
యీతల నీ రమణుఁడు యెదుట నిలిచితేను
చూతము వో యిట్లనె సొలనెటిదానిని ॥ ఈకోపా ॥

వోడక నిన్ను రమ్మంటే నొల్ల నందు వింతే కాక
ఆడ నుండఁగానె లేక లంప నేఁటికే
కూడనివాఁడే తమిఁ గూడేరు యిప్పు డిట్టె
తోడనె పంగించేఁ బో తొలఁగెటిదానిని ॥ ఈకోపా ॥

పెల్లున నీ వొద్దికె పిలిపించు కొందు గాక
యిల్లురికి వచ్చి వాదు లివి యేఁటికే
వొల్లనె శ్రీవెంకటేశు డొద్దికతో నిన్నుఁ గూడె
పల్లదాన నవ్వేఁ బో పాసియుండేదానిని. ॥ ఈకోపా ॥ 318

354–వ రేకు బౌళి

చెక్కుటఁ బెట్టెను చేయి చిత్తములో నదే నుయ్యి
యెక్కడికిఁ బోరాదు యిఁక నీచిత్తము ॥ పల్లవి ॥

జవ్వనపు పైతరవు సతితురుము బరవు
యెవ్వరు విలిచిన నెర వెరవు
యివ్వల నీ విదె చూడు మిదివో నెమ్మోవివాడు
రవ్వ లాయ నీ వలపు రావయ్య యిఁకను ॥ చె॥

చిగురుఁబులకపైరు చిత్తడిచెమటపేరు
పగటుగుబ్బలమీఁద పయ్యెద జారు
నగకు మాతో వింత నాతికి వంతా వింత
నెగటాయ నీమాయ విడవయ్య చలము ॥ చెక్కు ॥

కాయములోని యలపు కనుఁగొనల సొలపు
చాయల సన్నలలోని పారె బులుపు
యీయెడ శ్రీవెంకటేశ యింతిని నీవు గూడఁగా
తోయ రాదు నీ చనవు తోఁదోఁ దోడ నిదివో. ॥ చెక్కు ॥ 319

ముఖారి

లోలో నాతనిచేఁత లోక మెఱఁగదు గాని
యేలీల నన్నే దూరే రేమి సేతు నమ్మా ॥ పల్లవి ॥

చిఱునవ్వు నవ్వేఁగ చేయి వట్టీ నాతఁడు
గుఱిగా వే వద్దంటేఁ గోప మనేరు
అఱిముఱిఁ దానె సాదు [1] అందరికిఁ జూడఁ జూడ
యెఱుకతో నేనే వెఱ్ఱి నేమి సేతు నమ్మా ॥ లోలో ॥

వూరకె నన్నాతఁడు వాడివట్టి తీసీని
తారి నే రా నోప నంటేఁ దప్పు సేసేరు
వారక తానె మంచివాఁడు విన్న కన్న వారి
కీ రీతి నే నిష్ఠూరి నేమి సేతు నమ్మా ॥ లోలో ॥

కడ నేఁ గూచుండఁగాను కాఁగిలించుకొనీఁ దాను
జడిసి నే నుండితే రాజస మనేరు
విడువక నన్నును శ్రీవెంకటేశుఁ డిదె కూడె
యెడసి నే నుండఁ జాల నేమి సేతు నమ్మా. ॥ లోలో ॥ 320

బౌళి

తొల్లిటివలెనా నీవు దొర వైతివి
యెల్లవారుఁ జూడఁగా నే నే మందు నీకను ॥ పల్లవి ॥

---

1. "అందరిరి" అని వ్రాసి "అందరికి" అని తిద్ది యున్నారు.

యేరా నే వద్ద నుండఁగ యెవ్వతెదిక్కు చూచేవు
మేర మీర దొరకొంటి మెల్ల మెల్లనె
తేరా నా వుంగరము తెలిసితి నీ గుణము
వోరి నీతో జగడించ నోపరా నే నీఁకను ॥ తొల్లిటి ॥

నా యెదురుకట్టులనె నవ్వఁ బొయ్యే వాపెతోడ
యీయెడ నప్పుడె యెంత కెత్తుకొంటివి
చేయి విడువర నీతో చెలిమి నా కయి వచ్చె
చాయల నే వెంగె మాడఁ జాలరా ని న్నీఁకను ॥ తొల్లిటి ॥

యిట్టె నా యింటనుండి యిల్లురికి మాటాడేవు
తిట్టే నంటా నాపె విదె సందుగా
గట్టిగా శ్రీవెంకటేశ కలసితి విదె నన్ను
పట్టినచలము చెల్లె బ్రదుకరా యిఁకనూ. ॥ తొల్లిటి ॥ 321

దేసాళం

ఊరి మగనాండ్లకు మందఁ బానెను
యీరీతి న న్నింత సేసె నే మందు నమ్మా ॥ పల్లవి ॥

వొల్ల నన(గా నె వచ్చి వొక టొకటె యాడి
చెల్లఁ బో వీఁడు నా చేయి వట్టీని
పల్లదపు వీనిచేతి బాధకుఁ గాక నేను
యిల్లి దె నే లో నయితి నిఁక నేఁటి దమ్మా ॥ ఊరి ॥

తల వంచు కుండఁగానె దగ్గరి వద్దఁ గూచుండి
చలి వాయ మాట లాడీ జాణతనాలు
చలపాది వీనిచేతి చండకు నోపక నేను
చెలరేఁగి కాఁపురము సేసితి నో యమ్మా ॥ ఊరి ॥

యింటివారికి వెరవఁ [1]దెదుట నవ్వులు నవ్వీ
చంటిమీఁద నొరగుచు సట నేసీని
వెంటఁ బాయ కిది వో శ్రీవెంకటేశ్వరుఁడు గూడె
దంట నై వీనిమాయఁ దగిలితి నమ్మా. ॥ ఊరి ॥

1. "దెదుట" అని వ్రాసి "దెదుట" అని దిద్ది యున్నారు.

శంకరాభరణం

మా కేమి నీ వెంత మట్టు మీరి తిరిగిన
[1] లోకమువారే నవ్వేరు లో వెలుతు లేలరా ॥ పల్లవి ॥

ఆనలు నీ కేమిటికి నంత నిజమరి వై తే
కేనాన నీవే బదికేవు గాక
పూని యన్నీ విన్నదాన నుండ(జాల కొక టంటే
కోనల( దెలుపు మంటా కొంగు వట్టే వేమిరా ॥ మా కేమి ॥

తారుకాణ లే(టికి తప్పు లేనివా(డ వై తే
పేరడి నాచారములు పెంచేవు గాక
కేరి నీవు రాకుంటే వెంగెములు ని న్నాడితేను
పోరి పోరి పోయినది పోనియ్య వేమిరా ॥ మా కేమి ॥

వట్టిమా(ట లే(టికి [2] వలచినవా(డ వై తే
అట్టె అన్నిటను జాణ వయ్యేవు గాక
యిట్టె శ్రీవెంకటేశ యిందుకె నిన్ను( గూడితి(
దెట్టతెరువున నన్ను( దేలించే వేమిరా. ॥ మా కేమి ॥ 323

ముఖారి

ఏమి [3] నేరుచుకొంటివే యెంత కుచ్చితురాలవే
జాము వోయినా మానవు చలమే సాదించేవు ॥ పల్లవి ॥

చూడ( జాల వేమే యే సుదతితో మాటాడిన
[4] యేడా చుట్టాలు లేరా యెవ్వరి కై నా
కూడీ( గూడక తొల్లె కొడిమెలే కట్టేవు
వాడలో నుండ( బా సె(గా వన్నెమగవానికి ॥ ఏమి ॥

---

1. "లోకమువార" అని వ్రాసి "లోకమువారే" అని తిద్ది యున్నారు.
2. "వలచిన్న" అని వ్రాసి "వలచిన" అని తిద్ది యున్నారు.
3. "నేరుచుకొంటినే" అని వ్రాసి "నేరుచుకొంటివే" అని తిద్ది యున్నారు
4. "యేడ" అని వ్రాసి "యేడా" అని తిద్ది యున్నారు.

పుడికి పడే విదేమే వూరివారితో నవ్వితే
విడువ కెవ్వరి కైనా వేడుకె లేదా
కడ నున్నవారిమీఁద కానివావులు వేసేవు
తడవి మగవానికి తల యెత్తఁ బానెఁగా ॥ ఏమి ॥

చిన్నఁబొయ్యే విని యేమే చెలుల నేఁ బిలిచితే
యెన్నికె ముచ్చట లేదా యెవ్వరి కైనా
చెన్నుగా నుర మెక్కితి శ్రీవెంకటేశుఁడ నేను
యిన్నిటాఁ గూడఁ బానెఁగా యితరకాంతలను. ॥ఏమి॥ 324

355 వ రేకు భైరవి

పంతము చెల్లెను నీకు పదర నేలే
చింత దీర పతిమాట చేకొందు గాక ॥ పల్లవి ॥

అలిగినరమణుఁడె అట్టె నిన్నుఁ బేరుకొని
పిలిచినమీఁద నింక బిగు వేఁటికే
తల వంచు కుండఁగాను తగ నీపైఁ జేయి వేసి
కలయఁగ నీలోని కపటము లేఁటికే ॥ పంతము ॥

చేసన్నల రానివాఁడె చెట్ట పట్టి తియ్యఁగాను
వాసుల పంతులతోడి వాదు లేఁటికే
ఆసల నీ వద్దనుండి అట్టె తానె ఆన వెట్టి
నేస చల్లే పతిమీఁద చిడుముడి యేలే ॥ పంతము ॥

యింటికి రానట్టివాఁడె యిటు నిన్ను వేఁడుకొని
వెంట వెంట రాఁగానె వేస లేఁటికే
అంటుక శ్రీవెంకటేశుఁ డాతఁడె నిన్నుఁ గూడె
జంటయి వుందురు గాక చల మింకా నేలే. ॥ పంతము

రామక్రియ

చెప్పరమ్మ మీరు బుద్ధి చెలులాల
యిప్పటికోపము మీఁద నిట్టె వుండినా ॥ ప

చిగురుఁబెదవి వంచి సిగ్గులనె గొణఁగీని
వెగటునఁ బతి దన్ను వేఁడుకోఁగాను
నగుతాఁ బయ్యెదకొంగు నాథుఁడు పట్టఁ బట్టఁగ
జగడించి లోని కేఁగీ సమ్మతించ కదివో ॥ చెప్పరమ్మ ॥

సరస నవ్వులు దీర సతి యాన లెల్లఁ బెట్టి
బెరసి విభుఁడు దన్నుఁ బిలువఁగను
పరిమళము లతఁడు పైపైఁ బూయఁ బూయఁగ
తెరచీరఁ దుడిచీని తీసి తీసి యదివో ॥ చెప్పరమ్మ ॥

చెమట చెక్కున జార సిరసు వంచుకొనీని
సుముఖుఁ డై శ్రీవెంకటేశుఁడు గూడఁగ
అమరఁ గమ్మటి నాతఁ డాయము లంట నంటఁగ
తమితోఁ దప్పించుకొంటా తాఁ దా నేర్పి నిదివో. ॥చెప్ప॥ 326

పాడి

సిగ్గుగ లాఁటదానికి చెప్పించుకో నింత యేల
దగ్గరి వుండుటే చాలు తడవకు మమ్మును ॥ పల్లవి ॥

వొలిసీ నొల్లని నిన్ను వొడివటి తీయుకంటే
అలిగి నేఁ బవళించు టదియే మేలు
పిలువకుండఁగ నీవు పెనఁగి పైఁ బడుకంటే
తల వంచుకొని [1]వుండే తడవకు మమ్మును ॥ సిగ్గుగ లా ॥

కడు రాజసపు నీతో కలకల నవ్వుకంటే
చిడుముడిఁ జిన్నఁబొయ్యే చింత మేలు
జడిసి వుండిననీతో చనవు చెప్పుటకంటే
తడతాఁకులఁ బొరలే తడవకు మమ్మును ॥ సిగ్గుగ లా ॥

కపటాలుసేసే నిన్ను కాఁగిలించుకొనుకంటే
నెపముతో నూరకుండే నీచే మేలు
యిపుడె శ్రీవెంకటేశ యేకమై నన్నుఁ గూడితి
తపము ఫలించె నిఁకఁ దడవకు మమ్మును. ॥ సిగ్గుగ లా ॥ 327

---

1. "వుండి" అని వ్రాసి "వుండే" అని తిద్ది యున్నారు.

బౌళి

మేరకు మేరే కాక మీర నేఁటికే
నేరుపులు చాలుఁ జాలు నెరవేరెఁ బనులు ॥ పల్లవి ॥

వద్దు వ ద్దేమీఁ దడవకురే మీరు ।వా।
రిద్దరు లోన నుండఁగ నేలే దోసము
కొద్ది మీరి దగ్గరితే కూళ లందురు
తిద్ద నేల పను లెల్లఁ దీరినమీఁదటను ॥ మేరకు ॥

చేకొని మీ రెరుకలు [1]నేసుకొందురా ।[2]వా।
రేకత మయినవేళ యేలే దోసము
కాకు నేయఁ బోతే నన్నే కల్లందురు
లోకమువారే చెప్పేరు లోలోనె వారికి ॥ మేరకు ॥

తెక్కులవాకి లిప్పుడే తెరవకురే । వా ।
రిక్కువఁ గరఁగేవేళ యేలే దోసము
మొక్కి శ్రీవెంకటపతి మొకమోట నన్నుఁ గూడె
నెక్కుడు మా కేల పంత మిచ్చినమీఁదటను. ॥మేరకు॥ 328

శ్రీరాగం

ఇంక నెన్నఁడె నీ యెమ్మెలు నేఁడు గాక
అంకెల నాతఁడు నీ వాడినట్టె యాడఁగా ॥ పల్లవి ॥

చెల్లదా నీ కేమి నేఁడు చెలువుని వలపించి
యిల్లు వెళ్లకుండాఁ జేసి యింత నేసితి
పల్లదాన నప్పటిని పంత మాడే వేమి దొడ్డె
కెల్లు రేఁగి అతఁడు నీ కింకరుఁ డై యుండఁగా ॥ ఇంక ॥

తగదా నీ కే మతనిదండనుండి సవతులఁ
బగలు సాధించ నీవే పనిగొనను
నగ నేలె యాతఁడు నీ నటనకుఁ దగినట్టు
చిగురుతా సారె సారెఁ జెప్పినట్టు నేయఁగా ॥ ఇంక

1. "నిసు" అని వ్రాసి "సేసు" అని దిద్ది యున్నారు.
2. "వా" అని వ్రాసి "వా" అని దిద్ది యున్నారు.

మేలు గాదా యిందరిలో మించి శ్రీవెంకటేశ్వరు
నాల వై మావంటివారి నాదరించేవు
సోలుచు నీ రాజసాలు చూపేవు నీ కెదు రేది
వేళ గాచి యతఁడు నీ వెంట వెంట రాఁగా. ॥ ఇంక ॥ 329

సామంతం

తత్తరపు నీలోని తాపము మానితేఁ జాలు
యిత్తల మీఁదటిపను లెట్లయినాఁ గాని ॥ పల్లవి ॥

పక్క నుండఁగానె నన్ను భ్రమసి పేరఁ బిలిచే
వెక్కడ పరాకైతి వేరా నీవు
తక్కక నీవు మోహించేదాని గుఱుతు చెప్పరా
యిక్కడికిఁ దోడి తెచ్చే [1]యెగ్గైనాఁ గాని ॥ తత్తరపు ॥

ఆకు మడి చియ్యఁగానె అవ్వలఁ జేయి చాఁచేవు
యేకడ వున్నది చిత్త మేరా నీవు
ఆకెతో నీకు [2]నే మని ఆతుమ చెప్ప వలనె
చేకొని నాతోఁ జెప్పర చెప్పి వచ్చేఁ గాని ॥ తత్తరపు ॥

నేమాన నేఁ గూడఁగాను నిలు వెల్లఁ గరఁగితి
వే మాఁట దలఁచుకొంటి వేరా నీవు
యేమిర శ్రీవెంకటేశ యెవ్వతె జగడించెరా
కామించి యాన తీరా వొక్కటి సేసేఁ గాని. ॥తత్తరపు॥ 330

356-వ రేకు సాళంగం

నీ చెయ్యే మీఁ దాయ నీకుఁ జెల్లురా । నిన్ను ।
యేచి వలపుల బయ లీఁదించ నైతిరా ॥ పల్లవి ॥

మంచివానిపలెనె మాట లాడఁ బిలిపించి
కంచముపొత్తుకుఁ దీసి కాకు సేసేవు
వంచనతో దవ్వులనె వట్టిగుట్టు చేసి నిన్ను
పెంచి నీచేఁ బ్రియము చెప్పించ నేర నైతిరా ॥ నీ చెయ్యే ॥

1. "యెగ్గైనా" అనేచోట "గ్గై" అనే అక్షరము, 2. "నే మని" అనేచోట "మ" అనే అక్షరము తిద్ది యున్నారు. అంతకు పూర్వపు అక్షరములు గుర్తింప వీలుకా లేదు.

బత్తి గలవానివలె పానుపుమీఁదికిఁ దీసి
హత్తి సిగువడ నంటా నట్టె నవ్వేవు
కొత్త సతులవలెనె గొందులనుండి నిన్ను
తత్తరాన నాడ కెదతాఁకించ నైతిరా ॥ నీ చెయ్యే ॥

యిచ్చకునివలెనె యెలయించి నన్నుఁ గూడి
అచ్చట నా సుద్దు లెల్ల నాడుకొనేవు
మెచ్చుగా శ్రీవెంకటేశ మేర మీరి ఆవేళనె
కచ్చు పెట్టి నీ మోవి గంటి సేయ నైతిరా. ॥ నీ చెయ్యే ॥ 331

దేసాళం

కడుఁ బసిబాలుఁడవు కటకటా
యెదతాఁకి బడలితి విటువలెఁ గలదా ॥ పల్లవి ॥

యేయెడనుండి నా యన్న యిపు డాడి వచ్చితివి
కాయ మెల్లఁ జెమరించెఁ గటకటా
బాయిట నాడుతా నెంత పరువులు వెట్టితివో
యీయెడ బుస కొట్టేవు యిటువలెఁ గలదా ॥ కడుఁ బసి ॥

విందుల నెవ్వరియింట వేఁడిపా లారగించితి
కందువ నీ మోవి వొక్కెఁ గటకటా
మందలించి యా దేడ మదుగులు చొచ్చితివో
యిందు నీమె గరుపారె నిటువలెఁ గలదా ॥ కడుఁ బసి ॥

యెన్నెన్నిచోట్ల నీవు యేమి సేసి అలసితో
కన్నుల నిద్దుర దేరీఁ గటకటా
పన్నిన శ్రీవెంకటాద్రి బాలుఁడ వై నవ్వేవు
యిన్ని నీవే యెరుఁగుదు విటువలెఁ గలదా. ॥ కడుఁ బసి ॥ 332

బౌళి

చాలుఁ జాలు నాతోడి చల మేఁటికి
ఆలరి వై వుడికించి ఆదరించ నేఁటికి ॥ పల్ల ॥

ఒల్లజంపుఁగాఁకతోడ జాగులు సేయ నోప
అలాద నేకాంతవిరహమే చాలు
వెల్లివ నప్పటి నన్నుఁ బిలువకురా నీవు
యిల్లిందాఁకా కాఁకఁ బెట్టి యిఁక నేల ప్రియము ॥ చాలు ॥

పలు మంచిమాటలనె భ్రమఁబడ నోప నాకు
అలర నీతో వావాద మయినా మేలు
తల యెత్తి మోము చూపి తగులకురా నన్ను
వొలసి నొల్లక వుండి వూరడించ నేఁటికి ॥ చాలు ॥

వేసబెల్లి కాఁగిటిబిగువుకు నే నోప
రేసులతో నవ్వు నవ్వే వాసులే మెచ్చు
ఆస యిచ్చి శ్రీవెంకటాధిప నన్నుఁ గూడితి
వేసటగా నలయించి వేఁడుకొన నేఁటికి. ॥ చాలు ॥ 333

తెలుఁగుఁగాంభోది

ఏల మమ్ము భ్రమయించే రింతులాల
తేలించేరు మాటలనే తెరవలాల ॥ పల్లవి ॥

సిగ్గులు యెగ్గులు వాసె చీఁదక చీమిడి వాసె
దగ్గరి మీ రుండితేఁ దరుణులాల
వొగ్గితి మెంగిలితమ్మ కొకయింత దయ లేదు
వెగ్గళించే రప్పటిని వెలఁదులాల ॥ ఏల మమ్ము ॥

పాపము లన్నియుఁ దెగె బంధము లన్నియు నూడె
కోపగించుకొంటే మీరు కొమ్మలాల
తీపుల మా దేహము తెగ నమ్మితిమి మీకు
యేఁపుల నేల పెట్టేరు యిట్టె సతులాల ॥ ఏల మమ్ము ॥

దావతిపాట్లు మానె తరవు లుడిగెను మా
తోవ రాకుండితేఁ జాలు తొయ్యలులాల
శ్రీవెంకటేశ్వరుఁడు చేరి మమ్ము దయ నేలె
చేవ దేరె మీకు మాకుఁ జెలులాల. ॥ ఏల మమ్ము ॥ 334

సామంతం

సిగ్గువడి నీవు నాతోఁ జెప్పఁ జాల వింతే కాక
కగ్గిన నీ విరహము కాన రాదా నాకు ॥ పల్లవి ॥

చెక్కుమీఁది చేయే చెప్పీఁ జిత్తములోపలిచింత
యిక్కడాఁ బతిపై మోహ మేల దాఁచేవే
లక్కవలెఁ గరఁ గొకలాగుల మాట లాడేవు
నెక్కొన్నవిభావములు నే నెరఁగనా ॥ సిగ్గువడి ॥

కన్నులచూపులె చెప్పీఁ గాయములో తమకము
యెన్నికలు నీవు నాతో నేల దాఁచేవే
పన్ని చెమరించుకొంటా పైపై బొంకేవు నాతో
వెన్నెల నీసుద్దు లెల్ల వినకున్నదానా ॥సిగ్గువడి॥

వెలవినవ్వులె చెప్పీ శ్రీవెంకటేశునిపొందు
యెలమి నింకా నాతో నేల దాఁచేవే
వెలయ నాతఁడె నిన్ను వెల్లవిరిగాఁ గూడె
నిలువు నూరూఁ బంటె నీ కేటె వెరపూ. ॥ సిగ్గువడి ॥ 395

పాడి

ఎప్పుడు మంచిదాననె యిదివో నీకు నాతో
చెప్ప వద్దు గాని నీకు వెల పిచ్చేను నేనూ ॥ పల్లవి ॥

విచ్చలూను నిజ మాడి నీకుఁ బగ యవుకంటే
రిచ్చల నూరకుండితే రేఁచ నే లయ్య
హెచ్చి నే నే మనినాను యీరు దియ్యఁ బేమ వచ్చు
కుచ్చితము గాదు లోనఁ గూచుండే నేను ॥ ఎప్పుడు ॥

కూరిమి నీ వెంట వచ్చి గుండెదిగు లవుకంటే
బీరాన నే పీఁడ నుండేఁ బిల్వేకు వయ్య
కేరడాన నట్టె గోర గీరితే నేరు లవును
నేర నంతేసి యిచ్చలు విద్దిరించే నేనూ ॥ ఎప్పుడు

గక్కున నీ మోవి యాని గంటు రాఁగించుకంటే
చిక్కి నీ వశాన నుండే చెనక కయ్యా
పక్కన శ్రీవెంకటేశ బలిమి నన్నుఁ గూడితి
వక్కర దీరినమీఁద నలయించ కయ్యా. ॥ ఎప్పుడు ॥ 336

357-వ రేకు నాదరామక్రియ

*నే నెంత నీ వెంత నీతోనే బలిమా
మానరాని కృపతోడ మన్నించితి గాక ॥ పల్లవి ॥

చిత్తము వచ్చి నావద్ద చేరి వున్నాఁడవు గాక
వొత్తుకోలు వల పైతే వుండేవా నీవు
యెత్తిన కోపపుదాన నేమి బాఁతి నే నీకు
బత్తి సేసితివి నాభాగ్య మింతే కాక ॥ నే నెంత ॥

పిలిచితి విచ్చేసితి ప్రేమ గలుగఁగఁ గాక
పొలసితేఁ బరులకు సులభుఁడవా
చెలులు మీ కెంత లేదు చేరి నాతోనె మాట
పలు కాదే విదే నాభాగ్య మింతే కాక ॥ నే నెంత ॥

యిద్దరి మొక్కటి గాఁగ నిన్నియు నమరెఁ గాక
పొద్దు వోనిచోట చవి వుట్టీనా నీకు
గద్దరి శ్రీవెంకటేశ కాఁగిట నన్నుఁ గూడితి
బద్దు గాదు మెచ్చితి నాభాగ్య మింతే కాక. ॥ నే నెంత ॥ 337

దేసాళం

ఎట్టు గెలువంగ వచ్చు నిటువంటివాని నిన్ను
పట్టినచలముతోడ భ్రమలఁ బెట్టితివి ॥ పల్లవి ॥

మంచిమాట లాడఁగానె మఱచితి నిన్నియును
అంచెల నేఁ గోపగించే నంటా నుంటిని
యెంచి కన్ను లెత్తి చూడు యిటువంటివాని నన్ను
మంచముమీఁదికిఁ దీసి మరిగించితివి ॥ ఎట్టు ॥

* రే. పా. నీ వెంత నే నెంత. ప్రాస తప్పెను.

చెక్కు నీవు నొక్కఁగానె చిత్త మెల్లఁ గరఁగితి
అక్కరతోఁ గాఁగి లియ్య నంటా నుంటివి
మిక్కిలి నాకాఁక చూడు మీరి వచ్చేదాని నన్ను
వెక్కసాన నొడి వట్టి వెఱ్ఱిఁ జేసి తివుడు ॥ ఎట్టు ॥

వొద్దికి నీవు రాఁగానె వొదఁబడితిఁ గా కిట్టె
అద్దలించి ఆన వెట్టే నంటా నుంటివి
గద్దరి శ్రీవెంకటేశ గబ్బి నైననన్నుఁ జూడు
ముద్దుమోము యిచ్చి కూడి మొక మోడించితివి. ॥ఎట్టు॥ 338

సామంతం

ఇంత చలము నీ కే లమ్మా
కొంతయినఁ దెలుసుకో వమ్మా ॥ పల్లవి ॥

అలుకలుఁ బలుకలు నాతనితోడను
వలవని దేఁటికి వద్దమ్మా
మొలకల నవ్వులు ముంచఁగ నీ కిఁకఁ
దల వంచు కొనఁగఁ దగ దమ్మా ॥ ఇంత ॥

పెనఁగులు జునుగులుఁ బెట్టేవు పిలువఁగ
పని మాలినపని బలు వమ్మా
చనవులు నీ పతి చల్లఁగ మరి యిఁక
వెనకటిమంకులు విడ వమ్మా ॥ ఇంత ॥

అసురులు నుసురులు నందినకాఁగిట
వసివాడులు [1]వీఁక వలె నమ్మా
యెసగిన శ్రీవెంకటేశుఁడు గూడెను
పొసఁగె విన్నియును భోగించ వమ్మా. ॥ ఇంత ॥ 339

మధ్యమావతి

పంతములే నెరపేవు పలుమారును
యెంత కెంత విచారించ కిది నీకుఁ దగునా ॥ పల్ల

1. "వీవక" అని వ్రాసి "వింత" అని దిద్ది యున్నారు. "వ" వ్రాసిన స్థలం
గాడుగొంతో కొంకగా చెక్కి యున్నారు.

పేద నాదేవు వీఁడని పేవమంత పని కైన
తోడనె కొండవంటి దొర గాఁడా
యేడ నైనా నీ వైతే నెకసక్కెమే వేసేవు
జాడతో నీచే నాతఁడు సాధింపఁబడునా ॥ పంతములే ॥

చెలరేఁగే వది యేమే చేతికి లోనాయ నంటా
వలపు నీమీఁదఁ గలవాఁడు గాఁడా
పొలసి పొలసి వోరచూపులఁ జూచే వదేమే
చలపాదితన మింత సతులకుఁ జెల్లునా ॥ పంతములే ॥

సిగ్గువడే విది యేమే చేయి నీపై వేసె నంటా
యెగ్గు లేని శ్రీవెంకటేశుఁడు గాఁడా
అగ్గ మై నీచిత్తము రా నన్నిట నాతఁడు గూడె
కగ్గు దేరినందుమీఁదఁ గపటము చెల్లునా. ॥పంతములే॥ 340

ఆహిరి

ఎందు కైన వచ్చు నీయిటువంటి భావములు
విందుగా నాతో నాడవే వింటా నున్నాఁ డాతఁడు ॥ పల్లవి ॥

చెక్కునఁ బెట్టేవు చేయి సిగ్గుకో చింతకో కాని
తక్కక నే పతిసుద్ది దడవితేను
పక్కన నవ్వే వందుకు పగటో నీ పల్లదమో
వొక్కమాటె ఆన తీవే వొద్ద నున్నాఁ డాతఁడు ॥ఎందు కైన॥

తప్పక చూచే వదేమే తగులమో కోపమో
చిప్పిల నాతని నీ చేతి కియ్యఁగా
కప్పేవు పయ్యదకొంగు కసరులో కొసరులో
వొప్పుగా నాకుఁ జెప్పవే వూరకున్నాఁ డాతఁడు ॥ఎందు కైన॥

పవ్వళించే వేమే నీ పంతనాలో పొంతనాలో
యివ్వల శ్రీవెంకటేశుఁ డెద మియ్యఁగా
దవ్వుల మందినన్ను దగ్గరఁ బిలిచే వేమే
నివ్వటిల్ల నాన తీవే నిన్నుఁ గూడె నతఁడు. ॥ఎందు కైన॥ 341

బౌళి

కూళతనమా బత్తి గొట్టమునఁ బెట్టఁ బోకే
ఆలసించ కిఁక లేవె ఆకెతోఁ జెప్పుదము ॥ పల్లవి ॥

ఏదలి మనసు రానివాని మాట లెన్నైనా
పెదవులపైనె కాని ప్రియము లేదు
యిదివో తా రాఁ దట యీద నుండ మన కేల
అదనఁ బోదము రావె ఆకెతోఁ జెప్పుదము ॥ కూళతన ॥

ననుపు లేనివానినగవు లెందాఁక నైన
పని మాలుచే కాని ఫలము లేదు
మనవు లడుగఁ దట మనమే చెప్పఁగ నేల
అనుమానించక రావె ఆకెతోఁ జెప్పుదము ॥ కూళతన ॥

ఆరయ రాజసపువాఁ డాస లెన్ని పెట్టినాను
పేరడి నుండుచె కాని పెనఁగ రాదు
యీరీతి శ్రీవెంకటేశుఁ డింత చేసి చెలిఁ గూడె
ఆరితేరె నా సుద్దులె ఆకెతోఁ జెప్పుదమా. ॥ కూళతన ॥ 342

358-వ రేకు పాడి

ముద్దు గారీఁ జూడరమ్మ మోహనమురారి వీఁడె
మద్దులు విరిచిన మా మాధవుఁడు ॥ పల్లవి ॥

చల్ల లమ్మ నేరిచినజాణ గొల్లెతల కెల్ల
వల్లెతాడు మా చిన్న వాసుదేవుఁడు
మొల్లపుగోపికల మోవిపండులకు నెల్ల
కొల్లకాఁడు గదమ్మ మా గోల గోవిందుఁడు ॥ ముద్దు ॥

మందడిసానుల కమ్మని మోముఁదమ్ములకు
చెందినతుమ్మిదవో మా శ్రీకృష్ణుఁడు
చంద మైన దొడ్డివారి పతులవయసులకు
విందువంటివాఁ డమ్మ మా విఠలుఁడు

హత్తిన రేపల్లెలోని అంగనామణుల కెల్ల
పొత్తుల సూత్రము మా ముద్దుల హరి
మత్తిలి ప్రేతెల నిండుమనసుల కెల్లాను
చిత్తజునివంటివాఁడు శ్రీవెంకటేశుఁడు. ॥ ముద్దు ॥ 343

ముఖారి

ఊరకె గుట్టు వేసుక వుండవే వయ్యా
పేరఁ బెట్టినటువంటి పెరుగ మాజరగు ॥ పల్లవి ॥

గొల్లవారిమాఁటలు గోనుఁబువ్వవాటులు
కెల్లు రేఁచి మమ్ముఁ బలికించకు వయ్యా
కొల్లలాడే భాగులు గొద్దుఁబుల్లతీగెలు
నొల్లనొల్లమి ఏదే లంగిటయ్యా మాకును ॥ ఊరకె ॥

చిత్తములో మంకులు చేతు లెల్లా అంకులు
బత్తితో మమ్ము బలిమిఁ బట్టకు వయ్యా
గుత్త మైనపేడలు కొమ్మిమాకునీడలు
కొత్త సున్నపుటిండ్ల కొర యాల మాకును ॥ ఊరకె ॥

తొలుతే మా కాఁపురాలు తోఁపుతిత్తి దాఁపురాలు
తిలకించి మా వాడి సోదించకు వయ్యా
నెల పై శ్రీవెంకటేశ నీవు మమ్ముఁ గూడితివి
మొలకలపులకలు మోపు లాయ మాకును. ॥ ఊరకె ॥ 344

ఆహిరి

ఆఁటదానిపై నీ బలు వంతయునుఁ జూపేవా
నాఁటెనా నీ ఆయములు నవ్వుల నా మాటలు ॥ పల్లవి ॥

వాలుకరెప్పలు వంచి వడిఁ దప్పక చూచేవు
వోలి నిందాఁక నేడ మంటి వంటేను
తాలిమి లే కప్పటిని తగఁ గసరుకొనేవు
యేలని నెంజిరి నింక నెంతటాఁ దీరదురా ॥ ఆఁటదాని ॥

చేరి మూరుమోముతోఁ బిల్చిన నాతోఁ బలుకవు
మేర మీరే నీ గుణాలు మెచ్చే నంటేను
దార దప్పె కందుకై తగఁ బంతా లాడేవు
యేరా నాపై కోప మెంత నీ కున్నదిరా ॥ ఆఁటదాని ॥

కోక గట్టుక నాతోను కోరి వాదుకు వచ్చేవు
కైకొని నీ పరువులు గంటి నంటేను
యేక మై యిట్టె శ్రీవెంకటేశ నన్నుఁ గూడితివి
యీకడ నా గరిమెలు యెందు కైనా వచ్చురా. ॥ఆఁటదాని॥ 345

శుద్ధవసంతం

ఓరి వో యిదేఁట సుద్ది వుండఁ బట్టదా । వోసి ।
వోరికొట్లు గొట్టఁగా వొద్దికి వచ్చితినే ॥ పల్లవి ॥

గొల్లపిన్నవాఁడా గోవులఁ జిక్కఁ గావరా
యిల్లిదె మావాకిలి నీ వేల కాచేవు
కల్ల గాదె నీమాట నేఁ గాచే ఆవులపాల
చల్ల లమ్మఁ బోఁగానె వో సాధించ వచ్చితివి ॥ ఓరి ॥

బాలకృష్ణబోయిఁడా పసుల వల్లె వేయరా
వాలుఁ జూపుల మ మ్మేల వల్లె వేసేవు
నేలనుండి మాకోడెలు నీ యింటిచూరు మేసె
తోల వైతి వందుకే వో దూరులు వేసితివి ॥ ఓరి ॥

నాలి శ్రీవెంకటేశుఁడ నాచన్ను లేల పట్టేవు
చాలదా నీవు పసుల చను పట్టేది
మేలిమి ఆవులవారి మెలుతలు మీరు గాన
మూల మన్న మీ చన్నులు ముట్టి నేఁ గూడితివి. ॥ ఓరి ॥ 346

హిజ్జిజి

మంచివానివలెనె మాటలు వాడేవు గాక
దించరాని తమకపు దేవరవు గావా ॥ ...

గుట్టున నెవ్వతెమీఁది కోపాన వచ్చి య దెల్ల
వెట్టికి వింటివారిపై వెళ్లించేవు
దిట్ట నే నొకతెఁ గాఁగా దీకొంటిఁ గాక నీతో
అట్టిపాటి యాఁట దెల్లా నందకు రాఁగలదా ॥ మంచివాని ॥

బిగిసి యాద నెవ్వతో పిలువనికాంతాలాన
నగుతా నెవ్వ రే మనినాఁ దిట్టేవు
అగపడి నేఁ గాఁగా నన్నియు [1]నమరెఁ గాక
విగిడి వేరొక్క తైతే నీతోఁ బొందు నేసునా ॥ మంచివాని ॥

అవల నెవ్వతెతోము అలిగినవాఁడ వై
కవ గూడి నన్ను నిట్టె కాఁక నేసేవు
నవ మై శ్రీవెంకటేశ నాకె మజ్జాతి గాక
వివరి వేరొక్క తైతే నీతోఁ బొందు నేసునా. ॥ మంచి ॥ 347

మాళవిగౌళ

ఓప నన్న విదువవు వూఁకొను మనేవు నీవు
నీ పను లివెల్లాను విన్ననె పో వింటిని ॥ పల్లవి ॥

మాను మన్న మానవు మాతోనె నీ సుద్దు లెల్లఁ
దేనె వూసి చెప్పి చెప్పి తేలించేవు
కాని కాని అందు కేమి కల్ల లాడేవాఁడవా
నే నెరుఁగుదు నంతాను విన్ననె పో వింటిని ॥ ఓప నన్న ॥

వద్దన్నా విదువవు వాకిటఁ గూచుండి నీ
పెద్దరికే లెల్లా నాతో పెంచి చెప్పేవు
కద్దు గద్దు నీవల్ల కడమ లేమీ లేవు
నిద్దిరించు నీ గుణము విన్ననె పోవింటివి ॥ ఓప నన్న ॥

సిగ్గు వడ్డాఁ బో నీవు చేయి వట్టుకొని నాతో
అగ్గలపుఁ బిచ్చిమాట లవి చెప్పేవు
దగ్గరి శ్రీవెంకటేశ తగు నన్నుఁ గూడితివి
విగ్గుల నీ కత లెల్ల విన్ననె పో వింటివి. ॥ ఓప నన్న ॥ 348

1 "నమరె" అని వ్రాసి "నమరె" అని దిద్ది యున్నారు.

350-వ రేకు శంకరాభరణం

అదివో నీ రమణుఁడు అలుగఁగఁ దరి గాదు
యెదిటికి రావు లోన నేమి సేసేవే ॥ పల్లవి ॥

చిలుక పావురము చెరకు శింగిణివిల్లు
వలరాజు దాడి ముట్టె వసంతవేళ
బలిమిఁ గోవిలకూఁత పరివారములమోఁత
యెలమి నదివో లోన నేమి సేసేవే ॥ అదివో ॥

పొడవు మీనుటెక్కెము పూవులయమ్ములపొది
వెడలె మరుఁడు దండు విరహులపై
యెడయనివెన్నెలలు యెగయుఁ బోఁజులధూళి
యిదుమఁ జింతతో లోన నేమి సేసేవే ॥ అదివో ॥

చిగురుజొంపపు జల్లి చిరుతగాలి ప్రధాని
మగటిమిఁ గాముఁ డెక్కె మనసులపై
తగిన శ్రీవెంకటాద్రిదైవ మిట్టె నన్నుఁ గూడె
యెగసక్కెమున లోన నేమి సేసేవే. ॥ అదివో ॥ 349

వరాళి

వాకిటి కాతఁడు రాఁగా వద్దంటినా
చేకొని నా కేల [1]చెప్పేవే బుద్ధులు ॥ పల్లవి ॥

మన సాతనితగులు మాటలు నీతో తగులు
వొనర నన్నే మనేవే వో చెలియ
కనుచూపు లాతనిపై కాఁకలు నామేనిమీఁద
పెనఁగి నింకా నేల పెంచేవే దూరులు ॥ వాకిటి ॥

సిగ్గు లాడ కంపితిని చెక్కుచేయి నాకు విదె
యెగ్గులు దప్పులు లేవు యే మనేవే
దగ్గరెఁ దనపొరువు తాలిమి నాకుఁ గరవు
నిగ్గుల నాపయి నేల నించేవే కోపము ॥

1. "చెప్పేవే" అని వ్రాసి "చెప్పేవే" అని శుద్ధి యున్నారు.

ముంగిట నాతఁ డున్నాఁడు మూల నున్నదాన నేను
అంగడి కెక్కె వలపు లవుఁ గదవే
రంగుగా శ్రీవెంకటాద్రిరాయఁ డిట్టె నన్నుఁ గూడె
సంగ తాయ నీ కోరికె చల మేలే యఁకను. ॥ వాకిటి ॥ 350

పాడి

మేలు మేలు రాఁగా రాఁగా మెచ్చితి విన్ను
కోలు ముం దై యిందే కాక కొండకుఁ బొయ్యేవా ॥ పల్లవి ॥
సంతసాన నే నీతో జరసి మాటాడఁగాను
పంతము దప్పి నంటాఁ బలుకవు
రంతుల నేఁడె నీకు రాజస మెంత గల్లాను
కాంతలమీఁదనె కాక కడఁ జూపేవా ॥ మేలు మేలు ॥
సలిగెతో నే నెంత నటలు నేసిన నీవు
చలము దప్పి వంటా సరి నగవు
పెలుచుఁదనాన నీకు బీర మెంత గలిగినా
చెలులమీఁదనె యింత సేయక మానేవా ॥ మేలు మేలు ॥
యేపుననీ ముందటనె యెంత నిలుచుండినా నీ
చూపు లరగీ నంటాఁ జూడఁ జాలవూ
బాపుర శ్రీవెంకటేశ పచ్చిగాఁ గూడితి వన్ను
నీ పొందు నాతోనె కాక నేఁడు మానేవా. ॥ మేలు మేలు ॥ 351

సామంతం

నీవు విరహి వవుట నే నెరఁగనా
భావించి యెవ్వ రవుతా నేర్పరచలేఁ గాని ॥ పల్లవి ॥
కాఁకలు నీ మాటలోనె కాన రాదా నీమేను
సోఁకించి నా కప్పటివి చూప వలెనా
యేఁకట నా కయిన దివ్వి యెవ్వతెకు నీ పైనది
తేఁకువ నీ రెండూను తెలియలేఁ గాని ॥ నీవు ॥

కరఁగులు నీ మోము కళలోనె కాన రాదా
అర మరచితి నంటా నాడవలెనా
ధర నిది నా కవుత తగ వేరొకతె కవుత
యిరవుగ నిది నిశ్చయించలేఁ గాని ॥ నీవు ॥

కూటమి నీ కాఁగిటిలో గురి సేయవలెనా నీ
తేటల ప్రియాలలోనె ద్రిష్టము గాదా
మేఁటివి శ్రీవెంకటేశ మించి నన్నుఁ గూడితివి
యాఁటదానిపొం దవుత అరయలేఁ గాని. ॥నీవు ॥ 352

మంగళకౌశిక

ఇప్పుదె సవతితన మేరుపడె నాకు నేఁడు
తప్పు లేదు యిఁక నన్నుఁ దడవక పోవే ॥ పల్లవి ॥

ఆతఁడె నామీఁదిబత్తి అవు నట యిఁక నీవు
యీతల వెంగెము లాడి యేమి సేసేవే
కాతరాన మా గుట్టు కడు బయట వేసితి
భీతి వాసె నిఁక నీవు బీరము లాడకువే ॥ ఇప్పుదె ॥

వూరకె మా యింట నాతఁ డున్నాఁ డంటా నాదేవు
సారెకు నీ విఁక మరి సాదించే దేమే
యీరీతి మా చలి వాపి యింత అట్టు సేసితివి
తేరెఁ బను లన్నియును తెగ నాడేఁ [1] బదవే ॥ ఇప్పుదె ॥

శ్రీవెంకటేశ్వరు నాకుఁ జేరి వొప్పగించితివి
కావించి నీ వాదేనింద గట్టాయ లేవే
వేవేగ నాతఁడు నన్ను విచ్చనవిడిఁ గూడెను
దేవరే మేలు సేసె తెరమరఁ గేఁటికే. ॥ ఇప్పుదె ॥ 353

ఆహిరి

అప్పుడువో నన్నుఁ జూచే దంతా నీవు
చెప్పక నీవు దాఁచినచెలిఁ గంటేఁ గాని ॥ పల్లవి ॥

---

1. "బదవే" అని వ్రాసి "బదవే" అని దిద్ది యున్నారు.

చెప్ప రాదు గాని నా చిత్తములోని చింత
వుప్పతిల్లి వున్నది నా వొళ్లఁ జూడరా
కప్పురానఁ బోదు చల్లగాలిచేతా నారదు
తప్పదు విన్ను రానీవిదానిఁ గంటేఁ గాని ॥ అప్పుడువో ॥

చూప రాదు గాని నా [1]చుట్టుకొన్న తమకము
ఆఁప రానివిట్టూరుపు లందుఁ జూడరా
తీపుల మాటలఁ బోదు తేటల వెన్నెలఁ బోదు
తాపి యై విన్ను బోదించేదానిఁ గంటేఁ గాని ॥ అప్పుడువో ॥

యెంచ రాదు గాని నా యీరసపుఁ జలములు
యించుక నా కాఁగిటిలో నిదె చూడరా
ముంచిన శ్రీవెంకటేశ మూసి మంతనాలఁ బోదు
అంచెల నీ మేలుదాని నట్టె కంటేఁ గాని. ॥ అప్పుడువో ॥ 354

360-వ రేకు ముఖారి

బాపు బాపు జాణ గదే బావఁగారు
కోపగించీ నోప నంటే గోల బావఁగారు ॥ పల్లవి ॥

చనవు సేసుక నాతో సారె సారె నవ్వీని
పని లేదు తన కేమి బావఁగారు
వినరె మాటల నుప్పు వేసి పొత్తు గలసీని
పెనఁగి యెక్కడ నైనా పెద్దబావఁగారు ॥ బాపు ॥

నయమున నా యెదుట నన్నుఁ బేరుకొని పాడి
బయలువందిలి వెట్టీ బావఁగారు
ప్రియముతో మంచ మెక్కి పిలువని పేరంటము
లయకాఁడు గదవే తొలఁగుబావఁగారు ॥ బాపు ॥

సులభానఁ దానె మెచ్చి సొమ్ము లెల్లా మెడఁ గట్టీ
బలిమికాఁడు గదవే బావఁగారు
తొలఁగక నన్నుఁ గూడి దొరకోలు సేసుకొని
చెలఁగీ శ్రీవెంకటాద్రి చిన్నబావఁగారు. ॥ బాపు ॥ 355

---

1. "చుట్టు" అన్నచోట రెండక్షరములు వ్రాసి చెరిపినట్లు తెలియుచున్నది గాని అక్షరములు గుర్తింప వీలు కాలేదు.

కేదారగౌళ

ఏల నిలువఁ బెట్టేవు యింతేసి వలపులు
పోలికలు గాన రాదా పోయినందుకే ॥ పల్లవి ॥

ఆవ వెట్టేవు నామీఁద నక్కర గల నంటాను
కాని కాని అందు కేమి కడమా నేఁడు
యీ నిజము లెంచఁ బోతే యీరు దియ్యఁ బేను వచ్చు
వోరి నన్ను గుట్టుతోనె నూరకుండ నియ్యరా ॥ ఏల ॥

కారుకాణించ వచ్చేవు తలఁతు న న్నంటాను
సారె సారె నందు కేమి చాలదా నేఁడు
మారుబాణము లెంచితే మంచముకిందే నుయ్యి
నేరుపుతోఁ బరాకున నెత్త మాడ నియ్యరా ॥ ఏల ॥

పులకలే చూపేవు పొంది కరఁగితి నంటా
తలతల అందు కేమి తగదా నేఁడు
యెలమితో శ్రీవెంకటేశ నన్నుఁ గూడితివి
పలుకుఁబంతము చెల్లె భావించుకో నియ్యరా. ॥ ఏల ॥ 356

వరాళి

ఎరవులదానివలె నెందు వొయ్యేవే ఆత
నిరవులు వెదకవే యేమి నేసీనో ॥ పల్లవి ॥

కంకణాల చేతులు కదల నూఁచుకొంటాను
యింకనిచెమటలతో నెందు వొయ్యేవే
అంకెల నీ యింటికి నాతఁడె విచ్చేసె
యింకా రాఁడా వెర గయ్యీ నెంతఁ బోయనో ॥ ఎరవుల ॥

నెలవుల నవ్వుకొంటా చెంపలఁ దురుము జార
యెలమి ననురుసు రై యెందు వొయ్యేవే
కొలఁది లేనిసొమ్ములు [1]కొంట వచ్చె నీకు నిట్టె
[2]యెలయించి నాతోఁ జెప్పి యేద నున్నాఁడో ॥ ఎరవు

1. "కొంటా" అని వ్రాసి "కొంట" అని తిద్దియున్నారు. 2. "యెలయి అన్నచోట ఏవో అక్షరములు వ్రాసి చెరిపినట్లు తెలియుచున్నది గాని ఆ యక్షర గుర్తింప వీలు కాలేదు.

బంగారు పాదాలతోడ పట్టుచీర కొంగు జార
యింగితాలు గాన రాఁగా నెందు వొయ్యేవే
అంగన శ్రీవెంకటేశుఁ దప్పదె విన్నుఁ గూడెనో
రం గై నీ వెంటనె వచ్చె రాఁపుల వీఁడు గదే. ॥ ఎరవుల ॥ 357

కాంబోది

చాలుఁ జాలుఁ దనిసితి సటలనె నేఁ డెల్ల
తాలిమి నిందుకె విన్నుఁ దప్పక చూచేను ॥ పల్లవి ॥

నేయ రానిచేఁత లెల్లఁ జేసి వచ్చి నీవు నన్ను
పాయని చుట్టమువలెఁ బై కొనేవు
కాయకపువారికె కాని లే వీ వినయాలు
వోయమ్మ ని న్నె మనే నూరకుండేఁ గాక ॥ చాలు ॥

చి త్త మెక్కడనో పెట్టి చేరి నాతో మాయలకు
బ త్తి గలవానివలె బలికే విదే
హ త్తి గాయగంట్లె కాని అంతేసి నేరరు
యి త్తల నెట్టు వూఁకొందు నిట్టె నవ్వేఁ గాకా ॥ చాలు ॥

తేరక త్తె నెవ్వతెనో తెచ్చి యూపెచేత నాకు
చేరికొనఁ బెట్టి సేవ సేయించేవు
నేరుపు శ్రీవెంకటేశ నీకె కాని లేదు
సారె నన్నుఁ గూడితివి సమ్మతాయ నిదివో ॥ చాలు ॥ 358

కొండమలహరి

ఇంతటా నీ మనసు రా దెగ్గు లెంచ నేఁటి కోయి
చింతతో నుండాన నంటా సిగ్గు వడే వోయీ ॥ పల్లవి ॥

చి త్తమును నోవకుండా చిన్నఁబోయి వుండకుండా
మె త్తనిమాట లాడితే మే లదే వోయి
కొ త్త లెల్లఁ దోఁచకుండా గుట్టు నీకుఁ జెదకుండా
పొ త్తుల నవ్వు నవ్వితి వూఁచి మెచ్చ వోయి ॥ ఇంతటా ॥

జగడాలు రాకుండా చనవునుఁ దప్పకుండా
సగముచూపు చూచితి చాలదా వోయి
తగులమిఁ బాయకుండా తప్పు నీపైఁ [1]జేయకుండా
మొగము వంచితి నే నీ ముందరనె వోయి ॥ ఇంతటా ॥

నింద నీపై మోయకుండా నేమమూనుఁ దప్పకుండా
అంది నేఁ బరాకైతి నప్పుడే వోయి
కందువ శ్రీవెంకటేశ కాఁగిలించితివి నన్ను
చంద మాయ నిద్దరికి సరి లేదు వోయి. ॥ ఇంతటా ॥ 359

పాడి

ఎవ్వ రేమి చెప్పిరె యింతలోననే
నివ్వటిల్ల వింత లెల్ల నేరుచుకొంటివా ॥ పల్లవి ॥

మోము చూచి నవ్వఁగానె మోనానఁ దల వంచేవు
యేమిటికే కోపము నీ కెన్నఁడు లేమి
కామించి పిలిపించి కడసారె నలిగేవు
నేమమున నివి గొన్ని నేరుచుకొంటివా ఎవ్వ రేమి ॥

దగ్గరి నేఁ గూచుంటె తగ లేచి నిలిచేవు
సిగ్గు గొంత జిగి గొంతఁ జిలికే వేమే
అగ్గలపుఁబ్రేమ చల్లి అంతలోఁ బిరి తీసేవు
నిగ్గులు నీడలు గొన్ని నేరుచుకొంటివా ॥ ఎవ్వ రేమి ॥

కాఁగిట నే నించఁగాను కన్నులు మూసుకొనేవు
మాఁగఁ బెట్టేవు వలపు మతిలో మేలే
పాఁగిన శ్రీవెంకటపతి నన్నుఁ గూడితివి
నీఁగనిరతులు నేఁడు నేరుచుకొంటివా. ॥ ఎవ్వ రేమి ॥ 360

361-వ రేకు ముఖారి

తనవాల్లి భయ మింతే తప్పులు నేఁ బట్టేనా
వినవె సిగ్గు వదిని వేగిరించ నేఁటికే ॥ ప

1. "జేంయ" అని వ్రాసి "ం"ను చెరిపి "జేయ" అని తిద్ది యున్నారు

అద్దము నేఁ జూడు మంచె నావ వెట్టి నవ్వీని
అద్దలించి తమ్ము వెంగె మాడేనా నేను
వొద్దికి నే రమ్మంటే నూరకే అట్టట్టు వొయ్యీ
మద్దు లింతే తన మేను సోదించ వచ్చేనా ॥ తనవొళ్లి ॥

జలక మాడు మంచేను సారె సారెఁ దల వంచీ
యెలమిఁ దన కెగ్గవుత యెరఁగను
అలరులు ముడిచే నంటేఁ దా లోఁగీని
మలసి వాడుఁజూపుల మచ్చము వట్టేనా ॥ తనవొళ్లి ॥

నిద్దిరించు మంచేను విట్టచూపు చూచీని
యిద్దరి జాగరాలు నే యెత్తి పెట్టేనా
కద్దులె శ్రీవెంకటాద్రిఘనుఁ డిట్టె నన్నుఁ గూడె
ముద్దుమోము చూచి చూచి మొగ మోడ కుందేనా. ॥ తన ॥ 361

## సౌరాష్ట్రం

ఇందు కేల అలుగ మాయింటికి విచ్చేయవయ్య
ముందు ముందె నీకు నేము మొక్కేము గాని ॥ పల్లవి ॥

యేడ నైనాఁ జేయి చాఁచే విందుకే పో సిగ్గువడి
ఆడరాని మాటలు నే నాడితిఁ గాక
జాడతో నేక మైతే సారె నీ వేమి నేసినా
కూడ దనేనా నీకు గుట్టు లేదు గాక ॥ ఇందు కేల ॥

కొలువులో నుండి నీవు కొంగు వట్టి తియ్యఁగానె
వెలయఁగ విదిలించి వేసేఁ గాక
నెలవునఁ బానుపుపై నిన్నుఁ గసరుకొనఁగ
చలమా నీ కక్కూరితే జరపేవు గాక ॥ ఇందు కేల ॥

నిద్దుర వోయేవేళ నీవు నన్ను లేపఁగాను
అద్దమరేతిరి వోప నంటిఁ గాక
యిద్దరము సమ్మతిల్లి యిటువలెఁ గూడితిమి
అద్దో శ్రీవెంకటేశ అప్పు దేలో కాక. ॥ ఇందు కేల ॥ 362

శంకరాభరణం

ఇంత నేరకుండితే నీ వేల వచ్చేవు
వింత వింత వగ లెల్ల వింటిఁ గంటిరా ॥ పల్లవి ॥

వాలుక రెప్పలు నే వంచినమాత్రములోనె
నాలికాఁడ నీ తనువు నాఁటె ననేవు
యీలాగు మాట లాడి యిచ్చకాలు నేసుక
కాల మెల్ల బతికితి కానీ కానీరా ॥ ఇంత ॥

చల్లఁగా నే గందవొడి చల్లినమాత్రములోనె
పల్లదాన తల దిమ్మ పట్టె ననేవు
కల్ల గాదు యింత మాయకాఁడవు గాకుండితేను
యెల్లవారిలోన నేఁడు యెట్టు వేగించేవురా ॥ ఇంత ॥

కొంకక నీతొడమీఁదఁ గూచున్నమాత్రములోనె
అంకెల నీ కళ దాఁకె నని అనేవు
సంకె లేక నీ వింతేసి జాణవు గాకుండితేను
పొంకపు శ్రీవెంకటేశ పొంచి నన్నుఁ గూడేవా. ॥ ఇంత ॥383

ఆహిరి

నవ్వ నీకుఁ జెల్లు నట నాకుఁ గొసరఁ జెల్లదా
రవ్వగాఁ దడవుదురా రాజసపువాఁడవు ॥ పల్లవి ॥

సిగ్గువడి వున్నమమ్ముఁ జేయి వట్టి తియ్య నేల
యెగ్గు వట్టే[1] వేల నే నే మన్నాను
అగ్గల మై సరసము లాడ నేర్చినవాఁడ
వొగ్గి అన్ని మాటలును వోరుచుకో నేరవా ॥ నవ్వ ॥

జగడించి యున్నదాని చన్ను లంటి చూడ నేల
తగవులఁ బెట్ట నేల తల మంచేను
చిగులుతా మమ్మ[2] నింత సేయ నేర్చినవాఁడవు
యెగసక్కెపు మాకోపా లిముడుకోఁ జాలవా ॥ న॥

1. "నేల" అని వ్రాసి "వేల" అని దిద్ది యున్నారు. 2. "వింతె" వ్రాసి "వింత" అని దిద్ది యున్నారు.

కన్ను మూసుకున్నదాని కాఁగిలించి పట్ట నేల
చిన్నఁ బోవ నేల నాచే దాఁకె నంటా
యెన్నికెతో శ్రీవెంకటేశ నన్నుఁ గూడితివి
విన్ను నన్ను నెంచుకొని విందుకుండ నేరవా. ॥ నవ్వ ॥ 364

మాళవి

నేరుపు గలితేఁ జాలు నీవే నేను
దూరి మాటాడ నోప మందు లిట్టె నూరకురా ॥ పల్లవి ॥

యెప్పుడు నీ వారమే యేల పిలిచేవు మమ్ము
చప్ప నై నీ నోరు నొచ్చీఁ జాలించ రాదా
నెప్పున నే నీడ నుంటే నీవద్ద నుండుట గాదా
ముప్పిరిఁ బెనఁగ నోప ముంజేయి వట్టకురా ॥ నేరుపు ॥

వూడిగపువార మింతే వొాద లేల నిమిరేవు
తోడ నీచేతు లరిగీఁ దొలఁగ రాదా
నీడల నే నవ్వితేనె నీ పరిణామము గాదా
వీడ నాడ నే నోప వేసాలు సేయకురా ॥ నేరుపు ॥

నీకు మేనదాన నింతే నీ వేల కిందు పడేవు
కా కై నీ రాజసము కైకో రాదా
యీకడ శ్రీవెంకటేశ యిట్టె నన్నుఁ గూడితివి
నీకు నే సరి గా నోప నీ వంత మెచ్చకురా. ॥ నేరుపు ॥ 365

నాగవరాళి

ఎఱఁగ నైతి నిందాఁక యింత నీవు జోలిఁ బెట్టే
దెఱుఁగుకో నిన్నుఁ గొల్చే దిందుకొరకా ॥ పల్లవి ॥

మాయదారిమాటలే మాపుదాఁకా నాడి నా
కాయముపై నొరగితే కాఁక మానీనా
ఆయములు సళుపఁగ నాసపడి నీరాక
కీయెడ నేఁ గాచుకున్న దిందుకొరకా ॥ ఎఱఁగ ॥

నాటకపునవ్వులే నవ్వి నాతో వేగించఁగ
 తాఁటలుఁ దూఁటలే కాక తాపము మారీనా
 కూటమి గలిగె నంటా కోరివసంతోషముతో
 యీటున నుండిన దెల్లా నిందుకొరకా ॥ ఎఱఁగ ॥

పెనఁగి వట్టికాఁగిట బిగియించి సారె నా
 తనువు నిమిరితేనె తని వయ్యీనా
 ఘనుఁడ శ్రీవెంకటేశ గక్కునఁ గూడితి విట్టె
 యెన లేని నీ మతకా లిందుకొరకా. ॥ ఎఱఁగ ॥ 366

362-వ రేకు శంకరాభరణం

నేనె కూళఁ గాని వీఁడు నెరజాణఁడే
 తానె నావెంటవెంటఁ దగిలీనె వీఁడు ॥ పల్లవి ॥

మన్ననలు నాకు నిచ్చి మరి నే నెంత దూరిన
 కన్నులనె నవ్వు నవ్వీఁ గదవే వీఁడు
 సన్న లెరఁగక నేనె సారెఁ దమకింతుఁ గాని
 పన్ని నే నెం తలిగినఁ బదరఁడే వీఁడు ॥ నేనె ॥

యిచ్చకము నాకుఁ జేసి యెంత నే నలిగినాను
 బచ్చనల నావద్దఁ బాయఁడే వీఁడు
 కుచ్చితాన నేనె తన్నుఁ గొంగు వట్టి వియ్యఁ గాని
 విచ్చనవిడిఁ దా నై తే వేఁడుకొనీనె వీఁడు ॥ నేనె ॥

తాలిమితోడను నేఁ [1]దల వంచుకుండినాను
 కేలు చాఁచి నన్ను బుజ్జగించీనె వీఁడు
 వే శెరిఁగి రతుల శ్రీవెంకటేశుఁ డిట్టె కూడె
 నాలి దీర నన్ని ట్టె నమ్మించెనే వీఁడు. ॥ నేనె ॥ 367

భవుళి

సారె విన్నపము లేల చవులు వుట్టించ నేల
 దార దప్పకుండేజాణతన మింతే యిఁకనూ ॥

1. "దల" అని వ్రాసి "దల" అని తిద్ది యున్నారు.

నావలె వలచినట్టి నాతి నీకుఁ గలదా
ఆవల నీవల నే నాడుకోఁ గాక
నీవల్లఁ గడ మున్నదా నెరజాణతనమందు
భావభేదములలోని భాగ్య మింతే కాక ॥ సారె ॥

యింత నీతో నవ్వేటియింతి నీ కొకతె యేది
వింతగా నీపై వలపు వేయఁ గాక
చెంత నీ చేసినమేలు చెప్పితే నటువంటిదే
కొంత గొంత కూడేవేళ గుణ మింతే యిఁకను ॥ సారె ॥

నిన్ను నేఁ గూడినరతి నేరుచునా యెవ్వ తైన
పన్ని నిన్ను నే నిట్టె పంగించఁ గాక
యిన్నిటా శ్రీవెంకటేశ యిటు నన్నుఁ గూడితివి
మున్నిటివెనకల యీ ముచ్చటలే యిఁకను. ॥ సారె ॥ 368

సాళంగనాట

సందడికిఁ జొర నేల చలము సాధించ నేల
అం దెంది సరస మాడి అంద మంట గాక ॥ పల్లవి ॥

పంతపు నీ మాటలు భావించి తెలియఁ బోతే
కొంతము లై నాటుఁ గాక కొర తయ్యీనా
చింత లేల మాకును నీ చేఁతలే చూచుకొంటా
అంత కంతే చాలు ననే దది మేలు గాక ॥ సందడి ॥

నగెటి నీ నవ్వుల నయాన వహించుకొంటే
వొగరులే మించుఁ గాక వుడి వోయీనా
తగ వేల నీమంచితనానకే మెచ్చుకొంటా
మొగమొగా లెదుటనే మొక్కు[1] కొంటఁ గాక ॥ సందడి ॥

కాఁగిటి నీరతులు గాలించి వెదకఁ బోతే
మాఁగినచవులే కాక మానఁ బోయీనా
పాఁగిన శ్రీవెంకటాద్రిపతి నన్నుఁ గూడితివి
వోఁగు వోఁగుఁ బొందినట్టు వురిగొంట గాక. ॥సందడి॥ 369

1. "కొంటి" అని వ్రాసి "కొంట" అని శిద్ధి యున్నారు.

కన్నడగౌళ

నీ మన సెట్టుండునో నే నెఱఁగను
కోమలపుఁబలుకులఁ గొసరే నే నిదివో ॥ పల్లవి ॥

తప్పక చూడఁగ నోప తల వంచుకొన నోప
చిప్పిలుఁజెమటతోడి సిగ్గులే కాని
ముప్పిరి ములుగ నోప ముందటనే నగ నోప
అప్పటప్పటికి నుస్సు రను టే కాని ॥ నీ మన ॥

యేమీ నడుగ నోప యెవ్వరిఁ గోపించ నోప
ఆమని జాగరముల అలపే కాని
నేమపువ్రతాల కోప విందుమాయలకు నోప
చే ముంచి తమకముల చింతించు టే కాని ॥ నీ మన ॥

బుద్ధులు చెప్పఁగ నోప బూములు దొక్కఁగ నోప
వొద్దనె పాయక నీతో నుండు టే కాని
గద్దరి శ్రీవెంకటేశ కలసితి విదె నన్ను
వద్దని తోయఁగ నోప వంచు టే కాని. ॥ నీ మన ॥ 370

దేవగాంధారి

మంచివాఁడ వవుదువు మమ్మఁ దరవకు చాలు
ముంచి నీకు నేపొద్దు మొక్కేము నేము ॥ పల్లవి ॥

తెగనాడఁ జాలఁ గాక తేనెల నీ మాటలకే
అగపడి చిక్కరా దైత్యాంగనలు
పగ కోప మింతే కాక పదఁతిఁ జంపినవాని
మగతన మే మున్నది మరతునా నేను ॥ మంచివాఁడ ॥

యిచ్చకము మానఁ గాక యిట్టె నీ పొందులు నేసి
కొచ్చి మరులు గొనరా గోపికలు
వొచ్చె మిదె నీ కొడుకు వొగిఁ గూడపెట్టఁగాను
తెచ్చుకొంటివి పతుల దేవతవు గావా ॥ మంచివాఁడ

యింకా నే లవి కాక యిట్టి నీకు మోహించి
కొంతక వాక్కతె ముక్కుగోఁతఁ బరదా
లంకె మమ్ముఁ గూడితి నీలాగు మమ్ముఁ జేయకుమీ
అంకెల శ్రీవెంకటేశ అన్నిటా నమ్మితివి. ॥మంచివాఁడ॥ 371

సాళంగం

సడి సన్న యట్టి నెరజాణ నందువు
గొడవలు దీరఁ జెలిఁ గూడ రాదా రతుల ॥ పల్లవి ॥

చిగురుఁబానుపుమీఁదఁ జెలి విరహానఁ బొంది
చిగురువంటిచేయి చెక్కునఁ బెట్టి
చిగురులోపలిచేగ చిత్తమునఁ బుట్టదాయ
చిగురుఁబోణిని దయ సేయ రాదా విభుఁడ ॥ సడి సన్న ॥

పూవులతోఁటలోన పొలఁతి తాపాన నుండి
పూవుల మొగ్గలు మేనఁ బులకించెను
పూవులలో పూఁపలు పుట్టవాయ మాటలలో
పూవుఁబోణి నీవు గొంత బుజ్జగించ రాదా ॥ సడి సన్న ॥

పండువెన్నెలబయట భామిని యలయుచునుండి
పండువంటిమోవివాఁడు బయట వేసె
పండుగలు గాఁగ నిట్టె బావురె శ్రీవెంకటేశ
పండుజవ్వనిఁ గూడితి పవ్వళించ రాదా. ॥ సడి సన్న ॥ 372

383-వ రేకు లలిత

ఎంత కెత్తుకొంటివి నీ వేరా వోరి
చెంతల నవ్వు నవ్వేవు చెల్లురా వోరి ॥ పల్లవి ॥

చెఱఁగు మాసినదాని చెక్కు ముట్టి వేఁడుకొని
యెఱఁగి నన్నంట వచ్చే వేరా వోరి
మఱియు సురతపుఁజెమటలు జొబ్బిలఁగాను
పులక నాపైఁ బూసేవు పుద్దండాలా వోరి ॥ఎంత కెత్తు॥

గుట్టున నాకెపొత్తున కోరి యారగించుకొంటా
అట్టె నాకుఁ [1]గడెఁ దిచ్చే వదేరా వోరి
వొట్టుక ఆపెయు నీవు వుండినపరపుమీఁద
యెట్టు గూచుండఁ బిలిచే వేరా నన్ను వోరి ॥ ఎంత కెత్తు ॥

అచ్చు వాసుకొన్నదాని నట్టె నీవు గూడి వచ్చి
యిచ్చల నన్నుఁ గూడితి వేరా వోరి
పచ్చిగా శ్రీవెంకటేశ భ్రమసితి నీరతుల
మెచ్చితి ని న్నిన్నిటాను మేలు మేలు వోరి. ॥ఎంత కెత్తు॥ 373

దేసాక్షి

అప్పటప్పటికి బాగా లందియ్య వలె మనకు
చెప్పరే కతలు యిఁకఁ జింత లేఁటికి ॥ పల్లవి ॥

ముసిముసినవ్వులతో ముంగిట నుండినచెలిఁ
గొసరి [2]కొసరి పతి కౌంగు వట్టెను
వస మై [3]యిద్దరు లోన వడిఁ బవ్వళించి రదే
యెసఁగి వాకిట మన మిట్టే వుందమే ॥ అప్పట ॥

చిప్పిలుఁజెమటతోడ సిగ్గువడి వున్నసతిఁ
గప్పి పచ్చడ మాతఁడు గాఁగిలించెను
దెప్పర మిద్దరు దోమతెరలోఁ గూచుండి రిదే
కొప్పులు ముడుచుకొంటాఁ గూచుందమే ॥ అప్పట ॥

మాట లాడే అలమేలుమంగఁ జెక్కు నొక్కి కూడె
మేటి శ్రీవెంకటపతి మించురతుల
మాటున నుండి వచ్చి మనవద్ద నిలిచిరి
చాటువ సురటులు విసరు చుందమే. ॥ అప్పట ॥ 374

భైరవి

అట్టె కాదా తనమోహ మందరు నెరఁగ వద్దా
మిట్టిపడి యిందుకే మెచ్చితిఁ గా నేమ ॥

1. "గడి దిచ్చె" అని వ్రాసి "డి"ని "డె" చేసి "గ'డె" లకు పైన చేసి క్రింద "ం" పెట్టి "గడెందిచ్చె" అని దిద్ది యున్నారు. 2. "కొ" అను చెరిపి వ్రాసి యున్నారు. పూర్వపు అక్షరము తెలియరాలేదు. 3. "యిద్దవె" "యిద్దరు" అని దిద్ది యున్నారు.

సవతులతో నేను సారె వాదు లడువఁగ
తవిలి సాకిరి చెప్పఁ దన కేలే
యివల నేఁ దనుఁ జూచి యిందుకే వెర గంది
కవకవ నవ్వితివి కడు సంగ తేయఁగా ॥ అట్టె ॥

పగ చాటి వారు నేను పంతములు నెరపితే
తగవులు పచరించఁ దన కేలే
అగ డై యందుకే నేను అది యటు వెట్టి పతి
మొగమే తప్పక చూచే ముగిసెఁగా పనులు ॥ అట్టె ॥

పులక మాలో నేము వొట్లు వెట్టుకొంటేను
తలి సందిమాట లాడఁ దన కేలే
యెలిఁగి శ్రీవెంకటేశుఁ డిందుకే నన్నుఁ గూడఁగ
మఱచితి నన్నియును మన సొక్కటాయఁ గా. ॥ అట్టె ॥ 375

వసంతవరాళి

ఆన లేల పెట్టుకొనే వప్పటి నాతో
దాని కేమి దోసమా తగినంతే కాక ॥ పల్లవి ॥

చెలిచేఁ బిలిపించఁగ చేర వచ్చితివి గాక
వలచి నీ *యంత నీవే వచ్చితివా
వెల లేక మోహించి విడువ లేనేఁ గాక
కల నీగుణమే తొల్లి కన్నది గాదా ॥ ఆన లేల ॥

సేవలు నేఁ జేయఁగాను చిత్తము గరఁగెఁ గాక
కావించి నీ యంత నీవే కరఁగితివా
యీవలఁ గూళ నై నేనె యిట్టె పైకొందుఁ గాక
చేవ గలంతే కాక నేసి పెట్ట వచ్చునా ॥ ఆన లేల ॥

దండ నేనే వుండఁగాను [1]దయ దలఁచితి గాక
గుండె గరఁగి నీ యంతఁ గూడితివా
విండిన శ్రీవెంకటేశ నీకు నాకుఁ బోదు గాక
వెండియు నీతో విన్నవించ గురి యున్నదా. ॥ ఆన లేల ॥ 376

---

* రే. ప్రా. నీ వంత

1. "దద దలఁచితింగా" అనివ్రాసి 'ం' ను చెరిపి "దయదలఁచితిగాక" అని శద్ది యున్నారు.

రామక్రియ

ఇంకా నేల తడవేవు యేరా నీవు
సంతె దేరె నాకు నీ చలమూఁ జెల్లెనూ ॥ పల్లవి ॥

మాఁట నీతో నాడితివి మనసు దెలిసితివి
యేఁటికి నన్నుఁ బిలిచే వేరా నీవు
యీటుతోఁ బెండ్లాడితివి యిట్టె సేస వెట్టితివి
వాఁట మాయ వలపులు వద్దనే నుందానను ॥ ఇంకా ॥

చేత నీకు మొక్కితిని చేరి నీతో నవ్వితిని
యీతల న న్నొరసేవు యేరా నీవు
నీతగులు చూపితివి నెగు లెల్లాఁ బాపితివి
యేతు నీకు గన మాయ యియ్యకొంటి వందుకూ ॥ ఇంకా ॥

కన్నుల నిన్నుఁ జూచితి కాఁగిటిలో నున్నదాన
యెన్నేసి ప్రియాలు చెప్పే వేరా నీవూ
నన్ను మన్నించితి విట్టె నంటున శ్రీవెంకటేశ
చిన్నిపులకలు నేఁడె నెలవు నా కాయను. ॥ ఇంకా ॥ 377

తెలుఁగుఁగాంబోది

చుట్టమవు గా వతని సూడుబంటవూఁ గావు
ముట్టి వేఁడుకోఁ గాను మో మేల వంచేవే ॥ పల్లవి ॥

[1]గుట్టు లేక అతఁడు నీకొంగు వట్టి తీసీని
పట్టినచలము మాని పదవే నీవు
వుట్టిపడి నీ చెక్కు లుంగరాలచేత నొక్కె
బెట్టుగా నింతేసి యింకాఁ బెనఁగ నేమిటికే ॥ చుట్టమవు ॥

గక్కన నవ్వుతా వచ్చి కదిసి కూచున్నాఁడు
వెక్కసపుకోప మింక విడవే నీవు
అక్కరఁ దనపై నీకు ఆన లెల్లఁ బెట్టె నదే
యిక్కడఁ దొల్లిటినేరా లెంచఁగ నేమిటికే ॥ చుట్టమ॥

1. "గ్గుట్టు" అని వ్రాసి "గుట్టు" అని దిద్ది యున్నారు.

కందువ లంటుచు విన్ను కాఁగిలించె నాతఁడు
మందెమేళములు యింక మానవే నీవు
అం దెంది శ్రీవెంకటేశుఁ డన్నిటాను నిన్నుఁ గూడె
చంద మాయఁ బను లెల్ల సాదించ నేమిటికే. ॥ చుట్ట ॥ 378

384-వ రేకు పాడి

మాయలు మాని నాతో మాటలాడరా
నాయడ మునిముచ్చుఁదన మేల నీకు ॥ పల్లవి ॥

ఆరయ నాకెవంతూ ననేవు నీ వప్పటిని
నేరుపున నాపెమోము నేఁడు చూడవా
కేరి కేరి నవ్వేవు కేఁగండ్లఁ జూచుకొంటా
యేరా లే దటరా యీమాట నీవు ॥ మాయలు ॥

బత్తి నాకుఁ గల నంటాఁ బాయవు నీ వాపెకు
హత్తినచెలిచేఁ జెప్పి యంప వామాఁటా
వత్తివలెఁ బైఁ బడేవు వట్టి చనవు నేసుక
ఉత్తర మీరా యిందు కూరకుండేఁ గాని ॥ మాయలు ॥

యేపున నన్నే కాని యెవ్వరి నొల్ల ననేవు
ఆపె సొమ్ములె కావా అట్టే నీమేన
రాపుగా శ్రీవెంకటేశ రతి నన్నుఁ గూడితివి
ఆపను లిన్నాళ్లదాఁకా నమరెఁ గా నీకు. ॥మాయలు॥ 379

రామక్రియ

ఏఁటికి వాదుకు వచ్చే వింత నీవు
నాటకపుటాన లేల నమ్మనా నేను ॥ పల్లవి ॥

చెంతలఁ జెప్పినమాఁట చెవి యొగ్గి వింటిఁ గాక
కాంతుఁడ నీచేఁత లెల్లాఁ గంటినా నేను
యింతలోనె నీకుఁ గోప మేల వచ్చె విందరిలో
వంత విన్ను గురి సేసి అంటినా నేను ॥ ఏఁటికి ॥

చెక్కుల తమ్మచెదరు చేతఁ దుడిచితిఁ గాక
తక్కిన వెఱఁగుదునా తప్పులు నేను
గక్కన నీ వేల తారుకాణలకుఁ బెట్టేవు
వొక్క పై నీవద్దఁ బాయ కుండితినా నేను ॥ ఏఁటికి ॥

మించి కాఁగిలించఁగా నీ మేను నిమిరితిఁ గాక
యెంచి నీ మైగురుతు సోదించేనా నేను
అంచల శ్రీవెంకటేశ అట్టె నన్నుఁ గూడితివి
యించు కంతయిన నలయించేనా నేను. ॥ ఏఁటికి ॥ 380

సాళంగనాట

ఇందాఁకా రా వన వేమమ్మా
అం దెందె నవ్వేవు అతనితో నమ్మా ॥ పల్లవి ॥

యేలిపరమణుని కెన్నఁడు నలుగవు
తాలిమి నీకే తగు నమ్మా
యీలాగులనే యిచ్చక మాడేవు
మేలు మేలు నిను మెచ్చితి మమ్మా ॥ ఇందాఁకా ॥

దండ నున్నపతిఁ దరవులు పెట్టవు
నిండురాజసము నీ దమ్మా
వెండియు నతనికి వీడె మొసఁగితివి
కొండఁ బోలు నీగుణ మమ్మా ॥ ఇందాఁకా ॥

శ్రీవెంకటపతిఁ జెక్కులు నొక్కేవు
నీ వాదినవే నిజ మమ్మా
కైవసంబుగాఁ గాఁగిటఁ గూడితి
దేవుల వతనికిఁ దెలిసితి మమ్మా. ॥ ఇందాఁకా 381

శంకరాభరణం

ఆతని నీ వే మైనా నంటివా తొల్లి
నీతమి తానె యెరుఁగు నీ కేలే వెరపు ॥

మొగము చూచె నతఁడు మొక్కితి వందుకు నీ
తగ వాతఁ డెఱఁగడా దాని [1]కేమి
పగ యిద్దరికి లేదు పంతాన నుండితి వింతే
విగిడి యిందుకుఁ గాను నీ కేలే వెరవ ॥ అతని ॥

తామెర వేసె నతఁడు తట్టితివి చేత నీవు
దోమటి దొడికే వేళ దోసమా యేమి
యేమిటాను మోసపోరు యిద్దరి కిద్దరే సాటి
నేమ మేమిటాఁ దప్పదు నీ కేలే వెరవ ॥ అతని ॥

చేత నిన్ను నంటఁగాను సిరసు వంచితి వింతే
అతఁడె శ్రీవెంకటేశుఁ డందు కేమి
యేతులకుఁ గూడితిరి యిద్దరు నిక్కడనే
నీతితో బదుక వమ్మ నీ కేల వెరవ. ॥ అతని ॥ 382

ధవళ

వెలఁది యీమాఁటె విన్నవించ నంపె
వలవనిజోలి వద్దు సుమీ ॥ పల్లవి ॥

తరుణిచూపుల దట్టపు వెన్నెల
గరిమ నీపైఁ గాయఁగానె
విరహపుఁగాఁక వేసవి యెండలఁ
బొరలే వే మయ్య పొద్దు వోదా ॥ వెలఁది ॥

పేఁడుచు మాటలఁ బెరతేనె నీపైఁ
*బోఁడి మాపె బాయఁగానె
వేఁడి నిట్టూర్పుల వెసఁ గారముల
మాఁద నేల నీకు మంకు గద్దా ॥ వెలఁది ॥

కొమ్మ నిన్నంతలోఁ గూడి మోవులనె
చిమ్ముచు విందులు నేయఁగానె
యిమ్ముల శ్రీవెంకటేశ ర తెంకలి
కమ్మరఁ బెంచేవు కద లేదా. ॥ వెలఁది ॥ 383

1. "కేమె" అని వ్రాసి "కేమి" అని తిద్ది యున్నారు.
* రే. పా. బోఁడి మాపె నీపైఁ బాయఁగానె

లలిత

చాలుఁ జాలు నే మన్నఁ జవి గావు
కూళతన మింతే నిన్నుఁ గొసరఁ బోలేను ॥ పల్లవి ॥

ఉమ్మగిలుఁ జిత్తముతో నుడుకుతా నుండేనన్ను
యెమ్మెలకుఁ జెనకేవు యేరా నీవూ
తమ్మిమొగ్గవాట్లకె తల్లడించే నామేను
నిమ్మపంట వేసేవు నే నోపఁ గలనా ॥ చాలుఁ జాలు ॥

చెక్కు చేతఁ బెట్టుకొని చింతఁ బొరలెడినాతో
యెక్కువఁ గేరడా లాడే వేరా నీవూ
మొక్కలాన నీకు దక్కి మోసపోయి వున్ననన్ను
తొక్కేవు నాకాలు వట్టి దూ రప్పటి వలెనా ॥ చాలుఁ జాలు ॥

వులుకుట్టుఁజేఁతలకు నుస్సు రంటా నున్ననాతో
యెలయించి నవ్వు నవ్వే వేరా నీవూ
నెలవై శ్రీ వెంకటేశ నిన్నుఁ గూడి యలసితి
బలిమిఁ గాఁగిట నిఁక పచ్చి సేయ వలెనా. ॥చాలుఁ జాలు॥ 384

365-వ రేకు రామక్రియ

మొకమొక మెదుటనె ముంగోప మిఁక నేల
పక పక నగుతానె పంత మిచ్చె నాతఁడు ॥ పల్లవి ॥

ఆతఁడె నీ వున్నచోటి కంగనల నంపఁగాను
యీతలఁ దల వంచేవు యేలమ్మ [1]నీవు
కాతరిం చంతటఁ బోక ఘనుఁడు దానె వచ్చె
చేతులార నీవె సేవ సేయవమ్మ యిపుడు ॥ మొకమొక ॥

కదు మోహములె నీకుఁ గప్ప మాతఁడు వెట్టఁగ
యెదమాటలఁ దిట్టించే వేలమ్మ నీవు
తడవి మీ రాతని తరుణులు దొబ్బిరట
గొడవలు దీర వేఁడుకోవమ్మ పతిని ॥ మొక

1. "నీవె" అని వ్రాసి "నీవు" అని దిద్ది యున్నారు.

అయములు సోఁక నాతఁ డావ లెల్లఁ బెట్టుకోఁగా
యీయెడ నవ్వులు నవ్వే వేమమ్మ నీవు
వోయమ్మ శ్రీవెంకటేశుఁ డోఁగుసూతులలోఁ గూడె
నీయిచ్చ నాతఁ డున్నాఁడు నీవు మెచ్చ రాదా. ॥ మొక ॥ 385

లలిత

కానీవయ్య అందు కేమి కాల మిట్టే వుండీనా
మాన కెవ్వతె సలిగె మతి నమ్మినాఁడవో ॥ పల్లవి ॥

మాట లాడ నాతో నీకు మనసు రా దేమో కాక
పాటించి నేఁ బిలువఁగాఁ బరా కయ్యేవు
చీటికి మాటికిఁ దొల్లి చేసన్న కె వచ్చేవాఁడ
పీటున రాజసాన నీ వెవ్వరిఁ గై కొనవు ॥ కానీవయ్య ॥

నగ నై నఁ గొంత నాతో నంటున దోసమో కాక
మొగము నేఁ జూడఁగానె మోము వంచేవు
అగపడి యేపొద్దు నాయందఁ బాయనివాఁడవు
వెగ టై మావిన్నపాలు వినఁ దీర దాయను ॥ కానీవయ్య ॥

వెండినచలము నాపై నీకు నెంత గద్దో కాక
బెం డై నన్నుఁ గాఁగిట బిగియించేవు
కొండల శ్రీవెంకటేశ కూడి లో నై నవాఁడవు
వెండుకొని యే దవుత నిన్ను నీ వెరఁగవు. ॥కానీవయ్య॥ 386

బౌళి

ఏరా నావద్ద నుండే యిది దగవా
ఆరీతిఁ గనీఁ గానమి వది గొంత గాక ॥ పల్లవి ॥

కాఁకలు వేయుచు నాపె కన్ను లెదిటికి వచ్చి
సోఁక విన్ను నవ్వితేనె చొక్కి పడేవు
మూఁకలో నుండి అప్పటి ముసుఁగు వెట్టుక కొమ
రాఁకల నెలయించఁగ నట్టె చూచేవు ॥ ఏరా ॥

మటమాయముల నాపె మాట దీసి నీతోఁద
సటలు రెం డాడితేనె చన విచ్చేవు
తటుకున నప్పటివి [1]దగ్గరికివచ్చి యాపె
యెటు సేయు మవినాను యియ్యకొనే విపుడు ॥ ఏరా ॥

సిగ్గువడ కాపె నిన్ను చేచాఁచి కాఁగిటఁ గూడి
వొగ్గి లోవికిఁ దీసితే వొరఁబడేవు
విగ్గుల శ్రీవెంకటేశ నీవు న న్నప్పటిఁ గూడి
తగ్గి యాపెచే మొక్కించి తగులు సేసేవు. ॥ ఏరా ॥ 387

భవుళి

ఏల చిన్నఁ బోయినాఁడ విందుకుఁ గాను
ఆలరి వినోద మింతే ఆపె నీపైఁ గోపమా ॥ పల్లవి ॥

కలికికన్నుఁగొనల కాంత నిన్ను నవ్వఁగాను
తల వంచే వేమయ్య తక్కక నీవు
అలిగినవిధమో నీ వవ్వల యే మైనఁ జేసి
చెలరేఁగి యిందు వచ్చి సిగ్గు వడ్డ విధమో ॥ ఏల చిన్న ॥

సోవలు గా నూరివారి సుద్దు లాపె చెప్పితేను
యీవలఁ బైకిఁ దీసుకో నే లయ్య నీకు
తావుల నీ కం దే మైనా తగులు గలదో కాక
కావిరి నెం దైన మరి కలఁగి వచ్చితివో ॥ ఏల చిన్న ॥

గక్కన నాపె నిన్నుఁ గాఁగిటఁ గూడఁగాను
వొక్క పై శ్రీవెంకటేశ వుస్సు రనేవు
అక్కడ నెవ్వతె కైన ఆస యిచ్చి వచ్చితివో
లక్కవలెఁ గరఁగినలాగు రతిఁ జూపేవో. ॥ఏల చిన్న॥ 388

సామంతం

అన్నియుఁ గావలసిన ట్టయ్యీఁ గాని
యెన్నికగా మమ్మ వంపు యేల నవ్వే విఁకను ॥ పల్ల

[1]. "దగ్గరి వచ్చి" అని వ్రాసి "రి ౹ వ" ల క్రింద హంసపాది వేసి పైన వ్రాసి "దగ్గరికి వచ్చి" అని తిద్ది యున్నారు.

అమక నీ వాడినట్టే ఆపెతో నే విన్నవించే
వీనుల నీ మాట లెల్ల వింటిఁగా నేను
కానుకగాఁ బట్టె మయ్యా కాంతకు నీ సరితెలు
యీ నిజాలె చెల్లించుకో యేల నవ్వే వికను ॥ అన్నియు ॥

అక్కడనే పనులు అందాలుగాఁ జేసి వచ్చే
గక్కన నీ చేఁత లెల్లఁ గంటిఁ గా నేను
పెక్కు నీ వినయములు బిందెల నించే నాపెకు
యిక్కడనే వుండవయ్యా యేల నవ్వే వికను ॥ అన్నియు ॥

తీపులు గా నీరాక తేట తెల్లములు నేసే
నాపెకు నీకు లో నైతిఁ గా నేను
యేపున శ్రీవెంకటేశ యిద్దరిఁ గూడించితిని
యేప నైనా నాన తీ నీ వేల నవ్వే వికను. ॥ అన్నియు ॥ 389

వరాళి

ఏమి నేతు మొగమోట మిదివో నాకు
దీమసానఁ దిట్ట లేను దీవించ లేను ॥ పల్లవి ॥

తోయ రాదు నీ మాఁట దొరవు నీ వాన తీఁగా
నేయ రా దటంటే నీవు చెప్పిన ట్టెల్ల
రాయడిసతుల మచ్చరము నాలో మాన లేను
వే యైనా నీ వారి పొందు విడిపించ లేనూ ॥ ఏమి నేతు ॥

తెగ రాదు నీమీఁద తేరి నన్నుఁ బొగడఁగ
నగ కుండ రాదు నీవు నవ్వించఁగ
వొగి నీ వెం దైనఁ బోతే వోరుచు కుండఁగ లేను
మగఁడవు నీ గుణాలు మట్టుపెట్ట లేను ॥ ఏమి నేతు ॥

పట్ట రాదు పాయ మిది పైకొని నీవు గూడఁగా
గుట్టు [1] నేయ రాదు నీవు కొంగు వట్టఁగా
చుట్టాలఁ జేసితివి నీ సుదతుల నెల్లాఁ దెచ్చి
యిట్టె శ్రీవెంకటేశ యింక బాయ లేనూ. ॥ ఏమి నేతు ॥ 390

1. "నేయు" అని వ్రాసి "నేతు" అని దిద్ది యున్నారు.

388-వ రేకు భూపాలం

విన్నటికి నాయఁ బోయ నేఁ దేలయ్యా
కన్నుల నీరాలే కాని కాంత లేకుండ దయ్యా ॥ పల్లవి ॥

వొట్టు వెట్టుకొనెఁ గాన వూర కున్నది చెలియ
వెట్టికి మాట లాడక వేఁడుకోవయ్యా
పట్టినపంతమే కాని పై నున్నది ప్రేమ
వట్టియనుమానా లేల వద్దికి రావయ్యా ॥ విన్న ॥

పలుక దింతే కాని భార మెల్ల నీ మీఁదనే
చలి వాయఁ బై చేయి చాఁచవయ్యా
చల మనేపేరు గాని సతి తమకము బెట్టు
కలికిచెక్కులు నొక్కి కాఁగిలించవయ్యా ॥ విన్న ॥

సిగ్గులే మరఁగు గాని చింతలు వెలి కురికీ
యెగ్గు దీర మంచముపై కేఁగవయ్యా
అగ్గమై శ్రీవెంకటేశ అంగనఁ గూడితి వింక
నిగ్గుల నాపెకోరికె నెరవేర్చవయ్యా. ॥ విన్న ॥ 391

నారణి

ఎగసక్కె మాడితేనె యెంత వేసేవు
మగువతోనె నేఁడు మంకు లేల నీకును ॥ పల్లవి ॥

పలుమారుఁ బిలిపించీ పదవయ్య చెలి నిన్ను
అలిగి వచ్చితి వంటా అప్పటమండి
చల మెంత గలిగిన సతి నీవు గూడుకుంటే
తెలుసుకొందురు గాక తెగు వేల యీడను ॥ ఎగ ॥

వాకిట నిలుచున్నది వచ్చినదాఁకా నీవు
* రాక తా నారగించదు రమణి నేఁడు
యేకతాన నాపెతోనె యే మన్నా వందువు గావి
వాకునిష్టూరము లేల వద్దు వద్దు యీడను ॥

* రే. పా. రాక తా నారగించదు రమణి

కొంగు వట్టి తీసి నిన్ను కొమ్మ దానె యిందు వచ్చి
వుంగిటఁ జిన్నఁబోయి వున్నాఁద వంటా
అంగవించి శ్రీవెంకటాధిప కూడితి విట్టె
వెంగలియాన లెల్ల విడవయ్య యిఁకను. ॥ ఎగ ॥ 392

ధన్నాసి

ముఁదరిదోసము వాయ మొక్కితి పయ్య
చెంది నీపనికి నోఁచితిఁగా నేను ॥ పల్లవి ॥

అంగనలతో వాదు లడిచినకోప మెల్ల
ముంగిట నుండిన నీపై ముంచితి నేను
చెంగట నూరకె నీ చిత్త మింత నొప్పించితి
సంగతిగా నెంత పాపజాతినో నేను ॥ ముందరి ॥

యెగసక్కెపుసవతు లే మేమో నవ్వఁగఁ జూచి
మొగము చూడక నామోము వంచితి
తగ వెఱఁగక నేనే తమకించితి నీమీఁద
జిగి నన్నింత కట్టిఁజేఁ జేనెఁ గా దైవమూ ॥ ముందరి ॥

పడఁతులతోడ నేను పంత మాడినదాన నై
చిడుముడిఁ గూడి వచ్చి నేసితి విన్నూ
కడఁగి శ్రీవెంకటేశ గబ్బి నైతిని రతుల
వెడఁగుఁజలాల నెంత వెట్టినో నేనూ. ॥ ముందరి ॥ 393

శుద్ధవసంతం

ఏల మమ్ము నెగ్గు లెంచే వే మంటి నిన్ను
తాలిముల కెల్ల గురి తనమనసే ॥ పల్లవి ॥

మోహము గలవారికి ముంగోపపుతి ల్లెల్ల
దేహానకు చల్ల నైనదీవెన లౌను
యీహల మనసు రాక యిత వెంత నేసినాను
వూహించి చూచినను వొరటు లై తోఁచును ॥ ఏల ॥

అచ్చివచ్చినచోటికి అయాలు దాఁకించుకొన్న
మచ్చికఁ గళలు రేఁగేమర్మము లౌను
మచ్చర మైనచోట మరి పాదా లొత్తినాను
కచ్చు పెట్టి యవే కామాకారము లై తోఁచును ॥ ఏల ॥

అనుమాన మైనందుకు అన్నియానలు వెట్టిన
పనికి వచ్చునో రాదో భావించ రాదు
ఘనుఁడ శ్రీవెంకటేశ కైకొని కూడితి నిన్ను
వెనకటిదయ నాపై విడువకు వయ్యా. ॥ ఏల ॥ 394

ఆహిరి

నీవు చేసినచేఁతకు నెలఁత యేమీ ననక
కావికన్నులకొనల కలకల నవ్వేను ॥ పల్లవి ॥

మక్కువ నిన్ను దూరఁగ మనసు నొచ్చునో యని
వుక్కున [1]జంకించఁగాను వొచ్చెమో యని
నిక్కి నిన్నుఁ జూడఁగాను నేరమి మోఁచునో యని
చెక్కు నొక్కి యింతి నిన్నుఁ జేరి నవ్వేనూ ॥ నీవు ॥

యేల రావైతి వనఁగ నిట్టె చిన్నఁ బోదు వని
వేళ గాచుకుండఁగాను వెంగెమో యని
తాలిమితో నూరకున్నఁ దల వంచుకొందు వని
వేలు ముక్కుపై మోఁపి వికవిక నవ్వేనూ ॥ నీవు ॥

చేయి వట్టి తియ్యఁగాను సిగ్గు వడుదువో యని
రాయడింపురతులకు రాఁ పయ్యే వని
యీయెడ శ్రీవెంకటేశ యిట్టె నిన్నంగన గూడి
పాయపుమదముతోడ పకపక నవ్వేను. ॥ నీవు ॥ 395

కాంబోది

ఇచ్చకమే నడచేటియిల్లాల నేను
పచ్చిచేఁత లివి మాకు పాడిగా దయ్యా ॥

1. "జంకించఁగను" అని వ్రాసి చెరిపి "జంకించఁగాను" అని తిద్ది యున్న

పక్కనఁ దిట్టఁగ నోప పైపై వేఁడుకొన నోప
వొక్కరీతి గుట్టుతోడ నుందే నేను
అక్కడివారె నీకు నన్నిటికి నేరుతురు
చిక్కించుక యిత వైతే సేయించుకో వయ్యా ॥ఇచ్చకమె॥

అలిగి పొమ్మన నోప అప్పటి మొక్కఁగ నోప
నిలిచి రాజసముతో నే నుండేను
వెలయాండ్లే నీకు వినోదాలు నడపేరు
చెలఁగి నీ కిత వైతే సేయించుకో వయ్యా ॥ ఇచ్చకమె ॥

బొమ్మల జంకించ నోప పొరిఁ జెక్కు నొక్క నోప
యెమ్మె నీరతులఁ జొక్కి యి ట్టుండే నేనూ
నెమ్మది శ్రీవెంకటేశ నీవు గూడితివిగ నన్ను
చిమ్ముల నీ సేవ నాచేఁ జేయించుకోవయ్యా. ॥ఇచ్చకమె॥ 396

·-వ రేకు దేవగాంధారి

మేరకు మేరే కాక మీర వచ్చునా
ఆరీతి నారడి యైతే నంద మవునా మాటలు ॥ పల్లవి ॥

మొగమోట గలచోట ముంచి వా దదువ నేల
నగితేనె చాలదా నయముగాను
తెగనాడేమాట లెల్ల తెలుసుకొనీ నాతఁడె
జగడ మయినమీఁద చక్క నవునా పను ॥ మేరకు

యెగ్గు పట్ట రానిచోట యెక్కువ తక్కువ లెల్ల
సిగ్గు వడుటే చాలదా సిరసు వంచి
దగ్గరి కాఁ గలపని తనుఁ దానె తోఁచీని
కగ్గినందుమీఁద పతిఁ గైకొలుప వసమా ॥ మేరకు ॥

పన నెరిఁగినచోట మరి యెదమాట లేల
పెనఁగుటే చాలదా ప్రియముతోడ
యెనసె శ్రీవెంకటేశుఁ డింతలోఁ దానె నిన్ను
చన విచ్చినందుమీఁదఁ జలములు గలవా. ॥ మేరకు ॥ 397

## దేసాక్షి

నేసినట్టు సేయవయ్య చిత్తము వచ్చినయట్టు
బాస దప్పేమగవానిఁ బట్టవస మవునా ॥ పల్లవి ॥

నేమాన నేపుణ్య మైన నీవే కట్టుకొందు గాక
యే మనిన నీమాట కెదు రాడేమా
మోము వంచు కొఁడువారు మూల నుండుదురు గాక
గామిడైన మగవానిఁ గక్కసించఁ జెల్లునా ॥ నేసినట్టు ॥

కిమ్ములవా రాడెటికీరితి నీదే కాక
యెమ్మె నెవ్వతెఁ దెచ్చినా నెగ్గు లెంచేమా
వుమ్మడి మానాపతులు వోరుచుకుందురు గాక
దిమ్మరి మగవారితో దీకొనఁగఁ జెల్లునా ॥ నేసినట్టు ॥

పాపపుణ్యములలోని ఫలము నీదే కాక
యేపని నేసిన నీతో [1]నీసడించేమా
చేపట్టి కూడితి నన్ను చేతిలోనిదాన నంటా
పై పై శ్రీవెంకటేశ బలుములు చెల్లునా. ॥ నేసినట్టు ॥ 398

## గుండక్రియ

మమ్ము నేల తడవేరు మాటిమాటికి
వొమ్మెదు మాకు వలపు లో చెలులాల ॥ పల్లవి ॥

మన సెల్లా నివ్వెరగు మాటలు నాకు వేసట
యెన లేనికత లెల్లా నేమి చెప్పేరే
విన నోప మారుమాట వివరించా నే నోప
అనుమాన మెల్లఁ దీర నాతని నడుగరే ॥ మమ్ము ॥

కాయముపైఁ జెమటలు కన్నులపై వసివాడు
చేయి వట్టాతని నేల చేరఁ దీసేరే
సేయ లేను వినయాలు చేచేతఁ గొసర లేను
మాయకాఁ డాతని మీరె మనసు దెలియరే ॥ మమ్ము ॥

1. "నీసండిచేనూ" అని వ్రాసి "నీసండిచేమా" గా తిద్ది యున్నారు.

నిమిష మొక్కటి యేఁడు వింరుఁబాయము తరవు
భ్రమయించి యాల వొడఁబరచేరే
సమరతి శ్రీవెంకటేశ్వరుఁ డిట్టె నన్నుఁ గూడె
తమితో నాతని మీరు తప్పక నవ్వించరే. ॥ మమ్ము ॥ 399

సామంతం

ఇదివో తెలుసుకోరా యింకా నీవు
మదనపరవశాన మర పాయఁ గాని ॥ పల్లవి ॥

వాలుకరెప్పలు నాపై వంచి వంచి చూచేవు
ఆలించి నన్నెరిఁగిన ట్టయ్యీనో నీకు
మేల మాడి చూడు తొల్లి మేసవారమే మనము
సోలిఁ బెక్కుసతులలో చూచి మర పాయను ॥ ఇదివో ॥

పీరి వారి యేకాంతాన విచారించి చూచేవు
కారణ మే మైన నాతోఁ గద్దో నీకు
చేరి దగ్గరిన తొల్లి చెందినచుట్టాలమే
తారుకాణ లేక సందడి మర పాయనూ ॥ ఇదివో ॥

పెనఁగి పెనఁగి నన్ను పే రడిగి చూచేవు
కనుచూపులగురుతు కంటివో నీవు
యెన లే కలమేల్‌మంగను శ్రీవెంకటేశ్వర
మనరతులనుఁ జొక్కి మర పాయఁ గాని. ॥ఇదివో॥ 400

భైరవి

ఎప్పుదు నీసుద్దులు నే [1]మెరిఁగినవే
కప్పురము గోవయ్య కత లెల్ల మాని ॥ పల్లవి ॥

నొస లెల్లఁ జెమరించి నున్ననిచెక్కుల జారె
కిపరి యెవ్వతె యలిగెనో నీతోను
యిసుమంత వడె కాని యింతి నిన్నుఁ బాయ లేదు
విసరేము రావయ్య వేసాలు మాని ॥ ఎప్పుదు ॥

---

1. "మెరిఁగినవె" అని వ్రాసి "మెరిఁగినవె" అని తిద్ది యున్నారు.

సరు లెల్లఁ జిక్కువడి చల్లువెద లైన విపే
సిరుల ని న్నెం తాపె చేయి ముట్టెనో
సరస మింతే కాని చలము నీతోఁ గాదు
సరిసేసుకోవయ్య చలములు మాని ॥ ఎప్పుడు ॥

నిట్టూరుపులు రేఁగె నిద్దుర కన్నులఁ దేరె
అట్టె యెవ్వతెరలి నలసితివో
నెట్టన శ్రీవెంకటేశ నేఁడు నన్నుఁ గూడితివి
పట్టపలమేల్మంగను పంత మెల్ల మాని. ॥ ఎప్పుడు ॥ 401

రీతిగౌళ

గుబ్బతిల్లె తమలోని సుద్దిగా లింతే కాక
గొబ్బున సిడకు వచ్చి కొంగు వట్టఁ గలదా ॥ పల్లవి ॥

ఆతఁడే నాయింట నున్నాఁ డఁదవు సతులఁ గూడి
యేతులకుఁ గోపగించి యేమి సేసేరే
చూతమువో వొక్క తైనా సారిదిఁ గాంతునిఁ దమ
చేతికి లోనుగాఁ జేసి చిక్కించుకోఁ గలదా ॥ గుబ్బతిల్లె ॥

చనవు నా కిచ్చినాఁడు సవతు లెందరు గల్గా
యెనయక నామీఁద నేమి సేసేరే
నసుపున నొక తైనా నన్నుఁ గూడినట్టిపతిఁ
బెనఁగి వేరె వలపించుకొనఁ గలదా ॥ గుబ్బతిల్లె ॥

బాసతోడ నన్నుఁ గూడెఁ బైకొని శ్రీవెంకటేశుఁ
డీసులవా రిందరును యేమి సేసేరే
ఆస లింతే కాక వచ్చి అందులో నొకతె యైనా
నాసరి నుండి పతితో నవ్వి చూడఁ గలదా. ॥ గుబ్బతిల్లె ॥ 402

368-వ రేకు పాడి

ఇంతులచేఁ జెప్పి పంపె యిదివో యాతఁడు దాని
సంతసపు మేలుసుద్ది చాటరే యిందరికి ॥ ప ॥

అంగనభద్రికి నేఁడు ఆతఁడే విచ్చేసీ నట
సింగారింతము రారే చెలులాల
ముంగిట ముగ్గులు వెట్టి ముత్తేల పందిలికింద
బంగారుపీఁట వెట్టి పరపు వరచరే ॥ ఇంతులచే ॥

యిందుముఖి మన్నించ విప్పు డిది వేళ యట
విం దాయిత్తము సేయరే వెలఁదులాల
గందముఁ గస్తూరియును కప్పురవిడెములును
అందుకఁ బన్నీటఁ బాదా లదె కడుగరే ॥ ఇంతులచే ॥

వాయిదాలు వాయించేరు వాకిటికి రాఁ బోలు
యీయింతిఁ జేపట్టినాఁ డింతలో నట
యీయెడ శ్రీవెంకటేశుఁ డీమగువతోఁ గూడె
చే యెత్తే మొక్కరే మీరు సేసినట్టి మేలుకు. ॥ఇంతులచే॥ 403

గౌళ

వాఁడివో నీ రమణుఁడు వలసినట్టు సేయనీ
పేఁడుకొని మాకు నింత పెనఁగ నేమిటికి ॥ పల్లవి ॥

బలిమిఁ బట్టఁగ రాదు పరాకున నుండ రాదు
యెలమి నీతోడిపొందు లెటుఁ బో రాదు
వలపు తీపన రాదు వడిఁ గార మన రాదు
చెలులము సారె బుద్ది చెప్పకుండ రాదు ॥ వాఁడివో ॥

నవ్వులు నవ్వఁగ రాదు నాలి నూరకుండ రాదు
యివ్వల నీతో సరస మెటుఁ బో రాదు
జవ్వన మిందుకో రాదు చాలించి పో దొబ్బ రాదు
మవ్వపు మీ తేఁకువలు మాకుఁ జూడ రాదు ॥ వాఁడివో ॥

తప్పక చూడఁగ రాదు తల వంచు కుండ రాదు
యెప్పుడు నీతోడిజాడ యెందుఁ బో రాదు
అప్పుడు శ్రీవెంకటేశుఁ డలమేలుమంగ నిన్ను
యిప్పు డిట్టె కూడె మాకు నేమీ నన రాదు. ॥వాఁడివో॥ 404

శంకరాభరణం

మిము దూర నోపను మిం చతనిఁ బాయ లేను
తమకము దైన్యముఁ దడఁబడెనూ ॥ పల్లవి ॥

ఆల విభునియెలుఁగు ఆలించెద నిదె
పలుకకురే అటు పలుమారు
యెలమి నాతనికి నెదు రేఁగెద నిదె
పిలువకురే నను( బెనఁగుచును ॥ మిము ॥

వడి నతని నగరివంక చూచెదను
యెడ నడ్డము రా కిటు దలరే
తొడ రతనిసతులతో మాఁట లాడెద
చిడుముడిఁ బరాకు సేయకురే ॥ మిము ॥

శ్రీవెంకటపతికిఁ జేతుల మొక్కెద
చేవల బుద్ధులు చెప్పకురే
కావించి నన్నతఁడు కాఁగిటఁ గూడెను
భావించి నను( బై పై నవ్వకురే. ॥ మిము ॥ 405

సామంతం

చీ చీ సతుల మనఁగ సిగ్గు గాదా
తాచి యిన్నియు నింకఁ దడవ నేమిటికి ॥ పల్లవి ॥

సొలసియునుఁ దని వోదు చూచియునుఁ దని వోదు
పలుమారు నీమీఁదఁ బాడి తని వోదు
వలవ నేరుచునాకె వలపించ నేర్చితివి
చెలులబతుకులు యింకఁ జెప్ప నేమిటికి ॥ చీ చీ ॥

కదిసియునుఁ దని [1] వోదు కడు నవ్వి తని వోదు
అదన నీతో మాట లాడి తని వోదు
మది నిలిచె నీ కాపె మన్నించితివి నీవు
గుదిగొన్న కామినుల గొడవ యేమిటికి

1. "వోదు" అని వ్రాసి "వోదు" అని శిద్ధి యున్నారు.

మెచ్చియును( దవి వోదు మితిమీరి తని వోదు
కొచ్చి కాఁగిటిరతుల( గూడి తని వోదు
యెచ్చటను శ్రీవెంకటేశ నన్ను( గూడితివి
హెచ్చితి మిద్దర మొకటే యితరు లేమిటికి. ॥ చీ చీ ॥ 406

సాళంగం

చాలు( జాలు నంత మాతో సత్యా లేల
పోలించి వింటే( గల్లలు పుట్టె(దేసి రాలవా ॥ పల్లవి ॥

యెగ్గు పట్టే వని నిన్ను యేమి యన( జాల( గాక
సిగ్గుపడే వని నీపై( జే చా(చ( గాక
నిగ్గుల నీతో( గనక నే నేపాటి నవ్వినాను
బగ్గన [1]నీయాచారాలు బయిటనే పడవా ॥ చాలు ॥

తల వంచే వని నిన్ను( దారుకాణ( బెట్ట( గాక
కల(గే వని పయ్యెద( గప్పితి( గాక
వాలిసి నే( గనక ని న్నొత్తి మాట లాడితేను
యెలమి నీదొరతన మిట్టే యేరుపడదా ॥ చాలు ॥

పై పై( దమకించే వని పచ్చి సేయ( జాల( గాక
కోపగించే వని నిన్ను( గూడితి( గాక
యేపున శ్రీవెంకటేశ యిట్టె నిన్ను నొరసితే
తీపులనీమోవి తప్పు దీరుచుకో( బడదా. ॥ చాలు ॥ 407

ముఖారి

ఇట్టివలపులు తల కెక్కె( గా నీకు
పెట్టరానిమందు లెల్ల( బెట్టె( గా నీకు ॥ పల్లవి ॥

కోపగించి కన్నులనె కొసరుచు( దిట్ట(గాను
ఆపెతోడిమాట లిత వాయ( గా నీకు
పో పో కొంగు వీడు మని పోర(గానె యాపెతోడ
పూపనవ్వు నవ్వ బుద్ధి వుట్టె( గా నీకు ॥ ఇట్టి ॥

1. నీయాబారాలు" అని వ్రాసి "నీయాచారాలు" అని దిద్ది యున్నారు.

పిలువఁ బిలువఁ గానె బిగిసేయాపెతోఁడ
బలిమిఁ బట్టి పెనఁగ బాఁతిగా నీకు
తల మొల పీడఁగాను తప్పించుకొనేయాపెకు
యెలమిఁ దమ్మ వెట్టేదే యింపుగా నీకు ॥ ఇట్టి ॥
చెక్కు చేతిసిగ్గుతోడ సిరసు వంచినయాపె
కక్కసపురతులు సంగతిగా నీకూ
అక్కర శ్రీవెంకటేశ అలమేలుమంగ నని
వొక్క టయితి విది మతి నుందెఁ గా నీకూ ॥ ఇట్టి ॥ 408

369-వ రేకు శంకరాభరణం

అయ్యో యిన్నాళ్ల నీవే నే నని వుంటిని
నెయ్యపు నీ కపటాలు నే నెరఁగ నయ్యా ॥ పల్లవి ॥
యీడు గానిచెలి నన్ను నే మేమో ఆడఁగాను
వేడుక నోరాఁ గన్నుల వినేవు నీవు
తాడుపడి నే నందుకు తరిఁ జిన్నఁ బో యుండఁగాఁ
గూడెనా నీ కే మైనాఁ గోరి కట్టుకోవయ్యా ॥ అయ్యో ॥
పుక్కటసతులు నాతో పురుఁడుకు రాఁగాను
దక్కెనా నీ పంత మదె తగఁ జూచేవు
పక్కన నే నిందుకుఁ గా పై పై నిన్ను దూరఁగాను
అక్కర దీరెనా నీకు నైతే నీచిత్త మయ్యా ॥ అయ్యో ॥
నడుమంత్రాన నొకతె నాయెదుట మురియఁగా
యెడయక సమ్మతాన నేల నవ్వేవు
బడినె శ్రీవెంకటేశ పాయక నేఁ గూడఁగాను
యెడపులవారిపొందు లేమి బాఁతి నీ కయ్యా. ॥అయ్యో॥ 409

దేసాళం

ఎట్టు నేసినా నీచిత్త మింతే కాక
వట్టి జాలి నే నేల వాదు లడిచేను ॥ పల్ల

చింత లేమిటికి నీవు చిత్తములో నుండఁ గాను
పంత మేఁటికి నీవు చే పట్టి వుండఁ గా
వింతదాననా నన్ను వేఁడుకొనే విప్పు డిట్టే
యెంత లేదు నీతో నే నేల యలిగేను ॥ ఎట్టు ॥

కోప మేఁటికి నీవు కొంగు వట్టు కుండఁ గాను
కైపు లేమిటికి నీవు గలి గుండఁ గా
మాపుదాఁకానె నీకు మన్ననదానఁ గాన
యీపాటి కీపాటి యేల యలిగేను ॥ ఎట్టు ॥

వేసా లేమిటికి నీవు వేమారు నవ్వఁ గాను
బాస లేమిటికి నన్నుఁ బచ్చినేయఁ గా
ఆసగా శ్రీవెంకటేశ అట్టె నన్నుఁ గూడితివి
[1]యీ సుద్దులకే నీతో నేల [2]యలిగేను. ॥ ఎట్టు ॥ 410

రామక్రియ

చేసిన ట్టెల్లా నీకే చెల్లుఁ గాకా
ఆ సుద్దులు దడవి నిన్నంత సేయ వచ్చునా ॥ పల్లవి ॥

నెమ్మొగము వాడె నంటా నిండుఁజెమ టేద దంటా
దిమ్మరిమాఁటల నిన్నుఁ దిట్ట వచ్చునా
అమ్మరో పానుపుమీఁద నాకె నీవు నున్నా రంటా
నిమ్మపంటఁ గొని నేము నిన్ను వేయ వచ్చునా ॥ చేసి ॥

యేతల చూచే వంటా యెంగిలిత మ్మేద దంటా
చేత నంటి నిన్నే మైనాఁ జేయ వచ్చునా
భీతి లేక ఆపె వెంటఁ బెట్టుక వచ్చితి వంటా
నీతి దప్పి చిన్నఁ బో నిన్నుఁ జేయ వచ్చునా ॥ చేసి ॥

ఆకెచే మొక్కించే వంటా అట్టె సిగ్గు వడ వంటా
కాకు నేసి నిన్ను గంపఁ గమ్మ వచ్చునా
యీకడ శ్రీవెంకటేశ యిట్టె నన్నుఁ గూడితివి
పైకొని యింకా నిన్నుఁ బచ్చి నేయ వచ్చునా. ॥ చేసి ॥ 411

1. "యా" అని వ్రాసి "యీ" గా తిద్ది యున్నారు. 2. "యలిగిను" అని వ్రాసి "యలిగేను" అని తిద్ది యున్నారు.

రామక్రియ

ఇంకా నేల తడవే వేరా నీవు
సంకె దేరె నాకు నీ చలమూఁ జెల్లెనూ ॥ పల్లవి ॥

మాట నీతో నాడితిని మనసూఁ దెలిసితిని
యేఁటికి నన్నుఁ బిలిచే వేరా నీవు
యీటుతోఁ బెండ్లాడితివి యిట్టె నేస వెట్టితివి
వాఁట మాయ వలపులు వద్ద నే నుందానను ॥ ఇంకా ॥

చేత నీకు మొక్కితిని చేరి నీతో నవ్వితిని
యీతల నన్నారసేవు యేరా నీవు
నీ తగులు చూపితివి నెగు లెల్లాఁ బాపితివి
యేతు నీకు గన మాయ నియ్యకొంటి నందుకు ॥ ఇంకా ॥

కన్నుల నిన్నుఁ జూచితి కాఁగిటిలో నున్నదాన
యెన్నేసి ప్రియాలు చెప్పే వేరా నీవు
నన్ను మన్నించితి విట్టె నంటున శ్రీవెంకటేశ
చిన్నిపులకలు నిండి నెలవు నా కాయనూ. ॥ ఇంకా ॥ 412

శ్రీరాగం

ఇంత సేసినట్టి తన్ను నేమి సేసేమే
చింతతోడ నాచెక్కు చేతిమీఁది కెక్కెనూ ॥ పల్లవి ॥

దవ్వుల నుండేతనకు దండము వెట్టితి మిదె
యివ్వల నింకా మాతో నేమి నవ్వీనే
రవ్వ లాయ మావలపురాజ్యములోన నెల్ల
పువ్వుటమ్ముల మనసు పుర పురఁ బొక్కెను ॥ ఇంత సేసి ॥

పట్టక తొల్లె తనకుఁ బంత మిచ్చితి మిదె
యిట్టె మాదిక్కు తా నేమి చూచీనే
వెట్టివిన్నపము లాయ వేగుదాఁకా మాకతలు
జట్టిగా మావిరహము చల్లువెద లాయను ॥ ఇంత

చేరి తాఁ బైకొనఁ గానె చేతికి లోనైతి మిదె
యీరీతి నాయడకు తా నెంత సేసీనే
కూరిమి నిట్టె నన్నుఁ గూడె శ్రీవెంకటేశుఁడు
తీరుకు వచ్చి పనులు తేటతెల్ల మాయను. ॥ఇంత సేసి॥ 413

దేసాళం

నీకుఁ బోదు నాకుఁ బోదు నీ వెట్టు సేసినాఁ జేయి
సాకిరివంటిది నాజవ్వన మిందుకును ॥ పల్లవి ॥
జిగురువంటిది నాచిత్త మిది నీమీఁదఁ
దగిలి విడువదు నీ తగురూపు
తగరువంటిది నాతమకము మీఁద మీఁద
నగడు సేయు నీయాయాలు దాఁకిని ॥ నీకు ॥
బచ్చనవంటిది నాపలుకు నీయడకును
అచ్చమై చూడఁ జూడఁగ నందమై యుండు
నిచ్చనలవంటివి నానిండుఁగోరికలు నీకు
హెచ్చినవలపు తల కెక్కఁ జేసేయందుకు ॥ నీకు ॥
గాలమువంటిది నాకాఁగిటికూటమి నీకు
తూలి మరి యెందుకునుఁ దొలఁగ రాదు
తాలమువంటిది నాతగులమి నీమీఁద
మేలిమి శ్రీవెంకటేశ మీఁదఁ గిందఁ బాయదూ. ॥నీకు॥ 414

370-వ రేకు సాళంగం

ఎదుట నున్నాఁడు వీఁడె యీబాలుఁడు
మదిఁ దెలియ మమ్మ యేమరులో కాని ॥ పల్లవి ॥
పరమపురుషుఁ డట పసులఁ గాచె నట
సరవు లెంచిన విన సంగతా యిది
హరియే తా నట ముద్దు లందరికిఁ జేసె నట
యిర వాయ నమ్మ సుద్దు లేఁటివో కాని ॥ ఎదుట ॥

వేదాల కొడయఁ డట వెన్నలు దొంగిలె నట
నాదించి విన్నవారికి నమ్మికా యిది
ఆదిమూల మితఁ డట ఆడికెల [1]చాఁత లట
కా దమ్మ యీసుద్దు లెట్టికతలో కాని ॥ ఎదుట ॥

అల బ్రహ్మతండ్రి యట యశోదకు బిడ్డఁ డట
కొలఁ దొకరికిఁ జెప్పఁ గూడునా యిది
తెలిపి శ్రీవెంకటాద్రిదేవుఁ డై నిలిచె నట
కల దమ్మ తన కెంతకరుణో కాని. ॥ ఎదుట ॥ 415

లలిత

కా దని మీమాఁట కడచేమా
సోదించి మమ్మే సొలయఁగ రాదా ॥ పల్లవి ॥

తెలిసినమాఁటకు తెరమరఁ గేఁటికి
చెలులు తగవు లిటు చెప్పరే
అలిగి యిద్దరము నటు నిటు నుండఁగ
చల మే లని మమ్ము జంకించ రాగా ॥ కా దని ॥

మునుపు వెన కెరిఁగి మొగమో టేఁటికి
అనవలసినట్ల నాడరే
పెనఁగుచు మాతో బీరము లాడఁగ
కనుసన్నలనే కలఁపఁగఁ దగదా ॥ కా దని ॥

అమరినపనులకు ననుమాన మేల
సమము సేసితిరి సరుగ మమ్ము
క్రమమున శ్రీవెంకటపతి గూడెను
గుము రై మా కిటు గురిగాఁ దగదా. ॥ కా దని ॥ 416

శంకరాభరణం

ఎవ్వరితో గొడ వేల యింకా నీకు
రవ్వగా నీయింటికి ర మ్మనేవు నీవూ ॥ ప

1. "చాఁతట" అని వ్రాసి "త ట" లకు పైన హంసపాది వేసి క్రిం
వ్రాసి "చాఁత లట" అని తిద్ది యున్నారు.

యీయింతిపయి మన్నన నీ కేఁటిదో వొక్కమాఁటలో
నేయరానిపను లైన నేతువు నీవు
మాయ నేసి యీపె నీతో మచ్చిక చల్లితేఁ జాలు
పాయ లేక నిలువున భ్రమతువు నీవూ ॥ ఎవ్వరితో ॥

యెవ్వ రైనా నాపెను నేఁ డిటు పేరుకొంటేఁ జాలు
అవ్వల మూపులు మూఁడు అవుదువు నీవు
నవ్వులకు నాపెపయి నానలు వెట్టితేఁ జాలు
నివ్వెరగుపడి అట్టె నిలుతువు నీవూ ॥ ఎవ్వరితో ॥

యెంతదడ వాపె నీయెదుట నుండితేఁ జాలు
రంతులఁ గిందు మీఁదు నరయవు నీవూ
కాంతతో శ్రీవెంకటేశ కడపలోఁ దే రెక్కి
యింత నన్నుఁ గూడి వీధు లేఁగితివి నీవూ. ॥ఎవ్వరితో॥ 417

లలిత

మానవు జగడము మాతోను
నే నీ కిం తేసి నేరుపనా ॥ పల్లవి ॥

రపమున న న్నిటు ర మ్మని పిలువఁగ
అపుడే నే నోప నననా
ఉపమల దూరేవు వూరకే నను నిటు
కపటం బిపుడే కైకొంటినా ॥ మానవు ॥

చెనకుచు నాపయి చేతులు చాఁచఁగ
కొనచూపుల నినుఁ గోపించనా
తనియక నీవే తగిలేవు గాక
యెనసి యాస నీ కిచ్చితినా ॥ మానవు ॥

కలయుచు నీవే కాఁగిట నించఁగ
వలపు నీవు మఱవకు మననా
బలిమి శ్రీవెంకటపతి నను గూడితి
వలసి యెదురుమా టాడితినా. ॥ మానవు ॥ 418

లలిత

ఇందుకే వెరగయ్యీ నన్నెంచుకొంటేనూ
పందను దైవాన కెట్టు బాఁతైతినో నేనూ ॥ పల్లవి ॥

యెన్నికకూ మాని సంటా నెట్టు వుట్టించె దైవము
పన్ని యాఁడువారే మన్నఁ బంత మిత్తును
పున్నమచందురునకు పువ్వులమొనలకును
వెన్నెలబాయిటికిని వెరతు నేనూ ॥ ఇందుకే ॥

యెందుకుఁ గొరాదు నంటా యెట్టు వెంచె దైవము
ముందె ముట్టునెత్తురుముద్దను నేనూ
అంది చనుఁగొండలలో నధరామృతములలో
అందందె పొట్టువొర లైయలతు నేనూ ॥ ఇందుకే ॥

యెక్కడిదొర నంటా నన్నేలె శ్రీవెంకటేశుఁడు
మక్కువఁ బయ్యదకొంగుమాఁటువాఁడనూ
చక్కెరమాఁటలకును జంకెనబొమ్మలకును
పక్కన లోనై యట్టె భ్రమతు నేనూ. ॥ ఇందుకే ॥ 419

ముఖారి

నను(బోటి గాఁ గా నీతో నవ్వేఁ గాక
గుని నే యాఁట దైతే గుంపించ కుండునా ॥ పల్లవి ॥

తక్కెద నేను నిన్ను తప్పు లెంచఁ జాలఁ గాక
నిక్కపు నీవొళ్లితప్పు నీ వెఱఁగవా
చెక్కు నొక్కి చెలు లెల్లాఁ జెప్పఁగానె వింటిఁ గాక
వెక్కసపుటాఁట దైతే విడనాడ కుండునా ॥ నను(బోటి ॥

కావరించి నిన్నుఁ దారుకాణఁ బెట్టఁ జాలఁ గాక
నీ వాడినమాఁటలు నీ వెఱఁగవా
మోవ నాడి యిందరూను మొక్కఁగానె వింటిఁ గాక
చేవ దేరి నాఁట దైతే చిమ్మి కుండునా ॥ నను(బో

కలసినమీఁద నీతోఁ గపటాలు నేరఁ గాక
నిలువు నీకుచ్చితాలు నీ వెఱఁగవా
చెలఁగి కూడితి విటె శ్రీవేంకటేశ నన్ను
అలిగినమాఁట దైతే నలయించ కుండునా. ॥నవ్వుఁబోటి॥ 420

371-వ రేకు లలిత

ఇందుకే వెరగయ్యీ మాకు
అందపురమణుఁడు అతఁడే యెఱుఁగు ॥ పల్లవి ॥

చెలివిగురుమోవి చిత్తజునదివము
వొలుకుఁదేనె లె ట్లులికెనో
కులుకుఁజూపు పతిపంౘెబెదరు లవి
కలికివెన్నె లెటు గాసీనో ॥ ఇందుకే ॥

కాంతకుచంబులు గట్టికొండ లవి
దొంతివల పెట్లఁ దొరిగీనో
పంతపునడు మది బట్టబయలు గిలి
గింత నెట్లఁ గరఁగీనో తాసూ ॥ ఇందుకే ॥

తరుణిదేహ మింతయు బంగారమె
సొరిదిరతుల నెట్టు చొక్కెనో
యిరవుగ శ్రీవేంకటేశుఁడు గూడెను
అరిది[1] విభవము లె ట్లబ్బెనో. ॥ ఇందుకే ॥ 421

కన్నడగౌళ

ఇంక నేల ఆసుద్దులు యిన్నియు నిందే కంటిమి
అంకెల నీ విన్నాళ్లు అంతేసి నేసుతువా ॥ పల్లవి ॥

నవ్వేటినిన్నుఁ జూచి నమ్మఁగలవానఁ గాక
యెవ్వరికపటా లెట్లో యెఱుఁగుదునా
మవ్వపు నీమేన నేఁడు మచ్చములు గంటిఁ గాక
నెవ్వగ నంనమ్మిక నీపై తొల్లి కంటినా ॥ ఇంక నేల ॥

1. "విభవ లెట్లానబ్బెనో" అని వ్రాసి చెరిపి "విభవము లెట్లబ్బెనో" అని దిద్ది యున్నారు.

నీనయగారములకు నేనే మెచ్చుకొందుఁ గాక
[1]యే నెపానకుఁ జేయుట యెరుఁగుదునా
కానీలే నీకపటాలు కానఁబడెఁ గాక నేఁడు
నానాఁడె నీగుణము నా కింత దెలుసునా ॥ ఇంక నేల ॥

గక్కన నీవు గూడఁగ కాని మ్మని యందుఁ గాక
యెక్కడనుండి వచ్చుట యెరుఁగుదునా
యిక్కువ శ్రీవెంకటేశ యిట్టె నన్నుఁ గూడితివి
నిక్కి నేఁడు సేసే మేలు నిన్న నెరుఁగుదునా. ॥ఇంక నేల॥ 422

పాడి

నే నొకటి సేయఁగాను నీ వొకటి సేసేవు
కోనచెన్నరాయఁడ నీగుణ మింక మానవు ॥ పల్లవి ॥

పక్కన నే నీతోడ పకపక నగఁగాను
తెక్కుల నీ వైతే నేల తిట్ట వచ్చేవూ
మొక్కలము విడిచి నే ముచ్చట లాడుకోఁగాను
వెక్కసపువెంగె మని వేరె తలఁచేవూ ॥ నే నొకటి ॥

తనివోక నే నిన్ను తప్ప కిట్టె చూడఁగాను
తనువు చూచుక నీకే తల వంచేవు
అనుమానము లే దని ఆన నీపైఁ బెట్టఁగాను
పెనచి నీ వామాఁట పేరడిఁ బెట్టేవూ ॥ నే నొకటి ॥

కందువ లంటుచు నిన్ను కాఁగిట నించఁగాను
పొందుల నుప్పు వేసి పొత్తు గూడేవూ
అందపు శ్రీవెంకటేశ అట్టె కోనచెన్నఁడ వై
ముందు వెనకాఁ గూడి మోహము చల్లేవూ. ॥నే నొకటి॥ 423

శంకరాభరణం

ఎఱఁగమా యింత యెమ్మెకాఁడ
గుఱి లేని వట్టి కోపకాఁడా

---

1. "నేనె" అని వ్రాసి "యే నె" అని దిద్ది యున్నారు.

మాయలు నెరపి మంచిమాటలాడి
చాయకు వలచే సటకాఁడా
కాయజకేలికి కాలిసన్నగోర
వాయక వానేవు వగకాఁడా ॥ ఎఱఁగమా ॥

అట్టు నిట్టు వచ్చి యాసలు రేఁచేవు
పట్టినచలముల పంతగాఁడా
గుట్టు నేసుకొని కూరిమి చల్లేవు
తొట్టినపాయపు దొమ్మికాఁడా ॥ ఎఱఁగమా ॥

మన్నించి యింతలో మంచ మెక్కితివి
మిన్నక నవ్వుల మేఁటికాఁడా
యిన్నిటా శ్రీవెంకటేశ కూడితివి
కన్నుల మొక్కేటి గండికాఁడా. ॥ ఎఱఁగమా ॥ 424

మంగళకౌశిక

ఇసుమంత పని కైన యియ్యకొందును నీ
వస మైనదాన నాకు వంక లాడ వలెనా ॥ పల్లవి ॥

మన్నించి నీవు నాతో మాట లాడితివి గాక
సన్న నేసి నిలుచుటే చాలదా నాకూ
నన్నుఁ జూచి మరిఁ గొంత నవ్వు నవ్వితివి గాక
వున్నట్టె నావొద్ద నీవు వుండితేనె చాలదా ॥ ఇసుమంత ॥

కరుణించి నీవు నాకాయ మంటితివి గాక
సరిపేరఁ బిలిచిన చాలదా నాకు
మరిగించుకో లేక మంతన మాదేవు గాక
గరిమె నీసొమ్మ నని కైకొంటే చాలదా ॥ ఇసుమంత ॥

ఆదరించి కాఁగిట నీ వలముకొంటివి గాక
సాద నంటా మెచ్చి తిదె చాలదా నాకు
నేదదేరఁ గూడితివి శ్రీవెంకటేశ నీవు
పాదము చాఁచి నన్నుఁ బైకొనుటే చాలదా. ॥ఇసుమంత॥ 425

రామక్రియ

నీకే తెలుసు నయ్య నీతగవూ
యీక డాకడివారలు యే మందురో కాని ॥ పల్లవి ॥

అంచెలఁ బెట్టెను చూపు లంగన నీరాకకు
యించుకంత నీజాగు లెరఁగ రాదూ
మంచివాఁడ వంటానె మమ్ము నంపె నీకడకు
యెంచి యిటమీఁదిపను లె ట్టుండునో కాని ॥ నీకే ॥

పడఁతి మొక్కులు నీకు పొఁజు లెదురుగా నంపె
అదరి నీరాజన మింతౌ తెరఁగదూ
అదియాలము చె ప్పంపె నది యెం తైనాఁ గలదు
యెదసి నీ వుఁడినందు కే మనునో కాని ॥ నీకే ॥

కాంత కుచములు నీకు కానికెగా మీఁ దెత్తె
పంతము నీవు చెల్లించేబా గెరఁగదూ
అంతలో శ్రీవెంకటేశ ఆదరించి కూడితివి
యింతటి నీమేలు దక్కె నిఁక నెంతో కాని. ॥ నీకే ॥ 426

372-వ రేకు ముఖారి

వెన్నలు నెలవిఁ గారే విఠ్ఠలేశా
నన్నుఁ జూచి నవ్వేవు నాలి విఠ్ఠలేశా ॥ పల్లవి ॥

బాలులతో నాడి యాడి బదలితివి రావయ్య
వేలెటికురుల ముద్దువిఠ్ఠలేశా
కాళింగుఁ దొక్కితి వట కటకట వుద్దండాలు
వోలిఁ జేయ దొరకొంటి వోవిఠ్ఠలేశా ॥ వెన్నలు ॥

దూడలవెంటఁ దిరిగి దూళి మేన నంటె నిదే
వేడుక యంతో నీకు విఠ్ఠలేశా
యేడకొండో వొకవేల నెత్తితివి నీ వట
వోడక యింత సేతురా వోవిఠ్ఠలేశా ॥ ॥

గొల్లెతల నంటి యంటి గొల్లు మేన నిండె నిదె
వెల్లవి రాయఁ బనులు విఠ్ఠలేశా
యిల్లిదె పండరంగిని యిటు శ్రీవెంకటాద్రిని
వుల్ల మలర నిలిచి తోవిఠ్ఠలేశా. ॥ వెన్నలు ॥ 427

సాళంగనాట

నాకు నీమొగము చూచి నవ్వు వచ్చీని
కాకు సేయ కిఁక నైన గతి గూడవయ్యా ॥ పల్లవి ॥

పలుకు లెన్ని గలవు పాటించి బొంకఁగఁ బోతే
అలరీనా నీవంటి అందగానికి
చలము సాధించితివి చక్క నాయఁ బను లెల్ల
వెలయ మాయింటి కిఁక విచ్చేయవయ్యా ॥ నాకు ॥

ఆన లెన్నైనఁ గలవు అటమటించే నంటే
యీనెపాన నీవంటి యెమ్మెకానికి
నీనేర్పు లీదేరె నిన్ను నిందరు మెచ్చిరి
వీనులు చల్ల నాయను వీడె మిందవయ్యా ॥ నాకు ॥

వొడఁబా టైనఁ గద్దు వోపిక గలిగితేను
విడువక నీవంటి వేసదారికి
తొడిఁబడఁ గూడితివి దొమ్మితో శ్రీవెంకటేశ
బడలితివి రతులఁ బవ్వళించవయ్యా. ॥ నాకు ॥ 428

గుండక్రియ

కన్నవా రెవ్వరు దీనిఁ గడ లేని జవ్వనము
తన్నుఁ దానె వలపు లింతకుఁ దెచ్చె నయ్యా ॥ పల్లవి ॥

మనసులోపలి చింత మాటలాడుదాఁకాఁ దెచ్చె
యెన లేనిమాఁట [1]బయలీఁతకుఁ దెచ్చె
తనివోని [2]బయలీఁత తమకములకుఁ దెచ్చె
పెను నావల పింతగాఁ బెరిగె నోయయ్యా ॥కన్నవారె॥

---

1. "బయలింత్తకు" అని వ్రాఁతి "బయలీఁతకు" అని తిద్ది యున్నారు.
2. "బయలింత్త" అని వ్రాసి "బయలీఁత" అని తిద్ది యున్నారు.

గక్కనఁ జూచినచూపుకాఁక లింతేసికిఁ దెచ్చె
చిక్కించి కాఁకలు లో లో సిగ్గులుఁ దెచ్చె
నిక్కినసిగ్గులు నేఁ డీనివ్వెరగులుఁ దెచ్చె
పిక్కటిల్లి వల పింత పెరిగె నోయయ్యా ॥కన్నవారె॥

మితి లేనిమోహములు మేరలు మీరఁగఁ దెచ్చె
రతులమేరలు యింత రవ్వలుఁ దెచ్చె
యిత వై శ్రీవెంకటేశ యిష్టై నీవు గూడితివి
కత లై వలపు లింతగాఁ బెరిగె నయ్యా. ॥కన్నవారె॥ 429

సామంతం

చేరి మందెమేళ మెంత సేసేవు మమ్ము
మేరకు మేరే కాక మిక్కి లింత చెల్లునా ॥ పల్లవి ॥

చివ్వన నీ కూడిగాలు సేసేరాంతలలోన
నెవ్వరిఁ బోలుమ నే న న్నేల పట్టేవు
యివ్వల నీ వే మన్న నెదు రాడఁజాలఁ గాక
దవ్వుల నుండిననన్ను దగ్గరి రాఁ దీతురా ॥ చేరి ॥

అంచెల నీతో నవ్వే యాపాటివారమా
పొంచి నన్ను నెంత సేసి పొగడేవు
ముంచి బలిమి సేయఁగా మోనాన నుండితిఁ గాక
మంచ మెక్కి నీసరుస మాట లాడేదాననా ॥ చేరి ॥

కొంగు వట్టేవు నీకాలిగోరఁ బోరఁ గలనా
యెంగిలి మామోవితేనె లేల ముట్టేవు
అంగవించి శ్రీవెంకటాధిప కూడితి నన్ను
ముంగిటినిధానమ వై ముట్టి నన్నుఁ బాయవు. ॥ చేరి ॥

శంకరాభరణం

తగ దిఁకనూ నీ వెటు సేసిన తపములు ఫలియించె
మగవాఁడూ ప్రియములు చెప్పఁగ మంకులు పని లేవే అమ్మా ॥ప

అలుగకువే వోచెలియా అతఁడు గురి గాఁడు
వలవంతల నీలోఁ బొడమినవలపులు గురి గాని
చలములు యింకా సాదించకువే జగడము పని లేదు
వెలసిన నీమొగమోటము లుండఁగ వెనక నేర రాదు ॥తగ॥

తడవకువే అతఁడు చేసినతప్పులు గురి గావు
విడువక నీతనువునఁ బెనఁగెటివిరహము గురి గాని
చిడుముడికి యింక నేఁటికి నీచేతికి లో నతఁడూ
బడిబడినె నీవే అతనికిఁ బంత మియ్యఁ బడును ॥తగ॥

పెనఁగకువే శ్రీవెంకటేశ్వరు బీరము గురి గాదు
కొన మొద లెంచుక మీలోఁ గూడినకూటమి గురి గాని
వినియును వినకే సిగ్గులు వడియెడివెరగులు వని లేదూ
ననిచిన నీనెలవులలో ముసిముసి నవ్వులు దొలఁకఁగను. ॥తగ॥

## శ్రీరాగం

నీతో వాదుకు నే నోప
యేతుల కిఁక నీ వే మైన [1]ననరా ॥ పల్లవి ॥

బచ్చనమాటలు పలుమరు నాడఁగ
యెచ్చుకుందు లిఁక నే మానో
వొచ్చము లే కే నూర కుండఁగా
యిచ్చకొలఁది నీ వే మైన ననరా ॥ నీతో ॥

చేకొని బత్తులు సేయఁగ రాఁగా
నేకొలఁదిఁ బడునో యెన్నికలు
చీకా కయి నే సిగ్గున నుండఁగ
యీకొలఁదుల నీ వే మైన ననరా ॥ నీతో ॥

గుఱిగాఁ గాఁగిటఁ గూడఁగ రాఁగా
నెఱుకలు మఱపులు నే మవునో
నెఱి శ్రీవెంకటనిలయుఁడ నీవే
యెఱిఁగి కలసితివి యే మయిన ననరా. ॥ నీతో ॥ 432

1. "ననన" అని వ్రాసి "ననరా" అని తిద్ది యున్నారు.

373-వ రేకు మంగళకౌశిక

నావాఁడ వని నిన్ను నమ్మి యుందును
యీవేళ నాతోనె యింత గలదా ॥ పల్లవి ॥

రావద్దా నీవు నేఁడు రమణుఁడ మాయింటికి
కావిరి నీకు నేము కదవారమా
సోవల నెగ్గులు లేవు చుట్టపువరు నే నాకు
నీ వెరఁగనితగవు నీకుఁ జెప్పేమా ॥ నావాఁడ ॥

చెప్ప వద్దా నీవు నాకుఁ జేసేపనుల కెల్ల
[1]నెప్పు దైన నేము నీకు నెదు రాదేమా
తప్పించుకోఁ బని లేదు తగుల మైనచోట
ముప్పిరి నీకు వలపు మోపు గట్టేమా ॥ నావాఁడ ॥

కూడ వద్దా నీకు నీవే కొంగు వట్టి నన్ను నేఁడు
జాడ దప్పి నీకు మెచ్చనివారమా
యీడనె శ్రీవెంకటేశ యింత నేసి కలసితి
వేడుక నీచేఁతలకు వెగ్గళించేమా. ॥ నావాఁడ ॥ 433

ముఖారి

కదు గట్టిగుండె నీకుఁ గాఁగాఁ గాక
అదరి పాయపువారి కంతేసి చెల్లునా ॥ పల్లవి ॥

పంతము దప్పినఁ దప్పే పక్కన నవ్వేవు సుమ్మీ
యింతిరో నిన్నటిమాట కిపుడు నీవు
చెంతల నే మిందరము చేరి వేఁడుకోఁ గాను
కాంతునిఁ గాఁగిట నిట్టె కలయఁగ వలదా ॥ కదు గట్టి ॥

మంకులు దీరినాఁ దీరీ మాట లూఁకొనేవు సుమ్మీ
వుంకువగా రాతిరింటివొట్లకును
సంకె దీర మీఁతగవు సరిగా నే తేర్చఁ గాను
యింకా నేల అలుకలు యియ్యకొన వలదా ॥

1. "నెప్పుదై నేము" అని వ్రాసి "దై" "నే" ల మధ్య చిన్న హం[సపాదము] పైన "వ" అను అక్షరము విరికించి చెక్కె "నెప్పు దైవ నేము" అని దిద్ది

నిగ్గులు వీడినా వీడి సిరసు యెత్తేవు సుమ్మీ
అగ్గ మై శ్రీవెంకటేశుఁ డంద నున్నాఁడు
వెగ్గళిం చాతఁడే నిన్ను వేఁడుక కాఁగిటఁ గూడె
నిగ్గుల మ మ్మికక మెచ్చి నిందుకొన వలదా. ॥కదు గట్టి॥ 434

లలిత

నూఁటికి సెలవు గాఁగ నూలిపోఁగే యందురు
యేఁటి కిఁక మాఁట లెల్లా నిందులోనే వున్నవి ॥ పల్లవి ॥

నిందు విరహతాపాన నీవు రాని కోపాన
అంద నే మని దూరి నే నంటినో నిన్ను
వుండసుద్దు లేల యిఁక వొక్కమాఁటే మొక్కే మిదే
చండి పెట్టి యే మన్నాఁ జవి గాదు ప్రియము ॥ నూఁటికి ॥

చెప్పుడుమాఁటలకుఁ గా చిత్తము నిలుప లేక
వుప్పటించి నిన్ను నెంత వొరసితినో
ముప్పిరి నాకందు వాయ ముందటికి వచ్చితిమి
యిప్పు డిఁక నే మన్నా నెరవు లై తోఁచును ॥ నూఁటికి ॥

చెఱఁగు వట్టి తియ్యఁ గా సిగ్గునఁ దప్పించుకొంటా
తటి నాకొనగో రెందు దాఁకించితినో
నెటి శ్రీవెంకటేశుఁడ నే నందుకే కూడితిని
మొఱఁగు మరఁగు లేదు ముంచుకొనీ నవ్వులు. ॥నూఁటికి॥

శంకరాభరణం

ఎంద రైనఁ గలరు నీ కెరుఁగుదు నది నేను
నింద నీపైఁ బడీ నని నే నసేఁ గాని ॥ పల్లవి ॥

కాయము నీచేతిది కడు మోహించితిఁ గాన
యేయెడ నీ వేఁగఁగా నే మాదునో
నాయంతటు నే వెరవ నంటున ని న్నందరును
యీయెడ దూరే రని యెంచుకొనేఁ గాని ॥ ఎంద రైన ॥

వుసు రెల్ల నీసొమ్ము పూడిగపుదానఁ గాన
దెసలు నీచేతవి నీ తెగు వెట్టానో
విసుగ నీసుద్దులకు వెక్కసపుటపకీర్తి
ముసరి మీఁదట నీపై మోచీ ననీ కాని ॥ ఎంద రైన ॥

బదు కెల్ల నీసొమ్ము పట్టపుదేవులఁ గాన
యిదె నీరతులలో నే నెంత సేతునో
పొదిగి శ్రీవెంకటేశ పోనీక కూడితి నన్ను
అది గాదు నాతో సరి యయితి వనీ కాని. ॥ఎంద రైన॥ 436

## గుండక్రియ

త నంతఁ దా నెఱఁగఁడు తగులక నాకుఁ బోదు
చెనకఁగ నైన దయ్యీ సిగ్గులు వడకురే ॥ పల్లవి ॥

యేమా టయినఁ గాని యెగ్గు దప్పు లైనఁ గాని
ఆమాఁటే నామాటగా ననరే మీరు
వేమారుఁ దనతోడ వేసరితి మిన్నిటాను
వోముచు నెన్నాళ్లదాఁకా వోరుచుక వుందునే ॥ త నంత ॥

వాసి వంతు లైనాఁ గాని వైపు లెట్టయినాఁ గాని
సేసినదే నాచేఁత చెల్లెనే మీకు
మోసపోతి నిన్నాళ్లు మొగమోటములనే
పాసితే వలపులు చేపట్ట నెట్టు వచ్చునే ॥ త నంత ॥

చేతికి లో నైనాఁ గాని సేసినట్టే సేయనీ
మీతగవే నాతగవు మీరరే మీరు
యీతల శ్రీవెంకటేశుఁ డింతలో విచ్చేసి కూడె
యీతలఁపు నేఁడు గాక యిన్నాళ్లు నెం దుండునే. ॥త నంత॥

## దేసాళం

నీతో మాటాడఁ బోతే నింద వచ్చును
యేతెరువుఁ బో నోప మాయింటనే వుండే మయ్యా ॥ ప

సిగ్గులు ముదిరితే నెలవికి నవ్వు వచ్చు
బగ్గన నవ్వితేఁ గోపము వచ్చును
వొగ్గి కోపగించఁ బోతే వొక టొకటే వచ్చును
యెగ్గులకు నోపము మాయింటనే వుండే మయ్యా ॥ నీతో ॥

సరసాలు ముదిరితే సారెఁ జేపట్లకు వచ్చుఁ
దొరల చేఁ బట్టఁ బోతే దూరు వచ్చును
మరలి ఆదూరులు మరి యెందు కైనా వచ్చు
నిరవు లెరిఁగితిమి యింటనే వుండే మయ్యా ॥ నీతో ॥

తప్పక నిన్నుఁ జూచితే తలపోఁతలకు వచ్చు
కప్పినతలపోఁతల కాఁక వచ్చును
యిప్పుడె శ్రీవెంకటేశ యెనసితి విదె నన్ను
యెప్పుడూఁ బాయక మాయింటనే వుండే మయ్యా. ॥నీతో॥ 438

374-వ రేకు శంకరాభరణం

నామనసు వేగిరించీ నాకంటేను
తామసించఁ బని లేదు తమకించీ వయసు ॥ పల్లవి ॥

పోయి వచ్చి తటె నేఁ బొ మ్మన్నచోటికి నీవు
ఆయనా ఆపని నే నన్నట్లనే
మాయలు గావు గదా మన సొక్క టాయనా
యీమొదకు నీవెంటనే యిప్ప డిట్టె వచ్చెనా ॥ నామనసు ॥

వేలఁ దగిలించుకొన్న వింతలేక యెక్కడిదే
మేలుసుద్ది నీమొకాన మించీ నదే
వాలుకరెప్పలకొన వంచి సన్న సేసేవు
లోలో మాటాడుచము లోనికి రాఁ గదవే ॥ నామనసు ॥

యేఁటికి నవ్వేవే నీవు యెంచినట్టె ఆయనా
చాటువ నదియ నా సంతోషము
యీటున శ్రీవెంకటేశుఁ డింతలో విచ్చేసి కూడె
పాటించి తా నే మనీనె పంతము లీడేరెనూ. ॥నామనసు॥ 439

### లలిత

ఈకాలం బెవ్వరి కైన యిచ్ఛకమే మేలు
మీ కేఁటికి నిష్ఠూరంబులు మితిఁ దానె బుద్ధి యెరిఁగీని ॥పల్లవి॥

నగ నేలే చెలులాలా నటనల మీలోను
అగపడి నేఁ దతఁ దేమని నట్టె అవు ననరే
తెగనాడ వల దింకా తెలిపి చెప్ప నేలా
మొగమోటమినె వుందము మనముందరఁ దానె యెరిఁగీని ॥ఈ॥

కడుఁ గడుఁ దప్పక చూడకురే కపటము దగిలీని
జడిగొని ఆతఁడు యెంత నేసినా సారెఁ బొగడఁ గదరే
తడవఁగ వల దింకా తరి గా దీవేళ
వుడివోనివలపులు గలితే నొగిఁ దాఁ బ్రియములు చెప్పీని ॥ఈ॥

వెస నూరకె మొక్కకురే వెంగెము లయ్యీని
పొసఁగ నూరక దండ నిలిచి [1]పొగడకురే మీరు నన్ను
పస గల శ్రీవెంకటేశ్వరుఁడు పై పై నన్నుఁ గూడె
వస మై యాతని లోనై సతతము వడి నతఁడే మన్నించీని. ॥ఈ॥

### సామంతం

తనకును నాకునుఁ దగు లేదే
పెనఁగి పిలువనీ పేరట మిపుడూ ॥ పల్లవి ॥

దవ్వుల నాతఁడు దప్పక చూచీ
నెవ్వరి మనసున నె టుండునో
నవ్వ కుండినా నన్నుఁ బెడరేఁచీ
చివ్వన నా కిది సిబ్బితి గాదా ॥ తనకును ॥

కోపగించినాఁ గొంగులు పట్టీ
యీపెకు నితని కే మనరా
మాపుదాఁక నిదె మాటలె యాడీ
అపని మీతో నన సంగతులా ॥ తన

1. "పొగడరే" అని వ్రాసి "డ"రే" ల మధ్య హంసపాది చెక్కి క్రి నిరికించి "పొగడకురే" అని దిద్ది యున్నారు.

కడు నాన లిడఁగఁ గాఁగిట నించెను
వెడ వెడ గు ట్టింక వెలిఁ బడదా
బడి శ్రీవెంకటపతి యిదె తిరిగీ
నిడువుల నిందలు నిజమే కాదా. ॥ తనకును ॥ 441

ధవళ

చిత్తగించి చూడవయ్యా చిగురుఁబోఁడిదిక్కు
బత్తి నీవు గల దాపెభాగ్యముకొలఁ దయ్యా ॥ పల్లవి ॥
చెలిచెమటల నాని చిత్తములో వలపులు
పులక లై మొలచెను బుజ కలిగే
యెలమిఁ గోరికె లై యీరికె లెత్తె నవే
బలుపంట లిఁక నీభాగ్యముకొలఁ దయ్యా ॥ చిత్తగించి ॥
అంగనవిరహవేళ నాయిటిగా లై వూర్పు
వెంగలితనాన నట్టె విసరఁ జొచ్చె
పొంగుచుఁ దూరు పెత్తంగఁ బొలివారె నివ్వెరగు
పంగులఁ గోరు వట్టు నీభాగ్యముకొలఁ దయ్యా ॥ చిత్తగించి ॥
కామినికుచము లనేగాదెలను జవ్వనము
ఆమనికాలము పై పై నదె ముంచెను
చే ముంచి కూడితి విట్టె శ్రీవెంకటేశ యీపెను
భామకు నీకు రతులు భాగ్యముకొలఁ దయ్యా. ॥ చిత్త ॥ 442

ధవళ

తఱవాతిమాఁట లెల్ల దయ్య మెఱుఁగు
యెఱుఁగనిదాన నేను యే మందు నేనూ ॥ పల్లవి ॥
మంతనము లాడుకొంటా మంచముపైఁ గేరుకొంటా
నింతదడవు నుండరా యిద్దరు మీరు
యింతలో నే రాఁగాను యెవ్వ రాపె యీ పెంటా
యెంత కెంత న న్నడిగే వే మందు నేను ॥ తఱవాతి ॥

అంగము లొరసుకొంటా నాకు మడి చిచ్చుకొంటా
యెంగిలిపొత్తందుకోరా యిద్దరు మీరు
సంగడి నేఁ గూచుండఁగా సతి నా చెలి యనుచు
యింగితానఁ బే రడిగే వే మందు నేను ॥ తఱవాతి ॥

కమ్మి కాఁగిలించుకొంటా కాయాలు మరచుకొంటా
యిమ్ములఁ గూడి యుందరా యిద్దరు మీరు
పమ్మి నే దగ్గరఁ గాను పైకొని నన్నుఁ గూడితి
వెమ్మెల శ్రీవెంకటేశ యే మందు నేను. ॥ తఱవాతి ॥ 443

పాడి

ఏ లోయి విభుఁడా యిప్పుడు బాఁతైతిమా
తాలిమి నిన్నాళ్లు నీతలఁ పిట్టె వుండెనా ॥ పల్లవి ॥

సంగతిగా నాపెతోడ జగడించి రా కుండితే
నంగవించి మాతో మాట లాడుదువా
కుంగక కూడు వేఁడైతే కూరాకు నంజినట్టు
పొంగుచు నీ నా సందిపొందు చెల్లె నిదివో ॥ ఏ లోయి ॥

సన్నల నాపెతో యెకసక్యాలాడు నేమో కాక
యెన్నఁడైనా మాయింటికి నిట్టె వత్తువా
పన్నీరు గడుఁ జలైతే పచ్చిచాఁదు పూసినట్టు
యెన్నఁగ నీ నా పొందు లిన్నియు నిట్టె పో ॥ ఏ లోయి ॥

బలిమి నీ వాపెతోడ పంత మాడి రా కుండితే
కొలఁది మీర న న్నిట్టే కూడుదువా
అలరి శ్రీవెంకటేశ అయము సోఁకినట్టు
తలఁగని నీ నా పొందు తారుకాణ సుమ్మీ. ॥ ఏ లో ॥

375-వ రేకు శంకరాభరణం

ఏల నన్ను బుజ్జగించే విఁతటిలోనె
నాలితో నీ వేడ నున్నా నన్ను మానేవా ॥

చిన్నఁబోయి వుండ నేల చెక్కుచేయి నా కేల
మన్నించి నీవే నాతో మాట లాడఁగా
మున్నె నీ కొప్పగించితి ముంచిన నా దేహ మెల్ల
నిన్న నేఁటి వారిమాట నే వినేనా ॥ ఏల నన్ను ॥

వెంగె మాడ నా కేల వేసరుకొనఁగ నేల
సంగతిగా నీవే నాతో సారె నవ్వఁగా
వుంగరము వెట్టితివి వున్నదాన నీకుఁగాను
చెంగట నెవ్వరు నేమి చెప్పేరు యిఁకను ॥ ఏల నన్ను ॥

సిగ్గు వడ నా కేల సిరసు వంచఁగ నేల
దగ్గరి నీవే నాకు దక్కి వుండఁగా
నిగ్గుల శ్రీవెంకటేశ నీవే నన్నుఁ గూడితివి
యెగ్గులుఁ దప్పులు మరి యెంచ నేది యిందునూ. ॥ఏల నన్ను॥

సాళంగనాట

దగ దొట్టి వుస్సు రసీఁ దన కేలే
మగఁడే యింత నేసితే మరి యేఁటి మాఁటలే ॥ పల్లవి ॥

ముప్పిరి నాపెకంటేఁ దా ముందై వాదుకు రాఁగ
యిప్పుడుఁ గోపము రాక యింకా నెన్నఁడే
చప్పఁగా నప్పటిఁ దానే సాకిరులు చెప్ప వచ్చి
కుప్పలుగా నవ్వ కెట్టు గుట్టు చేసుకొందునే ॥ దగ దొట్టి ॥

సారెకు నాకెకుఁ గా దాసలు దానే సేయ రాఁగా
యీరు దియ్యఁ బేను రాక యేల మానునే
పోరచి యెందు కైనాఁ దాఁ బూసుక వాసుక రాఁగా
దూరక దైవము నేల తోసిపో నే నిత్తునే ॥ దగ దొట్టి ॥

చెంది మ మ్మిరువరిఁ దానె చెక్కులు నొక్కఁగ రాఁగా
యిందరితోఁ జెప్పక నే నేల మానేనే
కందువ శ్రీవెంకటాద్రిఘనుఁ డిట్టె నన్నుఁ గూడె
చందమే కాక నే నెట్టు చలము సాధింతునే. ॥దగ దొట్టి॥ 446

నాగవరాళి

వలపు రచ్చల [1]వేసేవారు గలరా
  కులమునాండ్ల నింత గోర సేయ వలెనా ॥ పల్లవి ॥

నేరుపునఁ గళ లంటి నివ్వెరగుఁ బొందించేవు
  వీరు వారుఁ జూచి నన్ను వెఱ్ఱి యనరా
  వూర కున్న నామీఁద వొక్కొక్క గురుతు సేసి
  ఆరయ ని దెంత [2]చిత్తి ణనిపించ వలెనా ॥ వలపు ॥

చేతిమీఁదఁ జేయి వేసి చెమరింపించేవు మేను
  ఆతలివారు చూచి నన్నట్టె నవ్వరా
  కాతరపుమాట లాడి కన్నులకెం పెక్కించేవు
  యీతరుణిమదవాగ మిది యెమ్మె లనరా ॥ వలపు ॥

రతి సేసి తెర దీసి రామలఁ బిలిపించేవు
  అతివె లి దెంత పచ్చి యనరా నన్ను
  గతిగా శ్రీవెంకటేశ కలసితి విటు నన్ను
  యితవరి యిది యెంత యిచ్చకుదా లనరా. ॥ వలపు ॥ 447

సామంతం

అద్ద మాడకు వమ్మ నీ వాతనితోను
  వొద్దార మతఁడు నీతో నొనరించీనా ॥ పల్లవి ॥

మూలలకుఁ బోకు వమ్మ మించి యాతఁడు రాఁ గాను
  యీలాగుదొరచిత్త మెట్టుండునో
  బాలకివి నీ విపుడు ప్రౌఢనాయకుఁ డతఁడు
  తాలిమి నీయదకుఁ దప్పి సేసీనా ॥ అద్ద మాద ॥

సిగ్గులు వదకు వమ్మ చెనకి యాతనితోను
  నిగ్గులమగవాఁడు మేనెప మెంచునో
  అగ్గలపు మేనదాన వతఁడు మోహపువాఁడు
  యెగ్గులు నీ కొనరించి యెలయించీనా ॥ అద్ద మాద

1. "వేసేవారుం గలరా" అని వ్రాసి "ం" చెరిపి "వేసేవారు గలరా" అని [illegible] యున్నారు. 2. "చిత్తిణె" అని వ్రాసి "చిత్తిణ" అని తిద్ది యున్నారు.

పక్కన నవ్వుతు మమ్ము పట్టి యాతఁడు గూడఁగ
యెక్కువ శ్రీవేంకటేశుఁ డెంత సేసునో
మిక్కిలి వాసికత్తెవు మించి వోరుచు నాతఁడు
వొక్క పైఁటి రిఁక నీపై నోల వేసీనా. ॥ అద్దమాడ॥ 448

సాళంగం

సిడికూరలో నలుపులు నేఁ బెనఁగి యేరఁగ నోప । తన్ను ।
చండి సేయఁగ రాదు యిఁక సరుగఁ గూచుండు మనవే యమ్మా ॥పల్లవి॥
వేగి మిగిలినచీఁకటి వీఁ దేల తడవీ మమ్ము
ఆగడము రాతి రెల్లా సతుల ఆడఁ జేయుట చాలదా
యీగతులు నే నెఱఁగనా మరియు యేల రేఁచీ మమ్మును
జాగు లన్నియు నాయను యిఁక చాలుఁ గూచుండు మనరే యమ్మా ॥పిండి॥
పూస గుచ్చినదారము పోసీఁడు తా నన్నును
వాసితో వీరి వారి వెనువెంట వలలఁ దిరుగుట చాలదా
నేసినవి తా నెరఁగఁడా చెప్పఁ బోతే నవ్వులు
ఆసఁ దన కెపుడు గలదూ యిఁక నాయఁ గూచుండు మనరే యమ్మా ॥పిండి॥
పూవులూ పూఁపలువలెనె పొసఁగఁ దా నన్నుఁ గూడె
భావమున తలఁచి తలఁచి కూడెటిభావరతులె చాలదా
సేవ లెల్లనుఁ జేసితి నేఁడు శ్రీవెంకటేశ్వరునికి
యీవేళ నేఁ దనిసితి యెపుడు నిట్లఁ గూచుండు మనరే యమ్మా. ॥పిండి॥

లలిత

కంటి మిన్నాళ్లకు గక్కన దొంగను
అంటె నోర నదే అంగమచ్చము ॥ పల్లవి ॥
పుట్టు లెక్కనాఁ దొక్క తొక్కతె
తిట్టఁ దిట్ట వాని దిగఁ బిటువరే
గుట్టుఁ గృష్ణునికి గొల్లెతలకును
యెట్టు గావలసి నట్టయ్యోఁ గాని ॥ కంటి ॥

మూల నున్నాఁ డదె ముంగిటికిఁ దీసి
రోలఁ గట్టరే రోస మెల్లఁ దీర
నీలవర్ణునితో నేఁడు మనబలి
మేలాగున నైన నెక్కఁ గాని ॥ కఁటి ॥

మంచముపై వాఁడె మన మిందరము
కొంచక వా క్కొక్కగురుతు సేయరే
యెంచఁగ శ్రీవెంకటేశునకు మనకు
నంచెఁ బొందు లాయ నట్టే కాని. ॥ కంటి ॥ 450

376-వ రేకు నాదరామక్రియ

ఆఅదిఁ బెట్టకు మమ్మ నప్పటి నీవు
ఆఅ నీవు నా కోపము అప్పటి నీవూ ॥ పల్లవి ॥

ముందు ముందె సోఁక నాడి మొరఁగి లే దనేపతి
కందాలు చెప్ప వచ్చేవు అప్పటి నీవు
సందె మాడి వోడి తానె పగ చాటి లోలోన
అందు కేల నవ్వేనే అప్పటి నీవు ॥ ఆఅది ॥

సంగతి గానిచేఁతలు సారెఁ జేసినట్టివాని
నంగవించి కూడు మనే వప్పటి నీవు
ముంగిట వాఁ డుండఁ గాను మొక్కి మొక్కి మావలపె
అంగడి వేసేవు మేలే అప్పటి నీవు ॥ ఆఅది ॥

యింటికి నాతనిఁ దెచ్చి యిట్టె కాఁగిలించు మంటా
అంటించేవు బలిమినే అప్పటి నీవు
దంట శ్రీవెంకటేశుఁడు తానె కలసె నీమాఁట
కంటె నన రాదు మొక్కే వప్పటి నీవూ. ॥ ఆఅ

సాళంగనాట

ఇంత యెరఁగనియట్టి యెద్దనా నేను
కాంతుఁడ నీ వంతేసి గరిసించ నేఁటికి

సిగ్గు వడి వొకమాఁట చింతతోడ నొకమాఁట
వెగ్గళించి నిన్ను నాడ వెట్టిదాననా
అగ్గలపుమోహ మైతే అన్నియు నమరుఁ గాక
దగ్గరి నప్పుడె నీతోఁ దమకించఁ దగునా ॥ ఇంత ॥

క న్నప్పుడే మొక్కులూను కాన కున్నఁ దక్కులును
పన్ని యింత సేయ నీకుఁ బగదాననా
మన్నించినవారితోడ మందెమేళ మింపు గాక
నిన్న నేటిలోననే నిన్ను దూరఁ జెల్లునా ॥ ఇంత ॥

మూల నుండి వొకవావి ముంగిట నొకవావియు
గోల నై చెప్పుక రాను కూళదాననా
యీలాగుల శ్రీవెంకటేశ నన్నుఁ గూడితివి
వేళగా కిందాఁక నిన్ను వేసరించ వచ్చునా. ॥ ఇంత ॥ 452

సామంతం

ఎఱఁగ ననకుండా నీ కెఱిఁగించితిమి నేఁడు
తఱవాతిపనులకు తలఁపు నీ కెట్టిదో ॥ పల్లవి ॥

జక్కవకుచములపై జారెటి పయ్యదతోడ
చెక్కుల జారే చెమటచిత్తడితోడ
నిక్కి నిక్కి లోలోనె నీ కెదురు చూచుకొంటా
అక్కడ నున్నది చెలి ఆనతి నీ దెట్టిదో ॥ ఎఱఁగ ॥

నిట్టూరుపుగములతో నివ్వెరగుపాటుతోడ
అట్టె నిన్నుఁ గూడెటి యాసలతోడ
నెట్టనఁ దనపాయము నీకే మీఁ దెత్తుకొంటా
యిట్టె వాకిటికి వచ్చె యెన్నికె నీ కెట్టిదో ॥ ఎఱఁగ ॥

భారపుఁదురుముతోడఁ బవళించే నీపానుపు
చేరి యం దున్నది నవ్వునెలవితోడ
ఆరయ శ్రీవెంకటేశ అంతలో నేతెంచి యాపె
నూరడించి కూడితివి వున్న దిఁక నెట్టిదో. ॥ ఎఱ్ఱగ ॥ 453

## ముఖారి

ఇంక నేల తెగి కొంక నెదురా నేనూ । నీవు ।
కంకిగా నేమి నేసినాఁ గా దనేనా నేను ॥ పల్లవి ॥

మక్కువ నీవే నన్ను మన్నించఁగా నింతే కాక
యెక్కుడ నీసతులలో నెవ్వతె నేను
మొక్కలపుఁజేఁత లేల మొగమోట మరి యేల
వక్కాణించి నీ వే మన్నా వద్దనేనా నేను ॥ ఇంక నేల ॥

నీ విచ్చినచనవున నేనే కసరితిఁ గాక
యీవల నీ వూడిగాన కేటాఁతి నేను
ఆవలఁ గపట మేల అట్టె కూటము లేల
నీవలసిన ట్టుండఁగా నిందించేనా నేను ॥ ఇంక నేల ॥

కామించి నీవే నన్నుఁ గలయఁగా నింతే కాక
యేమంచిదాన నీకు యిప్పుడే నేను
ఆముక శ్రీవెంకటేశ అట్టె నన్నుఁ గూడితివి
ప్రేమము నీవు నించఁగా బిగిసేనా నేనూ. ॥ ఇంక నేల ॥ 454

## సామంతం

ఎటువంటి నీ మాయో యెరఁగమురా
యిటువంటి చేఁతలనే యెద్ద నైతిరా ॥ పల్లవి ॥

నగఁ బోతే నీ చేతి నాలికి లో నయితిమి
అగ డాయ మావలపు లట్టే వుండరా
మొగము చూడఁగఁ బోతే ముంచుకొనె మోహ మెల్ల
యెగసక్కెములకే యేమి సేతురా ॥ ఎటువంటి ॥

మాఁట లాడఁ బోయి నీతో మంతనాలఁ జిక్కితిమి
యేఁటికి మమ్మఁ జెనకే వేడ సుద్దిరా
మేఁటినిన్ను మెచ్చఁ బోయి మేనవావి చుట్టుకొంటే
యేఁట వెట్టేఁ దమకము యేమి సేతురా ॥ ఎటు॥

కరఁగించఁ బోయి నీ కాఁగిట నేఁ గూడితి
యిర వాయ వయసు న వ్వేఁక నేలరా
సరవి శ్రీవెంకటేశ సమ్మటూరిలో మనము
యెరవు లేని యీమేలు కేమి సేతురా. ॥ ఎటువంటి ॥ 455

సాళంగం

దోసము దోసము దొర నే మనినా
యీసు లేనివిభుఁ డిచ్చకుఁ డతఁడూ ॥ పల్లవి ॥

పంతము లాడకు పగతోఁ జూడకు
కాంతుఁడు నిను నిదె కైకొనెను
యెంత వదియు నీ వెరఁగక తిట్టిన
వంతుకు [1] మొక్కవె వైపరి యతఁడూ ॥ దోసము ॥

కోపము మానుము గుంపెన లుడుగుము
తీపుల నీపైఁ దెగఁ డతఁడు
చే పట్టఁగ గోరఁ జిమ్మినయందుకు
మోపుచు శిరసున మొక్కవె యిపుడు ॥ దోసము ॥

చలము లేమిటికి జంకెన తగ దిఁక
బలిమి శ్రీవెంకటపతి గూడె
తొలుత నీ వతనిఁ దోసి పెనఁగితివి
అలరుచు మొక్కవె అన్నియుఁ దేరె. ॥ దోసము ॥ 456

377-వ రేకు సాళంగం

ఏ మయ్యా వో యయ్య యే మయ్యా నే
మేమి బాఁతి నీకు నేల పిలిచే వయ్యా ॥ పల్లవి ॥

నీ సరివారమా నేము నిండు సరసము లాడ
ఆసలఁ బెట్టక మాను మన్నా మానవు
కాసు నేయనిపనికి కమ్మటి నాన వెట్టేవు
వేసరక నీవు మావెంట వెంటఁ బాయవు ॥ ఏ మయ్యా ॥

1. "మొక్కవైపరి" అని వ్రాసి "మొక్కవె వైపరి" అని తిద్ది యున్నారు.

చనవరులమా నేము సంగడి నీతోఁ గూచుండ
పొనిగి పోయినసుద్ది పో నియ్యవు
నవిచినవావు లెల్ల నాటికి నాఁడే కాక
కొనవేసి మమ్ము నేల కూరిమి గొసరేవు ॥ఏమయ్యా॥

నిన్ను మీరేవారమా నేఁ డేమి సేసినాను
కన్నులఁ దప్పక చూచి కలసితివి
యిన్నిటా శ్రీవెంకటేశ యిందరు నిట్టె చూడఁగ
నన్ను మన్నించి నాతోనె నవ్వులు నవ్వేవు. ॥ఏమయ్యా॥ 457

ముఖారి

అయ్యేపను లేవిధాన నయ్యీఁ గాక
చెయ్యారఁ జేసేపనికి సిగ్గు లేక నేలా ॥ పల్లవి ॥

పంతము లాడఁగ నేలే బలువులతోడను
చింతతో చెక్కిటిచేతి శిబ్బితె మేలు
చెంతలఁ బెనఁగఁ బోతే చేకత్తిగోళ్లె తాఁకు
నంతేసి లోఁతులు చొర నాఁడువారి కేలా ॥ అయ్యే ॥

కోరి నేరా లెంచ నేలే కొయ్యగాండ్లతోడ
వోరుచు కుండే టన్ను రుసురే మేలు
యేరీతిఁ దమి రేఁచిన నీరు దియ్యఁ బేను వచ్చు
భారపుబండ్లకుఁ గాళ్లు పైఁ జాఁచ నేలే ॥ అయ్యే ॥

కదుఁ గదు నవ్వ లేలే కాముకులతోడను
చిదుముడిఁ జేసెటిసేవలే మేలు
అదరి శ్రీవెంకటేశుఁ డాతఁడే నన్నుఁ గూడె
విడువనిపొందులకు విచారము లేలే. ॥ అయ్యే ॥ 458

సాళంగం

ఏల తిట్టేవే నన్ను నెంత గబ్బిదానవే
మే లని పొగడితేను మెచ్చ వద్దా నీవూ ॥ పల్లవి

చిక్కని వెన్నెలతేట నెలవినె వుండఁ గాను
చక్కని నీ మోమునె చంద్రుఁ డంటినే
నిక్కి నిక్కి మూతు లెత్తి నీ మొగాన కెగరఁగా
జక్కవపిట్టలు నీచన్ను లంటినే ॥ ఏల తిట్టే ॥

కామించి మురిపెముతోఁ గదలుచు నుండఁ గాను
రామ నీపిరుఁదు మరురథ మంటినే
కోమలపుఁ బోలికలు గురుతులు చూపఁ గాను
తామెరలనె పాదాలు తగ నంటినే ॥ ఏల తిట్టే ॥

జాతిమెఱుఁగులతోడ సరివచ్చి వుండఁ గాను
నీతురుమె రాశి యైన నీలా లంటినే
నీతితో నన్నుఁ గూడితి నేను శ్రీవెంకటేశుఁడ
నీతనువె బంగారునెల వంటినే. ॥ ఏల తిట్టే ॥ 459

భైరవి

ఇట్టె నేఁ దప్పక చూడ నెంతదానను
పట్టి నీతోఁ బంత మాడి పని గొందునా ॥ పల్లవి ॥

పాటించి యిచ్చినమాఁటపట్టుకే ని న్నంటిఁ గాక
యీటున నీతోఁ బెనఁగ నెంతదానను
వాఁట మైన వలపులే వాసి రేఁచెఁ గాక నన్ను
వేఁట వెట్టి నిన్ను నింత వేసరింతునా ॥ ఇట్టె ॥

కదిసి చెప్పేకతకుఁ గా ల్లదిగితిఁ గాక
యెదురుమా టాడ నీతో నెంతదానను
మొదల నా మొగమోట మొక్కించెఁ గాక నీకు
యిదివో నిన్నుఁ దగిలి యింత సేతునా ॥ ఇట్టె ॥

సందడిఁ గాఁగిలించఁగా సంతోషించితిఁ గాక
యిందరిలో నిన్ను నవ్వ నెంతదాననూ
అంది శ్రీవెంకటేశుఁడ అట్టె నన్నుఁ గూడితివి
పొందుకు మెచ్చే కాక పోసి కిట్టె వుందునా. ॥ ఇట్టె ॥ 460

సామంతం

వాఁడి గలవాఁడ వౌత వది నే మెఱుఁగుదుము
వేఁడిమి దుష్టులమీఁద విసరంగ రాదా ॥ పల్లవి ॥

వోప నంటాఁ బెనఁగితే నుదికి తిట్ట వచ్చేవు
ఆపనికే యెంత కెంత బౌరా నీవు
కోపము గలిగితేను గురిఁ బగవారిమీఁదఁ
జూప రాదా యీడ నేల చూపేవు నీవు ॥ వాఁడి ॥

తనిసినవారిమీఁదఁ దగఁ జేతులు చాఁచేవు
యెన లేనిజాఁకతోడ నేరా నీవు
మొన చూప వలసితే మించి నీకు నెదిరించి
చెనకేటివారిపై నే చేఁత సేయ రాదా ॥ వాఁడి ॥

పొలసి నంతటిలోనె పొదిగి నన్నుఁ గూడితి
మెలుపు శ్రీవెంకటేశ మేలురా నీవు
బలిమి నీకుఁ గలితే పౌఁజులమీఁద నురికి
వలసినట్టు మెరయ వ ద్దనేనా నేను. ॥ వాఁడి ॥ 461

రామక్రియ

అదుగరే చెలులాల ఆతనినే యీమాఁట
తడవి నే మెవ్వ రైన తన్ను మీరేమా ॥ పల్లవి ॥

చదురంగ మాడి యాడి సరిఁ దానె వోడె నింతే
వొదిగి తనకు నను రుసు రేలే
మొదల నేఁ దెవ్వతెకు మొగము చూపి వచ్చెనో
యెదుట నున్నవా రెల్ల నేమి సేతురే ॥ అదుగరే ॥

పసంతము లాడ వచ్చి వదిఁ దానె తొప్పఁ దోఁగె
వసివాడి తానె తల వంచ నేలే
దెసల నెవ్వతెచేతి తిట్టు దాఁకి తా వచ్చెనో
మెసఁగి నవ్వేవా రెల్ల నేమి సేతురే ॥ అద

సరస మాడె తనకు సతి నింద మోఁచె నింతే
ధరలోన సిగ్గువడఁ దన కేలె
యిర వైన శ్రీవెంకటేశుఁడె తా నన్నుఁ గూడె
యెరవులవా రెల్ల నేమి సేతురే. ॥ అరుగరే ॥ 462

578-వ రేకు దేసాళం

అన్ని సుద్దులు నెరుఁగు నాతఁడే కాక
యెన్నికలు పలుమారు యే మెంచేనే నేను ॥ పల్లవి ॥

నివ్వెరగు వడి యుండి నే నే మనే నిన్ను
నవ్వులిమాటలు నన్ను నడుగ నేలా
నవ్వులఁ దనచేఁతలు తలపోయుచున్నదాన
యెవ్వరిమాటల కని యే మందు నేను ॥ అన్ని ॥

వెక్కుచేత నే నుండి నేనే దేమే నిన్ను
తక్కక న న్నేల పేరు తడవేరే
యెక్కలోన నాతనిమోము చూచే నిదే నేను
యెక్కువ తక్కువలకు నెంతదాన నేనూ ॥ అన్ని ॥

కలకల నవ్వుతాను కా దనే దేమే నిన్ను
వలపట్టి వల పేల చల్లు మనేరే
యెలమి శ్రీవెంకటేశుఁ డింతలోనె నన్నుఁ గూడె
యిల నాకు నెదు రేదే యిర వయితి నేనూ. ॥ అన్ని ॥ 463

రీతిగౌళ

నిజమే యాడుదు గాక నీ కేల యీవెరపు
గజిబిజి సేసి నిన్ను గాసిఁ బెట్టేనా ॥ పల్లవి ॥

మాఁట లాడుచే సురుతు మంచముపై నాపె నీవు
నాటినకూరిమి మించునవ్వులతోడ
యేఁటికి నాతో బొంకే వేసుద్ది నెరఁగ నంటా
ఆఁటదాన నిన్ను నే నే మైనాఁ జేసేనా ॥ నిజమే ॥

చేయి వట్టుచే గురుతు సిగ్గువడి యున్నచెలి
చాయకుఁ దీసీ నది పూఁజప్పరములో
మాయ లేల నెరపేవు మగువ నింతే నేను
దాయవలె నీతోడఁ దగఁ బోరేనా ॥ నిజమే ॥

చెక్కు నొక్కుచే గురుతు చెలి నీవు మేడమీఁద
నెక్కడి యానలు నాతో నేల పెట్టేవు
యిక్కడ శ్రీవెంకటేశ యేలితివి న్నన్ను నేఁడు
పక్కన లే కున్న నిన్ను బలిమి సేసేనా. ॥ నిజమే ॥ 464

ఆహిరి

ఎవ్వరికిఁ దెలును నీ యిట్టి మాయలు
రవ్వలుగాఁ జూడఁ బోతే రంటికిని వత్తువూ ॥ పల్లవి ॥

నగవులు సారె నీకు నవ్వ వచ్చుఁ గాక మాకు
పగ సవతులచేతఁ బడ వచ్చునా
పగటుమేలము చాలు పద వోయి నీ కేమి
తగులువిరికాఁడవు దక్కినట్టే వుందువూ ॥ ఎవ్వరికి ॥

చేఁత లెల్లఁ జేసి నీకుఁ జెక్కు నొక్క వచ్చుఁ గాక
బాఁతిపడి విరహానఁ బడఁ గలమా
లేఁతమాట లాడ వద్దు లేవోయి వలపులు
పాఁతగిలితేఁ జాలు పనులే మరతువూ ॥ ఎవ్వరికి ॥

గతి గూడి నీకు మమ్ముఁ గాఁగిలించ వచ్చుఁ గాక
అతివలము నిన్ను ర మ్మన నోపేమా
సత మై శ్రీవెంకటేశ చన విచ్చి కూడితివి
యిత వయినచోటికి నీ వె ట్టయినఁ జేతువూ. ॥ ఎవ్వరికి ॥ 465

హిందోళం

వెనక మ మ్మన వద్దు వెతలఁ బొరల వద్దు
అనుమాన మెల్లఁ దీరె నరసుకోవమ్మా ॥ ప॥

తలఁచఁ గానె వచ్చె తరుణి నీరమణుఁడు
అలరి మీముచ్చటలు ఆడుకోరమ్మా
నిలుచున్నాఁ డదివో నీయెదుట నతఁడు
తెలియఁగల వెల్లాను తెలుసుకోవమ్మా ॥ వెనక ॥

చేతికి లో నై యున్నాఁడు చిల్లరచేఁతలు మేన
ఘాతలుగ లేవు గదా కనుకోవమ్మా
యేతుల నీ చెప్పినట్టు యేమి సేయు మన్నాఁ జేసీ
యీతల నొరసి చూచు మింకా నోయమ్మా ॥ వెనక ॥

గక్కనఁ బ్రేమ మెరిఁగి కాఁగిలించినాఁ డిదివో
మిక్కిలి శ్రీవెంకటేశు మెచ్చవమ్మా
నిక్క యీతనిగుణాలు నీ వెరఁగ వలసితే
చెక్కు నొక్కి బుజ్జగించి చిత్తగించవమ్మా. ॥ వెనక ॥ 466

శంకరాభరణం

దొరపాటివాఁడు తాను దొరరీతి నుండఁడు
వరుసలు మిరి వచ్చి వ ద్దనరే చెలులూ ॥ పల్లవి ॥

అంది నాకు బాగా లిచ్చి ఆకు మడి చిచ్చె నంటా
ఏందువలె నితఁ డేల వేఁడుకొనీనే
యెందు నూడిగపువార మింతే తనకు నేము
మందెమేళములు నేసీ మాను మన్న మానఁడు ॥ దొరపాటి ॥

సరిఁ దా నిలుచుండి మంచముపైఁ గూచుండు మంటా
అరుదుగ నన్ను నేల ఆన వెట్టీనే
సరుసఁ దనకొలువుసతుల మింతే నేము
వెరవులు చెప్ప వచ్చీ వీఁ డి దేమే నేఁడు ॥ దొరపాటి ॥

తల గుచ్చి కాఁగిలించి తమ్ములు మిడు మంటాను
బలిమి నేసి పెనఁగీ పచ్చిగాఁ దామూ
యిల శ్రీవెంకటేశుఁడు యిచ్చలోనివార మింతే
చలి వాపి మమ్ముఁ గూడె చన వింత గలదా. ॥దొరపాటి॥ 467

శంకరాభరణం

ఎంత బలువె తన కెంత నేము సదరమా
అంతే పో తనసుద్ది లవి నే మెరఁగమా ॥ పల్లవి ॥

రమ్మని చేరఁ బిలిచి రా కున్నఁ దనచేతి
నిమ్మపంటఁ గొని వేసినే నన్నును
కమ్మటిఁ దప్పక చూచి కదు నేఁ బల నంచితే
అమ్మ మీఁదఁ దిట్టినె అంతలోనె తానూ ॥ ఎంత ॥

చేయి చాఁచి నామీఁద సిగ్గున సూర కుండితే
చాయలకుఁ బన్నీరు చల్లినె వీఁడూ
ఆయములు దా నంటఁగ నందుకు నేఁ బెనఁగితే
దాయిట వొట్టు వెట్టినె పాయ లేక తానూ ॥ ఎంత ॥

కొంగు వట్టి తియ్యఁగాను గుట్టున నే నవ్వితేను
అంగవించి యప్పై కూడె నందుచే తానూ
యింగితము శ్రీవెంకటేశుఁ డితఁడే యెఱఁగు
చెంగట నన్నిటికిని చెక్కు నొక్కెఁ దానూ. ॥ ఎంత ॥ 168

379-వ రేకు రామక్రియ

ఎఱుకముడి [1]విశ్వాస మిఁక నేలా
నెఱి నిటమీఁదికీర్తి నీదే కాకా ॥ పల్లవి ॥

నీవే నే నై యుండఁగాను నిన్ను దూరఁ జో టేది
కావలసినపనులు గనుటే కాకా
ఆవల మారుమాట లడుగఁగఁ జో టేది
వేవేలు సుద్దు లెల్ల వినుటే కాకా ॥ ఎఱుక ॥

మనసు లొక్క టైయుండి మచ్చరించఁ జో టేది
ననుపున నెందు కైన నగుట గాక
[2]చనవులు గలిగియు సాదించఁ జో టేది
వొనరినసంతసాన నుండుటే కాకా ॥

1. "విస్వాస" అని వ్రాసి "స్వ" ను "శ్వ" గ తిద్ది యున్నారు. 2. గలిగియు" అని వ్రాసి "ం" చెరిపి "చనవులు గలిగియు" అని తిద్ది యున్నారు.

నిండుఁగాఁగిటనే వుండి నీతోఁ గొంకఁ జోపేది
అండనే మనము వెర గందుట గాకా
కొండల శ్రీవెంకటేశ కూడితివి నన్ను నిట్టె
మెండుగా [1]నిన్నిటా నేను మెచ్చు టింతే కాకా. ॥ఎఱుక॥ 469

### శుద్ధవసంతం

అప్పటి నేనే కోపి నందురు మీరు
చెప్పరాని అతనిచేఁత లివి చూడరే ॥ పల్లవి ॥

నవ్వుతానే [2]మంచితనము నెరపుత గాక
యెవ్వరిమనసు తెట్టో యెరుఁగుదునా
[3]పువ్వుల నే వేయఁ గాను పూఁచి నిమ్మపంట వేసీ
పవ్వుల నుండి యాతని తగవులు చూడరే ॥ అప్పటి ॥

మొగము చూచి తనకు మొక్కఁ గలదానఁ గాక
మొగసక్కెము లవుట యెరుఁగుదునా
తగు వెన్నెలలోనికె తన్ను నేఁ బిలువఁ గాను
సగము చీఁకటిలోనె సన్న సేసెఁ జూడరే ॥ అప్పటి ॥

చెంది యిట్టె తనసేవ సేయఁ గలదానఁ గాక
యింయికె నన్ను మెచ్చుట యెరుఁగుదునా
అంచపు శ్రీవెంకటేశుఁ డన్నిటా నన్నుఁ గలసె
కంచమవలు గరఁగించి కడు మీరీఁ జూడరే. ॥ అప్పటి ॥ 470

### సాళంగం

అంతటఁ నాని తీర దతివమతి కోపము
యెంత దలపోసినా యిదివో నాయకుఁడా ॥ పల్లవి ॥

యిప్పు డైనా నామాట చెయ్యకొంటేఁ జాలుఁ గాక
తప్పి పోయీనా వలపు తతి మీరీనా
చెప్పనా నీ కప్పుడే సేసినసేరాన కెల్ల
ముప్పిరి నాపె నీపెకు మొక్కించు మని ॥ అంతట ॥

---

1. "నిన్నియును" అని వ్రాసి "యు" ను "టానే" అని దిద్ది "నిన్నిటా నేను" అని దిద్ది యున్నారు. 2. "మంచితనముం నెరపుత" అని వ్రాసి "ం" చెరిపి "మంచితనము నెరపుత" అని దిద్ది యున్నారు. 3. "పువ్వుల" అని వ్రాసి 'వ్వ' ను 'వ్వ' గ చేసి "పువ్వుల" అని దిద్ది యున్నారు.

వెనకటి నీచలము విడిచితేఁ జాలుఁ గాక
అనువుగఁ జేయ లేమా అన్నిపనులు
విన వైతి వింతే కాక వేగమే యెచ్చరించనా
చెనకిన ఆపె నీపెపేతి కిమ్మని ॥ అంతట ॥

ప్రేమానఁ జగవు నడపే నంటేఁ జాలుఁ గాక
యీమగువమాటగ నే నియ్యకొననా
కామించి శ్రీవెంకటేశ కలసితి నా నననా
సామాన నాపె నీపెను సరిగాఁ జేయు మని. ॥ అంతట ॥ 471

మాళవిగౌళ

ఊరకె ని న్నింత సేసి వుప్పటించేనా
తేరె నన్నిపనులు నిండె మొక్కే రావయ్యా ॥ పల్లవి ॥

కప్పురవిడెము నీవు కాంతచేత నందుకోఁగా
దెప్పరపుకోపమునఁ దిట్టితిఁ గాక
నెప్పున నాపెసొమ్ములు నీమేన నుండఁ గాను
అప్పుడె నీతో నేను అలిగితిఁ గాకా ॥ ఊరకె ॥

ముసిముసి నవ్వులతో ముదితమోము చూడఁగా
వెసఁ బూవుబంతిఁ గొని వేసితిఁ గాకా
పస మై యాపె నీతో వట్టిసన్నలు సేయఁగ
యిను మంత నిన్ను నేర మెంచితిఁ గాకా ॥ ఊరకె ॥

గట్టిగా నీ వాసతి కాఁగిట నుండఁగాఁ జూచి
చిట్టకానకుఁ బాదానఁ జిమ్మితిఁ గాకా
నెట్టన శ్రీవెంకటేశ నీవే నన్నుఁ గూడితివి
గట్టున నన్నిటా నిన్నే [1]కొసరితిఁ గాకా ॥ ఊరకె ॥ 472

శ్రీరాగం

నాకొర కంటినా నీ నాటకాన కంటిఁ గాక
యీకడ నాకు మొక్కే వేఁటి కింతే సానలు

1. "కొసరితి" అని వ్రాసి "రి" కొట్టి "కొసరితి" అని దిద్దబడి

చిత్తజకేలికి నీవు చేర వైతి వంటినా
హత్తి నీ వెందో వుంటి వంటిఁ గాకా
పొత్తుకు రావలసి నేఁ బోరి యింతే సంటినా
అత్తలివారిపొత్తు లరసితిఁ గాకా ॥ నాకొర ॥

వుంగరము నాకు నీవు వుంకువ యిమ్మంటినా
అంగడి నెవ్వతె యిచ్చె నంటిఁ గాకా
కంగి నాతో నీ విట్టె కల్ల లాడే వంటినా
అంగనతో నే మని యంటి వంటిఁ గాకా ॥ నాకొర ॥

నావద్దనె వుండు మని నమ్మక నే నంటినా
ఆవలివారు నిం దాడే రంటిఁ గాకా
శ్రీవెంకటేశుఁడ నన్ను చేకొని కూడితి విట్టె
భావరతి నాపెనుఁ జెప్పకు మంటిఁ గాకా. ॥ నాకొర ॥ 473

శంకరాభరణం

నీకు నిచ్చకమే నెరపుదుఁ గా కిటు
కాకు సేసి నినుఁ గదిమేనా ॥ పల్లవి ॥

యెమ్మెకు నాతో నెంత నవ్వినా
కిమ్ముల నీతోఁ గినిసేనా
నిమ్మపంటఁ గొని నీ వెంత వేసిన
ముమ్మాటికి నే మలిగేనా ॥ నీకు ॥

తొడిఁబడ నీవే తురుము వట్టితే
జెడిదంబుగ నేఁ బెనఁగేనా
అదరి నీవు ర మ్మని ననుఁ బిలువఁగ
వోదకఁ బంద నని వొదిగేనా ॥ నీకు ॥

పైకొని నీవే పాదము [1]చాఁచగ
చేకొని పిసుకక నెలనేనా
యీకడ శ్రీవెంకటేశ కూడితివి
మేకడ కేఁగఁగ నిచ్చేనా. ॥ నీకు ॥ 474

1. "చాఁచంగ" అని వ్రాసి "ం" చెరిపి "చాఁచగ" అని తిద్ది యున్నారు.

380-వ రేకు వరాళి

ఆడ కేల పిలిచేవే అప్పటి నన్ను
గోడ గరుగఁగ నేల గొబ్బున రాఁ గదవే ॥ పల్లవి ॥

లోఁతుకుఁ జొచ్చినవాఁడు లోన నీమాట వినీనా
మూఁతి మీఁది కెత్తేవాఁడు మోము చూచీనా
చేఁతలు దవ్వేటివాఁడు సిగ్గు పడ నేరుచునా
పాఁతుమా కై వుండేవాఁడు పైకొనీనా ॥ ఆడ కేల ॥

పెచ్చు వెరిగెటివాఁడు ప్రియము చేకొనునా
మచ్చరమే పెంచేవాఁడు మన సిచ్చీనా
వొచ్చెము వెదకేవాఁడు వొగి నిజ మెరుఁగునా
యెచ్చు కుందు చేఁతవాఁడు యిత వై చూచీనా ॥ ఆడ కేల ॥

సటల మాటలవాఁడు సరవిగా నడచీనా
కుటిలపుగతివాఁడు గుట్టు చెప్పీనా
యిటు శ్రీవెంకటేశుఁడు యీమాటకే నన్నుఁ గూడె
యిటువలె నుండినాను యింకఁ బాసీనా. ॥ ఆడ కేల ॥ 475

శుద్ధవసంతం

ఏల వేగిరించీనె తా నింతలోనను
జాలితోఁ బవ్వళించి మంచముపై నుందానను ॥ పల్లవి ॥

తెల్లవార నియ్యవే తేనె లుట్టిపడేఅట్టు
మల్లాడి తనతో నేను మాటాడేఁ గాని
యిల్లు గడె వెట్టుకొంటి నీపొద్దుకు నోప లేను
పల్లదాన నిదివో నాపక్క బిడ్డ వున్నది ॥ ఏల ॥

చలి వాయ నియ్యవే సరి బేసి ఆడినట్టు
వలపులు తనమీఁద వడిఁ జల్లేను
తలఁ బట్టు వెట్టుకొంటిఁ దతి గా దీవేళను
పొలసి మాయత్త నేఁడు పొరుగింట నున్నది ॥ ఏల ॥

వేగ వేర నియ్యవే వెల్లుబడి గలయట్టు
బాగులుగా తన్ను నేనె పైకొనేను
వేగడియ దీసి చొచ్చి శ్రీవెంకటేశుఁడు గూడె
వేగిరించి మావదినె వెలుపల నున్నది. ॥ ఏల ॥ 176

పాడి

సతులకుఁ బతులకు సాజమె యిది
యితవు వెంచుక తామే యేకములు నవుదురు ॥ పల్లవి ॥

కూరిమి గలుగుసతి కోరి పతిఁ గాన కున్న
యేరీతి సయిన మాట యిందరితోడ
వార చిప్పి మగవాఁడు తనయిచ్చఁ దిరిగాడి
యీరసాన నే మనిన యెగ్గులనుఁ బట్టఁడు ॥ సతులకు ॥

అంటెకు రా కున్నవేళ నాఁడువారు మగవానిఁ
గంటి నేసి కన్నచోటఁ గాకు సేతురు
వంక లొత్తఁ [1]బోఁడు తనవల్ల నేరమి గలితే
మంకు దీరి తనుఁ దానె మట్టుకు వచ్చును ॥ సతులకు ॥

కాఁగినచెలియ తనకాఁగిటికి దగ్గరితే
లోఁగి తనవిభునికి లో నవును
పేఁగుచు శ్రీవెంకటేశు వెలఁదిఁ గూడితి విట్టె
వేఁగ దేర నే మిందుకు నెలవి నవ్వేదుమూ ॥సతులకు॥ 177

నాదరామక్రియ

వద్ద నుండి మీరు మాడ పలసి కాక
కొద్దిమీరి నేనె పైకొన కుండేనా ॥ పల్లవి ॥

కగ్గ తనచేఁతలకు కన్నుల మొక్కినదాన
దగ్గరి తనకు మొక్కఁ దదవా నాకు
యెగ్గు లెంచక పనులు యే మైనాఁ జేసినదాన
వొగ్గి పూడిగాలు సెయ కూర కుండేనా ॥ వద్ద నుండి ॥

1. "బో" అను చోట ఏదో అక్షరమును వ్రాసి చెరిపి "బో" వ్రాసి యున్నారు.

బింకాన నాఁ డిట్టె తన్ను పేరఁ బిలిచినదాన
అంకెల తనతో మాట లాడ కుండేనా.
కంకి తనపుట్టులకు గక్కున నవ్వినదాన
యింకా సరస మాడ కిటు మానేనా ॥ వద్ద నుండి ॥
చెమటమేని తనకు చేలా గిచ్చినదాన
అమరఁ గాఁగిటఁ గూడ నరుదా నాకు
సుముఖుఁ డై శ్రీవెంకటేశుఁడు దాని నను( బొందె
తమకాన నిద్దరికి తతి పోయీనా. ॥ వద్ద నుండి ॥ 178

దేసాక్షి

మామాట లేల వినవే మగువ నీవు
వోమి యాతనికే మొక మోదేవు గాని ॥ పల్లవి ॥
పంతాన రా నని చలపట్టుకొని వుండఁ గాను
యెంతదద వైనఁ జోర నేలే మాకు
చెంతల నాతఁడే వచ్చి చేయి వట్టి తియ్యఁ గాను
వంతుకు నేఁడు నీ విట్టే వచ్చేవు గాని ॥ మామాట ॥
మాట లాడ నని నీవు మౌనముతో నుండఁ గాను
యేటికిఁ బెనఁగితిమే యుండాఁగా నేము
పాటించి యాతఁడే వచ్చి పక్కన నవ్వితేను
గాఁటపుముచ్చట లాడి కరఁగేవు గాని ॥ మామాట ॥
మంచముపైఁ బవ్వళించి మంతనాన నుండఁ గాను
పొంచి నిన్ను వేప నేలే పొదిగి నేఁడు
అంచెల శ్రీవెంకటేశుఁ డదె వచ్చి నిన్నుఁ గూడె
యెంచి యాతనికే చన విత్తువు గాని. ॥ మామా 179

సౌరాష్ట్రం

నీమనసులోనిమాట నే నెరఁగనా
కామించి నీవే నాకుఁ గల వని వుందుగా

నాకే వలతు వంటా నాపై బత్తి గల వంటా
ఆక డీకడివారితో నాడుకొందును
యీకడ నన్ను మన్నించి యింటి కిట్టె వచ్చే వంటా
తూకొని నీరాకల కెదురు చూతును ॥ నీమనసు ॥

నమ్మఁ గలవాఁడ వంటా నామాట గడవ వంటా
కమ్మి ని న్నెపొద్దునుఁ బొగడుచుందునూ
ర మ్మని నిన్నుఁ బిలిచి రతుల మెప్పించే నంటా
నెమ్మది నుపాయములు నేరుచుకుండుదును ॥ నీమనసు ॥

యిద్దరము నొక్క టంటా నెగ్గు దప్పు లెంచ వంటా
పెద్దరికమున సరి పెనఁగుదును
అద్దివో శ్రీవెంకటేశ అట్టె కా నన్నుఁ గూడితి
పొద్దు వొద్దు నీకు నిట్టె బోదింతునూ. ॥ నీమనసు ॥ 480

181-వ రేకు ఆహిరి

చే వట్టి పిలువరమ్మ చెలులారా
వే వేగఁ దా రాకున్న వేసరరా లోకులు ॥ పల్లవి ॥

వెదకి కానక నే విరహాన నుండఁ గాను
పొదిగి తానే వచ్చుట పుణ్యము గాదా
మదిలో నేఁ దలఁచఁగ మరఁగునఁ దా నుంటే
వదలక దయ లేనివాఁ డనరా[1] లోకులు ॥ చే వట్టి ॥

తలఁచి తనకుఁ గాను తమకాన నుండఁ గాను
మలసి తాఁ బైకొంటే మంచిది గాదా
వలచినవారి నింత వలలఁ బెట్టఁగఁ బోతే
అలరి యెం తపకీర్తి యనరా లోకులు ॥ చే వట్టి ॥

తనపేరు నాలికపైఁ దడవుచు నుండఁ గాను
తనియఁ బొందుట జాణతనము గాదా
యెనసె శ్రీవెంకటేశుఁ డిదివో నన్ను రతుల
పొనిగి యానోళ్లనే పొగడరా లోకులూ. ॥ చే వట్టి ॥ 481

1. "దనర" అని వ్రాసి "దనరా" అని తిద్ది యున్నారు.

కాంబోది

ఉన్న వల్లా నటుండనీ వొద్ద నిలుచుండనీ
కన్నులకు నిధానము గలిగెఁ గా నీకు ॥ పల్లవి ॥

యేపొద్దు నాపె నీవు యెదఁ గట్టుకొ నుండఁగ
తీపుల నీపాలిటి దేవ రాయఁ గా
యీపాటి వారి వీరి నెలయించి యీసు రేఁచ
కాపాడి చెప్పి చూపఁ గలిగెఁ గా నీకు ॥ ఉన్న ॥

చేతికి లో నై యాపె చెప్పినట్టె నేసేవు
యీతల నిన్ను వంచుకో నేలి కాయఁ గా
రీతిగా సింగారించి రేయిఁ బగలుఁ బాలార్చు
పూతల సింగారబొమ్మ గలిగెఁ గా నీకూ ॥ ఉన్న ॥

చీ మంత మా పైన చెవిలో నీకు బోధించు
కోమలి నీ పెన్నాళ్లకు గురు తాయఁ గా
యీమేర శ్రీవెంకటేశ [1]యిద్దరి మమ్ముఁ గూడితి
కామించి మేకులు సేయఁ గలిగెఁ గా నీకు. ॥ ఉన్న ॥ 182

సామంతం

అందాఁకాఁ గాఁగిన నిన్ను నన రాదు గా
పొందిక లైనమీఁద బుద్ది చెప్పేఁ గాని ॥ పల్లవి ॥

వేడుక నీరమణుఁడు విచ్చేసుదాఁకా నీ
వాడిన పెల్లా మాకు నాద వలెఁ గా
యీడుగా సమరతి మి మ్మిద్దరిఁ గూడఁగఁ జేసి
జోడుగా నీతిట్లకు సూడు వట్టేఁ గాని ॥ అందాఁ ॥

పక్కన మీలోన మొకబంగాయి వాసినదాఁకా
వెక్కసపు నీసణఁగు వినవలెఁ గా
చిక్కు వద్ద మీలోని చిత్తము తేకము సేసి
దక్కన నీచేఁత లెల్లాఁ దగఁ దిప్పేఁ గాని ॥ ౘ

1. "యిందరి" అని వ్రాసి "ం" చెరిపి "యిద్దరి" అని తిద్ది యు

యీకడ నాతఁడు నిన్ను యిట్టె మన్నించినదాఁకా
నాకు నాకే నిన్నుఁ జూచి నవ్వవలెఁ గా
చేకొని యింతలోనె యీశ్రీవెంకటేశుఁడు గూడె
సాకిరి దెలిపి మీఁద సమ్మతించేఁ గాని. ॥ అందాఁకా ॥ 483

సామంతం

ఎప్పుడు నీయిచ్చలోని యింతిఁ గాక
తప్పులు నీమీఁద వేసేతపణినా నేను ॥ పల్లవి ॥

వంతులకు వాసులకు వలపులు చల్లి చల్లి
అంత నిన్ను [1]దూరేటియాఁటదాననా
కొంత నిన్నుఁ గోపగించి గొణఁగి గొణఁగి తిట్టి
పంతము వెనక నిచ్చే పడఁతినా నేను ॥ ఎప్పుడు ॥

పొట్టు వొట్టు నీపద్ది పొలఁతులవలెనే
అట్టలించి పెనఁగేటియాఁటదాననా
ఉట్టండాలు నీతోఁ జేసి పూరకే వెనక వచ్చి
తిట్టుకొని మాట లాడేదేవులనా నేను ॥ ఎప్పుడు ॥

గారవాన నిన్నుఁ గూడి కాఁగిటి నీచేఁత వెల్ల
అరయఁ జెప్పుకొనేటియాఁటదాననా
నేఁటితువు శ్రీవెంకటనిలయ నీయాల నైతి
సారెకు సారె మాటాడేనకియనా నేను. ॥ ఎప్పుడు ॥ 484

కొండమలహరి

నీ కేమి దూరువాన నే నైతిఁ గాక
వాకున నప్పుడే నీతో వద్దననా ॥ పల్లవి ॥

నా మోము చూచి నీవే నవ్వఁగా నవ్వితిఁ గాక
అమాట వెల్లా నాపెతో నాడుదురా
ప్రేమాన నా పంపఁగా నే పిలువ వచ్చితి నింతే
చే ముట్టిన యాసుద్ది చెప్పుదురా ॥ నీ కేమి ॥

1. "దూరేంటి" అని వ్రాసి "ం" చెరిపి "దూరేటి" అని తిద్దియున్నారు.

ర మ్మని చేయి పట్టఁగ రతి నూర కుండఁగాక
యెమ్మె చెల్లా నాపెతోఁ నెంచుకొందురా
వుమ్మడి నాపెకు నీవు వూడిగపుదాన వంటే
అమ్మరో నావుంగరము ఆపె కిత్తువా ॥ నీ కేమి ॥

పాదాలు పట్టి మనఁగా పైకొని పెద్దికఁ గాక
పోదిగా నాబుద్ది యీడఁ బోగడుదురా
యీడనే నాపెఁ గూడితి విట్టె శ్రీవెంకటేశ
సోదించి నా మో వాపెకుఁ జూప వచ్చునా. ॥ నీ కేమి ॥ 185

సామంతం

అంతటఁ గాని తీరదు ఆపెనే చేరి
చెంత లోనికి ర మ్మని చే పట్టి తియ్యవయ్యా ॥ పల్లవి ॥

మచ్చిగించి నీవు నాపె యేకతము లాడఁగాను
వచ్చి వచ్చి నిలిచెను వాకిటఁ జెలి
తుచ్చము లాడక తొల్లె తొయ్యలిచే మొక్కించి
మచ్చికగాఁ గినుకపడి మాట లాడవయ్యా ॥ అంతట ॥

చేచేత నీ విద్దరును సెలవుల నవ్వఁగాను
చూచి చూచి తలవంచి సోలసీని
యేచి కోపించకతొల్లె యింతిచే సేవ సేయించి
తాచి నీకాఁగిట నీవు తమి రేఁచవయ్యా ॥ అంతట ॥

మంచముపై నీవు నాపె మలయఁగా ముట్టి ముట్టి
అంచునఁ దాఁ బవ్వళించి అంగవించును
అంచెల శ్రీవెంకటేశ అంతలోఁ గూడితి వాపె
కంచముపొత్తు గలపి కరఁగించవయ్యా. ॥ అంతట ॥

382-వ రేకు ఛాయానాట

వేసాల నేఁడు నాకుఁ గా వెరవ నేల
వాసి యాపె కెక్కించఁగా వద్దనేనా యిపుడు ॥ పల్ల

వాయలు చూచి చూచి సణఁగులు చల్లి చల్లి
ఆయెడనే నిలుచున్న దప్పటనుండి
చేయి మీఁదివేసి యాపెఁ జెంగటఁ గూచుండు మంటే
యీయెడఁ దా వచ్చినా నే లనేనా నేను ॥ వేసాల ॥

వెంగెములే యాడి యాడి పెరగులే నించి నించి
కంగి నిలుచున్న దదే కంబముదండ
సంగడి నిల్చి నిలిచి చన విచ్చి వేఁడుకొంటే
సింగారి నేఁడు గాదా సిగ్గువ్యానా నీకు ॥ వేసాల ॥

పొందు లట్టే చేసి చేసి బొమ్మ లట్టే వంచి వంచి
కందువ శ్రీవెంకటేశ కరఁగీ నదే
యిందు నందుఁ దిరిగాడి యిద్దరిఁ గూడితి విట్టే
ముందరనే యిట్టైతే మొరఁగి నవ్వేనా. ॥ వేసాల ॥ 487

శుద్ధదేసి

వీరి వారివలె నేను వింతదాననా
నేరక నీ వుండినాను నే మెచ్చక మానను ॥ పల్లవి ॥

వలచిన మేలు నీకు వలవ కున్నా మేలు
తలఁపు నీమీఁద నాకుఁ దగిలి పోదు
అలమి పట్టఁగ వద్దు అనలు పెట్టఁగ వద్దు
చెలిమి నీతో నెపుడుఁ జేయక నే మానను ॥ వీరి వారి ॥

యింటికి వచ్చిన మేలు యేద నున్నా మేలు నీ
వెంట వెంటఁ దిరిగి సేవించక పోను
తొంటిపొందు చెప్ప వద్దు దొమ్మిఁ జెక్కు నొక్క వద్దు
అంటి [1]ముట్టి సరసము లాడక నే మానసు ॥ వీరి వారి ॥

యివ్వలిమో మైన మేలు యెటువలె నున్న మేలు
నెవ్వగ దీరఁ గూడక నే మానను
రవ్వగ శ్రీవెంకటేశ రతిఁ జొక్కించితి విదె
పువ్వువలె నిన్ను నేఁ [2]బొదుగక మానను. ॥ వీరి వారి ॥ 488

1. "ముంట్టి" అని వ్రాసి "ం" చెరిపి "ముట్టి" అని దిద్ది యున్నారు.
2. "బొంధుక" అని వ్రాసి చెరిపి "బొదుగక" అని దిద్ది యున్నారు.

భైరవి

ఇంక నేల కొంకఁ దమయిచ్చ లనరే
అంకె నే నుంచేఁ దమ కే మాయ నడుగరే ॥ పల్లవి ॥

యేకత మాడెటవేళ నేల నే వచ్చితినో
దాకొని నన్నుఁ గంటానే తల వంచిరి
యీకడఁ దమ కిద్దరి కెంత వెగ టైతినో
రా కున్న నె ట్టాయ నింత రచ్చల కెక్కితిని ॥ ఇంక నేల ॥

మగఁడు నాకు నుండఁగ మంచ మే లెక్కితినో
చిగురుమోవులఁ దాము సిగ్గు వదిరి
సొగిసి యిద్దరి కెంత సుఖవిరుద్ధ మైతినో
మొగ మియ్య నసే రంటా ముందు నుంచానను ॥ఇంక నేల॥

మెనసినరతివేళ నేల కాఁగిలించితినో
తనిసి తమమేనులు తా మెఱుఁగరు
అను వై శ్రీవెంకటేశుఁ డప్పటిని నన్నుఁ గూడె
ఘనగర్వ మనే రంటాఁ గాని మ్మని యంటిని. ॥ఇంక నేల॥ 480

శ్రీరాగం

చెప్పకున్న దోసమూ సేసినచేఁతలు నీతో
చొ ప్పెత్తి పయ్యద గంచే సోదించక మానఁడు ॥ పల్లవి ॥

రాఁ దని నీతోఁ జెప్ప రాఁగా నీరమణుఁడు
పోఁడిమిఁ గాఁగిటఁ బట్టెఁ దోసు పంటాను
నాఁడె నీతోఁ జెప్పనా నన్ను నంపకు మనుచు
అఁచ దైతేఁ జాలు నాతఁ డంటుకోక మానఁడు ॥ చె ॥

నీపై నాన పెట్టఁ గానె నీవావి మీఁద వేసి
చే పట్టి గిఁబిగిఁబినాఁ జేసె నాతఁడు
చోప నన్నాఁ బో నీక పూఁడిగాన కంపితివి
యీపాటి నందు గలితే యెనయక మానఁడు ॥ చె

నే వద్దె పెనఁగఁ గాను నీమతకమే యంటా
తానే కూడె శ్రీవెంకటోత్తముఁడు నన్ను
మోనాన నూరకుండితి ముందు నిన్నుఁ గూడుదాఁకా
నానాటి కీపాటి నవ్వు నడపక మానఁడు. ॥ చెప్ప ॥ 490

కన్నడగౌళ

మనోభావకుఁడవు మగువ మిక్కిలి జాణ
అనేకవిన్నపము లందులోనే వున్నవి ॥ పల్లవి ॥

వంచినరెప్పలవెంట వడిసిన కన్నీరు
కొంచక నీమీఁదఁ జెలి గోరఁ జిమ్మీని
యెంచి నీ విందాఁక రాక యింత సేసినయందుకు
పొంచి నీకు నక్కునఁ బోసి చూప వలదా ॥ మనో ॥

సారె నాకొప్పువిరులు సరి [1]వొక్కొక్కటే తీసి
డార దప్ప కుండ నిన్నుఁ దాఁక వేసీని
రా రమ్మని పిలువఁ బరాకై వుండివందుకు
పూర కుండి తనపాటు వొప్పగించ వలదా ॥ మనో ॥

వెట్టఁ బొరలిన దై వెస నిన్నుఁ గాఁగిలించె
అప్టై తన అసురుసు రదె చూపీని
జట్టుగ శ్రీవెంకటేశ నెట్టనఁ గూడి తీదనె
ది ట్టయి నీసేసినవేలు దిగఁ బోయ వలదా. ॥ మనో ॥ 491

సాళంగనాట

అడుగరే చెలులాల అతఁడు వాఁడే
యెదసితే జంకింతుము యింత కోపీనా ॥ పల్లవి ॥

చేతికి లో నాదాఁకాఁ జెప్పెటప్రియము లింతే
అతరి మందెమేళాతె అందు కోపీనా
కాతరపుదాన నేను ఘమఁ దిన్నిటాఁ దాను
ఘేతుు నెమ్మెలు మావి యింత కోపీనా ॥ అడుగరే ॥

1. "వొక్కటే" అని వ్రాసి "వొ" కు పైన హంసపాది చేసి క్రింద "క్కొ" వ్రాసి "వొక్కొక్కటే" అని దిద్ది యున్నారు.

చనవు గలుగుదాఁకా సరవి నడచు వింతే
వెనకపనులు మీరు వెట్టి కోపీనా
మొనతోడిదాన నేను మొక్కలపుదొర దాను
యెనసి మాతోడి జద్దు కింత కోపీనా ॥ అడుగరే ॥
కలసిన యందాఁక కన్నుల మొక్కుట యింతే
బలుము లంతటి మీఁదిపని కోపీనా
చెలి వింతే నన్నుఁ గూడె శ్రీవెంకటేశుఁడు దాను
యెలయింపులరతుల కింత కోపీనా. ॥ అడుగరే ॥ 492

383-వ రేకు నారణి

తనిసినవాఁడు గాన తమి చాలదు దనకు
పని లేదు తను నింక బదలించ నాకు ॥ పల్లవి ॥
సరసమే ఘన మాయ సరి యేఁకవల పాయ
సరివొద్దు వోయ వింకాఁ జాల దటరే
అరలోనఁ బవ్వళించు మనరే విభుని నేను
పొరిఁ దూఁగుమంచానఁ బొరలేఁ గాని ॥ తనిసిన ॥
పందెములే తఱి చాయ బయలీఁత సుద్దు లాయ
చందమామగుటుకలు చాల దటరే
కందువ నిద్ర రా కుంటే కతలు విను మనరే
ముందర నేనే లోన మొక్కు చుండేఁ గాని ॥ తనిసిన ॥
చల్లుఁజూపు లెక్కు డాయ జడివానరతు లాయ
జల్లింపు వినయములు చాల దటరే
యిల్లిదె శ్రీవెంకటేశుఁ డింత నేసి నన్నుఁ గూడె
యెల్లకాలమునుఁ దన్ను నెడ వాయఁ గాని. ॥తనిసిన

ముఖారి

అప్పటిఁ దా మంచివాఁడ ననుకొనును
చెప్పరే బుద్ధులు మీరు చెలులాల పతికి ॥ ॥

మోము చూచితే నాకు మొగమోట దరచూ
దోమటి నాతని నే దూరఁ బొయ్యేనా
గామిడిమాట లాడితే గబ్బి నందురు
యేమి సేతు నమ్మలాల యెం దున్నాఁడో అతఁడు ॥అప్పటి॥

గక్కనఁ గదిసితే కరఁగు నా చిత్తము
మక్కువ నాతని నేను మట్టు పెట్టేనా
చక్క నూర [1] కుండితే రాజస మందురు
దక్కితి నే నమ్మలాల తా నేద నున్నాఁడే ॥ అప్పటి ॥

సొలసి మా టాడితే చుట్టమ నే నౌదునూ
కలసే శ్రీవెంకటేశుఁ గా దనేనా
చలపట్టి మెచ్చఁ బోతే సట లందురు
వలచితి నమ్మలాల వాఁడె నవ్వీ నదివో. ॥ అప్పటి ॥ 494

దేసాళం

ఏల నాపై నాన వెట్టే వేఁటికి నీకు వెరపు
నీలాగురమణుఁడ నే నెఱఁగనా ॥ పల్లవి ॥

తేరకొన నీగుణాలు దెలిసినప్పుడు గాక
వీరి వారి మాటలకె వేగిరించేనా
మేరతో నీవు నాయెడ మెచ్చుగా నడవఁ గానె
కూరిమి గొసరి నిన్నుఁ గోపగించేనా ॥ ఏల ॥

యెల్లవారు నీచేఁతలు యెఱుఁగుదు మన్నదాఁకా
అల్లంత నిన్నుఁ గంటానె అలిగేనా
కల్ల నిజ మెఱఁగక కాదు గూడ దని నీపై
వెల్లవిరిగా నిందలు వేయఁ బొయ్యేనా ॥ ఏల ॥

మంతనాన నీమేన మచ్చము గానకతొల్లె
పంత మాడి నే నీతో పగ చాటేనా
యింతలోఁ గాఁగిలించితి విందుకె శ్రీవెంకటేశ
యెం తయిన నిన్ను నే నెరసి వుండేనా. ॥ ఏల ॥ 495

1. "కుండతే" అని వ్రాసి "కుండితే" అని శిద్ధి యున్నారు.

## ముఖారి

అన్నియు నీవల్ల నింతే సాయ నయ్యా
విన్న నేఁటనె యీమేలు నందె నయ్యా ॥ పల్లవి ॥

సాదించి నేఁ డాపె నీసరిఁ గూచుండినది నీ
పాదము సోఁకినయట్టి బలు వయ్యా
ఆదిగొని యిన్నాళ్లాపె ఆపె గాదో నేఁ గాదో
యీదెస మేరలు మీరి యిట్లనె వుంటిమా ॥ అన్నియు ॥

యించు కంత పిన్నది నా కెదుట మాటాడె నిదే
మించి నీ నవ్వినమందెమేళ మయ్యా
నించి వొక్కపూరనె నే లేనో ఆపె లేదో
చంచు మీరి యింతేసి రచ్చలకు నెక్కుదుమా ॥ అన్నియు ॥

తేరకొన నాపె నన్ను దిష్టించి చూచినది
కోరి నీచేయి వేసినగుణ మయ్యా
యీరీతి శ్రీవెంకటేశ యిటు నన్నుఁ గూడితివి
నేరుపు నీవల్లఁ గాక నే నొక్కటి అవుదుమా. ॥ అన్నియు ॥

## పాడి

కన్నుల నీ రాఁప లేక కాఁకలు నిలుప లేక
పన్ని పెద్దయెలుఁగెత్తి పాడితి నోయమ్మా ॥ పల్లవి ॥

దగ్గరి వచ్చినవాని తరవి నే నే మన్నా
అగ్గలము నావొళ్లదె యీ నేరమి
వెగ్గళించ రాదు మరి వెనక తియ్యఁగ రాదు
బగ్గనఁ బాదాలమీఁదఁ బడితి నోయమ్మా ॥ కన్నుల ॥

చేయి మీఁద వేసేవాని చేఁత నే నేమి నేసినా
నాయము గా దని మీరు నన్నే అందురు
పోయినట్టె పోనీలేను పొంచి కొత్త సేయ లేను
సేయ రాని వినయాలు చేసితి నోయమ్మా ॥ కన్ను.

వుమ్మడిఁ గాఁగిలించఁగ వోప నంటే అంతలోనే
కిమ్ముల నాతఁడు నాకుఁ గిందు పడును
నెమ్మది శ్రీవెంకటేశు నేనె మునుపఁ గూడి
సమ్మతించి ఆనందమే చల్లితి నోయమ్మా. ॥ కన్నుల ॥ 497

పాడి

నేనే పిలువ ననే నేర మేమి గలిగినా
దీన నైనతప్పు మీఁద దిద్దుకొనేఁ గాని ॥ పల్లవి ॥

వలపు బలిమి నేసి వంతుకుఁ బెనఁగఁ బోతే
చలువలే వేఁ దౌను సతులాల
వెలి నున్న రమణుని వేడుక నేఁ బిలిచితే
చులుకఁదనము రాదా చూడఁ గానె యిపుడూ ॥ నేనే ॥

మనసు రావిచోట మాటలఁ గొసరఁ బోతే
చన వెల్లాఁ జవి దప్పు జాణలాల
ననుపు లేనిపతితో నవ్వులు నవ్వఁగఁ బోతే
పని మాలినది గాదా పై పైనె యిపుడూ ॥ నేనే ॥

దరదరిఁ గాక నే దగ్గరి కూడఁగఁ బోతే
సరసమే విరస మౌ సకియలాల
యిర వై శ్రీవెంకటేశుఁ డిట్టె విచ్చేసి కూడె
దొరతన మిది గాదా తుద కెక్కె నిపుడూ. ॥ నేనే ॥ 498

[1] 384-వ రేకు ఆహిరి

ఒద్దన్నా మానవు నీవోజ లిట్టివి
పెద్దరికము సేయుచుఁ బ్రియము లాడేవు ॥ పల్లవి ॥

నివ్వటిల్ల నీ నవ్వు నేఁడె నాతో వలెనా
వువ్విళ్లూర రేపు గొంత వుండనీరాదా
జవ్వనపువాఁడవు నీసరివారమా నేము
దవ్వుల నుండి మొక్కితే దగ్గరఁ బిలిచేవూ ॥ ఒద్దన్నా ॥

1. "౩౨౪" అని రాఁగులు చెక్కి చెరిపి "౩౮౪" అని తిద్ది యున్నారు.

కొయ్య నీ మాటలు నాకొఱకె నేరిచితివా
అయ్యో యీవేళకుఁ దగి నంతే చాలదా
గయ్యాళించి నిన్ను నే మోఁ గా దనేటివారమా
పయ్యద నే మూసుకొంటే పై నేల పొరగేవు ॥ ఒద్దన్నా ॥

కన్నులసన్నలు నాకే గాదెఁ బోసు కుండితివా
పన్ని పైఁడియమ్ము లిన్నిఁ బార వేసేవా
యిన్నిటా శ్రీవెంకటేశ యిట్టె నన్నుఁ గూడితివి
మన్ననలు పొగడితే మర్మము లంటేవు. ॥ ఒద్దన్నా ॥ 499

సామంతం

మన మింత దద వాయ మంకు వాప లే మైతిమి
ఘనుఁడు గాన యాతఁడు కాంతకాఁక వాపెను ॥ పల్లవి ॥

చెలియమోము చూచి చెక్కులు చేత నొక్కి
కలువరేకులకొప్పు కదు దువ్వి
నెలవుల నవ్వించి చేరి మోవితేనె లాని
అలుక దేరిచెఁ బతి అదివో యిప్పుడు ॥ మన ॥

మాటలనె బుజ్జగించి మనసునొప్పులు మాన్పి
కాటుకకన్నులయింతి కందువ లంటి
తేటలఁ గతలు చెప్పి దిష్టపుమన్నన లిచ్చి
యీటునఁ గోపము దీర్చె నిదివో విభుఁడు ॥ మన ॥

వనితఁ గాఁగిట నించి వాడినదప్పి దేరిచి
ననుపులు నటియించి నయ మిచ్చి
తనువు నిమిరి యీపె తత్తరాలు మందలించె
యెనసి శ్రీవెంకటేశుఁ డిదివో యిపుడు. ॥ మన ॥ 500

శంకరాభరణం

కానీవే తనవేసాలు కనుఁగొంటిఁ గా
వీనులకు యీసుద్దులు వెర గాయఁ గా ॥ పల్లవి

చెప్పరే చెప్పరే వీనివేఁతలు నాకు
అప్పుడే యాపెతో మాట లాడి వచ్చెనా
ముప్పిరి నాకిఁక నేఁటి మొకమోటమే
తప్పని బొంకనివాఁడు తా నెందు వోయీనే ॥ కానీవే ॥

యెంత కెంత వీనిసుద్ది లేల దాఁచేరే
దొంతిగా నాపెను వెంటఁ దోడి తెచ్చెనా
యింతపుమోనము లిఁకఁ బనికి రావె
సంతసమే చేసేఁ గాక జగడించేనా ॥ కానీవే ॥

యే మంటి రే మంటిరే యెఱఁగ నేను
చే ముట్టి యాపెను నాచేతి కిచ్చెనా
కామించి శ్రీవెంకటాద్రికడపరాయఁడు నన్ను
గోమునఁ గూడె నిదియుఁ గొంత వలెనా. ॥ కానీవే ॥ 501

కొండమలహరి

వేగ మీరినపనులే సేసే వెల్ల
బాగు మీరఁ దన కదె పై వచ్చే దెరఁగఁడూ ॥ పల్లవి ॥

సిగ్గు వడి తనుఁ జూచి సిరసు వంచుకొంటేను
దగ్గరి ర మ్మంటి నంటా దండ చేరీని
వెగ్గళించ నైతిఁ గాక విదలించి వేసి నేను
బగ్గనఁ దిట్టితే తనభావము చూచీనా ॥ వేగ మీరి ॥

యెదుట నిలువక నే నింటిలోని కేఁగితేను
అదె సన్న సేసుక న న్నంట వచ్చీని
పదర లే నైతిఁ గాక పక్కనఁ బువ్వులబంతి
నెదరొమ్ము వేసితేను యే మనీనె యపుడూ ॥ వేగ మీరి ॥

నెల పై పానుపుమీఁద నే ముసుఁగు వెట్టుకొంటే
కలయు మనే నంటాఁ గాఁగిలించీని
యెలమి శ్రీవెంకటేశుఁ డింత నేరుపునఁ గూడె
బలి మెతే నాతోఁడఁ బంత మాడఁ గలఁడా. ॥ వేగ మీరి ॥ 502

## ముఖారి

పో పో యి దేశ సుద్ది పొద్దు పొద్దు చెలులకు
యేపున నిన్ను ర మ్మన నేడవాన నేను ॥ పల్లవి ॥

కాతరాన నలుకలు గడించేవు గాక నీవు
నీతో నలుక రేచ నే మెవ్వరము
జాతులకు నీ వాడెటిచాయవాకా లింతే కాక
ఆతల నిన్నుఁ గొసర నంత పొందులా ॥ పో పో ॥

చిన్నఁ బో యుందాన నంటా చెప్ప నొక్కె వింతే కాక
వున్నతి నీముందరను వొచ్చెము గావా
యిన్నేసి నీ వినయాలు యెగసక్కె లింతే కాక
నన్ను నీవు వేఁడుకోను నంటుదాననా ॥ పో పో ॥

అక్కడ పూర కుంటువా ఆనలు వెట్టేవు గాక
యిక్కడ వా దకువ మా కెవ్వ రున్నారు
గక్కన శ్రీవెంకటేశ కలసితి విటు నన్ను
యెక్కువ తక్కువ లేఁక నేల మాకు. ॥ పో పో ॥ 503

## రామక్రియ

ఒద్దన్నా మానవు నన్ను నొడఁబరచేవు నీ
వద్ద మెమ్మెలు మెఱయ వాపు వీడు చాలరా ॥ పల్లవి ॥

కొండవంటి దొర వని కుంచ నీకు వేయఁ గా న
న్నండఁ గూచుండు మనుచు నాన వెట్టేవు
దండితోడ నూడిగపుదాన నయ్యే నంటే నేల
చండి పోరి నీదేవులసానిఁ జేసే వయ్యా ॥ ఒ ॥

అందచందమునను నీ కాకు మడి చియ్యఁ గాను
అందల మెక్కు మనుచు నాన వెట్టేవు
గొందినె నీపాదాలు గొలిచి వచ్చే నంటే
యిందరిలో దొర గా న న్నెంత నేసే వయ్యా ॥ ఒ ॥

కట్టడతో నీమేనఁ గస్తూరి నేఁ బూయఁ గాను
అట్టె కాఁగిలించు మంటా నాన వెట్టేవూ
గుట్టులో శ్రీవెంకటేశ కూడితి వింతలో నన్ను
మట్టులో నుండఁ గా నెంత మన్నించే వయ్యా. ॥ ఒద్దన్నా ॥

385-వ రేకు హిజ్జిజి

పో పో యి ఁదె సుద్ది పొద్దు వోదా తనకు
చూపకు నేయి దాగేటిదూరు గాకా ॥ పల్లవి ॥

యింటిని వద్దఁ బెట్టుక యేల పిలిచీనె నన్ను
బంతిఁ గట్టి రతు లేమి పసులదొడ్డే
దొంతులవేడుకలను తొల్లె తా మోల లాడిరి
యింతలోనఁ జల్లాపెన యీ చ వింతే గాక ॥ పో పో ॥

కమ్మి యాపెపై నొరగి కమ్మటి న న్నేల పట్టీ
కుమ్మి చిందులాడ నేమి గొల్లదోమచే
అమ్మరో తా మిద్దయిను అన్నిటాఁ గరఁగి మీఁద
చిమ్ములాన నవ్వీతనె నెల వొఁ గాకా ॥ పో పో ॥

కన్నుల నొక్కు తెఁ జూచి కాఁగిట నన్ను బిగించి
పన్నినపలపు లేమి బండికండ్లా
యిన్నిటా శ్రీవెంకటేశుఁ డిద్దరిఁ దాఁ గూడినాఁడు
మన్నించ నాపెతో సరి మరిగితిఁ గాకా. ॥ పో పో ॥ 505

హిందోళవసంతం

వట్టిమాట లిఁక నేల వాసి గలకాంతలకు
గుట్టుతోడ నుండేదె గుణ మింతే కాక ॥ పల్లవి ॥

పూసుక వానుక వచ్చి పొందులు నీతోఁ జెప్పి
వేసరించేకాఁగిటిలో వేడు కున్నదా
మూసినముత్యమువలె మూల నుండఁగా నీవే
చేసినపాటి ప్రియము చేకొనేది గాక ॥ వట్టి ॥

చేరి నవ్వి విన్నపాలు వెలలచేఁ జేయించి
సారెఁ జల్లేకూరిమిలో చవు లున్నవా
పూరక మానాపతి నై వోజ దప్ప కుండఁగా నీ
వేరీతి చేసిన నది యియ్యకొంట గాక ॥ వట్టి ॥

యిచ్చకాలు సేసుకొంటా యెరవువలపు చల్లి
తచ్చి యెంత పిలిచినా తమి పుట్టీనా
అచ్చపు శ్రీవెంకటేశ అలమేలుమంగ నేను
యిచ్చట నీవే కూడితి విది మేలు గాకా. ॥ వట్టి ॥ 506

నాదరామక్రియ

ఏల వేగిరింపించేరే యేమిరే వో చెలులాల
చాలుకొన్న నాయకుని చరితలు చూడకా ॥ పల్లవి ॥

నగినయంతటిలోనె నాకు దగ్గర వచ్చునా
తెగ నాడి మన సెల్లఁ దెలియకా
మొగము చూచె నంటాను ముచ్చ టాడ వచ్చునా
మగవాఁ డని లోనిమర్మములు గానకా ॥ ఏల ॥

వద్ద నున్నాఁ డంటాను వావి చెప్ప వచ్చునా
కొద్ది నాతఁ డుండేటిగు ట్టెరంగకా
పెద్ద చేసె నంటానె పెనగొన వచ్చునా
వుద్దండీఁ డీతని మేనివోరపు లరయకా ॥ ఏల ॥

యింటికి వచ్చె నంటాను యియ్యకొన వచ్చునా
అంటిము ట్టాతనిసుద్దు లడుగకా
దంట శ్రీవెంకటేశుఁడు తా నలమేలుమంగను
జం టాయ మీర వచ్చునా చవులు సోదించకా. ॥ ఏల ॥

మధ్యమావతి

దావి కేమి మీఁదటను దైవమే మేలు సేసీని
తానే యింత చేసు నట తగులు వోయీనా ॥

యింత మోహించిననేనె యింటికి రాఁ జెల్లుఁ గాక
పంతగాఁడు తన కేలే పైకొనను
కాంతుఁడు మ మ్మింత సేసి కట్టుకోనీ యామేలు
యింతలోనే సతులకు హీన మయ్యీనా ॥ దాని ॥

మనసు రెంటైన నేనె మా టాడించ వలెఁ గాక
తనిసినతన కేలే తర్కరించను
ఘనరాజసముతోఁ [illegible] [1]గడకూ బదుక నీవే
వనితల కిందువంక వాసి దప్పీనా ॥ దాని ॥

నాఁకలఁ బొందిన నేఁ గాఁగిలింతుఁ గాక మా
[illegible]ఁకకు రాఁ దన కేడే వేడుకకాఁడు
అఁకల శ్రీవెంకటేశుఁ డలమేలుమంగ నేను
యేఁకటఁ గూడితి మిఁక నెఱ వయ్యీనా. ॥ దాని ॥ 508

పాడి

[illegible]కు దాస [2]యిచ్చెద యిటు నీయింటికి రాను
చెంది నీసతులు యింత చేసిరి నీగుణము ॥ పల్లవి ॥

నవ్వుతా దగ్గరి వచ్చినాను సరకు గొనవు
మెవ్వరితో మాట లాడే విపుడు నీవు
మువ్వంక నీరాజసము మున్నిటివంటిదా నేఁడు
రివ్వలుగా సతు లెల్ల రేఁచిరి నీగుణము ॥ ఇందుకు ॥

బడి బడి మొక్కినాను పరాకై వున్నాఁడవు
కడు దొర వైతి నీకుఁ గాన వచ్చీనా
కడఁగి మావంటివారిఁ గైకొనేవా గొల్లెతల
బెదసుగొల్ల మంకుతోఁ బెంచిరి నీగుణము ॥ ఇందుకు ॥

యిట్టె చేయి వట్టినాను యించు కంతాఁ దెమలవు
నెట్టుకొన నీబిగువు నేఁడు గొత్తలా
నెట్టన శ్రీవెంకటేశ నే నలమేలుమంగను
జట్టిగొని కూడితివి సాజమే నీగుణము. ॥ ఇందుకు ॥ 509

---

1. "గడుంబదుక" అని వ్రాసి "ం" చెరిపి "గడకూ బదుక" అని తిద్ది యున్నారు.
2. "యిచ్చెదు" అని వ్రాసి "యిచ్చెద" అని తిద్ది యున్నారు.

బలహంస

మిక్కిలి జాణవు నీవు 'మే మేమి బాఁతి
పక్కన నీ వన్నిటాను బదికితేఁ జాలదా ॥ పల్లవి ॥

కూరిములు చల్లితానె కొపరేగుణము మాది
నేరుపు మా కున్నదా నేరమే కాకా
మేరతోడి మ మ్మేల మేకులు సేసేవు రతి
పేరుఁడవు నీవు మాతెరువు రా వలెనా ॥ మిక్కిలి ॥

నించేనరసములోనె నిండువిరసము మాది
మంచితన మున్నదా మాటలే కాకా
యెంచ నేల మమ్ము నీవు యిల జాణలలో నెల్ల
అంచె నూడి పద్దవాఁడ వంత మాతో వలెనా ॥ మిక్కిలి ॥

చనవునఁ గూడుతానె జంకించేగుణము మాది
తనివి మా కున్నదా తమియే కాకా
అనుఁగు శ్రీవెంకటేశ అలమేలుమంగ నేను
పెనఁగి కూడితి వింక బెట్టి నవ్వ వలెనా. ॥ మిక్కిలి ॥ 510

386-వ రేకు దేవగాంధారి

మట్టు మీరినచేఁతల మగవాఁడవు
వట్టి సత్తేలు నెరప వలెనా నీకు ॥ పల్లవి ॥

అంగన నీవును మాట లాడుతా నుండఁగఁ జూచి
అంగవించి పొందు గద్దో యని వుంటిమి
వింగి మోవ నాన లెల్ల నీ వేల పెట్టుకొనేవు
చెంగట దోసమా నీకుఁ జెల్లదా యేమి ॥ మట్టు ॥

పొలఁతి నీ వాకవీధిఁ బొలసి వడవఁ గాను
అలరిన నీపమ్మంధ మవి వుంటిమి
తెలుపు మమచు నేల తీసేవు నాకొంగు వట్టి
తలఁచ నాపెకు నీకుఁ దగదా యేమి ॥ ॥

యింతియును నీవును నేకతాన నుండఁ జూచి
అంతలో నీవు గూడితి వని యుంటిమి
యంతుకు శ్రీవెంకటేశ వది యలమేలుమంగ
నింతటఁ గూడితివి నీ వెఱఁగవా యేమి. ॥ మట్టు ॥ 511

శంకరాభరణం

మేలే నీభాగ్య మలమేలుమంగా అదె
ఆలరి నీపతి మెచ్చె నలమేలుమంగా ॥ పల్లవి ॥

యెంచ రాక పతితోఁద నిచ్చకము లాడి నేర్పు
మించితివి గదే యలమేలుమంగా
వంచనఁ బ్రియాలు సేసి వడి నాతనిచిత్తము
అంచెల దక్కఁ గొంటివే అలమేలుమంగా ॥ మేలే ॥

తతితోఁద మంచిజాణతనపుమాటలు నెల్ల
మెఱసితి గదే యలమేలుమంగా
తెలుఁగుల నీపతికి తెల్లవినవ్వులు చల్లి
అఱచేతిమణి వైతి వలమేలుమంగా ॥ మేలే ॥

వొక్క పై శ్రీవెంకటేశుపుర మెక్కి యేపొద్దు
మిక్కుట మైతివే యలమేలుమంగా
యెక్కువఁ బదారువేలుయింతుల మతనికి మ
మ్మక్కర దీర మన్నించి తలమేలుమంగా. ॥ మేలే ॥ 512

ఆహిరి

ఇందాఁక రా కుండితే నిది పావగా వలెనా
చందాలు చెప్పి వచ్చేవు సాదించ వచ్చేమా ॥ పల్లవి ॥

ముందరికి రా రాదా మో మైనఁ జూచేను
చెంది యింతలో నేల సిగ్గు వడేవు
అందు కేమి మాచుట్టమ వవుత గల్లా యెం తయిన
కందువఁ బెనఁగ నిదె కడ మయ్యీనా ॥ ఇందాఁక ॥

పీఁటపైఁ గూచుండ రాదా పిసికేము పాదాలు
యేఁటి కని వొద్దనేరా యెవ్వ రైనాను
యీటు లేనిమగవాఁడ వేమి సేసినా నేమి
కోటిసతులఁ బొందిన కోపగించేనా ॥ ఇంతాఁక ॥

పచ్చడము గప్ప రాదా పక్కనఁ గరఁగించేము
చెచ్చెర నేల వవ్వేవు నెలవులను.
అచ్చపు శ్రీవెంకటేశ అలమేలుమంగ నేను
నిచ్చఁ గూడి యున్నారము నీవే నేఁ గానా. ॥ ఇంతాఁక ॥ 513

కాంబోది

బలిమి సేయఁగ నీతోఁ బంతమా నాకు
పలుకఁగా నిన్ను నాడఁ బంతమా నాకు ॥ పల్లవి ॥

యిట్టె నీసతులు యే మందురో అని కాక
పట్టకు మని కోపించఁ బంతమా నాకు
చుట్టుకొన్న నీతగవు చూడవల సింతే కాక
బట్టబయ లీదించఁ బంతమా నాకు ॥ బలిమి ॥

మోసాన నెవ్వతె నైనా మొక మోదే వని కాక
పాసి వేరే మంచ మెక్కఁ బంతమా నాకు
వాసుల నీ మతిలోని వల పెరఁగక కాక
బాసలు నిన్నుఁ జేయించఁ బంతమా నాకు ॥ బలిమి ॥

అదరి మరి నొకతె నాసపడీ నని కాక
బదలించి రతి సేయఁ బంతమా నాకు
వదిఁ శ్రీవెంకటేశుఁడ వా నలమేలుమంగను
బది వాయ నియ్యకుండఁ బంతమా నాకూ. ॥ బలిమి ॥ 5

ధన్నాసి

ఎఱఁగ మిన్నాళ్లు నీ విటువంటివాఁడ వవుట
ఉఱక లేనిగుణము లొక్కటే వే యాయమ ॥ పల్లవి

మంచివానివలెనె మాటలు వెలుచుకొని
పొంచి నవ్వుతాఁ జెప్పేవు పొలఁతికిని
యెంచఁగా నాపె నీకు హితవరురాలు గాని
పంచల వేయఁగ నీకుఁ బగవారమా ॥ ఎఱఁగ ॥

నామంచముమీఁద నుండి నయముల నట చేసి
కామించి యాపెమీఁదఁ గాలు వేసేవు
ప్రేమ నాపె నీకు నేసపెండ్లికూఁతు రాయఁ గాని
నేము వెట్టికి వచ్చినవెలఁతల మైతిమా ॥ ఎఱఁగ ॥

వురముపై నే నిట్టె వుండఁగా శ్రీవెంకటేశ
కరఁగించి యాసతికిఁ గత చెప్పేవు
యెరవుగా నాపెఁ గూడి యింపుగా నన్నుఁ గూడితి
నిర తలమేల్మంగను నేనే మేలుదానవా. ॥ ఎఱఁగ ॥ 515

కురంజి

ఎప్పటివాఁడవె కావా యెరుఁగుదుము
తప్పులు పట్టఁగ నిన్నుఁ దగ దయ్య మాకును ॥ పల్లవి ॥

చనవు నేసుక నే నీసరి విఱచుండుఁ గాక
మన సిచ్చి నీవు నాతో మాట లాడేవా
వనిత లి దెరఁగరు వడి నేఁ గైకో నందురు
అనుమాన మెల్లఁ బాసె నంపవయ్య మమ్మును ॥ ఎప్పటి ॥

పూర కైనా నేనే వట్టి వూడిగాలు సేతుఁ గాక
మేరతో నీవు గొం తైన మెచ్చఁ బొయ్యేవా
నేర మెల్లఁ దీర నేఁడు నిన్ను ముదులకించితి
పోర నోప నీతోను పోవయ్య చాలును ॥ ఎప్పటి ॥

నంటున నీతో నేనే నవ్వులు నవ్వేదుఁ గాక
జంట యై నీ వట్టె సరసము లాడేవా
అంటివి శ్రీవెంకటేశ అలమేలుమంగ నేను
యింటికి వచ్చి కూడితి వేల వయ్య నన్నుమా. ॥ ఎప్పటి ॥ 516

387-వ రేకు నాగవరాళి

ఇన్నియుఁ గన్నట్టిమీఁద నిఁక నేలా
యెన్నికలు నీకు నాకు నిఁక నేలా ॥ పల్లవి ॥

పొదిగి నీ వనఁ గాను పూఁచి నిన్ను నే నాడఁగా
యెదురుబడి మాటలు యిఁక నేలా
కదిసి యావలఁ జూచి కన్నవారె నవ్వఁ గాను
యిదివో మనలో వాదు లిఁక నేలా ॥ ఇన్నియు ॥

సారె సారె నీవు నేను సరసము లాడఁ గాను
యీరు దియ్యఁ బేను వచ్చు నిఁక నేలా
మోరతోపుఁదనములు మొగములో నుండఁ గాను
యీరీతి సాకి రడుగ నిఁక నేలా ॥ ఇన్నియు ॥

పంతముల నిందాఁకఁ బరాకులె పచరించి
యింతలోనె యిచ్చకము లిఁక నేలా
అంతటి శ్రీవెంకటేశ అలమేలుమంగ నేను
యింతటఁ గూడితి రేసు లిఁక నేలా. ॥ ఇన్నియు ॥ 517

ఛాయానాట

వట్టి సటలకు తల వంచ నేలే
మట్టు మీరేపని యైతే మానుప కుండేనా ॥ పల్లవి ॥

కాతరాన నీవిభుఁడు కదిసి యేపొద్దు నీ
చేతికి లో నై యుండఁగ చింత లేలే
ఆతల నొక్క_తెయింట నాతఁ డుండఁగాఁ జూచితే
యేతుల నీ వే మన్న నియ్యకొందుఁ గాకా ॥ వట్టి ॥

చంచలము దీర నిన్ను సమ్మతించఁ జెప్పి నీతో
ముంచి నవ్వులు నవ్వఁగ మునుఁ గేలే
పంచల నాతఁడు వేరె పరా కై వుంచేఁ గనక
వంచన నీతుఁ గా ప్రతివాదుల [1]మై యుండేమా

1. "మై యుండేమో" అని వ్రాసి "మై యుండేమా" అని [illegible]

అక్కజపు యేకతాన నంగము లంటుచు నీ
చెక్కులు నొక్కఁగా నీకు సిగ్గు లేలే
అక్కర శ్రీవెంకటేశుఁ డలమేలుమంగవు నీ
విక్కువతోఁ గూడితివి యిట్టె సంతోసించవే. ॥ వట్టి ॥ 518

భైరవి

ఏమి సేతు నిందుకు ని న్నెటువలె వేఁడుకొందు
చే ముంచి నీమోము చూడ సి గ్గయ్యీ నాకు ॥ పల్లవి ॥

వేడుక నాపె యింటికి విచ్చేయఁ గాఁ జూచి
వోడక నే రేవ నైతి సుదుకునను
యీడ నీతోఁ జెప్పే విను యెంత దోసకారినో
యీడు జో డై సవతిపో రింత సేసె నయ్యా ॥ ఏమి సేతు ॥

యిచ్చగించి ఆపెతోనె యిట్టె నవ్వఁగాఁ జూచి
మచ్చరాన నీతోడ మా టాడ నైతి
కచ్చుపెట్టి నే నెంత కట్టడి మతిధాననో
మెచ్చి నాజవ్వనమద మింత సేసె నన్నును ॥ ఏమి సేతు ॥

గక్కన నాపెకు నీవు కనుసన్న సేయఁ జూచి
యెక్కువ నీ వున్నమంచ మెక్క నైతిని
అక్కర శ్రీవెంకటేశ అలమేలుమంగ నేను
యిక్కువ నీతోడికూట మింత సేసె నన్నునూ. ॥ఏమిసేతు॥ 519

రామక్రియ

ఎం తయిన మానవు ని న్నేమి సేతును
పంతపు నీసుద్దులకు భ్రమ సున్నదానను ॥ పల్లవి ॥

నగవు గాదు నీతోడ నాఁడె నేఁ జెప్పనా
తెగి మాలో నవ్వితే నేఁ దిట్టుదు నని
మొగము చూడఁగ నీకు ముందె నే మొక్కనా
తగులా నాడకు మమ్ముఁ దడవకు మనుచు ॥ ఎం తయిన ॥

వసు పై యిన్నా ళ్లాయ నాతలఁ పెరఁగవా
తవివోని కక్కూరితిదావఁ గాన నీ
చనవు సేసి యింతుల సాకిరులుఁ బెట్టనా
పెనఁగకు మమ్ముఁ బేరఁ బిలువకు మనుచు ॥ ఎంతయిన ॥

నీ వేల నమ్మవో కాక నీవే నేఁ గానా
వావి నీవు దెలియవా వదినె నని
ఆవల శ్రీవేంకటేశ అలమేలుమంగ నేను
తావులఁ గూడితి వింకఁ దమక మే లనుచూ. ॥ఎంతయిన॥ 520

శ్రీరాగం

నీవు సేసేపనులకు నేర మేది
తావుల నీతోఁ బెనఁగఁ దగ వేది ॥ పల్లవి ॥

వెలఁదులతోడనె వేగునంతాఁ బట్టె నీకు
వెలయ మాయింటికి [1]రా వేళ యేది
కులికి మాకాతరానఁ గొసరేము గాక నిన్ను
పలుమారుఁ బలికించ బలు వేది ॥ నీవు ॥

యెక్కడనోఁ దిరుగాడ నిందాఁకాఁ బట్టె నీకు
దక్కి మాతో రతి సేయఁ దలఁ పేది
మక్కువ సేసితి గాన మాన లేము గాక నిన్ను
తక్కులఁ బెట్టఁగ మాకుఁ దగ వేది ॥ నీవు ॥

అదరించి నామీఁద నాన వెట్టఁ బట్టె నీకు
సోదించి వి న్నవుఁ గా దనఁ [2]జో టేది
ఆదెవ శ్రీవెంకటేశ అలమేలుమంగ నేను
ఆదరించి కూడితివి అడ్డ మాడ నేది. ॥ నీవు ॥ 521

నాదరామక్రియ

చెల్లు లేవే యాతఁడు నీచేతఁ జిక్కెనే
వల్లదమే తల్లి నీకుఁ బాలతోనే వోపెనే ॥ పల్ల ॥

---

1. "శా" వ్రాసి చెరిపి "రా" అని తిద్ది యున్నారు. 2. "శా టేది" అని "జో టేది" అని తిద్ది యున్నారు.

తెగువలు వచరించ తేనెలమాట లాద
పగటుల వదప నీపాలఁ బోయనే
మొగమిచ్చలు నెరప ముసిముసినవ్వు నవ్వ
తగవులఁ బెట్ట నీకు తతి వచ్చెనే ॥ చెల్లు రేవే ॥

సారెకు మొక్కులు మొక్క చలములు సాదించ
ఆరీతి నాన వెట్ట నీ కలవా ట్లాయనే
నేర మొకరిపై వేయ నీచేయి మీఁదు వేయ
నేరుపు నాలితనాలు నీ వియ్య వలెనే ॥ చెల్లు రేవే ॥

అరగపటము చూప నంతలోఁ దిరుగ వేయ
సరిఁ జిన్ననాఁడె యిన్ని సాధించితివే
గరిమ శ్రీవెంకటేశుఁ గలసి న న్నేలించితి
సరి వచ్చితే మెచ్చ జాణ వైతివే. ॥ చెల్లు రేవే ॥ 522

388-వ రేకు ముఖారి

ఏ లోయి మాతోడి యెగసక్యాలు
జాలిఁ బడి వున్నవారి నట సేసేవా ॥ పల్లవి ॥

నెలవుల నవ్వు నవ్వి చేతి పువ్వుబంతి వేసి
యెలమి మాకోపము నేఁ దేల రేఁచేవు
వులి వచ్చి విరహాన నుదుకుతా నుండేవారి
వలపుల యెండలనే వద చల్లేవా ॥ ఏ లోయి ॥

దగ్గరనే నిలుచుండి తతిగొని చన్ను లంటి
యెగ్గులతిట్ల మాచే నేల పడేవు
నొగ్గిన సిగ్గులతోడ నుట్టి లేక వూఁగేవారి
అగ్గలపుటాసలపుయ్యాల లూఁచేవా ॥ ఏ లోయి ॥

చేరి పచ్చడము గప్పి చెక్కు నొక్కి కాఁగిలించి
యీరీతి మన్నించి మమ్ము నేల మెచ్చేవు
కూరిమి శ్రీవెంకటేశ కూడిన మావంటివారి
నేరా తరితీపుల నెలయించేవా. ॥ ఏ లోయి ॥ 523

రాయగౌళ

ఎప్పటివలెనే చన వియ్య రాదా
తప్పు లేనిసతి నింక దయఁ జూడ రాదా ॥ పల్లవి ॥

నాలితో నాపె నిన్ను నవ్వుతా నన్న మాఁటకు
యేల కోపగించుకొనే వింతలోనే
మీలోనె ఖటు లైతే మెత్తురా లోకమువారు
తాలిమితో నింతి నింక దయఁ జూడ రాదా ॥ ఎప్పటి ॥

చనవు చేసుక యాపె జంకించినయందుకు
యెన లేక చిన్నఁబొయ్యే వేఁటికి నీవు
కొనగొన మీకు మీకు కోపము లింత చెల్లునా
తనిసి నీదేవులను దయఁ జూడ రాదా ॥ ఎప్పటి ॥

చుట్టరికమున నాపె సూసు వట్టినందుకు
యెట్టు పెనఁగఁ బోయిన నితవు లవునా
యిట్టె శ్రీవెంకటేశ యింతలోఁ గూడితి వీపెఁ
దట్టు ముట్టు సేయ కిట్టె దయఁ జూడ రాదా. ॥ ఎప్పటి ॥ 524

నారణి

కల మీ సహజానకు కన్నుల మెచ్చుట గాక
తలపోసి మి మ్మదుగఁ దగవా యీవేళను ॥ పల్లవి ॥

పడఁతి నీమోము చూచి పకపక నవ్వు నవ్వి
చిదుముడి నీచేతిపై చేయి వేసెను
అదరి మీలోని మర్మా లవి యేమి గలవో
తడవఁగ మాకు నంత దగవా యీవేళను ॥

సారె సారె నన్న వేసి చాయలు దొరల నాడి
మోరతోపుఁదనమున మొక్కు మొక్కెను
కారణ మేఁటికో కాని కందువ మీకే తెలుసు
తారుకాణించఁగ మాకుఁ దగవా యీవేళను ॥

చెనకి పాదము దొక్కి చెవిలోన మాట చెప్పి
ఘనముగ విన్ను నాపె కాఁగిలించెను
అనుగు శ్రీవెంకటేశ ఆడుకోలుమాటలేవో
తనివి నిట్టె పొగడఁ దగవా యీవేళను. ॥ కల ॥ 525

## సామంతం

ఎంత నీవు పతివైనా యింతులకు లోనే సుమ్మీ
వంత జవ్వనమదపువారు సుమ్మీ వీరు ॥ పల్లవి ॥
సొలసి యాడెటిమాట సుమాశముమీఁది పాట
పెలుచుఁగామినులకుఁ బెట్టవికోటా
బలిమి చూపఁగ రాదు పంతపు మగవారికి
వలవాచనలిగెలవారు సుమ్మీ వీరు ॥ ఎంత ॥
కనుచూపుల కొనరు గబ్బితనపుటుసురు
దినవలపులకు నెత్తినయసరు
ఘనలు మీరఁగ రాదు మంచి యెంతకొరతైన
వనవసంతునిపొజువారు సుమ్మీ వీరు ॥ ఎంత ॥
పుదుటుమీఁది సణఁగు వొద్దికతోడి గొణఁగు
మదరాగ మీసతికి మంచి మణుఁగు
ఆదన శ్రీవెంకటేశ అట్టె కూడితి వీపెను
వదనశశినిఁ బోలేవారు సుమ్మీ వీరు. ॥ ఎంత ॥ 526

## శవుశ

ఏమి సేసినా నీ చిత్త మింతే కాక
కాముకుఁడైన విన్నుఁగా దనేటివారమా ॥ పల్లవి ॥
నేరిచినవారుగా నీతో మాటాడేది వే
మారుమ నెదు రాడఁగ మా కేఁటికి
కారణము గలిగి కా కమ్మర నీతో నవ్వేది
యారీతి నీతోఁ గెలయ నెంత పని మాకును ॥ ఏమి ॥

అంత కోపినప్పుడుగా నట్టై నిన్ను దగ్గరేది
మంతనాలు విన్నవించ మా కేఁటికి
పంతము నే నాడితేఁగా బలువు నీతోఁ జూపేది
యెంత కెంత నీసుద్దులు యేమి పని మాకునూ ॥ ఏమి ॥

నేనే నీ వయితేఁగా నిజ మని నమ్మేది
మానక వావులు చెప్ప మా కేఁటికి
పూనుక శ్రీవెంకటేశ బుజ్జగించి కూడితివి
యే నెపాలకు నింక నేమి పని మాకును. ॥ ఏమి ॥ 527

తెలుఁగుఁగాంబోది

తను నేమి సేసితినే తా నేం తమకించెనే
యెనయఁగా నూరకున్న దిదే నా [1]నేరమే ॥ పల్లవి ॥

తగుల నాడినదానఁ దల వంచు కుండ నైతి
నగితి నింతే పో నా నేరమీ
మొగము చూచినదాన మోనము గైకొన నైతి
అగపడి లో నైన దదే నా నేరమీ ॥ తను ॥

ఇంటికి వచ్చినదాన నే మైనాఁ గొసర నైతి
నంటున నే నుంటి నది నా నేరమీ
అంటినదాన నే నట్టె చెనక నైతి
వొంటి మొగమోటల నే నున్నదే నా నేరమీ ॥ తను ॥

నెమ్మదిఁ గూడినదాన నిజబా సకుగ నైతి
నమ్మితి నే నిదియె కా నా నేరమీ
వుమ్మడి శ్రీవెంకటేశుఁ డొగి నిట్టె నన్నుఁ గూడె
సొమ్మల మై మఱచి నేఁ జొక్కినదే నేరమీ. ॥ తను ॥ 528

389-వ రేకు సాళంగం

కొసరి ని న్నింతలోనె కోపగించేనా
ముసిముసి నవ్వు లెల్లా ముచ్చటలె కావా ॥ ॥

1. "నేరమా" అని వ్రాసి "నేరమీ" అని తిద్ది యున్నారు.

కలఁపులో నీరూపు తగిలి పాయ కుండఁగ
యెలమి విరహతాప మెక్కుడిది
వెలయ నిందుకుఁ గాను వేఁడుకొనే వేల నన్ను
నలువంక నీమేలె నామేలు గాదా ॥ కొసరి ॥

చేకొని నీ కంకణము చేతఁ జిక్కి వుండఁ గాను
యీక దాకడి మాటకు నెగ్గు లేది
వాకున నిందుకుఁ గానె వైపులుగా నమ్మించేవు
నీకుఁ గలసంతోసమే నేఁడు నాకుఁ గాదా ॥ కొసరి ॥

కందువ నీవే నాయింటఁ గాణాచై వుండఁగాను
చెంది నామనవి నీతోఁ జెప్ప నేది
అఁని శ్రీవెంకటేశ నన్నలమితి కదపలో
విందుగ నీవేడుకే నావేడుకలు గావా. ॥ కొసరి ॥ 529

సాళంగనాట

ఎవ్వరితోడి గొడవ లిఁక నేలా
యివ్వల మ మ్మిందులోనే యేల పొగడేవు ॥ పల్లవి ॥

సన్నల సారెకు మెచ్చ సణఁగు నీపైఁ జల్ల
కన్నులెదుట నీ కాపె గలిగెఁ గా
మన్ననలు పచరించ మాటికి మాటికి నవ్వ
అన్నిటిమారును నీవు ఆపెకుఁ గలితి గా ॥ ఎవ్వరి ॥

యిచ్చకము నీకు నాడ యే మైనఁ బనులు నేయ
గచ్చుల నీకు నేఁ డాపె గలిగెఁ గా
చెచ్చెర వాసు లెక్కించ చెప్పినపనులు నేయ
నిచ్చ నిచ్చ నాపెకు నీవు గలితివి గా ॥ ఎవ్వరి ॥

[1] అంది నీకాఁగిటఁ గూడ నాయము గరఁగి చొక్క
కందువ లంట నీ కాపె గలిగెఁ గా
అందపు శ్రీవెంకటేశ ఆపెఁ గూడి నన్నుఁ గూడి
తిందులో మాయిద్దరికి నిటు గలితివి గా. ॥ ఎవ్వరి ॥ 530

1. "అందివ్వ" అని వ్రాసి "వ్వ" చెరిపి "నీ" వ్రాసి "అంది నీ" అని దిద్ది యున్నారు.

శంకరాభరణం

పెలుచఁగోపపువాన బిరుదుకు మొదలను
   ఘెలమి నీగుణాలే నన్నింత వలపించెను ॥ పల్లవి ॥
తత్తరించి నే నిన్ను తగుల నాడినందుకు
   చిత్తాన నొవ్వక నన్నుఁ జేర వచ్చేవు
మత్తిలి నేఁ గొసరితే మరి నీవు నవ్వేవు
   యిత్తల నీమంచితనా లింత వలపించెనూ ॥ పెలుచు ॥
గక్కన నీరాకకు నేఁ గైకో కుండినందుకు
   అక్కర దీర నన్నంటి ఆదరించేవూ
వొక్కటి గా కూరకున్న వొడఁబరచ వచ్చేవు
   యిక్కువ నీ నేరుపు నన్నింత వలపించెనూ ॥ పెలుచు ॥
వొంటిఁ గాఁగిలించఁగా ని న్నొట్టు వెట్టినయందుకు
   బంటువలె వెంట వెంటఁ బాయ కుందేవూ
అంట కుంటే శ్రీవెంకటాధిప నన్నుఁ గూడితి
   పెంటనే నీ చనవులు యింత వలపించెనూ. ॥ పెలుచు ॥ 551

హిందోళం

ఏమి సేసితి విందాఁకా నేద నుంటివి
   చే ముంచి యాపెను నీవే నేద దేర్చవయ్యా ॥ పల్లవి ॥
యింతి నీవు వచ్చే వంటా నిందాఁకా నెదురు చూచె
   అంతయు నీతోఁ గొంచి యాడఁ జాలదు
చింతతో నున్నది చెలి చెక్కు నొక్కి యాపెకు
   సంతోసము సేసి మోవి చవి చూపవయ్యా ॥
నీవే పిలిచే వంటా [illegible]లుచుండె నిందాఁక
   ఆవలి[illegible] నిన్ను ననఁ జాలదు
కోవరపుఁబమకాన గుట్టుతో [illegible] యాపెఁ
   జే వట్టి బుజ్జగించి [illegible]య్యా ॥

పవళించే వంటాను నీపైనే కన్ను లిందాఁకా
అవుఁ గా దనుచు విన్ను నవఁ జాలదు
వివరించి కూడితి శ్రీవెంకటేశ యీసతిని
కవ వాయ కిట్లానె కైకొ నుండవయ్యా. ॥ ఏమి ॥ 532

సాళంగం

అన్నిటాఁ దన్నుఁ జూచుకొ మ్మనరే మీరు
పున్నమచంద్రువెన్నెల భూమి కెల్లాఁ గాదా ॥ పల్లవి ॥

యెంత నన్ను బుజ్జగించి యెటువలెఁ బెట్టుకున్నా
అంతయునుఁ దనమే లనరే మీరు
పొంతనె పాదాలమీఁదఁ బూజించినపెద్దరికె
మంతట దేహాన నెక్కు నదియే కాదా ॥ అన్నిటా ॥

సారె సారె దా నెంత చనవు నా కిచ్చినాను
ఆరయఁ దనలాభమె అనరే మీరు
నేరుపుతో వేళ్లపై నీ కెల్లాఁ దోసితేను
మారమినా తని వెల్లాఁ గొనలకే కాదా ॥ అన్నిటా ॥

సరి నన్నుఁ గూడి నా మైచలు వెంత వేసినాను
అరిది తనకె పుణ్య మనరే మీరు
ఇర వై శ్రీవెంకటేశుఁ డింత సేసి నన్నుఁ గూడె
మరిగె పండ్లతీపు మాకు వల్లఁ గాదా. ॥ అన్నిటా ॥ 533

ముఖారి

ఇంతేసి మాయలు పతి యెరుఁగునో యెరఁగఁడో
చింత దీర నాతనితోఁ జెప్పరమ్మ చెలులు ॥ పల్లవి ॥

ఒక్కరి యాతనితో నే తమితో మాట లాడితే
అగ్గలపుసతులు గయ్యాళి యందురూ
సిగ్గువడి వూర కున్న చెంగలించి వెంగెముల
నిగ్గుల ని దేమియు నేర దందురూ ॥ ఇంతేసి ॥

సయమున నే( గొంత నవ్వులు నవ్వ(గ( బోతే
బయకారా లని వారే పచ్చి సేతురు
పయతోడ సుట్టు సేసి తల వంచుకొని వుంటే
నియతి నలిగె నంటా నెట్టన గడింతురు ॥ ఇంతేసి ॥
రతగా శ్రీవెంకటేశు( గలసి మెప్పించితేను
రతులలో ని దెంతటి రా(గ యందురూ
ఉతవై యీత(డు నన్ను నింతిగా మన్నించి కూడె
మతక మింతయును నామర్మమే యందురూ. ॥ ఇంతేసి ॥ 531

390-వ రేకు సుంతక్రియ

కంటి వటే నామీ(ద( గల బత్తి యీతనికి
గొంటు(దనమున( దానే కొంకీ నాచే(తకు ॥ పల్లవి ॥
నంటు గలవారి( గండే నవ్వ బుద్ధి పుట్టు( గాక
కంటకపువారికి( గలదా సొంపు
అంటి ముట్టి నే సరసు మాద(గా నా వొసగోరి
ముంటివా(డి సో(క కుండా మొక్క వచ్చీ నిత(డు ॥ కంటి ॥
యేకచిత్తమైనచోట విన్నియు నితవు గాక
పకాకు వడినచోట( జెప్ప( గలదా
కైకొని నే( దను నెంత కర(గించి మాటాడినా
ఆక డీకడి మాటలు ఆలకించీ నిత(డు ॥ కంటి ॥
యింత నే విన్నవించ(గా నియ్యకొని కూడె( గాక
చెంత నే నాదక వుంటే( జిత్తగించీనా
పంతపు శ్రీవెంకటాద్రిపతి యిప్పుడు నారతి
మంతనాన( జిక్కి చొక్కి మచ్చికాయ నిత(డు. ॥ కం

పాడి

ఈపాటి కీపాటి యి(క నెంతో
కోపగించ రాదు నీతో కూటములు చెల్లినా

పెలవుల నవ్వితేనె చెరఁగు వట్టేవు నీవు
యెలమి నాల నైతే యెంత సేతువో
బలువులతోడి పొందు పై వచ్చు నై వచ్చు
చలము సాదించ రాదు చాలు నోప నందుకు ॥ ఈపాటి ॥

మచ్చికె నిన్నుఁ జూచితే మంచానకుఁ దీసేవు
యిచ్చలు నీకుఁ జేసితే నెంత సేతువో
వచ్చెఁ బదివేలు మాకు వరుస లిందే కంటిమి
మచ్చరించ రాదు నీతో మాట లింతే సేఁటికి ॥ ఈపాటి ॥

వొంటి నే నిలుచుండేను వూరకే కాఁగిలించేవు
యింటికిఁ బిలుచుకొంటే నెంత సేతువో
గొంట నై శ్రీవెంకటేశ కూడితివి నన్ను విట్టె
దంట నై జంకించ రాదు తతి వచ్చె నీకును. ॥ఈపాటి॥ 536

దేసాళం

వట్టి మందాటము లేల వ ద్దన నేలా
యిట్టె నీపతి వీఁడె యే మైన ననవే ॥ పల్లవి ॥

వలపనిజోలి యాల వాదులాట మా కేల
తలఁచఁగానె యాతఁడు తానే వచ్చెను
పొలసి యుందాఁక నేము పూనుక వచ్చితి మింతే
చెలువుఁడు వాఁడె నీవు నేసినట్టు సేయవే ॥ వట్టి ॥

ఆన వెట్ట నా కేల అంతేసి పంతము లేల
వీనుల నాతఁడు దానే వినుచున్నాఁడు
కానీవే ఆతఁడు నీవు గన్నదాఁకా గురి యైతి
పోనీక యీతని కన్ని బుద్ధులూనుఁ జెప్పవే ॥ వట్టి ॥

చక్కటి సేయఁగ నేల చవులు చెప్పఁగ నేల
గక్కన నాతఁడు నిన్నుఁ గాఁగిలించెను
యిక్కువ శ్రీవెంకటేశుఁ డెనసి వున్నాఁడు నీతో
యిక్కడ నాతనితో నీ వె ట్టయినఁ బెనఁగవే. ॥ వట్టి ॥ 537

గుండక్రియ

మగవాఁడు గూఁ యైతే మరి చేతఁ బట్ట రాదు
తగ వెరఁగక నీవే తమకించే విదివో ॥ పల్లవి ॥

అంగనకు నీమనసు అరసి తెలియుదాఁకా
నంగవించి నవ్వ దాయ నందుకే కాదా
కుంగుచు నీ వది చూచి కోపగించి వున్న దంటా
నంగడిఁ బెట్టి వలపు లాడుకొనే విదివో ॥ మగవాఁడు ॥

పడఁతికి నీ వాకడిపరాకు మానినదాఁకా
నదరి నీతో మాటాడ దందుకే కాదా
కదఁగి నీతో నాపె వైకొనక వున్న దంటా
వుదివోక గోర నేసి వుప్పతించే విదివో ॥ మగవాఁడు ॥

జలజాక్షికిని నీవే చనవు లిచ్చినదాఁకా
నలమక వూరకుండె నందుకే కాదా
యెలమి శ్రీవెంకటేశ యిట్టె నీవే కూడితివి
చలము చెల్లించే నంటా జట్టిగొనే విదివో. ॥ మగవాఁడు ॥ 538

సాళంగం

చెల్లఁబో నీ వింత నాకుఁ జెప్ప వలెనా
బల్లిదుఁడ నాకు నీ బలు వుండఁగా ॥ పల్లవి ॥

సందడించి యవ్వరితో జగడాలు మా కేల
కందు వై నీవు నాకుఁ గలి గుండఁగా
మందలించి కన్నవారిమాట విన నా కేల
కిందట మీఁదట నీకృప యుండఁగా ॥ చెల్లఁ ॥

పొట్టఁబొరుగువారితో పురుఁడు నా కది యేల
యిట్టె నీవు నాకుఁ జన విచ్చి యుండఁగా
వట్టి విచారము లేల వగలఁ బొరల నేల
గుట్టుతో నీజాస నాకు గురి యుండఁగా ॥ చెల్లఁ ॥

కదవారితో నింకఁ గాఁతాళము నా కేల
అదరి నీకాఁగిలి న న్నంటి యుండఁగా
బడిసె శ్రీవెంకటేశ పాయక నన్నుఁ గూడితి
జడియ నేల వలపు సరు లయి వుండఁగా. ॥ చెల్లఁబో ॥ 539

సాళంగనాట

నిక్కము నేఁడు మా పొందు నీకు వచ్చెనా
చక్కని విభుఁడ యింత చవి [1]వుట్టీనా ॥ పల్లవి ॥

మనసు దెలిసి నాతో మాట లాడే విప్పు డిట్టె
తనిసి నేఁ డైన నీచిత్తము వచ్చెనా
చెనకి నామీఁదఁ దెచ్చి చేయి వేసే వప్పటిని
వెనకముందరి బుద్ధి విచారించుకొంటివా ॥ నిక్కము ॥

నయగారమున మాతో నవ్వఁ జూచే విప్పు డిట్టె
జయ మైన సిగ్గు దేరి చలి వాసెనా
ప్రియపడి నన్నుఁ గడు పేరుకొని పిలిచేవు
క్రియతో నీ కింతపని కెమ్మెలఁ గలిగెనా ॥ నిక్కము ॥

చొక్కుచు నా మోముదిక్కు చూచేవు సారె సారె
పుక్కపై నీలోని వలపులు రేఁగెనా
యిక్కు వంటి శ్రీవెంకటేశ నన్నుఁ గూడితివి
దిక్కుల నీగుణములు తీర్చుకొంటివా. ॥ నిక్కము ॥ 540

231-వ రేకు ముఖారి

చెప్పకు నీ పోరుపులు సిగ్గు లయ్యీని
కప్పక రాఁగానె కాక కడుఁ బెలుచవు ॥ పల్లవి ॥

ఆయము దప్పక నిన్ను ఆద కుండఁగానె కాక
వోయయ్య నీ వింతేసి కోరిచేవా
చాయ నేసుకొని నీతో సరి నవ్వే దెరఁగవు
నీయంతనే వచ్చి నిజము నెరపేవు ॥ చెప్పకు ॥

1. "వుట్టైనా" అని వ్రాసి "వుట్టీనా" అని తిద్ది యున్నారు.

సంగడి దప్పి నీపైఁ జేయి వాఁచ కుండఁగానె కాక
యింగితాన నెంద్దు నైన నియ్యకొనేవా
చెంగట నీగుణములు చెల్లఁబెట్టే దెరఁగవు
ముంగిటిచెలుల కెల్ల ముచ్చట చెప్పేవూ ॥ చెప్పకు ॥

కిమ్ముల బొమ్మలను జంకించ కుండఁగానె కాక
నెమ్మది నీ దీమసాలు నెరపేవా
యిమ్ముల శ్రీవెంకటేశ యిట్టె నన్నుఁ గూడితివి
సమ్మతించి యిప్పుడు గా చనవు లిచ్చేవూ. ॥ చెప్పకు ॥ 541

మంగళకౌసిక

ఈపాటి మేలు నేసితి వింత చాలదా
మాపట్టుకు నీవు గాఁగా మన్నించితి గాకా ॥ పల్లవి ॥

వంతుకు నామనసు రావలె నంటా నాపెచేత
పంతము లిప్పించే వేర పలుమారు
యెంతటివాఁడవు నీవు యే మేమి నేయ నేరవు
మంతనాన మముఁ గొంత మన్నించితి గాకా ॥ ఈపాటి ॥

అది గాని నే నే మైనా ననే నంటా నాపెచేత
పాదాలకు మొక్కించేవు పలుమారు
కా దంటే నీ వెంత కైనఁ గలవు నే నెరఁగనా
మాచెనఁ గొంత నీవు మన్నించితి గాకా ॥ ఈపాటి ॥

యెనయ నిద్దరి నొకయింటఁ బెట్టి యాపెచేత
పని నాకుఁ జేయించేవు పలుమారు
కొనబు శ్రీవెంకటేశ కూడితివి నన్ను నిట్టె
మన సిచ్చి నేఁ గాఁగా మన్నించితి గాకా. ॥ ఈపాటి

వరాళి

మొదల నేమీ నెరఁగ మూఢురాలను
యెదుట నీయాల నేను యీడేరించ వయ్యా ॥

వోపి మంచము దిగక వుందు నొక్కొక్కవేళను
రాపుగ నిన్నుఁ బొందినరాజసానను,
కోపగింతు నొకవేళఁ గొసరుదు నొకవేళ
అపాపము లే దని మా కానతియ్య వయ్యా ॥ మొదల ॥

దగ్గరినవేళ నాపాదము దాఁకు నీ మేను
అగ్గలపుమందెమేళ మట్టె కాఁగాను
వెగ్గళింతు నొకవేళ వేసరింతు నొకవేళ
యెగ్గు లే దని వరము లియ్య వయ్యా ॥ మొదల ॥

యేకతపువేళ నిన్ను యే మైనా నందుము నేము
కైకొని పనవుతోడఁ గాఁగిట నించి
యీకడ శ్రీవెంకటేశ యేక మైతి మిద్దరము
వాకుదోసము లే దని వలప లీవయ్యా. ॥ మొదల ॥ 543

## లలిత

నిన్ను మీర నోపను నే నెటువలె నుండిన
అన్నిటా నే నీకే లో నవుతే నాతగవూ ॥ పల్లవి ॥

యెంత విరహవేదన నెట్లా నేఁ బొరలినా
రంతుల వేగిరించఁగ రాదు నిన్ను
యింతకంటే నీతో నే నెంత పొట్టు వెట్టుకొన్న
వంతుల నీయంకెలకు వచ్చుటే నాతగవు ॥ నిన్ను ॥

ముంచి నాకు నీమీఁద మోహ మెంత యెక్కుడైన
చంచలించి వేగిరింప సంగతా నాకు
మంచితనాననే నీకు మందెమేళ మెంతయిన
పొంచి నీవేళ గాచుక పొందుటే నాతగవూ ॥ నిన్ను ॥

వరుసతో నే నీకు వద్ద నిట్టే వుండినాను
గరిమె నే ముందు వెనకఁగఁ జెల్లునా
నిరతి శ్రీవెంకటేశ నీవే నన్నుఁ గూడితివి
ధరమీఁది పనులకుఁ దాలిమే నాతగవూ. ॥ నిన్ను ॥ 544

## పాడి

పొంచి పొంచి మాతో నేల పురుఁడు వెట్టుకొనేవు
నించి యిన్నిటా దొరవు నీకుఁ జెల్లదా ॥ పల్లవి ॥

చలపట్టి మాకే నీతో జవదాఁట రాదు గాక
నెల వై పెచ్చు వెరుగ నీకుఁ జెల్లదా
కలది గ లట్టే మాకు కల్ల లాడ రాదు గాక
నిలువున బొంకు బొంక నీకుఁ జెల్లదా ॥ పొంచి ॥

మఱఁగు లెల్లా విరులు మాకుఁ జెల్ల దింతే కాక
నెఱి దాఁగి పొదచూప నీకుఁ జెల్లదా
తఱిఁ గపటము మాకుఁ దగవు గా దింతే కాక
నెఱవుదొంగతనాలు నీకుఁ జెల్లదా ॥ పొంచి ॥

చిమ్ముచు మాకే నీతో చేరి నవ్వ రాదు గాక
నెమ్మది సిగ్గు విడువ నీకుఁ జెల్లదా
నమ్మించి శ్రీవెంకటేశ నన్ను విట్టె కూడితివి
నెమ్మి నన్ను మన్నించ నీకుఁ జెల్లదా. ॥ పొంచి ॥ 546

## ముఖారి

చిత్తము వచ్చిన ట్టెల్లఁ జేసుఁ గాకా
బత్తితోడ నేల వొడఁబరచీనె నన్నునూ ॥ పల్లవి ॥

చేరి తనతో నవ్వి నేసపాలకు లో నైతి
దీరాన నేఁ బొందు నేసి బేల నైతివి
సారె సారెఁ దనవంక జాలదా నా కింత మేలు
పోరి పోరి యిఁక నేమి బుజ్జగించీ నన్నునూ ॥ చిత్తము ॥

కన్నులఁ జూచినందుకు కాలమందె లో నైతి
యెన్ని తననే నమ్మి యిం తైతివి
మన్ననలు దనవంక మరి యింతకంటే నేవి
కొన్నకో లై యిఁక నేమి గొంగు వట్టీ నన్నునూ ॥ చిత్తము

మాటలు దనతో నాడి మన సిట్టె తనిసితి
యీటుకుఁ బెనఁగఁ బోయి యేక మైతిని
గాఁటపు శ్రీవెంకటాద్రిఘనుఁడు దా నన్నుఁ గూడె
ఆఁటదాన నేల మెచ్చీ యప్పటిని నన్నుసూ. ॥ చిత్తము ॥ 516

392-వ రేకు మలహరి

ఎందాఁక నీసిగ్గు లేఁటికిఁ బెంచేవు
పొందులు దొరకెను భోగించ రాదా ॥ పల్లవి ॥

చెలఁగి నీకుచులు చేతుల దువ్వేచు
మలసెటిపతితో మా టాడవే
నెలవినవ్వుతోఁ జెక్కులు నొక్కీ
చెలువుని చనవులు చెల్లించ రాదా ॥ ఎందాఁక ॥

కదిసి చేసురటి కాంతుఁడు విసరీ
నదె నీచేతుల నందుకోవే
మొదల నాతఁడె ముచ్చట లాడీ
యెదు రుత్తరము నీ వియ్యఁగ రాదా ॥ ఎందాఁక ॥

ఆతఁడు కాఁగిట నట్టె బిగించీ
నీతగ విప్పుకు నెరపఁ గదే
కాతరపు శ్రీవెంకటఘనుఁ డితఁడు
ఘాతలఁ గూడెను కనుఁగొన రాదా. ॥ ఎందాఁక ॥ 517

శంకరాభరణం

నీవు మగవాఁడవు నెలఁత యాపె
వేవేలకు నైనాను వింత సేయఁ జెల్లునా ॥ పల్లవి ॥

తచ్చి తచ్చి యాపెతో తారుకాణ నీకు నేల
యిచ్చగించి విన రాదా యింతలో నేమి
హెచ్చినకోపానఁ జెలి యే మన్నా నసఁ గాక
మచ్చరించి యింత నీకు మారుమాట చెల్లునా ॥ నీవు ॥

ముంచి తిట్టేయాపెఁ జూచి మోవినె నవ్వఁగ నేల
యించుక వోరుచ రాదా యింతలో నేమి
మించులవనిత యెంత మీరినాను మీరెఁ గాక
అంచెల సతులతో నీ కాడుకొనఁ జెల్లునా ॥ నీవు ॥

కూడినవేళ యాపెతో గోరఁ జెనకఁగ నేల
యీడు జోడై యుండ రాదా యింతలో నేమి
వేడుక శ్రీవెంకటేశ వెలఁదిఁ గలసితివి
తోడనె తనివి లేక దొమ్మి సేయఁ జెల్లునా. ॥ నీవు ॥ 548

నాదరామక్రియ

అంతే కలితే నీవు అతనివద్దికి రావే
కాంతరో అన్నియుఁ దారుకాణించె నిపుడు ॥ పల్లవి ॥

యేమి సేసీనో యంటా నేకతాన దగ్గరితే
కామించి యాతఁడు నన్నుఁ గరఁగించెనూ
నీమనసున విభుని నేనే యంటితి నంటా
మోము చూచి నవ్వేవు మొరసి యే మందునే ॥ అంతే ॥

సూడు వట్టి నే నాతని జూజ మాడఁ బిలిచితే
కూడఁబట్టి తానె దక్కఁగొనె నన్నునూ
తోడనె వెంగె మాడేవు దొమ్మి నేఁ జేసితి నంటా
ఆడియు [1]నాదవు నన్ను నందుకు నే మందునే ॥ అంతే ॥

నీతోడి చుట్టరికాన నే మొక్కితే నన్నుఁ గూడె
యీతల శ్రీవెంకటేశుఁ డిచ్చకాననూ
నీతితో న న్నడిగేవు నీ వెఱఁగ వటే యిది
యేతరీఁ డాతఁడు నీతో నే మందునే. ॥ అంతే ॥ 549

సాళంగం

ఎఱఁగ రాదు మీగుట్టు యి ట్టుండ వలదా
అఱమఱపులే కంటి మవ్వల దెలియదు ॥

1. "న్నాండవు" అని వ్రాసి చెరిపి "నాదవు" అని తిద్ది యున్నారు.

అట్టె నీమొగము చూచి అతివ నవ్వీననవ్వు
వట్టి శిగ్గులో నీ తల వంచినవంపు
దట్టపు వెన్నెలకును తామెర ముకుళించిన
అట్టాయఁ గాని మాకు నవ్వల దెలియదు ॥ ఎఱఁగ ॥

చేతి పూవుబ్బంతిఁ గొని చెలియ వేసినవాటు
యీతల నంతలో నీ చె య్యెత్తినమొక్కు
ఘాత మరునమ్ములకు గవిశనవలె నాయ
నాతుమలోపల మాకు నవ్వల దెలియదు ॥ ఎఱఁగ ॥

తరుణి నీమంచానకు దగ్గరి వచ్చినరాక
విరతి శ్రీవెంకటేశ నీకూటమి
గరిమఁ బాలును నీరు గలసినయట్టాయ
అరు దందితిమి మాకు నవ్వల దెలియదూ. ॥ ఎఱఁగ ॥ 550

కొండమలహరి

నేనే కాదు చెలు లెల్ల నీగుణ మెరుఁగుదురు
నానినవలపు చెప్ప నాతో నేల యిఁకనూ ॥ పల్లవి ॥

మంతనాన మీ రిద్దరు మచ్చిక ముచ్చ టాడఁగ
వింతలుగా మీ సుద్దులు వినినా నేను
యింతలో నే నడిగితే మేరుపడఁ గత చెప్పే
వంతరంగ మెఱఁగదా ఆన లేల యిఁకను ॥ నేనే ॥

మొదలనె మీకళల మొకములలో తేట
కదిసి చూచితి నిట్టె కాననా నేను
[1]అదన నే నవ్వితేను అట్టె తెర వేసేవు
కదిమి నాతో నయగార మేల యిఁకను ॥ నేనే ॥

పచ్చి గాఁగ నింటిలోన పానుపుపైఁ గూడినది
యెచ్చరికె లెరఁగనా యిప్పుడే నేను
అచ్చపు శ్రీవెంకటేశ అట్టె నన్నుఁ గూడితివి
ముచ్చుమి దీరినమీఁద మొక్కు లేల యిఁకను. ॥ నేనే ॥ 551

---

1. "అదనె" అని వ్రాసి "అదన" అని శిద్ది యున్నారు.

రామక్రియ

ఇనుమంత పనికిఁ గా నెంత సేసేవు
విను పేల వచ్చె నీకు [1]వినవయ్య మాఁటా ॥ పల్లవి ॥

తూఁగుమంచ మెక్కుకొని తొయ్యలి లేవ దంటా
[2]తోఁగి చూచి నీవు వోఁగాఁ దొడికి పట్టి
వేఁ గగుకుచభారము వీడఁగాఁ బెనఁగీ నాపె
వీఁగక మన్నించి నేఁడు వినవయ్య మాఁటా ॥ఇనుమంత॥

కామెర నాపె వేయఁగఁ దాఁకి నీకు నొచ్చె నంటా
వోమి నీవు కళ వట్టి వూర కుండఁగా
మోము చిన్నఁబోయి యింతి మోవితేనె నీకు నిచ్చి
వేమారు వేఁడుకొనీని వినవయ్య మాఁటా ॥ఇనుమంత॥

సిగ్గుతో నున్నది యంటా శ్రీవెంకటేశుఁడ నీవు
బగ్గన నవ్వలిమో మై పవ్వళించఁగా
దగ్గరి యందుకే యింతి తమకించి నిన్నుఁ గూడె
వెగ్గళించ కిపు డిట్టె వినవయ్య మాఁటా. ॥ఇనుమంత॥ 552

393-వ రేకు శుద్ధవసంతం

ఇప్పు దేల చవు లయ్యీ నింపులు చాలనిపొందు
చప్పనైనా నుప్ప నౌను సమ్మతై తేఁ గాకా ॥ పల్లవి ॥

చలము సాధించేచోట సలిగెలు చెప్పఁ బోతే
ములుచదాన ననవా మొదల నీవే
వలచినవేళ నెంత వడి నేఁ గోపించినాను
తల కాయి సేసుకొని తగులుదు గాక ॥ ఇప్పు దేల ॥

నయము చాలనిచోట నవ్వులు నవ్వఁగఁ బోతే
బయకారించె ననవా పక్కన నీవే
ప్రియము గలవేళను బిగి సెంత నే నుండినా
దయ వుట్టి నీవు నన్ను దగ్గరుదు గాక ॥ ఇప్పు

1. "విన" అని వ్రాసి "విన" అని శిద్ధి యున్నారు. 2. "తొంగ్గి" అ "తోఁగి" అని శిద్ధి యున్నారు.

తమకము లేనిచోట తతిఁ బెనఁగఁగఁ బోతే
భ్రమసి వున్న దనవా పై పై నీవే
అమర శ్రీవెంకటేశ అట్టె నన్నుఁ గూడితివి
సమ మై యేకతవేళ [1]సత మైతి గాకా. ॥ ఇప్పు దేల ॥ 553

సాళంగం

చెలులతో నీసుద్దులు చెప్ప వచ్చునా
చలము మన లోలోనె సాదించుట గాకా ॥ పల్లవి ॥

మచ్చిక నీతిట్లూను మనలోని వొట్లూను
చెచ్చెర నొరులతోడఁ జెప్ప వచ్చునా
కొచ్చి బొమ్మల జంకించి కోపముల నుంకించి
రొచ్చుల మతికాఁక దీరుచుకొంట గాకా ॥ చెలులతో ॥

నీ చేఁతలును మన నెట్టుకొన్న మర్మములు
చేచేత నొరులతోడఁ జెప్ప వచ్చునా
తాచి నిట్టూర్పు నెరపి తగఁ గన్నులు గిరిపి
యేచి మనలో మనమే యిందుకొంట గాకా ॥ చెలులతో ॥

యింతేసి నీ వినయాలు యిక్కువ మనరతులు
చెంతల నొకరితోడఁ జెప్ప వచ్చునా
పంతపు శ్రీవెంకటేశ భావములనే చొక్కి
వింత సంతసాల విఱ్ఱవీఁగుకొంట గాకా. చెలులతో ॥ 554

సాళంగం

ఆన వెట్టినా మానరు అప్పటి మీరు
పానిపట్టి చెలులాల పగదాన నటరే ॥ పల్లవి ॥

[2]యెదురుమాటలు నేర యెవ్వరితో నేఁ బోర
వొదిగి వొకరీతి న న్నుండ నీరే
అదన నండఁ గూచుండ నాతని సరివారమా
పొదిగి నా కేల మీరు బుద్ధి చెప్పేరే ॥ ఆన ॥

1. "సత మైతిం గాకా" అని వ్రాసి "ం" చెరిపి "సత మైతి గాకా" అని తిద్ది యున్నారు. 2. "యెదుగు" అని వ్రాసి "యెదురు" అని తిద్ది యున్నారు.

వట్టి పూడిగాల కోప వాదు లాతనిపై [1]మోప
వెట్టికి మొక్కి న న్నేల వెట్టిఁ జేసేరే
యిట్టె న న్నాతఁ డే మన్నా నే మాయ లే దంటా
నొట్టు వెట్టుకొనె నంటా నొడఁబరచకురే ॥ అన ॥

మంతనా లంతే సెఱఁగ మతిఁ దనకు మొఱఁగ
యెం తయినఁ దనకాఁగి లేల మానేనే
యింతలోనె శ్రీవెంకటేశుఁడు దానె కూడె
పొంత నన్ను నాతనిఁ బొగడ నేమిటికే. ॥ అన ॥ 555

గుజ్జరి

అలుక గాను నీతో నన్నిటా మన్ననదాన
చలపట్టి యందరితో సరి సేయ కికను ॥ పల్లవి ॥

చిత్తము నొవ్వకుమీ చెప్పే నే నొకమాట
హత్తి మంచ మెక్కు మన కంతే చాలు
యిత్తల నీ కూడిగాలు యెన్ని యైనఁ జేసేఁ గాని
పొత్తుల యెంగిలితోడి బోగము సయించదు ॥ అలుక ॥

ఆనలు వెట్టకుమీ అడిగే నే నొకయీవి
పూని నాతోడ నవ్వకు పొందులే చాలు
కాని మ్మని నీవద్ద నేఁ గాచుకుండే నేపొద్దు
సానఁ బట్టేసరసాలు చవి గాదు నాకును ॥ అలుక ॥

చేతుల మొక్కకుమీ సేసేఁ గాని నీమాఁట
రాతిరి నన్నుఁ గూడినరతులే చాలు
యీతల శ్రీవెంకటేశ యిపుడు నన్నుఁ గూడితి
కాతరాన నీతోడఁ గపట మెరఁగను. ॥ అలుక ॥ 556

రామక్రియ

నే నెటుల నుండినాను నీ కేమీ
వేమరు మామీఁది ద్రిష్టి విడువవు నీవు ॥ ప ॥

1. "మోంప" అని వ్రాసి "ం" చెరిపి "మోప" అని దిద్ది యున్నారు.

సెలవి నే నగితేను చేరి య దేమిటి కంటా
[1]వలరి చెప్పు మనుచు నాన వెట్టేవూ
తలఁకేవు నీ వ దేమి తప్పు నీవల్లఁ గలదా
తెలుసుకో నీకు నీకే తేటతెల్ల మిఁకను ॥ నే మెటుల ॥

ముక్కుపై వే లిడుకొంటే ముంచి యేపని కనుచు
గుక్కక తెలుపు మని కొంగు వట్టేవు
మక్కువ నీవల్ల ననుమాన మైనఁ గలదా
చక్క నీవే [2]దిద్దుకొమ్ము చల మేల యిఁకను ॥ నే మెటుల ॥

తప్పక నేఁ జూచితేను తమకించితి ననుచు
కప్పి కప్పి నన్ను నట్టె కాఁగిలించేవు
యిప్పుడె శ్రీవెంకటేశ యెనసితి విటు నన్ను
అప్పటి కిప్పుడు నీవే అందము సేసుకొమ్మీ. ॥ నే మెటుల ॥

పరాళి

చేతికి లో నైనవారిఁ జేతురా పగవా రైన
కాతరాన నీవే కళవళించితివి ॥ పల్లవి ॥

యెట్టకేలకును నిన్ను యింటికిఁ బిలుచుకొంటి
చుట్టమ నయినదాన సూదు వట్టేనా
యిట్టె నీ కెవ్వతె చెప్పె యింత సేతుఁ జేయ నని
నెట్టన నాగుణ మెల్ల నీ వెరఁగవా ॥ చేతికి ॥

చెక్కు నొక్కి చేత మొక్కి సేవ లిన్నియునుఁ జేసె
మొక్కలాన నింక నిన్ను మోస పుచ్చేనా
యెక్కుడిబుద్ది దలఁచి తేల సిగ్గు వడ నీకు
యిక్కువ నీ నా సంది యిటువంటిదా ॥ చేతికి ॥

మాఁగినమోవి యిచ్చి మంతనాలు నీతో నాడి
కాఁగిట నిన్నుఁ గూడి ఘాత సేసేనా
యేఁగివచ్చి శ్రీవెంకటేశ నన్నుఁ గూడితివి
నాఁగువారె వలపులు నమ్మి కియ్య వలెనా. ॥ చేతికి ॥ 558

---

1. "వలవి" అని వ్రాసి "వలరి" అని దిద్ది యున్నారు. 2. "దిద్దుకొంమ్ము" అని వ్రాసి "ం" చెరిపి "దిద్దుకొమ్ము" అని దిద్ది యున్నారు.

394-వ రేకు గుండక్రియ

నీవే మంచివాఁడ వయ్య నేనే వీరిడిఁ గాని
భావించి నామంకు నేనే పాపఁగల నింకను ॥ పల్లవి ॥

పారె పారె నిన్ను దూరి సణఁగుతే యాడితిని
భారపు నీసతులకుఁ బగ యైతిని
యీరీతి నిన్నుఁ జేసి యేఁటిజన్మ మెత్తితినో
తేరకొన నన్ను నేనే తిట్టుకొంటి నింపకు ॥ నీవే ॥

కపటాన నీమీఁద గబ్బిచూపు చూచితిని
కపురుల నీమనసు గలఁచితిని
యిపు డింద కొడిగట్టి యెందుకు మంచిదాననో
వుపమించి నాకు నాకే వుస్సు రంటి నేను ॥ నీవే ॥

అట్టుగ నిన్నుఁ గూడి యుఱక యలయించితిని
కట్టఁగడ నిన్నుఁ దిరుగ నీ నైతిని
యిట్టినన్ను శ్రీవెంకటేశ నేఁడు గూడితివి
నట్టనడుమ నిందుకే నవ్వుకొంటి నేను. ॥ నీవే ॥ 559

కేదారగౌళ

విచ్చనవి డాయ నేఁడు వెర పేల యిఁక నీకు
విచ్చల మాయమనసు నే మే మనే మయ్యా ॥ పల్లవి ॥

కన్నుల మొక్కితిమీ కాఁకలఁ జిక్కితిమీ
నన్నలు మాతో నింకాఁ జాలదా అయ్యా
వెన్నెలలే యెండ లాయ వేగి యిది వొద్దాయ
నిన్నుఁ గాన వచ్చె నిట్టె నే మే మనే మయ్యా ॥ విచ్చన ॥

యిచ్చక మాడితిమీ యింతగా నోడితిమీ
మచ్చికె లింకా మాతో మానవా అయ్యా
రచ్చలో నిన్నుఁ గంటిమి రాతిరే వింటిమి మాట
నెచ్చెలిచేఁ జె ప్పింపేవు నే మే మనే మయ్యా ॥ విచ ॥

కందువ దెరఁగితివి కాఁగిటఁ గరఁగితివి
సందడి నవ్వేవు మాతో చలమా అయ్యా
యిందుకె శ్రీవెంకటేశ యిటు నన్నుఁ గూడితివి
నింద వెల్లాఁ బాసె నిన్ను నే మే మనే మయ్యా. ॥విచ్చన॥ 560

ముఖారి

ఒద్ద నున్నదాన నేను వొక్కటి గాఁ దడవా
దిద్దుకోఁ గలమా యెల్ల తేరుమకొ మ్మనవే ॥ పల్లవి ॥

తన మేలే కలితేను తాపముఁ బాసేఁ గాక
ఘనుఁడు నిన్నే లంపె యిక్కడికి నేఁడు
మనసులో నున్నదాన మాఱుమాట లాడేనా
మునుపటివారి దాస [1]ముగియించు మనవే ॥ ఒద్ద ॥

యేకత మెనవేఁ యిట్టె నే వచ్చేఁ గాక
యీకడ మాయింటికిఁ దా నేల వచ్చెనే
చేకొలఁదిదాన నేను చిత్తము నొప్పించేనా
పైకొన్నవారి పొందులపని దీర్పు మనవే ॥ ఒద్ద ॥

నేస వెట్టినట్టిదాన సేవలు సేసేఁ గాక
ఆస నేల వేఁడుకొనీ నప్పటిఁ దాను
వేసరక నన్నును శ్రీవెంకటేశ్వరుఁడు గూడె
రాసి కెక్కె నీవలపు రవ్వ మాను మనవే. ॥ ఒద్ద ॥ 561

ఆహిరి

నాతో నూరకే నీవు నవ్వేవు గాక
రాతిరి నీమాఁట వూరక పోవ నిచ్చేవా ॥ పల్లవి ॥

కొంకక నీవును నేనుఁ గూడి యున్న రతివేళ
బింకము లాడుచు నట్టె పెనఁగితివి
అంకెల నాకుచములు అంతవేఁగు లని నీవు
జంకెనతో ములిగేవు సత్తు వెల్లా నిట్టిదా ॥ నాతో ॥

1. "ముగించు" అని వ్రాసి "గి'ం" ల పైన హంసపాది వేసి క్రింద "ఇ" వ్రాసి "ముగిఇంచు" అని దిద్ది యున్నారు.

మంచముపై నిద్దరము మంతన మున్నంతవడి
 కంచువలె వాఁగెను నీ గబ్బికుత్తికె
 కొంచపు నామాట లివి [1]కొండలసెల లనుచు
 యించుకలో భ్రమసేవు యిట్టిదా నీవోరుపు ॥ నాతో ॥

మోవి మోవిఁ గూడి తేనె మురిరి యానినదాఁకా
 నీవు నే న నెరఁగవు నిండఁ జొక్కుచు
 శ్రీవెంకటేశుఁడ గోరఁ జెనకిలేఁ దెలిసేవు
 యీవల నీతో కూటము లిటువంటివా. ॥ నాతో ॥ 562

సామంతం

అటువంటివాఁడవా అద్దో నీవు
 నటన మొకమోటాలు నడపేవు గాకా ॥ పల్లవి ॥

తలఁపులోపల నీకు తగులు గలిగితేను
 అలరి రా కుండుదువా అక్కడ నీవు
 చలముల నెవ్వతో జాగులఁ బెట్టుక నిన్ను
 వెలి లోను మఱపించి వెట్టిఁ జేసెఁ గాకా ॥ అటు ॥

కడుఁ దమకము నీకుఁ గమ్మి పెరచేఁచితేను
 అదరి నాతో మాట లాడ కుందువా
 వడి నెవ్వతో నిన్ను వాకట్టు గట్టుక యింత
 ముడి వెట్టి విడిచి తా మొప్పెఁ జేసెఁ గాకా ॥ అటు ॥

తటుకన నన్నుఁ గూడేదయ నీకు లే కుండితే
 ఘటన నెదురుకొని కాఁగిలింతువా
 యిటువలె శ్రీవెంకటేశ కడపలోన
 నటల కెవ్వతో నిన్ను చంది సేసెఁ గాకా. ॥ అటు ॥ 563

సామంతం

సరవు లెరఁగ మయ్య చాలు నింత కోపము
 కరఁగించి సొలసితే గర్వ మనేవా ॥ పల్ల

1. "కొండలు సెలు" అని వ్రాసి "కొండలసెల" అని తిద్దియున్నారు.

కందువలుగా నీకుఁ గతలు నేఁ జెప్పఁ గాను
అంది నీమీఁదఁ బెట్టుక అట్టె నవ్వేవు
యిందు ర మ్మనుచు నిన్ను నింటికిఁ బిలుచుకొంటే
యెందో పో నియ్య ననుచు నెమ్మె చూపేవు ॥ సరవు ॥

వద్ద నుండి సతులను వారి వీరిఁ జూపితేను
అద్దో నింద లాడె నంటా నాన వెట్టేవు
తిద్దుకో కస్తూరిబొట్టు తెర దిగ వేయు మంటే
గద్దించి యట్టె నన్నుఁ గాఁగిలించేవు ॥ సరవు ॥

పూస గుచ్చినట్టు నీకు బుద్ధులు నేఁ జెప్పితేను
ఆసతో నామోవి మోవి నందుకొనేవు
వానితో శ్రీవెంకటేశ వడి నన్నుఁ గూడితివి
రాసి కెక్కితి వంటేను రతికిఁ దీసేవు. ॥ సరవు ॥ 564

395-వ రేకు శుద్ధవసంతం

ఎంతవాఁడ వైన నిన్ను నింత సేసితి
యింతిని నాయపరాధా లె ట్టోరిచే వయ్యా ॥ పల్లవి ॥

చేర ర మ్మంటే రా నైతి చెక్కులు చేత గిల్లితి
గారవించఁగా నిన్నుఁ గసరితిని
[1]కూరిమి గొసరఁగాను కోపాన జంకించితిని
యీరీతి నాయపరాధా లె ట్టోరిచే వయ్యా ॥ ఎంత ॥

మనసు నొప్పించితిని మాట లెల్లా నాడితిని
చెనకఁగా వద్దని పైఁ జేయి వేసితి
పెనఁగితి నీతోడఁ బ్రేమము రెట్టించఁగాను
యెనసి నాయపరాధా లె ట్టోరిచే వయ్యా ॥ ఎంత ॥

కందువలు నీ వంటఁగాఁ గాఁగిలించితి సిగ్గున
విందుల నీరతులకు వేసపుకొంటి
అందుకొని శ్రీవెంకటాధిప నిన్నుఁ గూడితి
విందు నాయపరాధా లె ట్టోరిచే వయ్యా. ॥ ఎంత ॥ 565

---

1. "కూరిమింగా" అని వ్రాసి యున్న చెరిపి "కూరిమిగా" అని తిద్ది యున్నారు.

సామంతం

విన్నప మొక్కటే నీకు వేవేలకు
[1]మన్నించక నీకుఁ బోదు మామనసు నీది ॥ పల్లవి ॥

చేరి మొక్కేవారమూ సేవ సేసేవారమూ
యేరీతి మాట లాడినా నే మాయ నీకు
నేరనివారు దిట్టితే నీకుఁ బోదు బుద్ధి చెప్ప
భారము నీదే సు మ్మయ్య పడఁతినే నీకు ॥ విన్నప ॥

నీతోడివారమూ నీసరివారమూ నేము
యీతల నేఁ గైకొన్న నే మాయ నీకు
కాతరాన నే రా కున్నఁ గదియక నీకుఁ బోదు
నాతప్పులు నీవి సుమ్మీ నాపతివి నీవు ॥ విన్నప ॥

కాంతుఁడ శ్రీవెంకటేశ కాఁగిటిలోని వారమూ
యెంత నిన్ను జంకించినా నే మాయ నీకు
అంతరంగ మైనవారి నాదరించ [2]కీఁకఁ బోదు
పంతము నీది సుమ్మీ బడిదాన నేను. ॥ విన్నప ॥ 566

సామంతం

ఇయ్యకో లయినమీఁద నిఁక నేలా
•నెయ్యము లాతఁడు నాపై నెరపీఁ జూడరే ॥ పల్లవి ॥

యెన్ని నేరా లైనఁ గానీ యెక్కడ నైనా నుండనీ
వన్నెగా నే ర మ్మంటే వచ్చెఁగా తాను
మన్ననలు నా కిచ్చె మాఁటలూ నాచేత వినె
మున్నిటిసుద్దు లిం కేమి ముదులకించకురే ॥ ఇయ్యకో ॥

యెం దైనా సన్న సేయనీ యెవ్వ తైనాఁ గూడనీ
యిందు నాపై నాన వెట్టె నిప్పుడే తానూ
అంది నాపైఁ జేయి వేసె నంతరంగ మెల్లఁ జెప్పె
నింద లాడేమాట లెల్ల నిలువఁ బెట్టకురే ॥ ఇయ్యకో ॥

1. "మన్నించవే" అని వ్రాసి "చ, వే" ల క్రింద చిన్న హంసపాది వేసి వ్రాసి "మన్నించక" అని తిద్ది యున్నారు. స్థలము లేనందున హంసపాది, " చిన్నవిగా వ్రాసి యున్నారు. 2. "కీకి" అని వ్రాసి "కీఁక" అని తిద్ది [illegible]

మన సెజ్జైన నుండనీ మంతనాలె యాడనీ
కొన కెక్క నను నేఁడు గూడెఁగా తాను
యెనసెను శ్రీవెంకటేశ్వరుఁ డీతమితోడ
నను పైతి మిద్దరము నవ్వులు నవ్వకురే. ॥ ఇయ్యకో ॥ 567

శుద్ధవసంతం

చెల్లఁబో నామన సింక సిగ్గు వడదు
పల్లదాన నీకు నేల భ్రమసితినో ॥ పల్లవి ॥

అదరి నీవు మొక్కఁగా నాపె నిన్నుఁ దిట్టఁ గాను
నడుమ నూరకే నాకు నవ్వు వచ్చెను
వడిఁ జనవు గలట్టివారు ని న్నేమి చేసినా
తడవి నీపై నా కేల దయ వుట్టెనో ॥ చెల్లఁబో ॥

వెఱఁగు నీవు ముట్టఁగ చేతు లాపె దొబ్బఁ గాను
కలకుఁ బెండెమటలు గారీ నాకు
గుటి మైనవారు నీతో గొడవలు వెట్టుకొంటే
అటిముటి నే నేల అడ్డము వచ్చితినో ॥ చెల్లఁబో ॥

కాని మ్మని యాపె రాఁగా కాఁగిట నీవు నించఁగా
తానక మై నావలపు తల [1] కెక్కెను
దీనికె కా నన్నుఁ గూడితివి శ్రీవెంకటేశుఁడ
కానీ లె నీ కెంత నేను కైవస మయితినో ॥ చెల్లఁబో ॥ 568

శంకరాభరణం

ఏమియుఁ గొలుప వింక నేఁటి మాటలూ
యీమన సెల్లఁ గంటిమి యిఁక నేఁటి మాటలు ॥ పల్లవి ॥

వున్నతి నీ హారములు వొకతెమెడ నుండఁగ
నెన్నుకొంటి విందాఁక నేఁటి మాటలు
నిన్ను నతు లెల్లాను నేరము లెంచే దెల్లా
నిన్నిటాను సరి వచ్చె నిఁక నేఁటి మాటలు ॥ ఏమియు ॥

1. "కెప్కెను" అని వ్రాసి "కెక్కెను" అని తిద్ది యున్నారు.

మేలిమి వింతవాసన మేన నీవు నించుకొని
యేల నన్నొరయఁబరచే వేఁటి మాఁటలు
పాలించి యాపెకు నీవు బాస లెల్ల నిచ్చి వచ్చి
యీలీల ముచ్చట లాడే విఁక నేఁటి మాఁటలు ॥ ఏమియు ॥

నవ్వుతా నొకతెతోడ నంటు సేసితి విందాఁక
యివ్వల నన్నుఁ బిలిచే వేఁటి మాటలు
రవ్వగా శ్రీవెంకటేశ రతి నన్నుఁ గూడితివి
యెవ్వతెతోఁ బొత నీకు నిఁక నేఁటి మాటలు. ॥ ఏమియు ॥ 569

హిందోళం

కామిని యిప్పటినుండి కాచు కున్నది
యీమోహ మెఱఁగ కున్న నెగ్గు వట్టుఁ జుమ్మీ ॥ పల్లవి ॥

చక్కఁ జూడ రాదా సతి నిన్నుఁ జూడఁ గాను
యెక్కడో పరాకై యేమి సేసేవు
మొక్కీ నాపెవిధ మెంత మంచి నీరాజన మెంత
తక్కు లిఁక మాన కున్న తమకించుఁ జుమ్మీ ॥ కామిని ॥

మాట లాడ రాదా మగువ నిలుచుండఁగ
నేఁటికి నీకుచ్చితము చేల చూపేవు
మేఁటి యాపెప్రియ మేద మించిన నీ బలు వేడ
గుట్టుతో మన్నించ కున్న నేరమి యౌఁ జుమ్మీ ॥ కామిని ॥

చిత్తగించ రాదా చెలి వద్దఁ గూచుండఁగ
యెత్తిన నీ యెమ్మె లిఁక నేల మానవూ
పొత్తుల శ్రీవెంకటేశ పొందితి వీపె నింతట
హత్తి యిట్టె వుండ కున్న నాఱడి యౌఁ జుమ్మీ. ॥ కామిని ॥

396-వ రేకు లలిత

ఏ మయ్య రమణుఁడ యెంత సేసేవూ
కామ నిన్నుఁ దలపోసీఁ జైకొనుదాఁకాను

చింతలచిగురు గోసీఁ జిత్తములోనఁ
గొంతుఁద ని న్నెదుటనుఁ గన్నదాఁకాను
పొంతఁ బ్రియములఁ జేసీ బోనాలు
సంతతపు వలపుల చవి గొనుదాఁకాను ॥ ఏ మయ్య ॥

వెదచల్లీఁ జీఁకటులు వేనలివెంట
అదె నీవిరహతాప మాఁపఁగ లేక
తుదచూపులనె కట్టె దోరణాలు
వదలక నీ వింటికి వచ్చినదాఁకానూ ॥ ఏ మయ్య ॥

ముగ్గులు వెట్టీఁ జెమటముత్తెములను
అగ్గమై నీవు తనుఁ బెం డ్లాడుదాఁకాను
సగ్గు దేరఁ గూడితివి శ్రీవెంకటేశ
అగ్గలమై నీకు మొక్కు నట్టె యిందాఁకానూ. ॥ ఏ మయ్య ॥

సామంతం

రాజసపుదాన నంటా రవ్వ సేసేరు గనక
వోజ నా కిటువంటిదె వూహించుకొనరే ॥ పల్లవి ॥

వాలిసీ నొల్లమితోడ పూరకె తా నుండఁ గాను
బలిమి సేసి పెనఁగఁ బాడి యౌనా
పిలిచినప్పుడు మరి ప్రియముతో వచ్చేఁ గాని
తలఁగి లోననే వుండేఁ దతి యెరిఁ గుండరే ॥ రాజ ॥

పంతము ముంగిట వేసి పరాకుతో నుండఁ గాను
పొంతఁ జేసన్నలు చూప బుద్ధి వుట్టునా
చింతతోఁ గావలె నంటే చెప్పినట్టు సేసేఁ గాని
మంతనానఁ బండి వుండేమన నెరిఁ గుండరే ॥ రాజ ॥

బయలు మెరసి తానె పైకొని నన్నంటఁ గాను
నయ మిచ్చి కూడ కున్న నాయమా నాకూ
క్రియతో శ్రీవెంకటాద్రిగిరి వితఁడె కూడె
దయ తనపాటి నాకు తగ వెరిఁ గుండరే. ॥ రాజ ॥ 572

శుద్ధవసంతం

పలుకవే చెలియా పంత మెచ్చెనే
చలి వాసి నీవలపు చవు లెక్కెనే ॥ పల్లవి ॥

నీ వెంత గోపగించి నేరుపులోఁ దిట్టినాను
వావిరి నిండా నవ్వు వచ్చెనె నాకు
కావిరితో నీ వెంత కాఁక దేరఁ జూచినాను
మూవంకఁ దమకమే ముంచీ నాకు ॥ పలుకవే ॥

పూఁచి పట్టి నీ వెంత బొమ్మల జంకించినాను
చాఁచి మందెమేళము జాజుకొనీనే
వేఁచి నీవు నన్నుఁ గడు రేసు లెంత వుట్టించినా
తూఁచినట్టు కళ లెల్లా తుద ముట్టెనే ॥ పలుకవే ॥

కాతరించి నీ వెంత కాఁగిట బిగించినాను
యీతల నా కంత కంత కింపు వుట్టెనే
యేతులకు శ్రీవెంకటేశుఁడ కని కూడితి
నీతలఁపు నావలెనె నేర్పున రూపాయనే. ॥ పలుకవే ॥ 573

శంకరాభరణం

ఏమి గంటివి నావల్ల నిట్టె కాచుక తిరిగి
ఆమీఁదఁ గదా నిన్ను నట్టె మరిగితిని ॥ పల్లవి ॥

వుపచరించ నేరక వూర కున్న నాపై నొక్క
నెపానఁ బాదాలు చాఁచి నీవే మెచ్చేవు
యెపుడూ సరస మాడ నెరఁగని ననుఁ దెచ్చి
వుపమల నాచేయి నీవొళ్లిపై వేసేవు ॥ ఏమి ॥

దవ్వుల నే నూర కున్న దగ్గరఁ బిలిచి నీవే
నవ్వులు నవ్వి ననుపు నటియించేవు
జవ్వనపు సిగ్గుతోడ సరిఁ దల వంచుకొంటే
చివ్వన నామొగ మెత్తి చెక్కు నొక్కేవు ॥

మాట లాడ కుండితేను మంతనము గడియించి
నీటున మందెమేళాలు నీవే సేసేవు
గాటపు శ్రీవెంకటేశ గక్కనఁ గూడితి నంటా
మాటికి మాటికి నన్ను మన్నించేవూ. ॥ ఏమి ॥ 574

## సాళంగం

కొమ్మలాల అమ్మలాల గోవిందరాజు మాపాలి
నిమ్మలఁ జిక్కున్నవాఁడు యిఁక నేమమ్మా ॥ పల్లవి ॥
పరపుమీఁద నూరక పవళించుండుట గాని
నిరతి మావిభునికి నిద్దుర లేదు
పరగ మీ రిద్దరును పాదములు పిసుకఁగ
సురతమర్మపుఁగాకఁ జొక్కీ నదే ॥ కొమ్మ ॥
వున్నతితోఁ గొలు విచ్చి వుండుట యింతే కాని
కన్నులచూపు మీపైనే కదరమ్మా
మన్ననసతులు మీరు మాట లిట్టె యాడఁ గాను
విన్నవిసుకుల మెచ్చి విఱ్ఱవీఁగీ నదివో ॥ కొమ్మ ॥
పూఁచి భుజములు మూఁదై పొరలి వుండుట గాని
చాఁచినకరము మీకే సన్న సేసీని
ఆఁచి శ్రీవెంకటగిరి నదె తిరుపతిలోన
రేఁచినమోహానఁ గూడె రేయిఁ బగ లదివో. ॥ కొమ్మ ॥ 575

## రామక్రియ

ఇంత వెల్లవిరి గద్దా ఇంతుల వలపు లెల్లా
కాంతునికి నొప్పగించి కాకు సేసేవు ॥ పల్లవి ॥
అందపుఁజెక్కులతోడి యలమేలుమంగ నీ
వంది మైలా గియ్యవమ్మ ఆతనికిని
కందువ కన్నులఁ జూచె కరఁగి వుందానవు
యిందుకే యీతఁడు నవ్వీ నిది గదవమ్మా ॥ ఇంత ॥

బంగారువస్త్రలతోడిపదఁతి
సంగతి నీపతికొప్పు చక్కఁ బెట్టవో
ముంగిట నాతఁ [1]డుంటేనె మురిసేవూ
చెంగట నాతఁ డేసుద్ది చెప్పేఁ జెలులకూ ॥ ఇంత ॥

కప్పురపువాసనకలికి
యిప్పుడె శ్రీవెంకటేశు నెనసితివి
తప్పక చూచి మఱియుఁ దమకించేవూ । అతఁ ।
డప్పటి నిందుకు లో నాయఁ గదవమ్మా. ॥ ఇంత ॥ 576

397-వ రేకు దేసాళం

వెఱవకు నిన్ను నంత వేసరించను
నెఱి నీగుణములు నే నెఱఁగనా ॥ పల్లవి ॥

చనవు సేసుక నే నీసరునఁ గూచుంటిఁ గాక
ననుపు చెప్పక నీతో నవ్వ వచ్చేనా
వెనకటివాఁడవా నీవిధము నే నెఱఁగనా
చెనకి నీతో నేరమి సేసుకొనేనా ॥ వెఱవకు ॥

కపట మెఱఁగనా కతలు చెప్పితిఁ గాక
నెపమున వావులు నే నీకుఁ జెప్పేనా
కపురు మొకదాకిరి గడించ నీకు వచ్చునా
యిపు డిట్టె నీకు దా యెస [2]పెట్టేనా ॥ వెఱవకు ॥

కైవసము గాఁగా నిన్నుఁ గాఁగిట నించితిఁ గాక
భావ మెఱఁగక నిన్నుఁ బైకొనేనా
శ్రీవెంకటేశుఁడ నే మెచ్చి తలమేలుమంగను
నీవే నే నని కాక నీకు మొక్కేనా. ॥ వెఱవకు ॥ 577

కాంబోది

ఇట్టె వీడె మందుకోవు యెందాఁకాను
పట్టపగలే వచ్చితి పరా కేఁటి కోయి ॥

1. "డుంటానె" అని వ్రాసి "డుంటేనె" అని దిద్ది యున్నారు.
2. "పెట్టినా" అని వ్రాసి "పెట్టేనా" అని దిద్ది యున్నారు.

కంటికి నిద్దుర రాక కాచుకుందాన నీరాక
యింటికి రా వే మోయి యెందాఁకనూ
జంట లైనసతులతో జాణతనా లాడఁ బట్టె
వెంటనే తిరుగ కనువేళ గాన నోయీ ॥ ఇట్టె ॥

నెయ్యమున విందు చెప్పి నే నీకు మొక్కఁ గాను
యియ్యకొన వే మోయి యెందాఁకనూ
యియ్యేడ నందరితో నీ కేకళా లాడనే పట్టె
అయ్యో నిన్ను నిష్టూరము లాడ నేర నోయీ ॥ ఇట్టె ॥

కంకి సేసి రతులను కాఁగిటఁ గూడితి నిన్ను
యింకాఁ దనియ వే మోయి యెందాఁకను
అంకెల శ్రీవెంకటేశ అలమేలుమంగ నేను
సంకె లేదు వురముపై సత మైతి నోయి. ॥ ఇట్టె ॥ 578

మాళవి

పో పో నీపొందు చాలు పొసగ దిఁక
వైపు గా దనుచు నీతో వదిఁ బోరాదేనా ॥ పల్లవి ॥

అప్పుడే ఆపెమాఁటకు [1]నదలించ వలదా
విప్పుచు నన్నుఁ దిట్టఁగా విందురా నీవు
చెప్ప నేల నీతోడిచెలి మేఁటి చెలిమి
ముప్పిరి చుట్టమ వంటా మొగము చూచేదా ॥ పో పో ॥

మచ్చరాన నవ్వఁ గాను మానుపంగ వలదా
[2]వొచ్చాన నావేళ నాపెవొద్ద నుందురా
యిచ్చకాన నీకు నాకు నేఁటి మొగమోట మింక
వచ్చినదే పదివేలు వాదులాటే చాలును ॥ పో పో ॥

పొత్తునఁ గూచుండితేను పొమ్మనంగ వలదా
అత్తల సరి సేతురా ఆపెను నన్ను
అత్తిన శ్రీవెంకటేశ అలమేలుమంగ నేను
బత్తితో నన్నుఁ గూడితి పంత మేఁటి పంతమూ. ॥ పో పో ॥ 579

1. "నదుంచ" అని వ్రాసి "నదలించ" అని తిద్ది యున్నారు. 2. "వొచ్చావ" అనుచోట 'చ్చా' గల స్థలములో ఏదో అక్షరమును వ్రాసి చెరిపి "చ్చా" అని తిద్ది యున్నారు.

కన్నడగౌళ

ఎట్టు సేసినా నీచిత్త మింతే కాక
తట్టి నిన్ను వెగ్గళించఁ దగునా మాకును ॥ పల్లవి ॥

మంతన మాకెతో నాడి మరి నన్నుఁ గని తేచి
చెంత నా కిచ్చక మాడి చెక్కు నొక్కేవు
యింతటి మగవాఁడవు యేల నీ కింత వెఱపు
కాంతలము యేమి సేయఁ గల మయ్య నిన్నును ॥ ఎట్టు ॥

యిద్దరూఁ గూ డుండఁగాఁ జూ చిట్టె నేఁ దిరిగి రాఁగా
గద్దించి నాకొంగు వట్టి గడె వెట్టేవు
వుద్దండీఁడవు మాతోడ నూర కనుచర ణేల
అద్దో పూడిగపువార మవుఁ గా దనేమా ॥ ఎట్టు ॥

యిట్టె యాచెలియఁ గూడి యే మైనాఁ జేసుకొ మ్మని
వొట్టుక నాపైఁ దెచ్చి వొట్లు వేసేవు
నెట్టన శ్రీవెంకటేశ నే నలమేల్మంగను
అట్టడి నిన్నుఁ గూడి యాఱడికి నోపుదుమా. ॥ ఎట్టు ॥ 580

రామక్రియ

వేళ గానివేళ వచ్చి వెదకేవు
యేలినరమణునితో నింత రట్టు గలదా ॥ పల్లవి ॥

యేచిన నీనాయకుఁడు యింట నున్నాఁ డంటా వచ్చి
చూచేవు నలుదిక్కులు సోదించి
యీచాయ నుండె నాతఁడు యిట్టె పిలుచుక వచ్చేఁ
గూచుండవమ్మా నీవు కోపగించుకొనకా ॥ వేళ గాని ॥

వొద్ద నెవ్వతెఁ బెట్టుక వున్నాఁడో యనుచు
నద్దమరేతిరి పొంచు లాలకించేవు
నిద్దురతో నెం దున్నాఁడో నే నతనిఁ దోడితెంచే
వద్దు వీడె మిందవమ్మ వట్టిచల మేఁటికి ॥ వేళ గా ॥

మామాట వినక నీవు మాడుపుటింటిలో చొచ్చి
కామించి శ్రీవెంకటేశుఁ గని కూడితి
యే మమ్మ అలమేల్మంగ యింటికే యీతనిఁ దెచ్చే
ప్రేమాన నావెంట రావో పెనఁగించుకొనకా. ॥ వేళ గాని ॥

రామక్రియ

ఆతని మంచితనము అట్టే నా మంకుఁదనము
ఘాతల నే నెంచుకొంటేఁ గరఁగీ నామనసు ॥ పల్లవి ॥

యింటివాకిటఁ దా నుండి యిట్టె నన్నుఁ బిలువఁగ
అంటఁ గాక వున్నదాన ననిపించితి
[1]బంటువలెఁ దా వాకిటఁ బవళించి వుండఁ గాను
మంటమారితనమున మాటలాడ నైతిని ॥ ఆతని ॥

పానుపుమీఁదికి వచ్చి పైఁ జేయి వేసితేను
ఆన వెట్టి నిద్ర వచ్చీ నని తోసితి
దానికిఁ గోపించుకోక తతి గాచు కుండఁ గాను
లేనగవుతోఁ గొంత లేచి మొక్క నైతిని ॥ ఆతని ॥

బలిమి శ్రీవెంకటాద్రిపతి నన్నుఁ గూడఁ గాను
మెలుపున నాచేయి మీఁదు సేసితి
అలమేలుమంగ నేను ఆతఁడే నన్ను మెచ్చఁగా
కిలకిల నవ్వుకొంటా కిన్నెర మీఁటితిని. ॥ ఆతని ॥ 582

398-వ రేకు లలిత

మానవు నీవోజ లింకా మా కేల యింత
కానీరే మగవాఁడవు కాదు నేసేవా ॥ పల్లవి ॥

వాసికి నీమీఁద నేను వలపు చల్లితిఁ గాక
యీసుల యెగసక్యాన కింత నవ్వేనా
చేసిన నీచేఁతలకు సెర సూఁచుకొంటిఁ గాక
పాసిసతమకానకుఁ బగ చాటేనా ॥ మానవు ॥

1. "బంటవ" అని వ్రాసి "వ" చెరిపి "టువ" అని వ్రాసి "బంటువ" అని దిద్దియున్నారు.

యిచ్చగించి నీపైఁ జేయి యిట్టె నే వేసితిఁ గాక
    పొచ్చి నీమేనిగురుతు పొప్పు లెత్తేనా
    మెచ్చి నీ వీపనులకు మేఁటి వని యంటిఁ గాక
    విచ్చనవిడిగా నిన్ను వెంగె మాడేనా ॥ మానవు ॥

కందువకు నీవు రాఁగాఁ గాఁగిట నించితిఁ గాక
    అంది నిన్ను బలిమి సేయఁగ వచ్చేనా
    అందపు శ్రీవెంకటేశ అలమేలుమంగ నేను
    విందువలెఁ గూడితివి వేసరించేనా. ॥ మానవు ॥ 583

## హిజ్జిజి

బోన మెల్లాఁ జల్లి నారి పొద్దు వోయను
    పూని నేము నీ కిట్టి బుద్ధి చెప్ప వలెనా ॥ పల్లవి ॥

పొత్తుకు నీవు రమ్మంటేఁ బొరిఁతి దా సిగ్గువడి
    చిత్తములోఁ గొంకె కొంకి చెక్కు చేఁ బెట్టి
    హత్తి యాపెకు నీమీఁద నాన లేల పెట్టేవు
    బత్తి గలితేఁ జేయి వట్టి తియ్య రాదా ॥ బోన ॥

కడి సేసి చేతి కియ్యఁగా నింతి నవ్వుకొంటా
    చిఱుముడి మాటమోము సేసుకొని
    అడరి రా దాయ నంటా నాపెతో నలుక లేల
    కదు నీకు వేడు కైతే కమ్మి మొక్క రాదా ॥ బోన ॥

సతిఁ గాఁగిలించి పట్టి చవులు నోటి కియ్యఁగ
    రతి బువ్వ మారగించి రమణి మెచ్చె
    యిత వై శ్రీవెంకటేశ యీ యలమేలుమంగను
    మతకానఁ గూడితివి మరి వేళ లేదా. ॥ బోన ॥ 584

## లలిత

ఎంత మొగ మోడి యున్నా నెఱఁగవు నీయంత
    పొంతనె నా కిఁక నీవు బుద్ధి చెప్ప వలెనా ॥ పల్లవి ॥

మనసు నొవ్వఁదు గదా మాటలాడే నీతోను
విను నిజ మాడెటి వెట్టిదానను
తనివోక వాడవారిఁ దమకాలు రేఁచి వచ్చి
యెనసీ నాతో నవ్వేవు యేది నిజ మయ్యా ॥ ఎంత ॥

సిగ్గు వడవు గదా చెలులఁ దారుకాణించే
కగ్గి కల్ల కోఁదవనిగబ్బిదానను
వెగ్గళించి వీరి వారి వెంటనె పెట్టుక వచ్చి
అగ్గ మైనవాఁడ నంటా నాన వెట్టే వయ్యా ॥ ఎంత ॥

సెలవి నవ్వవు గదా చేతిలోనే వాసి చూపే
వలచి యె గ్గెంచని భావపుదాననూ
కొలఁది మీఱఁగ నన్నుఁ గూడితి శ్రీవెంకటేశ
అలమేలుమంగను నే నన్ని కావవయ్యా. ॥ ఎంత ॥ 585

సామంతనాట

ఎటువంటి చుట్టమే నా కెంత కలసినవాఁడే
సటలు నేసీ వీని చంద మేమి చందమే ॥ పల్లవి ॥

అలుక నేసుక నేనే అవ్వలిమో మై యుండఁగ
పిలిచీ నూరక నన్నుఁ బేరుకొని
పలుక కుండఁగఁ దానె పకపక నవ్వుకొంటా
నిలుచున్నాఁ డిదె వీనినేరు పేమి నేరుపే ॥ ఎటు ॥

ముడివడ్డ బొమలతో ములుగుతా నుండఁ గాను
తడవీ నూరక నన్నుఁ దతి గొని
చిదుముడితో నుండగఁ జేతులు చాఁచుకొంటా
వొడివట్టి నన్నుఁ దీసీ వోరు పేఁటి వోరుపే ॥ ఎటు ॥

పట్టినచలముతో నేఁ బవళించి వుండఁ గాను
వొట్టుక దగ్గరి నామై వొళ్లు వేసీని
అట్టె శ్రీవెంకటపతి అలమేలుమంగ నేను
తిట్టఁగానె కూడె వీనితెగు [1]వేఁటి తెగువే. ॥ ఎటు ॥ 586

1. "వేంట్టి" అని వ్రాసి "వేఁటి" అని దిద్ది యున్నారు.

కొండమలహరి

మఱచినవారి నేల మఱవ నియ్యవు మమ్ము
వెఱచినవారి నేల వెఱపించ నేఁటికే ॥ పల్లవి ॥

నీకుఁ గట్టినట్టితాళి నీమారు సేసుకొని
యేకచిత్తమున నే నింట నుండఁగా
పైకొని పిలిపించేవు పడఁతుల నంపి నన్ను
దీకొని మ మ్మింత సేసి దిమ్ము రేఁచ వలెనా ॥ మఱచిన ॥

సేస వెట్టిన నీరూపె చిత్తములో నించుకొని
పోసరించి పొద్దు గడపుచు నుండఁగా
ఆస చూపి నీవు నాకు నప్పటి సన్న సేసేవు
వాసితో నుండినవారి వలఁ బెట్ట వలెనా ॥ మఱచిన ॥

తప్పక చూడఁగ నీకు దగ్గరనె నిలుచుండి
దప్పులనుఁ బెడఁబాసి తని వొందఁగా
అప్పుడె శ్రీవెంకటేశ అలమేల్మంగను నన్ను
ముప్పిరిగా నిట్టె కూడి మోహించ వలెనా. ॥ మఱచిన ॥ 587

ధవళ

యోగి భోగి నటనం కురు వుల్లాసాననమోహన
సాగరోద్భవకన్యకాపతి సారస శ్రీవెంకటగిరియోగి ॥ పల్లవి ॥

లీలానక్షత్రజాలాధికరండ
మాలాత్రైవిక్రమాకారయోగి
[1]హేలాహలకర [2]కోలాహలకర
శూలాయుధవంద్య పరిపూర్ణయోగి
కాళీవినుత ప్రహేళిచరితాహి
మౌళిఘనసారవిన్యస్తయోగి ॥ యోగి ॥

---

1. "హేలాహేలం" అని వ్రాసి "హేలాహలం" అని తిద్ది యున్నారు.
2. "కోలాహేలం" అని వ్రాసి "కోలాహలం" అని తిద్ది యున్నారు.

గరుడపక్షివాహగమనవిహారి
సురనాగసైనేశ గోరక్క రే
మురళీనాదశృంగ మోహనమురారి రే
కరుణానందసాగరశాయి రే
పరమ శ్రీవెంకటపతియవతార
నరరూపగోపికానాథ గోరక్క రే. ॥ యోగి ॥ 588

399-వ రేకు సాళంగం

ఆడువార మే మనేము అట్టె [1]నీ వేమి సేసినా
నేడు పుణ్యపాపాలు నీచేతివి గాకా ॥ పల్లవి ॥

నవ్వుతానె ఆపెటూ నన్నునూ వాదులు వెట్టి
పగ సాదించితిగా పంతగాఁడా
తగవులు చెప్పె నంటూ దగ్గరించి మావలపు
తగిలించుకొంటివి గా తక్కరికాఁడా ॥ ఆఁడు ॥

మచ్చిక నే మాడెటిమాటలు వేలుచుకొని
కుచ్చితాలు సేసితిగా కొయ్యకాఁడా
కొచ్చి కొచ్చి నీయెడఁ గోరి యాన లెల్లాఁ బెట్టి
తెచ్చితిగా నీయింటికి దిమ్మరీఁడా ॥ ఆఁడు ॥

వాసులు మాకు నెక్కించి వద్దఁ బాయకుండఁ జేసి
సేసలు వెట్టితివిగా సిగ్గరీఁడా
ఆసల శ్రీవెంకటేశ అలమేలుమంగ నేను
నాసరి నాకెఁ గూడితి నాటకీఁడా. ॥ ఆఁడు ॥ 589

సామంతం

తరుణి నైనా నేను దయ లేనిదాననా
వెరవుతో నీ వుండఁగా వేగిరింతునా ॥ పల్లవి ॥

1. "నీ వేమిసినా" అని వ్రాసి "మి 'సి" ల పైన హంసపాది వేసి క్రింద "సే" అను అక్షరము చెక్కి "నీ వేమి సేసినా" అని తిద్ది యున్నారు.

మొగము చూచి నాకు ముందట నిలుచుండఁగా
పొగరుముంపున నిన్నుఁ బొమ్మందునా
విగిడి నీవాళ్లఁ దొల్లి నేర మేమి గలిగినా
పగటున నప్పు డట్టె పంగింతునా ॥ తరుణి ॥

మంచివానివలె నాతో మాట లిట్టె యాడఁ గాను
చంచలించి నిన్ను వద్దు చాలు నందునా
యెంచుకొని నీ వెవ్వతెయింట నుండి వచ్చినాను
మంచ మెక్కి యింక నీతో మాఁపకొనేనా ॥ తరుణి ॥

కడుఁ జుట్టమవై నన్నుఁ గాఁగిటిలోఁ గలయఁగా
జడిసి వేడుక చెల్లించక వుందునా
అదరి శ్రీవెంకటేశ అలమేలుమంగ నేను
వడి నన్నుఁ గూడితివి వాసులు వట్టుదునా. ॥ తరుణి ॥ 590

రామక్రియ

నిన్ను మెచ్చుకొనేవో నానేరుపు మెచ్చేవో కాని
పన్ని నీవూడిగానకు బ్రౌఢఁ జుమ్మీ విభుఁడ ॥ పల్లవి ॥

చెక్కులు నీవు నొక్కఁగ చిత్తము గరఁగెఁ గాక
యెక్కువ కోప మెం తందు నిందాఁకను
తక్కరీఁడవు నౌటువు తగవరివి నౌదువు
చక్కఁ జాయకు రా నేను జాణఁ జుమ్మీ విభుఁడ ॥ నిన్ను ॥

బాసలు నీవు సేయఁగఁ బరిణామ మాయఁ గాక
యీసు నీపై నే మందు నిందాఁకను
ఆస చూప నెరుఁగుదు ఆదరించ నెరుఁగుదు
రాసి కెక్క నీ కిచ్చకురాలఁ జుమ్మీ విభుఁడ ॥ నిన్ను ॥

మచ్చిక నీవు గూడఁగ మరి నే లోనైతిఁ గాక
యెచ్చుకుందు లెంచుకోవా యిందాఁకను
అచ్చపు శ్రీవెంకటేశ అలమేలుమంగ నేను
తచ్చి కూడితివి మేలుదానఁ జుమ్మీ విభుఁడా. ॥ నిన్ను ॥ 591

## కేదారగౌళ

ఇప్పుదే వేగిర మేల యిందుకుఁ గాను
 వొప్పగించితిమి వల పోపరో విభుఁడా ॥ పల్లవి ॥

నయగారినీమాటలు నమ్మకుండ నెట్టు వచ్చు
 రయమున నీవా రైనరమణులకు
 ప్రియము నీవు చెప్పఁగ విగియఁగ నెట్టు వచ్చు
 దయ నీకుఁ గలితేను తానే వచ్చీఁ గాకా ॥ ఇప్పుదే ॥

నంటున నీవు నవ్వఁగ నవ్వకుండ నెట్టు వచ్చు
 జంట లైన సేసపాలసతులకును
 వెంట నీవుదిరుగఁగ విడువఁగ నెట్టు వచ్చు
 యింటికి విచ్చేసినప్పు డెననేము గాకా ॥ ఇప్పుదే ॥

చేరి కాఁగిలించుకోఁగా సిగ్గువడ నెట్టు వచ్చు
 కోరి నీ కెదురు చూచేకొమ్మలకును
 ఆరయ శ్రీవెంకటేశ అలమేలుమంగ నేను
 యీరీతిఁ గూడఁగ నిన్ను నియ్యకొనేఁ గాకా. ॥ ఇప్పుదే ॥ 59?

## సామంతం

అప్పు డెంత లే దని నీ వాన వెట్టినా నమ్మదు
 ముప్పిరి నాకుఁ గా నింద మోవ నీకు నేఁటి? ॥ పల్లవి ॥

పట్టకురా నీవు మమ్ముఁ బలుమారు నీచేతుల
 వెట్టఁ గాఁగినది మేను విరహానను
 అట్టె నెవ్వతె నైన నంటఁ బోతే నాపె మరి
 వట్టిసందేహాలు నీపై వడిఁ జుట్టుఁ జుమ్మీ ॥ అప్పు ॥

మాటలాడకురా నీ నా మనసులు గలయఁగ
 గాఁటపు నామన సెల్లఁ గలఁగినది
 యీటున నాకలఁక నీ కిట్టె అంటితేఁ గనక
 నాటకుఁడ వ నెవ్వతె నవ్వకుండుఁ జుమ్మీ ॥ అప్పు ॥

చూడకురా నాచన్నులు జొబ్బిలీఁ జెమటచేత
జోడుగా శ్రీవెంకటేశ సోఁకి నిన్నును
కూడితివి నన్ను నిట్టె కోరి యలమేల్మంగను
యేడ నెవ్వ తైన నిన్ను నీఁక నవ్వుఁ జుమ్మీ. ॥ అప్పు ॥ 593

### ముఖారి

నీ కెదురు చూచి చూచి నెలఁత [1]న న్నంపె నిదే
రాకుండితే నాపె వచ్చీ రావయ్య నీవూ ॥ పల్లవి ॥

అప్పుడు నీ వాన వెట్టినది నమ్మినది గాక
తప్పులు వట్ట నేర దాతరుణి నిన్ను
నెప్పున నీ విందుకుఁ గా నీ వేల వెరచి రావు
చెప్పేఁ గాని యింటికి విచ్చేయవయ్యా నేఁడు ॥ నీ కెదురు ॥

నీసుద్దుల కెల్ల నాపె నెట్టన నోరిచెఁ గాక
సేసే నంటే నీ వింతిచేఁతకు [2]వేలె
పాసి యిందుకుఁ గా సిగ్గువడి యీాదఁ గొంక నేల
నేసతో మాయింటికి విచ్చేయవయ్య ఘనుఁడా ॥ నీ కెదురు ॥

ముంచి యలమేలుమంగ మొకమోడి కూడెఁ గాక
వంచే నంటే నాపె నీతో వాదు వెట్టదా
యెంచుక శ్రీవెంకటేశ యిందుకుఁ గా నవ్వ నేల
చించితి మాట యింకా విచ్చేయవయ్య యింటికి. ॥ నీ కెదురు ॥

400-వ రేకు

### భూపాలం

అంతయును నిన్నుఁ బొందేయందుకొరకే
వింత సేసుక యిందుకు విసిగేవు సుమ్మీ ॥ పల్లవి ॥

---

1. "న న్నెంపె" అని వ్రాసి "న న్నంపె" అని తిద్ది యున్నారు.
2. "వేలెం" అని వ్రాసి "ం" చెరిపి యున్నారు.

అంకెకు రానివేళ నాడుదు మే మైన నిన్ను
పొంకము వచ్చినవేళ పొగడుదుము
సంకె లేవి మావంటి సతులకు నిది వోజ
పంకించి నీ విందు కెగ్గు పట్టేవు సుమ్మీ ॥ అంత ॥

బగి వాసి వున్నవేళ పగ చాటుదుము నిన్ను
మొగము చూచితేనె మొక్కుదుము
యెగసక్కెలె మావంటి యింతులకు సహజము
అగ డైతి నని నీవు అలిగేవు సుమ్మీ ॥ అంత ॥

తక్కించినప్పటివేళ తరిఁ జలపట్టుదుము
గక్కనఁ గూడితేనె కరఁగుదుము
దక్కితి శ్రీవెంకటేశ తతి నలమేల్మంగను
వొక్క టైతి విది నీకు వొడఁబాటే సుమ్మీ. ॥ అంత ॥ 595

దేసాక్షి

ఇంక నెన్నఁ దమ్మ నీయెన్నిక జాణతనము
జంకించి మాటాడకున్న సతులఁ గైకొందురా ॥ పల్లవి ॥

సూటిగా నిన్నుఁ దప్పక చూచీ నాతఁడు
వాఁటముగఁ దల యెత్తి వంచుకొంటాను
చీటికి మాటికిఁ దానె నెలసి నెలసి నవ్వీ
నాఁటదాన వాతనితో నొఁ గా దనకుందురా ॥ ఇంక ॥

వేమరుఁ జేయి చాఁచి వేఁడుకొనీ నాతఁడు
సోమరించి దారిమోనాఁ జూపి చూపి
నేమములుఁ బచరించి నెలఁత లంచేఁ జెనకీ
చే ముంచి యాతని నీవు చిమ్మిరేఁచ కుందురా ॥ ఇంక ॥

సిగ్గు విడిచి కూడెను శ్రీవెంకటేశుఁడు
వొగ్గి తల రాయి నేను కూర కైనాను
విగ్గుల నలమేల్‌మంగ ని న్నితఁడు గలసెను
వెగ్గళించి నీవలపు వెదచల్ల కుందురా. ॥ ఇంక ॥ 596

రామక్రియ

ఇంట నున్నవారము నే మెందు వొయ్యేము
దంటల మై నిన్ను నేము తప్పు వట్టేమా ॥ పల్లవి ॥

నివ్వటిల్ల నీకన్నుల నిద్దుర దొట్టి వున్నది
పవ్వళించ రాదా పానుపుమీఁద
చివ్వన న న్నేల నీవు చేయి వట్టి తీసేవు
దవ్వుల మాతోడిపొందు తప్పి పోయీనా ॥ ఇంట ॥

అసురుసు రెల్లా నీయంగముపైనే వున్నది
విసరించుకో రాదా వేగినంతాను
రసికుఁడ మ మ్మేల రతికిఁ బిలిపించేవు
వెస నెప్పు డైనా నిన్ను వెగ్గళించేమా ॥ ఇంట ॥

వేడుకలు నీ కెపుడు వెల్లివిరిసి వున్నవి
పీడె మింద రాదా వెర పేఁటికి
అడనె శ్రీవెంకటేశ అలమేల్‌మంగను నన్ను
కూడితివి యిఁక నీకు గురి దప్పేనా. ॥ ఇంట ॥ 597

అహిరి

గక్కన నాతనిఁ గని గడ్డము వట్టి వేఁడుక
చెక్కు నొక్కవపుడుగా చింత లెల్లఁ బాసును ॥ పల్లవి ॥

యే మని దూరితినో యెంత చిత్తము నొచ్చెనో
ప్రేమావ నాతఁడు నన్నుఁ బిలిపించఁడు

మోము చూచి తనకు నే మొక్కే నన్నా నిందు రాఁడు
ఆమని విరహతాప మడ్డ మేల వున్నదే ॥ గక్కన ॥

పాదము లొత్త నైతినో పంత మేమి యెంచినాఁడో
నాదెస చూడఁ జెలి నైనా నంపఁడు
ఆదరించి వచ్చే నంటే వట్టె తెల్లవారదు
సాదించి నావలపులే చలముతో నున్నవి ॥ గక్కన ॥

విన్వేరగుతో నుంటినో నెప మేమి గలిగెనో
నవ్వుచుఁ గాఁగిట నించి నాలి సేసీని
యివ్వల శ్రీవెంకటేశుఁ డే నలమేలుమంగ
నువ్విళ్లూర నన్నుఁ గూడె నొద్దనె దాఁగీని. ॥ గక్కన ॥ 598

## సామంతం – ఏకతాళి

నీమతకము లన్నియు నే నెరఁగనా
యేమి దలఁచుకొంటివో యింతలో నవ్వితివి ॥ పల్లవి ॥

పిలిచినప్పుడె రాక పెనఁగి పెనఁగి నాతో
బలిమి వచ్చిన రాక పట్టఁ బనేది
అలుక సేసుకొంటివి అక్కడికిఁ బోవలసి
తెలుసుకొని యేఁటికో తిరిగి వచ్చితివి ॥ నీమత ॥

తప్పక నేఁ జూడఁ గాను తల వంచి వంచి ।నీవు।
యిప్పుడు నీవు చూచితే నియ్యకొందునా
అప్పుడే వెఱచితి వేయంగన గనునో యంటా
కొప్పు మాఁటు సేసుకొని గొబ్బునఁ జూచితివి ॥ నీమత ॥

చెనకినప్పుడె లోఁగి చేతులఁ దప్పించుకొని
వెనక నన్నుఁ గూడితే వింత మానునా
అనుఁగు శ్రీవెంకటేశ అలమేలుమంగ నని
మన సిచ్చి యిప్పుడు గా మగుడఁ గూడితివి. ॥ నీమత ॥ 599

## పాడి

అందుకే పో నవ్వు వచ్చీ నప్పటనుండి
అందుకు మొక్కఁ బోతేను ఆయములు సోఁకెఁ గా ॥ పల్లవి ॥

సంగడా లెత్తినచేయి చాఁచేవు మాపురముపై .
సంగనలము మా చన్ను లంత కోపునా
యెంగిలితమ్మ రాచెను యింతలో నీచేతిమీఁద
సంగతి నేమో సేయఁగ సరి నేమో యాయఁ గా ॥ అందుకే ॥

విరులు ముడిచి నట్టిసిరసు మాతొడమీఁద
నెరవుగఁ బెట్టుకొని నిద్దిరించేవు
పొరి నాపాదాలమీఁదఁ బూవు రెల్ల రాలఁ గాను
దొరతనానకు రాఁగా దొమ్మిపూజ లాయఁ గా ॥ అందుకే ॥

గందము పూసినమేను కాఁగిట నన్నుఁ గూడఁగ
చిందే నా చెమట నీపై చిప్పిలఁగను
అందపు శ్రీవెంకటేశ అలమేల్మంగను నేను
కందువఁ గూడితి విష్టే కలలై నిలిచెఁ గా. ॥ అందుకే ॥ 600

## సూచిక ౧



### సంకీర్తన రాగముల అకారాది సూచిక

| రాగములు | | సంకీర్తనసంఖ్యలు. |
|---|---|---|
| మంగళకౌశిక | .... | 20, 49, 99, 121, 266, 299, 353, 425, 433, 542. |
| మధ్యమావతి | .... | 10, 68, 113, 163, 244, 291, 340, 508. |
| మలహరి | .... | 62, 261, 547. |
| మాళవి | .... | 43, 365, 579. |
| మాళవిగౌళ | .... | 35, 76, 173, 267, 348, 472. |
| మాళవిశ్రీ | .... | 223, 280. |
| ముఖారి | .... | 5, 39, 60, 92, 102, 110, 133, 146, 155, 176, 221, 229, 236, 262, 265, 276. 293, 307, 312, 320, 324, 344, 355, 361, 408, 420, 427, 434, 454, 458, 494, 496, 503, 523, 534, 541, 546, 561, 594. |
| మెంచబౌళి | ... | 24. |
| రామక్రియ | .... | 6, 11, 32, 41, 47, 54, 55, 82, 131, 142, 147, 183, 188, 197, 238, 240, 251, 264, 275, 284, 314, 317, 318, 326, 377, 380, 385, 411, 412, 426, 462, 469, 504, 520, 552, 557, 576, 581, 582, 591, 597. |
| రాయగౌళ | .... | 69, 524. |
| రీతిగౌళ | .... | 79, 402, 464. |
| లలిత | .... | 19, 64, 90, 162, 259, 263, 298, 373, 384, 386, 416, 418, 419, 421, 435, 440, 450, 544, 571, 583, 585. |

| రాగములు | | సంకీర్తనసంఖ్యలు. |
|---|---|---|
| వరాళి | .... | 33, 66, 83, 89, 123, 140, 153, 171, 253, 256, 287, 300, 306, 350, 357, 390, 475, 543, 558. |
| వసంతం | .... | 227. |
| వసంతవరాళి | .... | 13, 120, 149, 376. |
| శంకరాభరణం | .... | 42, 50 86, 96, 97, 107, 141, 157. 167, 170, 174, 189, 207, 215, 217, 230, 247, 250, 272, 273, 274, 297, 323, 349, 363, 367, 382, 405, 409, 417, 424, 431, 436, 439, 445, 467, 468, 474, 501, 512, 531, 548, 569, 574. |
| శ్రీరాగం | .... | 18, 34, 72, 91, 106, 128, 154, 178, 181, 186, 190, 309, 329, 413, 432, 473, 490, 521. |
| శుద్ధదేసి | .... | 488. |
| శుద్ధవసంతం | .... | 9, 67, 98, 136, 228, 271, 310, 346, 394, 470, 476, 553, 565, 568, 573. |
| సామంతం | .... | 8, 21, 53, 70, 77, 88, 93, 115, 135, 145, 159, 165, 166, 177, 192, 210, 212, 218, 220, 226, 231, 234, 242, 258, 268, 316, 330, 335, 339, 352, 389, 400, 406, 430, 441, 448, 453, 455, 461, 483, 484, 486, 500, 526, 563, 564, 566, 567, 572, 590, 593, 599. |

---

## సూచిక ౨



## సంకీర్తన తాళ సూచిక



---

★

## సంకీర్తన అకారాది సూచిక

| సంకీర్తన | | రాగము | | సంకీర్తన సంఖ్య. |
|---|---|---|---|---|
| మగవారి కేఁటిమేలు | .... | నాదరామక్రియ | .... | |
| మట్టు మీరినచేఁతల | .... | దేవగాంధారి | .... | 511 |
| మతకాలు నేరిచినమాయ | .... | పాడి | .... | 196 |
| మన మింత దడ వాయ | .... | సామంతం | .... | 500 |
| మన మెఱిఁగినవె మాయ | .... | నాదరామక్రియ | .... | 132 |
| మనవి చెప్పితిని మఱవకుమీ | .... | సామంతం | .... | 53 |
| మనసు లొక్కటు లైతే | .... | మధ్యమావతి | .... | 68 |
| మనోభావకుఁడవు మగువ | .... | కన్నడగౌళ | .... | 491 |
| మమ్ము నిన్నిటా నీఁక | .... | లలిత | ... | 90 |
| మమ్ము నేల తడవేరు | .... | గుండక్రియ | .... | 399 |
| మపుఁడు సేసినమాయ మరి | .... | కన్నడగౌళ | .... | 125 |
| మఱచినవారి నేల మఱవ | .... | కొండమలహరి | .... | 587 |
| మాఁటలు నీతో మాకేల | .... | దేసాక్షి | .... | 100 |
| మా కేమి నీవెంత మట్టు | .... | శంకరాభరణం | .... | 323 |
| మాతో నేల తన కింత | .... | దేసాళం | .... | 31 |
| మానవు జగడము | .... | లలిత | .... | 418 |
| మానవు నీవోజ లింకా | .... | లలిత | .... | 583 |
| మాన వెప్పుడును నీమాయ | .... | పాడి | .... | 45 |
| మామాట లేల వినేవే | .... | దేసాక్షి | .... | 479 |
| మాయలు మాని నాతో | .... | పాడి | .... | 379 |
| మిక్కిలి జాణవు నీవు | .... | బలహంస | .... | 510 |
| మిము మార నోపను | .... | శంకరాభరణం | .... | 405 |
| ముంచి నిన్నే మనఁజాల | .... | గౌళ | .... | 152 |



ఈ చరణములు దిద్దుకొన ప్రార్థన.





తి. తి. దేవస్థానం ప్రెస్. తిరుపతి :– కా. 300. 14–3–63.

